# ఉర్దూ కథానికలు

అనువాదము

శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి




ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి
తిలక్ రోడ్, హైదరాబాదు.

# ప్రకాశకుల విజ్ఞప్తి

ఆంధ్రేతర భాషల సాహిత్య చరిత్రలతోపాటు వాఙ్మయ విశేషాలను గూడ తెలుగువారికి పరిచయము జేయుట ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి ఆశయాలలో నొకటి. ఈ ఉద్దేశాలతో యిప్పటివరకు దక్షిణ భారత సాహిత్య చరిత్రములతోపాటు ఉర్దూ సాహిత్యచరిత్రను గూడా ప్రకటించనైనది. దీనికి తోడుగా నీ సంవత్సరము యిరువది తెలుగుకథలను యేరి కూర్చి ఉర్దూలో ప్రకటించవలెనని, పదునైదు ఉర్దూకథలను యెన్నుకొని తెలుగులో ప్రకటించ వలెనని నిర్ణయించనైనది. తెలుగు కథల సంపుటి ఉర్దూలో ప్రకటితమైనది. దీనితోపాటు యీ ఉర్దూ కథానికల సంపుటము గూడ ఆంధ్ర పాఠక లోకానికి అర్పించుచున్నాము.

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి ఉర్దూ సలహా సంఘము ఈ పదునైదు కథలను యెన్నుకొను బాధ్యత శ్రీమతి జీనత్ సాజిదా (ఉస్మానియా మహిళా కళాశాల ఉర్దూ ఉపన్యాసకురాలు) గారికి అప్పగించినది. ఆమె యేరి కూర్చిన కథలను అనువాదము చేయు కర్తవ్యమును శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారికి ఉర్దూ సలహా సంఘము అప్పగించినది. తమ బాధ్యతలను చక్కగా నిర్వహించిన యీ ఉభయులకు అకాడమిపక్షాన ధన్యవాదాలు. ఈ కథలను ఆంధ్రీకరించుటకు అనుజ్ఞ నిచ్చిన రచయితలకు, ఆ అనుజ్ఞను సంపాదించుటకు తోడ్పడిన శ్రీ ఆబిద్ అలీఖాన్ (సంపాదకులు, సియాసత్) గారికి మా ధన్యవాదములు.

దేవులపల్లి రామానుజరావు
ప్రధాన కార్యదర్శి
ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి.

# విషయ సూచిక

రచయిత:
డాక్టర్. రషీద్ జహాఁ

# అనుకోని ఆపదలు!

అసలు కథ పేరు:
"నయీ ముసీబతేఁ"

''నాకు జ్ఞాపకమే లేదు. ఈ వున్ని ఏ ధరకు దొరికిందో!'' తన వదిన 'సగరా'ను అడిగింది అమా. ఆమె తన పినతండ్రికోడలు, పాపం ఆమెకు వైధవ్యం వచ్చి రెండేళ్ళయింది!

''బహుశా, పౌను పన్నెండు రూపాయలనుకుంటా-అవునా అమా?''

ఆమె అత్తకోసం వున్ని అంతా విప్పి బంతులు చుట్టుతోంది.

''అబ్బ! ఉన్ని ధర ఈ యేడు ఎంత కొండకంటిపోయింది-'' సగరా వదిన అతియా అన్నది- ''చిన్నపిల్లలక్కుట్టిద్దామంటే జంపర్లన్నీ ఎంతో గిరాకీ అయ్యాయి. ఇప్పుడు శ్రీమతి రాబర్టుకు ఉన్ని తీసుకో వచ్చి ఇచ్చింది ఆమె స్వెట్టరు అల్లిపెట్టమని- మహా కష్టంగా ఉంది''.

''మీకేం కష్టం. అల్లేది పాపం నర్సేగదా!...''నాలోనూ, అతియా వదినెలోనూ, పూర్తిగా వదినా మరదళ్ళ సమ్మంధం ఉండేది. మేమిద్దరమూ ఒక రొకరిలో వున్న బలహీనతలనీ, మంచిచెడ్డల్నీ బాగా ఎరిగున్నవాళ్ళం- సమయం వచ్చిందంటే ఒకర్నొకరం వదిలి వుండేవాళ్ళం గాదు- అతియా వదినెకు జీవితంలో ముగ్గురు పిల్లల్ని కనటం మాత్రమే పనిగాక, మరో కార్యక్రమమూ ఉండేది. ఏడాది కొక జంపరూ, యాపులూ, అద్వాలున్నూ అల్లుకోవటం! ఆ తరువాత వాటినిగురించి మాట్లాడుకోవటమున్నూ. ''ఏం! నేను అల్లనా యేమిటి? అతియా వదిన పొడుచుకు వచ్చి అన్నది- నేను జవాబియ్యాలని అనుకుంటోండగానే, అమా నాకేసి గురగురలాడుతూ గుడ్లురిమి చూస్తూ బిగ్గరగా మాట్లాడ్డం మొదలెట్టింది. నా సమాధానానికి సమయం దొరక్కుండాలని. కారణం: యథాప్రకారంగా

సగరాకూ నాకూ అతియా వదినెకూ రాజలాంఛనం లాంటి జగడం జరక్కుండా ఉండాలని- అమాకు సగరాకూడా ఇందులో సహాయపడింది. ఇలా అన్నది. "నిజమైతే అవును. ఉన్ని చాలా విపరీతంగా ధర పెరిగి పోయినమాట! ఇంకా బాగా ప్రియంగాకముందే నాకో జంపర్ కొని తెచ్చుకుంటా న్నేను-

నా పినతల్లి అమా తిరస్కారంగా సగరా అత్తగారు కుంపటికి దగ్గరగా తన తెల్లని పిల్లిని ఒళ్లోకి తీసుకుని కూచోనుంది. ఇటు పిల్లి కునికిపాట్లు పడుతోంది. అటు పిన్ని అమా- కాని. తెలియదు ఏ తీరుగా సగరా మాట విని, ఆ తీరుగానే కళ్లు మూసుకుని మూసుకుని అన్నదో- "ఎక్కణ్ణించీ తెస్తావ్ ? ఇవ్వాళా రేపూ యుద్ధాలరోజుల్లో ఏమి తేవటానికైనా ఎక్కడే ముందని-"

"ఇప్పు డిప్పుడే, ఈ ఉదయమే దుకాణంనుంచీ తీసుకొచ్చారు. మరి ఇప్పుడు ఈ రోజల్లా దుకాణాలన్నీ ఖాళీ అయినై-" మా బాబయ్య భార్య మాటను దెబ్బగొట్టకుండా పోనిచ్చేవాడుగాడు-

వెంటనే పిన్ని అమా కళ్లు మూసేసింది-

"దుకాణాలు ఖాళీ అయ్యాయని నే నెప్పుడన్నాను ?"

"అయితే మళ్లీ మీరు ఇవే మాటలు ఎందుకు అంటారు ?" పిన్ని బాగా బిగడాయించుకుని అన్నది. ఇదేమంత కొత్తకథ గాదు-

ఎప్పుడైతే సగరాకు పెళ్ళయిందో, అప్పటినుంచీ ఆమెకు అత్త భయమే ఉండేది. ఇప్పుడు మరి ఇంకా ఎక్కువ. ఆమెను గురించి ఒక్క రూపాయి ఖర్చు గావటం అమా పిన్నికి ఎప్పుడూ కష్టంగా ఉండేది- కాని సగరా బాబయ్యగారి కళ్ళకు నక్షత్రంగా ఉండేది. కొడుకు కాలం చేశాకనైతే ఆయన మరీ ఆమెను తన చేతుల్లోనే పెట్టుకొని చూసుకునే వాడు.

"అయితే నేనేమన్నా అబద్ధం చెబుతున్నానా ఏమిటి ? ఆమెఇప్పుడు కొనాల్సిందేమైనా ఇంకా ఉందంటవా-"

"అయితే మళ్లీ మీ రెండుక్కొన్నారు...సగరా రేపు రావాలి, నావెంట. వచ్చి తన యిష్టం వచ్చిందేదో తెచ్చుకోవాలి బజారునించీ..."

"అది అవును. అమా పిన్నీ మీరుగూడా ఇప్పించండి- నేనైతే ఇలా ఏమీ అనటం లేదు- అమా పిన్ని చక్కగా చెప్పారు-యుద్ధపు రోజులు- దానితో ప్రతీ వస్తువూ ఎంతో గిరాకీ అయింది".

బాబయ్యగారు తనలోతాను ఏదో గొణుక్కుంటూ, అన్నంతినటానికి తయారయి వెళ్ళిపోయాడు-చాలు. ఇంత జ్ఞాపకం వచ్చింది—" నీ వే వస్తువూ తీసుకోబోకు. నాకైతే ఉన్ని కావాలి......నేను తప్పకుండా కొంటానుగా !......"

"నే ననే ప్రతి మాటనూ ఇప్పుడు వీరు తల్లక్రిందులు చేస్తారు... ...చూడు. నే నేం తప్పు అన్నాను ! ?—ఉన్ని ఇప్పుడు పనికిరానిదై పోయింది". అమా పిన్ని చాడీల ధోరణిలో అన్నది. విన్నవాళ్ళల్లా జాలితో కరిగిపోయేలా. ఇవాళే ఉదయం నేను, అతియావదినా, అమా పిన్నీ అంతాకలిసి వందరూపాయలకు ఎక్కువగా ఉన్ని కొనుక్కొచ్చాము.

"ఒక్క ఉన్నిమీదే ఏముంది-ప్రతి వస్తువూ ఇలాగే అర్థంలేకుండా పెరిగిపోయింది." మా అమ్మగారు మాట సరిసమం చెయ్యటానికి అన్నది.

అవునమ్మా పిన్నిగారూ నిజం మీరన్నది : ఇప్పుడు జార్జెట్ ఖరీదే చూసుకోండి, నిరుడు సుమారు మూడు రూపాయలకు అమ్మిన జార్జెట్ ఇప్పుడు గజం అయిదు రూపాయలన్నా దొరకటంలేదు......అప్పుడే నే నొక మంచి జార్జెటూ అవీ తీసుకున్నా-ఈ తడవ నేను ఇంత కొంచెంగా బట్టలు మసూరీలో కుట్టించానుగదా. ఇప్పుడు తొడుక్కుందామంటే లేవు-".

"తక్కువలో తక్కువ ఎనిమిది చీరె లుండాలి. కాస్త నీవు అల్మారా తీసిచూడు." ఉద్యోగంరోజుల్లో అయితే ఏటా వందా నూట యాభై రూపాయల్లో బట్టలు అయ్యేవి. వీరికి అలవాటే గుడ్డిబరువు మోయటం. జీతగాళ్ళను దుంపదెంచి వదిలారు. నే నన్నా ఈ ఒక్క

న్మేడూ ఉంచి చూడండని-ఇప్పుడు బాగానే ఉందిగదా. "బిగించుకుని, నే నెప్పుడూ నౌకర్లను అసహ్యంగా ఉంచలేను వాలికలు పీలికల్తో. అలా ఒక్కమాట ఎప్పుడైనా విన్నారూ——"

అమాపిన్ని మళ్ళీ చాడీలు చెప్పింది.

"ఇది నిజమే. ఇది ఈ అన్నదమ్ములందరిలో ఉన్నసంగతే. పొరి శుద్ధ్యం పేరుతో వీరు వేలరూపాయలు గవ్వలూ గచ్చకాయలుగా చిమ్మేస్తారు." అమా అన్నది——

"ఆఁ ! అవునుమరి. ఈ ఖర్చులన్నీ ఈ రోజుల్లో ఎల్లానడుస్తాయి. ఇప్పుడు ఇంట్లోకి ఇలాంటి మనిషి ఒకడైనా కావాలా, ఎందరో అందరూ ఎందుకుకావాలి ఇలాటివాళ్లు." ఈ ఎత్తిపొడుపు మాటను, పాపం. అమాయికురాలైన సగరామీద విసిరింది అత్తగారు...మా పిన్ని తన పేరు మీదిగా ఖర్చుపెట్టే డబ్బంతా దండగమారి వ్యవహారంగా భావించేది గాదు. అరవై యేళ్ళ ప్రాయం గడిచాకగూడా, చాలా ఫాషన్‌గా ఉండేది. ఎన్నో చీరెలు ఉన్నప్పటికీ ఈ ప్రొద్దున్నే మళ్ళా రెండు చీరెలు కొన్నది. నన్ను చీదరించుకోకుండా ఉండలేకపోయింది. నేనన్నాను——

అమాపిన్ని, ఇప్పటిదాకా ఎవరికి బాబయ్యగారిమీద కోపం వస్తూం డేదో, ఎంతమాత్రం తెలుసుకోలేదు మరి. అంతేనా ఎంతో నొక్కింపుగా వక్కాణించటం మొదలెట్టింది——

"ఏం జెప్పేను బిడ్డా ! క్రేప్‌డాషిన్ ఖరీదే గజం తొమ్మిది రూపాయలకు ఎక్కువగా ఉంది. 27 రూపాయల్లో ఆ చీర దొరకటం కష్టమైందనుకో !...ఆహా ! ! ఇకచెప్పు ఎవరు ఏం బట్ట కట్టగలుగుతారో ! ఇక రెండోది, పోనీ స్వదేశీ శిల్కుది ఉంది-అది చాలా చవగ్గా దొరికింది 17 రూపాయలకు !...ఏమైతే ఏమనను. మంచిరోజులు పొయ్యాయి. చాలా చెడ్డరోజులునూ, గడ్డురోజులునూ వచ్చాయి ! ఎంచేతంటావా. తినే వస్తువులకూ ఇబ్బందిగానే ఉండే ! తాగేవస్తువులకు అంతకంటే చిక్కులే వచ్చె!!

...ఇలావుంది పరిస్థితి మొత్తానికి చాలా కష్టమైనావివి. ముందు ముందు ఇంకా ఏమేమి కానుందో చూడాలి !..."

"మీరు నిజం అంటున్నారు అమ్మా." - అతియావదిన చల్లని నిట్టూర్పు వుచ్చి, మనస్సుకు తగిలి ద్రవించేలాంటి ధ్వనితో అన్నది. "ఈ 'మూవీ'యుద్ధం ఏమీ తెలియటంలేదు ఎల్లావుందో, ఇంక ఇది ఏరకంగానూ అయ్యేపోదేమో !-నాకైతే నా విశ్రాంతి అంతా, ఆలోచన అంతా ఈ దిక్కుమాలినదాని మీది చూపుగానే అయిపోయింది."

సగరా నావేపు అదోలాచూసి చిన్నగా నవ్వింది-వెంటనే ముఖం అటుపక్కకు పెట్టింది—

"అదొకటనే గాదు. ఏ వస్తువ ధరైనా చౌకగా వుందా మరి ! పెట్రోలు రేటు !? ఇటు చూడూ. ఇంకా నాయనగారు కొనే వస్తువుల ఖిమ్మతులైతే హద్దూ పద్దూ లేదుగదా ! ఇంతయినా అంతా చెత్తసరుకు ! ...అదిగాదు-నీవు చెప్పు. మీ అన్నయ్యదగ్గర విరిగిపోయిన పాత షికారు మోటారు పడివున్నది ఒకటి,...ఆ ముసలిడొక్కును యాభై రూపాయ లిచ్చి రిజిష్టరు చేయించాడు. అప్పుడు రెండు మోటారుకార్ల నూనె ఇరవై నాలుగు గ్యాలన్లూ అతని అదృష్టంలో కొచ్చాయి-నిజానికి నిజంగా ఈ యుద్ధంవల్లనైతే వెనకటికంటేగూడా చాలా ఎక్కువగా కష్టాలూ, ఇబ్బం దులూ ఉన్నాయి." అమాపిన్ని దగ్గర దగ్గరగా ఏడిచింది !

"మేమైతే మా మోటారు ఆపేజేశాం-నా మటుకు రోజూ ఉద యాన్నే తెలతెల వారుతోండగా షికారుచేసే అలవాటు ఏళ్ళతరబడిగా ఉంది. ఎప్పటినుంచీ పెట్రోలు కరువువచ్చిందో అప్పటినుంచీ నా ఆరోగ్యమున్నూ నాశనమైపోయింది."

మా అమ్మగూడా విసుగ్గా అన్నది. "అవును. అదే నె ననేదీనూ ! ఈ పెట్రోలుమీద కంట్రోలు ఎందుకు పెట్టారు సర్కారు-ఇప్పుడు గ్యాలన్ ఖరీదు రెండురూపాయల పావలా వుంది. నడిచిచూడు మూడు రూపాయలు చేస్తుంది. కాని, ఈ పన్నెండు మరి పధ్నాలుగు గ్యాలన్లనూ ఖైదు

పెట్టదుగా ! ఎవరిదగ్గర బేరసారాలుంటాయో వారే కొంటారు. ఎవరిదగ్గర ఏమీ ఉండదో వారు కొనరు !——''

అతియావదిన ఇలా మండిపడుతూ అన్నది. గవర్నమెంటుకు వారి మీద ప్రత్యేకం పగ ఉన్నట్టుగా. ''ఒక పెట్రోలుమీదనే ఏమిటి. ఈ యుద్ధంమూలాన ప్రతివస్తువు మీదా ఆపద వచ్చికూర్చుంది. చూశావో లేదో, సేపులు పావలాతక్కువ రెండురూపాయలు శేరు-ఇదే మరీచిత్రంగా వుంది. ఏం ఈ సేపులుకూడా సైనికులు తీసుకుపోతారా తినటానికి !''——

నా తల్లి బాగా అణగిమణగిన గొంతుతో అడిగింది.

''మరి గుడ్లు ?'' అమాపిన్ని అన్నది. ''డజను ముప్పావలా గావచ్చు-ఇంకా కోడి అదీగూడా రెండురూపాయలదాకా పోయింది. ఎవ రన్నా తినాలంటే ఏం దినాలి !'' అబద్ధంగాదు - ఇవ్వాళ చూద్దువుగాని, నీ ముందే దుకాణాలన్నీ చూద్దాం గదా ! ... 'ప్రెవెన్సు' ఎక్కడైనా ఉన్నాయా, అవెక్కడా దొరికేట్టే లేదు-ఘనా కష్టంగా పోయిన నెలలో ఇరవై రూపాయలలో ఏడుశేర్లు ఎలాగో దొరికాయి. ఇప్పు డవీ లేవు... ఫ్రూట్‌సాలిడ్ లేకుండా ప్రెవెన్సును పిల్లలు ముట్టనుకూడా ముట్టరు... ''అవును. గృహస్థులకు మరీ అగచాట్లొచ్చాయి.'' అత్తగారిమీద దయ దల్చింది అతియారాషిద్ అచ్చంగా, కచ్చితంగా అదే అంటూ వచ్చాడు. అమా నాయనమ్మగారి ఖాన్సా అమ్మ తాగే మంచి చీస్‌స్టేక్సు చేస్తుంది. మా ఖాన్సా అమ్మకంటేగూడా చాలా బాగా...''

''ఇక చూడు. నేనేంచేయను ! పెళ్ళికూతురుకు మంచిగాజులు కావా లంటేనే దొరకటం లేదు-ఇప్పుడైతే అవుపించనే అవుపించవు ! నేను అస్లమ్ కొట్టుమీదికి పోయాను. అడిగాను బొంబాయిలోవున్న రేటుకే బంగారం ఇయ్యమని, మా అబ్బాయికి మనసులో బాగా ఇష్టంగా వుంది. కాని అది ఎక్కడైనా వుంటేనా మరి !''

''ఒక్క ఇబ్బంది అయితే దాన్ని అనుకోవచ్చు.'' అమా మాటలో మాట కలిపేసింది.

"ఇదుందే, ఈ మంట అంతా ఒక్కసారే ఎక్కడ మాయమై పోయింది !" అతియావదిన విసీవిసీ ఒఖసారే అంది.

"ఇది నిజమేగదా. ఆ భ్రాష్టుడు వాజద్ లేకపోతే కట్టెలైనాపూర్తిగా వేశాడుగాడు. చెట్టుకూ పోలేదు...అరజ్ మంద్. కొంచెమంత బటన్ నొక్కు బెల్‌కు...నాలుగు నాలుగు చెట్లున్నాయి...అయినా మళ్ళీ కూచో. చలిలో ముడుచుకోపో....బలే. ఇవెలాంటి రోజులోగాని, ఇప్పుడు బొగ్గులే చూడు. బేడా నుంచీ రెండురూపాయలదాకా ఎక్కాయి. దీనికంటే కరెంటే కాస్తనయం. చూడు ఈ దరిద్రుడు ఏమన్నా జవాబన్నా ఇస్తాడేమో !"—

మళ్లా సగరాతో అన్నది. "కొంచెం నీవు వెళ్లాలి సగరా. చూడు వీరంతా ఎక్కడ మాయమయ్యారు. మీకు చలి వేస్తున్నది"...సగరా వారిని వదిలేసి త్వరగా ఆమె వెనువెంటనే, నేనుకూడా "వదినా నీ వుండు. నేనుగూడా వస్తాను." అంటూ వారి వెనకాలే పరుగెత్తింది.

"చూడూ. వెచ్చని బట్టల్లో.... వెళ్ళాలి. చల్లని బట్టల్లో కాదు," అమా కేకగా చెవుల్లోకి వస్తోనేవుంది. నేనూ, వదినే వాకిట్లోనుంచీ బైటకు వచ్చేశాం. బయటయితే ఎంత పదునుగా, ఎంత చలిగా ఉన్నదంటే శరీరపు ఈ పక్క నుంచీ ఆ పక్క దూసుకొని కోసుకొని పోతున్నట్టు ! వదినె బయటికివచ్చి 'వాజద్-వాజద్' అంటూ కేక విసిరింది-కాని ఎంతకూ జవాబురాక, అన్నది.

"గత్యంతరం లేనివాడు. చలిదెబ్బకు మంచంలో జొరబడిపోయా డేమో! తెలుసుకున్నాడు ఎలాగైనా భోజనానికి ఇంకా అరగంటయినా పట్టవచ్చని!... ఆమె శిష్యరికం వేపుగా సాగింది. కొంచెం దూరం నడిచి వేపచెట్టుక్రింద ఒక ప్రత్యేకతగా కనిపించింది. మరి మేము శిష్య వృత్తిగా ఎప్పుడైతే చేరామో, అప్పు డక్కడ పంచాయితీ కూడుకొని ఉన్నది. తోట మనిషి 'మాలిన్' తన ముగ్గురు పిల్లలను పెట్టుకుని అక్కడ కూర్చొ నుంది. చాకలిది గూడా తన పరివారంతో అక్కడ తిష్ఠవేసింది. వాజదూ, ఇంకా ఇతర నౌకర్లూ చాకర్లూ అక్కడే ఉన్నారు. పాకీవాడుకూడా అక్కడే దూరంగా ఒక మూల కూచుని చిలుం తాగుతున్నాడు. మమ్మల్నిచూస్తూనే

చాకలిది గొంతు చించుకు అరిచింది. "ఓ చిన్నకోడలా కొంచెం ఇటు రావాలి"—

చిన్నకోడలు కొంచెం వంగి నిప్పు కాగటం మొదలెట్టింది. మగ నౌకర్లంతా లేచి నుంచున్నారు.

"ఏమిటీ, ఎందుకు ?" సగరా అడిగింది.

"ఓ కోడలా ! ఈ సమరం ఎప్పటిదాకా సాగుతుంది?"

"చాలారోజులు...ఎందుకు ?"

"బాబోయ్ ! రామచంద్రా!...నిజంగానా ?"

"అవునవును. ఇదింకా చాలారోజులు నడుస్తుంది !" నిర్లక్ష్యంగా అన్నది సగరా.

"అయితే, మేమంతా ఎలా బ్రతకటం ?"

"మొన్నటిదాకా ఆరుశేర్లున్నపిండి ఇప్పుడు మూడు శేర్లయింది!"

"మూడు శేర్లదయితే గోధుం పిండి!" ఒక కూలీ నౌకరువాడు ఈ మాటన్నాడు.

"అయ్యో నాయనా! నిజం చెప్పు. ఈ యేడుపు ఎప్పుడు చివరెళ్లు తుంది ? మా కడుపులూ మా పిల్లల పొట్టలూ ఎట్లా నిండుతై" మాలిన్ నాకేసి తిరిగి దుఃఖంగా అన్నది.

"సెనగలేమో ఎనిమిదిశేర్లు."

"కోడలా నీవు ప్రతిమాటలోనూ నవ్వులాలు కలుపుతావు, నిజం చెప్పమ్మా. పత్రికల్లో ఏం రాస్తున్నారు?" చాకలిది వదినెకేసి ఎంతో అమాయికంగా చూసింది.

"అయ్యో! చెబుతూనే వున్నానుగదా. నామీద నమ్మకం లేకపోతే ఆమె నడుగు."

ఆశతో నిండిన అందరి చూపులూ నావేపు తిరిగాయి– నేనుమాట్లాడ కుండా ఉండటం జూసి చాకలిది అన్నది. "కోడలు తెలిసికూడా అంటుంది. మా పని జేసుకు బతికే వాళ్ళకు మంచిరోజులొస్తాయని, ఇది నిజమేనా?"

"నాకేం తెల్సు-"

వాజద్ చెట్టు గొట్టటానికి పొయ్యాడు-నేనూ, వదినె అక్కడే నెగడి దగ్గరనుంచుని మాట్టాడుతున్నాం-ఎప్పుడైతే భోజనం గంట విన బడ్డదో మేము ఇంటికి పోయాం అందరమూ- వెళ్తూ దారిలో చూసింది వదినె. నా వంటి మీ దేమీ వేడిబట్టలు లేకుండటం- అన్నది. "ఏమోయ్ అర్జ్‌మంద్ నీవు గూడా భగవత్సాక్షిగా ఒక నడుస్తూ, తిరుగుతోన్న ఆపద వేమో ! జబ్బు పడ్డావా అనుకోని మరో కొత్త కష్ట మొచ్చిపడుతుంది..."

నే నిప్పటివరకూ నౌకరీవాళ్ళ ప్రతి అయోమయపు వాలకాలలో మునిగి ఉన్నా. ఏమీ ఆలోచించకుండా, తెలుసుకోకుండానే ! అన్నాను మాంచి జోరుగా. "ఈ 'మరి' అన్నది మీరు మా గట్టిగా అన్నారు" వదినె నవ్వింది- "మరి లేకపోతే ఏఁవిటి- అతియా వదినెకోసం జార్జెట్ ధర పెరిగిపోయింది. ఇదేమన్నా తక్కువ కష్టమా- మీ అమ్మగారి చాంద్రా యణం తగ్గిపోయిందా. ఇదేమైనా తక్కువ కష్టమా- మరి మా అత్తగారికి పాపం కష్టాల లెఖ్ఖకూడా తెలియకుండా ఉంది. కోకింగ్ చీస్ (తిను బండారం) దొరకదు, మరి, ప్రొవెన్స్'...

మరి "దీని మీద నీకు న్యూమోనియా వస్తే ?"

---

రచయిత:
ఉపేంద్రనాథ్ అష్క్

# "పేదల కోరిక !...."

మూలకథ:
"డాచీ"

బాఖర్ తన వస్తువు మీద ఆశ గల చూపుతో చూస్తోండటం చూసి, ఇంటి ముందున్న పెద్ద చెట్టు నానుకుని కూచుని కునికిపాటు కండ్లతో ననంద్ చౌధురీ గురగురలాడే ధ్వనితో, 'ఏంరా, ఇక్కడేం జేస్తున్నావ్?' అన్నాడు. అతని ఆరడుగుల పొడుగుపాటి దృఢమైన దేహమూ జలదరించింది. అంతేనా, గుండీలు వూడిపోయినందువల్ల ఖద్దరు చొక్కాలోనుంచీ విశాలమైన ఛాతీ, బలిసిన భుజాలూ కనిపించసాగాయి !—

బాఖర్ కొంచెం దగ్గరికివచ్చాడు. దుమ్ముతో నిండిన పిల్లి గడ్డమూ, షరాయీ, మీసాల సందుల్లో లోతైన గోతుల్లో ఇరుక్కుపోయినట్టుగా వున్న కండ్లూ, ఒక్క నిమిషంలో మెరిసినట్టనిపించింది. చిన్న చిరునవ్వుతో అనజొచ్చాడు-'డాచీ'ని చూస్తున్నాడు చౌధురీ—

'ఎంత గొప్ప అందంగా వున్నది ! మాంచి పడుచుదనంలో గూడా ఉన్నది ఇది ! దీన్ని చూస్తేనే ఆకలిదప్పులు తీరుతోన్నై !!'

తన వస్తువు గురించిన పొగడ్తను వింటోన్న చౌధురీ వళ్లు ఎంచేతో కొంత పులకరింపు తగ్గింది. అయినా, సంతోషంతోనే అన్నాడు. 'ఏ ఒంటె?' అని—

'అది, కడపటి నాలుగోది' బాఖర్ తలతో చూపుతూ అన్నాడు.

ఆ యింటి ముందున్న మరో పెద్ద చెట్టు నీడనే ఏడెనిమిది ఒంటెలు కట్టివేయబడి ఉన్నాయి. అందులోనే ఆ పడుచు 'డాచీ' తన పొడుగాటి చక్కదనమూ, ఎత్తైన మెడా జూపి ఆ చెట్టు ఆకుల్లో నోరు ఆడిస్తున్నది. సంత దూరంగా ఉంది. అయినా చూపుకు ఆనినంత మేరా. చాలా ఎత్తాటి

ఒంటెలూ, అందాల ఆడ ఒంటెలూ, నల్లగా కురూపమైన గేదెలూ, ఇంకా వెలా తెలాబొయ్యే ఆవులూ తప్ప మరేవీ కన్పించటంలేదు. గాడిదలు గూడా ఉన్నాయి. గాని లేని వాటిలోనే జమ అవి. ఎక్కువగా ఒంటెలే ఉన్నాయి—

భావల్ నగర ప్రాంతాల ఇసుక ఎడార్లలో వీటి ఆధిక్యమే జాస్తి. ఒంటె ఇసుక నేలల జంతువు. ఈ కాలే భూముల్లో రాక పోకలకూ, వ్యవసాయానికీ, బరువు మోయటానికీ, వీటితోనే ఈ పన్లు నెరవేరాలి.

పూర్వకాలంలో అప్పుడు ఆవులు పది పదీ, ఎడ్లు పదిహేనూ పదిహేను రూపాయల్లో దొరుకుతూండేవి. అప్పుడు కూడా మంచి ఒంటె యాభై రూపాయలకంటే తక్కువలో చేతికొచ్చేదిగాదు. ఇప్పుడు ఈ ప్రదేశంలో కాలవలు వచ్చినై-నీళ్ళకు అంత కాటకం లేదు. కాని ఒంటెల ఖరీదు తగ్గకపోవడమే గాక ఎక్కువ గూడా అయింది! ప్రయాణపు ఒంటెలు రెండువందలనుంచీ మూడొందలదాకా ఉంటూన్నాయి! దున్నేవీ, బరువులు మోసే వాటి ఖిమ్మతు గూడా వందకంటే తక్కువకు దొరకటమే లేదు—

బాఖరు కొంచెం ముందుకు వెళ్ళి అన్నాడు—'నిజం చెబుతాను చౌధురిగారూ. అట్లాంటి మిక్కిలీ అందమైన 'డాచీ' (ఆడు ఒంటె)నాకు ఆ సంత మొత్తంలో అవుపించనేలేదు!—

సంతోషంతో చౌధురీ ఎదుర్రొమ్ము రెట్టింపైంది! అంటున్నాడు-'ఇది ఒకటేనా? ఇవన్నీ అందంగానే వున్నాయి? నేనైతే వాటికి దాణా మేతా బాగానే వేస్తా!'

బాఖరు నిమ్మళంగా అడిగాడు, 'అమ్మతారా దాన్ని?'—

'ఇక్కడికైతే అమ్మటానికే తెచ్చాను' చౌధురీ జాలిగా అన్నాడు.

'అయితే మళ్లా చెప్పండి, ఎంత కమ్ముతారో?' అన్నాడు బాఖర్.

ఈ మాటనగానే బాఖరును చౌధురీ కిందినించీ పైదాకా ఓ చూపు జూసి నవ్వుతో అన్నాడు. 'సరే-ఇది నీకే కావాలా, నీ యజమానికా?—

'నాకే కావాలి !' అన్నాడు బాఖర్ గట్టిగా—

చౌధురీ బేపర్వా (అలక్ష్యము) గా తల పంకించాడు!' ఈ కూలివాడి బిషాత్ ఏమిటీ ! ఈ అంద చందాల ఒంటెను కొనటమేమిటి !' అనుకుని,

'నీవేం గొంటావ్ !' అన్నాడు.

బాఖర్ జేబులో పెట్టుకొచ్చిన నూటయాభై రూపాయల నోట్లూ, అతను తీయకుండానే బైటికి దూకటానికి ఆదుర్దా పడుతూన్నట్లు పైకి వచ్చాయి ! అతను కొంచెం ఆవేశంగా అన్నాడు. 'అదంతా నీ కెందుకు. నీకు కావాల్సింది డబ్బు. అదెంతో చెప్పు నీవు ! అంతే !'

అతని చినుగుబట్టిన దుస్తులూ, మోకాలు మీదకు వున్న లుంగీ, నోహా పైగంబరు కాలంనాటి ముచ్చెలూ, వీట్ని చూస్తూ, ఎట్లాగో టలాయించే ఉద్దేశంతో అన్నాడు చౌధురి.

'పోపో, నీవు కొన్నట్టే !...ఈ సంతలో దేన్నో దాన్ని కొనుక్కుపో ! అంతేగాని......కావాలంటే దీని ఖరీదెంతో తెలుసా...నూటా అరవై రూపాయలు. ఒక్క పైస తగ్గదు దీంట్లో !'

అలసిపోయిన బాఖర్ శరీరంలో అదే నిమిషంలో సంతోష తరంగాలు దౌడు తీసినై ! అతనికైతే మొదట్నించీ లోపల ఒక భయం వుంది. ఈ చౌధురీ తన హైసియతుకు మించిన ఖరీదు ఎక్కడ చెబుతాడోనని ! కాని, ఇప్పుడెప్పుడైతే తన నోటితో చౌధురీ నూట అరవై అన్నాడో, ఇహ బాఖర్ సంతోషానికి మేరలు లేకుండా పోయినై ! నూటయాభై రూపాయలైతే అతని దగ్గర ఉండనే ఉన్ననై. కాని అంతక్కూడా చౌధురీ ఒప్పుకోకపోతే, పది రూపాయలు అరువు చేసుకోవాలి. ఏమంటాడో మరి, ఏమైనా, బేరం అదీ చెయ్యటం అతనికి చాతే గాదు. ఝట్‌మని '150' రూపాయలూ తీశాడు చౌధురీ ముందుకు వాట్ని విసిరేసి 'లెక్కబెట్టుకో !' అన్నాడు-'అంతకన్నా నా దగ్గర ఒక్క పైసా కూడా లేదు ! ఇక తరువాత నీ యిష్టం !'—

వెంటనే చౌధురీ ఆ నోట్లు మర్యాదగా అందుకుని లెక్కబెట్టుకున్నాడు-ఎంచేతో లెక్కయ్యేప్పటికే అతని కళ్లు ఒక మెరుపు మెరిసినై! అతనైతే బాఖరు ఏం గొంటాడని గదా, 160 రూ. చెప్పింది. అంతేగాని ఆ ఆడు ఒంటెకు 140 రూపాయలన్నా వస్తాయని అత నెప్పుడూ, కలలో గూడా అనుకున్నది గాదు! కాని ఆ సంతోషాన్ని అంతరంలో అదిమిపట్టి, పైకి బాఖరుమీద మేలుబుద్ధి గలవాడిలాగా నటిస్తూ చౌధురీ అన్నాడు ఇట్లా, ఈ 'డాచీ' ఐతే నాది రెండొందలకుగాని తక్కువకు రానిది. ఏదో నోరు జారి 160 అన్నా, సరేలే. అది నీ అదృష్టం!...దీనికి నీకు చెప్పిన ఖిమ్మత్తులోనుంచీ 10 రూపాయలు గూడా తీసేస్తున్నా! పాపం! పేద వాడివి!' ఇట్లా అంటూ అంటూనే ఆ ఒంటె మెడకున్న తాడు బాఖరు చేతికిచ్చాడు.

ఆ జంతువువంటి స్వభావమేగల అతని మనస్సు ఒఖ్ఖ నిమిషంలో నిండిపోయింది-ఈ ఒంటె కొన్నదిగాదు. ఇతనిదొడ్లోనే పుట్టి, ఇతనిచేతే పోషించబడ్డది. అట్లా చేతులతో పెంచినదాన్ని నేడు ఇతరులచేతిలో బెట్టేప్పటికే అతనిమనస్సుకు ఎంతో అనూహ్యమైన వికారం కలిగింది. కని పెంచిన ముద్దుబిడ్డను అత్తారింటి కంపేప్పుడు తండ్రికి కలిగే మనఃపరిస్థితి లాంటిది!...తన కంఠస్వరాన్నీ-ఉచ్చారణనూ కొంచెం మెత్తగా ఉండేట్టు అతనన్నాడు. 'ఈ ఒంటె అతి గారాబంగా పెంచబడ్డది. దీని బ్రతుకు పాడవకుండా జాగ్రత్తగా చూసుకోవాలి-ఏంజేస్తావో!'

ఆనందపు రెక్కలమీద ఎగిరిలేస్తూ బాఖరు అన్నాడు. 'నీవేం ఫికరు పెట్టుకోకు. నా ప్రాణాన్ని ఒడ్డయినా దాన్ని పోషించుకుంటాను!'—

చౌధురీ ఆ నోట్లు రెండువేళ్ళమధ్యగా పెట్టుకొని జాగ్రత్తగా, ఎండి పోయిన గొంతును తడిచెయ్యటానికి కుండలోనుంచీ మట్టి గురిగితో నీళ్లు ముంచాడు-సంతలోనైతే ఎటుజూసినా దుమ్ము చిమ్మిరేగుతున్నది. పట్టణాల నించీ తెచ్చిన వస్తువులు అనేకమైన కుప్పలుకుప్పలుగా పోసి ఉంచబడ్డాయి. ఇంకా ఎంతగానో ఉన్ని పరచబడి ఉన్నది-దుమ్ము తక్కువేం లేదు! మళ్ళీ

ఆ యిసుక ఎడారి సంతలో దుమ్మే రాజ్యం ఏలుతున్నట్టున్నది. చెరుకు కొట్లో ఆ ముక్కలమీదా, హల్వాదుకాణాలమీదా, జిలేబీ-జంతిక చుట్టలూ-పకోడీ-మిఠాయీ, వీటన్నిటిమీదా దుమ్మే దుమ్ము అవుపిస్తోంది! ఆ కడవలో ఉన్న నీళ్లు కాలవనుంచీ తోలుతిత్తులతో బండ్లమీద తెచ్చారు. కాని అవి ఇక్కడికి వచ్చేసరికి బురదలాగా చిక్కబడిపోయినై! ఆ బురద తేరుకున్నాక తాగుదామనుకుంటున్నాడు ఛౌదురీ. కాని అతని గొంతు ఎండిపోతున్నది. ఒక్కగుక్కలోనే ఆ గురిగిలో నీళ్లు నిగ్గించి, బాఖరునుగూడా తాగమన్నాడు-అతడూ ఆదుర్దాగా వచ్చాడు ఎందుచేతంటే అతనికీ ఎక్కడలేని దాహమూ వేసి ఉంది! కాని అప్పుడతనికి నీళ్లుతాగే వ్యవధి ఎక్కడా!! పొద్దుగూకటంకంటే ముందరికి ముందరే అతను తన పల్లెకు చేరుకోవాలనే తొందరలో ఉన్నాడు-'డాచీ' మెడతాడును పట్టుకుని, మబ్బులాగా కమ్ముకుని వస్తోన్న ఆ దుమ్మును చీల్చుకుంటూ వెళ్ళిపోయాడు!...

* * * *

బాఖర్ మనసులో చాలాకాలంనుంచీ ఒక మంచి అందమైన పడుచు ఒంటెను కొనాలని వాంఛ ఉండేది. ఆ ప్రాంతంలో కులంరీత్యా అతను తక్కువవాడు. అతని తాత ముత్తాతలు కుమ్మరిపని చేస్తోండేవారు-ఇతని తండ్రిమట్టుకు ఆ పురాతనవృత్తిని వదిలేసి కూలీనాలీ జేసుకుని తన పొట్ట పోసుకోవటం మొదలెట్టాడు. అలాగే బాఖరున్నూ అదేవృత్తితో జీవిస్తున్నాడు. ఆ కూలీ అయినా అతను బాగాజేస్తే బాగానే వుండేది. పనికెప్పుడూ వళ్లుదాచుకుండేవాడు-అవును. ఎందుకు బద్ధకించడు!! ఎప్పుడైతే అతని భార్య అతనికంటే రెట్టింపు పనిజేసి, అతని బరువును తగ్గించటానికీ, అతనికి 'ఆరాం' ఇవ్వటానికీ సిద్ధంగా ఉన్నప్పుడు!-కుటుంబమూ పెద్దది గూడా గాదు. అతనొకడూ-భార్య ఒకతీ-ఒక చిన్ని పిల్లా-మరెందుకని అతను కష్టపడి పనిజేస్తాడు!?-కాని, ఈ ఆకాశానికి కాళ్లులేవు! అతడామెను ఎప్పుడూ సుఖంగా కూచోనియ్యలేదు. ఆ నిద్రనుంచీ మేల్కొల్పి

ఆమెను తన బాధ్యతలో ప్రవేశించటానికి బలవంతపెట్టేవాడు. ఆమెతో ఇట్లా అంటూండేవాడు, 'ఈ జీవితంలో సుఖంలేదు. విశ్రాంతిలేదు. ఉన్నదల్లా దుఃఖమే-కష్టమే. అంతులేని శ్రమే!...'

ఐదేళ్ళయింది అతనిని అట్లాగే సుఖపెట్టుతోన్న ప్రియమైన భార్య, బొమ్మలాంటి ఒక పిల్లనూ, భర్తనూ వదిలిపెట్టి ఈ ప్రపంచంనుంచీ దూరమై వెళ్ళిపోయింది- ప్రాణాన్ని వదలబోతూ భర్తను దగ్గరకు రమ్మని పిల్చి, తన సర్వసంతాపాన్నీ, వివర్ణమైన కండ్లతో దుఃఖాన్ని నింపుకుని అన్నది. "నా చిన్ని రజియా ఇప్పుడు నీ అధీనంలో ఉండబోతున్నది. దానికి కష్టం గానియ్యరాదు"- ఈ ఒక్కమాటే బాఖరు సర్వ జీవితాన్ని తల్లకిందులుగా మార్చేసింది! తన అర్ధాంగి చనిపోయిన తరువాత అతను తన అనాధయైన చెల్లెలిని వాళ్ళ ఊరినుంచీ తీసుకొచ్చుకున్నాడు. తన సతి కళ్లు మూసుకున్న క్షణం నుంచీ తన బద్ధకాన్నీ పొరపాట్లనూ వదలి, తన చనిపోయిన ప్రియురాలి చివరికోరికను పూరించటానికి ప్రాణాన్నయినా ధారపోయాలని నిశ్చయించుకున్నాడు.

ఇదెట్లా సంభవమైనదంటే, తన స్వర్గీయురాలయిన భార్యను కేవలం భార్యగానే గాక తన సర్వస్వముగా సర్వ ప్రాణాలతోనూ అగాధంగా అనుభవించేవాడు. అందుచేత ఆమె మృతివల్ల పుట్టిన దుఃఖపు బుగ్గ అతని అంతరాల తెరలలో పొరలలోకి పరుచుకుపోయింది. ఐనా, ఈ పైబడ్డ వయస్సులో నైనా మళ్లీ పెళ్ళి చేసుకోటానికి వాళ్ళ ఆచారం అనుమతించినప్పటికీ, కులంవారు సరేనన్నా, బంధువులు బలవంతపెట్టినప్పటికిన్నీ, అతడా ఆలోచననే తన తలలోనికి రానిచ్చాడు గాడు. పెళ్లేచేసుకుంటే స్వర్గతురాలయిన ఆ ప్రియతమురాలి జీవితాంతపు కోరిక అరి పొగచూరి పొయ్యేది అని!——

ఇక ఆనాటినుంచీ అతను ప్రాణానికి తెగించి పని పాటులలో విరామమెరుగకుండా పరిశ్రమించేవాడు. ఎందుకు? సర్గీయ అయిన భార్య చేసి

పోయిన అప్పగింతకు- తన చిన్ని బొమ్మకు రకరకాల వస్తువులు తెచ్చి పెట్టగల్గటానికి !

ఎప్పుడైనా, అప్పు డప్పుడూ సంతకుబోయి వచ్చాడో, రాగానే చిన్ని చిన్నారి రజియా తన కాళ్ళకు తీగలా చుట్టుకుండేది- దుమ్ముతో, శ్రమతో కప్పుకుపోయిన తన ముఖాన్ని రజియా పెద్దకళ్లు విప్పుకుని ఎన్ని కళ్ళుగానో చూసేది-గుచ్చిగుచ్చి అడిగేది, 'నాయనా నా కోసం ఏం దెచ్చావ్ ?' అన్నమాట తన కళ్ళలో చెలమలు పారించేది. రజియాను ఎత్తి గుండె కదుముకునేవాడు. కళ్ళకద్దుకునేవాడు. ఎప్పుడైనా మిఠాయీ- ఎప్పుడైనా ఆటబొమ్మలూ తెచ్చి ఆమె వడి నింపుతోండేవాడు. అప్పుడు రజియా తండ్రి ఒళ్ళోనించీ దూసుకుపోయి తన సావాసగాళ్ళకు అవన్నీ చూపించి వచ్చేది!- అసలే బొమ్మలాంటి ముద్దయిన పిల్ల. దాదాపు 7-8 ఏళ్ళు వచ్చాయి. ఒకనాడు మారాయించి తండ్రితో అన్నది. "నాయనా, మనం ఒక అందమైన "డాచీ"ని కొనుక్కుందాం!... నాకో "డాచీ''ని తెచ్చిపెట్టవూ ?!" అని;—పాపం! అమాయికురాలయిన ఆ పసిపాపకేం తెల్సు తాము నిరుపేదలమనీ, కూలిజేసుకు బతికే వాడి బిడ్డననీ !!—

అంచేత అది తీరనికోరికల్లోదే. ఎంతకూ అసాధ్యమైనదిగూడానూ!

ఏది ఏమైనా ఆ చిన్నారి పొన్నారి చిరుత కోరికను తీర్చకపోవటం ఆ తండ్రి హృదయాని కొక ఘోరమైన నేరం;—నిస్సారమైన నవ్వుతో బాఖరు ఆమెను తన ఒళ్లోకి తీసుకుని, "రజ్జూ! నీవే ఒక అందాల ఒంటెవు గదా !'' అన్నాడు. కాని రజియా వినలేదు. నాకు "డాచీ'' కావాల్సిందే'' అన్నది—బాఖరు కళ్ళనీళ్ళు చెంపల మీదిగా నింపాదిగా జారాయి!

అదేనాడు ధనికుడైన ఆ గ్రామాధికారి తన ఒంటె నెక్కి ముందు బిడ్డను కూచోబెట్టుకొని ఆ గూడెంలో కొంతమంది కూలీలకోసం రావటం రజియా చూసింది. ఇంక అక్కడినుంచీ ఆమె కోరికకు రెక్కలు మొలిచి నట్టయింది! తానూ ఆ గ్రామాధికారి బిడ్డలాగా ఒంటెనెక్కి తిరగాలి—

ఆమెను ఎప్పుడు మాట్లాడించినా అదేమాట!-ఇక ఆనాటినుంచీ, బాఖర్‌లో ఇంకేమైనా మిగిలి వున్నదేమో బద్ధకమూ అవీ ఎగిరి పొయ్యాయి.

ఎందుకైనా మంచిదని అతను రజియాను టలాయించ జూశాడు. కాని, తన మనసులో ఆ అమ్మాయి మనస్సును ప్రతిష్ఠ జేసుకున్నాడుగదా! 'ఏమైనాగానీ-ఎలాగైనాగానీ, నా ప్రాణపదమైన రజియాకు ఒక చక్కని 'డాచీ'ని తప్పక కొని తీరతాను.' ఇలా అనుకోవాలనిగాదు అనుకున్నాడు.

అప్పట్లో-ఆ ప్రాంతంలో అతని రోజువారీ ఆదాయం మూడణాల కంటే మించి ఉండేదిగాదు. అదే ఇప్పుడు 8-10 అణాలదాకా వచ్చింది. దూర దూర గ్రామాలకు సైతం అతను కూలీకి వెళ్లుతూండేవాడు. వేతా, కోతల సమయంలో రాత్రింబవళ్ళు ప్రాణంతో పోరాడేవాడు. పైరును కోస్తాడు-ధాన్యం నూరుస్తాడు - బస్తాలలోకి ధాన్యం పట్టుబడీ చేస్తాడు-గడ్డి వాములు చక్కగా వేస్తాడని పేరొచ్చింది-వ్యవసాయం రోజుల్లో అయితే ఎడంచేతా కుడిచేతా నాగలి దున్నేవాడు-విత్తులు చల్లటంలో నేర్పరి-కలుపు తీతకు ముఠా గట్టి తాను మేస్త్రీగా పని జేస్తాడు. ఆ రోజుల్లో రోజుకు పావలానించీ అర్థ రూపాయిదాకా గిట్టేది అతనికి కూలీ—

ఎప్పు డెప్పుడైనా ఏమీ పని దొరక్కపోతే, ప్రొద్దున్నే లేచి అక్కడికి ఎనిమిది కోసుల దూరంలోవున్న సంతకు వెళ్లేవాడు. '8-10' అణాలు కూలీ కండ్ల జూసిగాని ఇంటికీ వచ్చేవాడు గాడు. ఆ రోజుల్లో అతను ప్రతిరోజూ రోజుకు '6' అణాలు మిగుల్చుకుండేవాడు. ఈ క్రమానికి అత నెటువంటి పరిస్థితిలోనూ ఒడుదుడుకులు రానిచ్చేవాడు గాడు. అతని కదొక పిచ్చై పోయింది.

'బాఖర్ నీ విప్పుడైతే బొత్తిగా మారిపొయ్యావు ! మొదట్నించీ నీ విట్లాగే ఒళ్లువంచి పనిజేస్తే...!' అనేది చెల్లెలు—

'నీవు గట్టిగా అంటే నా జీవితమంతా గూడా ఇట్లాగే కూచో నుంటాను ఏ పనీ చెయ్యకుండా ?' అంటాడు నవ్వుతూ బాఖర్.

'నీవు వూరికే కూచోవాలని నేననటంలేదు...కాని, ఆరోగ్యం పాడు చేసుకుని డబ్బు కూడబెట్టుకోమనే సలహా గూడా ఇయ్యలేను!' అంటుంది చెల్లెలు—

ఇట్లాంటి సంభాషణ ఎక్కడ ఎప్పుడు జరిగినా, అతని చచ్చిపోయిన భార్య ప్రేమ రూపం కండ్ల గట్టినట్లుండేది బాఖరుకు - ఆమె చిట్టచివరి మాట అతని చెవుల్లో ప్రతిధ్వనించేది! వెన్వెంటనే, ముందిట్లో ఆడు కుంటోన్న చిన్ని రజియా మీదికి ఒక ప్రేమ పాశం పడి పెదవులమీద దాకా వచ్చిన ఏడుపును ఆపుకుంటూ శుష్కమైన నవ్వు నవ్వేవాడు!... మళ్లీ తన పని తనను తన్ని చెప్పినట్టు జ్ఞాపకం వచ్చి, వెంటనే ఏదో పని లోకి వెళ్లేవాడు- అట్లా అది నేటికి-సంవత్సరంన్నర కఠినమైన కష్టం జేసిన తరువాత అతను ఆ చాలాకాలంగా పేరుకునున్న కోరికను నెరవేర్చగలి గాడు. 'డాచీ' మెడ తాడు అతని చేతులో వుంది, దాన్ని బట్టుకుని సర్కారీ పిల్లకాలవ ఒడ్డు ఒడ్డు ఒడ్డున్నే అతను పోతోన్నాడు—

అది సాయంకాలం-పడమటి దిశను అస్తమిస్తోన్న సూర్యుని కిర ణాలు ధరిత్రికి బంగారపు దానం చేస్తోన్నై! గాలిలొ కొంచెం చల్లదనం వచ్చింది-కొంచెం దూరంలొ, చేలలో, తిత్తిరిపిట్టలు 'టీంవ్‌ః, టీంవ్‌ః' అంటూ ఎగురుతూన్నాయి!

బాఖరు దృష్టిలో, ధ్యానంలో, గతించిన విషయాలు ఒక్కటొకటిగా దర్శనమిస్తోన్నై!...అటూ ఇటూ నుంచీ ఎవరో రైతులు తమ ఒంటెల మీద ఎక్కి ఊగులాడ్తూ వెళ్తున్నారు-అక్కడక్కడా పొలాలనుంచీ తిరిగి వచ్చే రైతుల పిల్లలు కచ్చటాలలో కట్టిపెట్టుకున్న గడ్డిమోపులమీద కూచుని ఎడ్లను తోలుకుంటో, ఏదో జానపద గీతాల్లో జ్ఞాపకం వచ్చినంత గానే ఒకటీ అరా చరణాలు పాడుకుంటో, ఈ కచ్చటాల వెనకగా కట్టి వుండి నిశ్శబ్దంగా ఊగుతూ నడిచివస్తోన్న ఒంటెల మూతులతో ఆటలాడు కుంటో, వస్తున్నారు—

బాఖరు, ఎల్లాగైతేనేమి కలనుంచీ మేలుకొన్నవాడిలా పశ్చిమాన క్రుంకబొయ్యే సూర్యుణ్ణి చూశాడు. వెంటనే ఉదురుగా నిర్మానుష్యంగా ఉన్న ప్రదేశంమీదకు చూపును ఉరికించాడు-అతని గూడెం ఇంకా చాలా దూరాన ఉన్నది-సంతోషం అనిపించింది ఎందుకో! వెనక్కు దిరిగి చూశాడు. గప్‌చిప్‌గా నడిచివస్తోన్న 'డాచీ'ని ప్రియపూర్వకంగా అదిలించాడు. అది కొంచెం కాలుజాపి నడవటం మొదలెట్టింది. ఎందుకంటే దీన్ని తోలుకువెళ్లేటప్పటికే రజియా నిద్రపోకుండా వుండాలని!...

*　　　*　　　*　　　*

అల్లంతదూరంలో ఆ గ్రామాధికారి ఉండే పల్లెపట్టు అవుపడ్డం మొదలెట్టింది. ఇక్కడినుంచీ అతనిపల్లె దగ్గఱగానే వుంటుంది. అదే ఒక కోసెడు-బాఖర్ నడక మందగించింది-దీనికి తోడుగా-అతని ధ్యానదేవి తన రంగురంగుల కుంచెలతో ఆతని మెదడనే పలకమీద రకరకాల చిత్తరువులు వేయసాగింది బాఖరు ఆ బొమ్మలను చూస్తూనే ముందుకుబడని అడుగుతో నడుస్తోన్నాడు! తను ఇంటికిచేరగానే చిన్ని రజియా మారాంజేస్తూ సంబరంతో ఉరకలువేస్తూ తన కాళ్ళను చుట్టివేసినట్టూ, వెంటనే 'డాచీ'ని చూసి దాని పెద్దపెద్ద కండ్లు గాభరాతో, ఆనందంతో నిండిపోయినట్టూ, మళ్లా అతను చూశాడు. తన రజియాను ముందర కూచోబెట్టుకుని సర్కారీ పిల్లకాల్వ ఒడ్డున్నే 'డాచీ' మీద పరుగుతీస్తున్నట్టూ; సంధ్యా సమయం అది. మన్నైన మలయమారుతంలాంటి గాలి వీస్తున్నది. అప్పుడప్పుడూ ఏదో అడివికాకి తన పెద్దపెద్దరెక్కలల్లారుస్తూ చాచుకుని తన మొద్దుధ్వనులతో ఒకటిరెండుసార్లు 'కావ్ కావ్' మంటూ పైకిలేచిపోతో ఉన్నది-రజియాయొక్క సంతోషానికి అంతూ పొంతూ లేదు. అది: విమానంలో లేచిపోతోన్నట్టూ, మళ్ళీ అతనెదటికి వచ్చింది ఒక చూపు!-ఆ రజియాను దీసుకుని భావల్‌నగర్ పెద్దసంతలో నుంచున్నట్టూ, చిన్నిరజియా అదెంతో చూడదగిందిగా ఉన్నట్టూ, కంగారుగా నుంచుని అది అన్నివైపులా పెద్ద

ధాన్యపు రాసులనూ, అంతులేకండా వున్న కచ్చటాలనూ, ఆశ్చర్యంతో ముంచెత్తి తన్మయుల్నిచేసే నానా రకాల వస్తువులను చూస్తూన్నట్టూ, ఒక దుకాణంలో గ్రామఫోను అమ్మబడ్తూంది. దాన్నిచూసి ఆకొయ్యపెట్టెలోంచీ పాట ఎట్లావస్తోంది? ఎవరు దాంట్లోదాగి పాడుతున్నారు? అని ఈ విషయా లన్నీ రజియాబుద్ధిలోకి ఎక్కి ప్రశ్నించినట్టూ, ఇవన్నీ ఆమె తెల్సుకో టానికీ ఆమె మనస్సులో ఏవైతే కోరిక పీరిక లెత్తుతున్నాయో అవన్నీ అతని కళ్ళల్లోనించీ ఉట్టిపడుతున్నాయి!

తానట్లా ధ్యాన ప్రపంచంలో మునిగి పల్లె సమీపానికి చేరుకొంటో న్నాడు. ఏదో అకస్మాత్తుగా ఒక ఆలోచన తట్టి అక్కడనే నిలిచి పోయ్యాడు - కొంచెం ఆగి గూడెంలో ప్రవేశించాడు. ఆ గ్రామాధికారి పల్లెకూడా ఏమంత పెద్దది గాదు. అటువేపుల ఊళ్ళన్నీ అలాగా వున్నాయ్. ఎక్కువగా ఉంటే '30' గుడిసెలు!-పండు ఇటికా, దూలాలూ, పెంకుతో ఉన్న ఇళ్ళే ఇప్పటికీ అక్కడ లేవు! బాఖర్ వుండే గూడెంలో నైతే '15' గుడిసెలే ఉన్నాయి! ఇంట్లెక్కడ!!-అవీ రెల్లు గుడిసెలు-ఆ గ్రామాధికారి పల్లె గూడా, '20-25' గుడిసెలు గల వూరే-కేవలం గ్రామాధికారి ఇల్లు మాత్రం పచ్చి ఇటుకలతో కట్టబడ్డది, కాని దానిమీది కప్పు గూడా రెల్లే!....

వడ్ల నానక్ గుడిసె ముందు అత నాగాడు. సంతకుపోయే ముందు అతను నానక్ ఇంటి దగ్గర 'డాచీ' మీద కట్టే పల్లం చెయ్యమని కర్ర యిచ్చిపోయ్యాడు. అతనికి స్ఫురణ గలిగింది. ఒకవేళ తన చిన్ని రజియా ఇప్పుడే ఒంటె నెక్కుతానని మారాముళ్లు పెడితే నే నెట్లా దాని వాంఛను ఆపుచెయ్యగల్ను! అదే ఉద్దేశంతో అతను వెనక్కు తిరిగి నానక్ ఇంటికి వచ్చాడు - అతడు 'నానక్‌జీ!' అని పెద్ద కేక పెట్టాడు. లోపల్నించీ బహుశా అతని భార్య గావచ్చు పలికింది. 'ఇంట్లో లేడు. సంతకు పోయాడు' అని; బాఖర్ ఉత్సాహం సగం చచ్చిపోయింది! అతనేం జేస్తాడు!.... నానక్ సంతకే పోతే నేను చెప్పిన పల్లాన్ని ఏ గంగలో

గలిపి పొయ్యాడు !....కాని మళ్లీ అత ననుకున్నాడు. ఏమో చేసి ఇంట్లో పెట్టే పొయ్యాడేమో!....అతను మళ్లా కేక వేశాడు. 'నేను 'డాచీ'కి పల్లం తయారు చెయ్యమని చెప్పిపోయియుంటిని .. ఇంట్లో ఏమైనా ఉందా !-నా కేమీ తెలియదు' అని జవాబు వచ్చింది...

బాఖర్‌కు మిగిలి వున్న ఆ సగం ఉత్సాహమున్నూ ఆరిపోవటం మొదలెట్టింది !....పల్లం లేకుండా 'డాచీ'ని తీసుకుని ఎట్లా పోవాలి, పోతే మాత్రం ఏం నయం. నానక్ వుంటే తాను జెప్పిన 'పల్లం' చెయ్యక పోయినా, పోనీ మరొకటన్నా అతన్నడిగి తీసుకుపొయ్యేవాడిని....ఇట్లా అనుకుంటోండగా అతనికో ఆలోచన తట్టింది, సరే పద. గ్రామాధికా రింట్లో చాలా ఉంటై. వారి నడిగి ఓ పాతదన్నా తీసుకుపోదాం అని- దీంతో బిడ్డను ఒంటెనెక్కించుకుంటే నానక్ వచ్చాక కొత్తది చేయించుకో వచ్చును అనీ ! ...గ్రామాధికారిగారి ఇంటిదారి బట్టాడు—

తన ఉద్యోగ కాలంలో ఆ గ్రామాధికారుగారు ఎక్కాదక్కాగా సంపాయించి పెట్టుకున్నాడు. ఎప్పుడైతే అటు సర్కారు కాలవ మొద లెట్టారో అప్పుడు ఇటు తన ప్రభావంవల్లా, డబ్బువల్లా, ఆ రాజ్యంలోని ఎన్నో చదరపు మైళ్ళ భూమిని సంపాయించాడు - ఇప్పుడు పించెను తీసు కుని ఇక్కడనే వచ్చి ఉంటున్నాడు. ఒక శివారు గ్రామం గూడా వుంది. ఆమ్దనీ ఎక్కువగా మిక్కిలిగా వస్తూనే వుంది; ఎంతో మజాగా జీవిస్తున్నాడు—

అప్పుడు అతను చతుశ్శాలలో ఒక పెద్ద కుర్చీలో కూర్చుండి, 'హుక్కా' తాగుతున్నాడు. తలకు తెల్లనిపాగా, వంటికో తెల్లని కమీజూ, దాని మీద తెల్లని జాకెట్టూ, నడుముకు పాలలాంటి తెల్లని లుంగీ, ఇలా వున్నాడా అధికారి !

చేతో 'డాచీ' తాడు బుచ్చుకుని, దుమ్ముతో తలా వలువలూ తెగ మాసి వస్తోన్న బాఖర్‌ను చూసి అత నడిగాడు—

"ఏమిటోయ్ చెప్పవూ! బాఖర్...ఎక్కణ్ణించి వస్తున్నావ్ !?"

బాఖర్ వంగి "హుజూర్" అంటూ సలాం చేసి, "మాలక్ సంత నించి వస్తున్నా" అన్నాడు.

ఈ" 'డాచీ' ఎవరిది ?"

"నాదే ఇది. మాలిక్ ఇప్పుడే సంతనించీ తెస్తున్నాను."

"ఎంతకు తెచ్చావ్ ?"

బాఖర్ అనుకున్నాడు మొదట '160' రూపాయలకు తెచ్చానని చెబుదామని-అతని బుద్ధిలో ఇంత అందచందాల 'డాచీ' రెండొందలకు గూడా చౌకే ! కాని మనస్సు వప్పలేదు ఎందుకో !

"హుజూర్. '160' రూపాయలకైతే నేనే అడిగాను. కాని '140' రూపాయలకు మాత్రమే తెచ్చాను!!...

ఆ గ్రామాధికారి "డాచీ"ని ఒక కోరచూపుతో చూచాడు. ఆయన స్వయంగానే కొన్నాళ్ళనుండీ తన సవారీకోసం ఒక అందమైన "డాచీ"ని కొనాలని అనుకుంటూన్నాడు- అతనికైతే ఒక"డాచీ" లేకపోలేదు. కాని, గత సంవత్సరం దానికి ఏదో జబ్బుచేసింది. దానికి నీలీ అదీ వేసి చికిత్స చేయటంవల్ల రోగమైతే పోయిందిగాని, దాని నడకతీరూ, గర్వమూ, అందమూ, పోయినాయి!—— ఈ "డాచీ" అతని కంట్లో నిలిచిపోయింది. దాని పొంకమైన, తగిన అవయవాలూ! ఏమి తెల్లగా బూడిదరంగూ ! ఎంత కోమలమైన పొడుగాటి మెడ !!

"పద! మా నుంచీ "160" రూపాయలూ తీసుకో. మాకో "డాచీ" అవసరం గూడా వున్నది ! పదిరూపాయలు నీ కష్టానికి మిగిలి వుంటాయ్!

"హుజూర్! ఇప్పటికైతే నే నెంతకు తెచ్చానో ఆ కోరికే తీర లేదు!' అన్నాడు రాని నవ్వు తెచ్చుకుంటూ చప్పచప్పగా బాఖర్——

గ్రామాధికారి లేచి ఆ 'డాచీ' మెడమీద చెయ్యివేసి నిమరటం మొదలెట్టాడు. 'ఓహో ! ఎంత అసలైన జంతువు !....సరే తీసుకో, ఇంకో ఐదురూపాయ లెక్కువ దీసుకో !' అంటూ తన నౌకరుకు కేక విసిరాడు, 'నూరే....అరే ఓ నూరే-రా !' అని——

నౌకరు గొడ్లసావిట్లో కూచుని గేదెలకోసం చొప్పకట్టలు నరుకుతోన్నాడు. అత నదేవిధంగా గొడ్డలి చేత్తోబుచ్చుకుని ఉరికీ వచ్చాడు- గ్రామాధికారి అతనితో ఇల్లా అన్నాడు ...

"ఈ 'డాచీ'ని తీసుకుపోయి కట్టేసెయ్యి !...'165' రూపాయల్లో ! ...చెప్పు ఎట్లావుంది ! ?...."

ఇదంతావింటూ నిర్ఘాంతపడి నించున్న బాఖరు చేతులోనుంచీ నూరేగాడు తాడుతీసుకుని, దాన్ని క్రిందినుంచి పైకీ, పైనుంచిక్రిందికీ చూస్తూ, 'బలే మంచి జంతువు !' అనంటూనే గొడ్లసావిడికేసి నడిచాడు !!...

వెంటనే గ్రామాధికారి జేబులోనుంచీ '60' రూపాయలనోట్లు దీసి బాఖర్‌చేతిలో బెడ్తూ చిన్నగా నవ్వుకుంటూ—

"ఇప్పు డివి వుంచు. తతిమ్మావి రెండుమూడు నెలల్లోపల్నే అంద జేస్తాను....ఒక వేళ నీ అదృష్టంవల్ల ముందేదొరికినా ఇస్తాను. నీవు రా !" అంటూ, అతనినించీ ఏ జవాబూ రాకముందే కొట్టంవేపు వెళ్ళిపోయాడు.

నోరా మళ్లా మేత నరుకుతూ కూచున్నాడు—

'గేదేల మేత అట్లా వుండనియ్యి—అది ఆకల్తో వున్నట్టవుపిస్తోంది. మొదట 'డాచీ' కోసం, దానికి పసందైన మేత వెయ్యి !' అని దూరం నుంచే కేక బెడుతూ, 'డాచీ' దగ్గరికి బోయి దాని మెడ మీద చెయ్యివేసి దువ్వటం మొదలెట్టాడు...

* * * *

నాడు కృష్ణ పక్షాష్టమి-ఇంకా చంద్రోదయంగా లేదు. నిర్మానుష్య మైన భూమికి నలుమూలలనుంచీ కటిక చీకటి కమ్ముకున్నది. నెత్తిమీద ఒకటో రెండో నక్షత్రాలు తొంగిచూస్తున్నాయి. తుమ్మ చెట్లూ, ఇండ్ల ముందరి చెట్లూ, పెద్ద పెద్ద చెట్లన్నీ పెద్ద పెద్ద నల్లని మచ్చల్లాగా అవుపిస్తోన్నాయి...'60' రూపాయల నోట్లనూ చెత్తో ఊగులాడిస్తూ, తన యింటికి కొంచెందూరంలో ఉన్న పొదలచాటుగా కూచున్నాడు. బాఖరు, ఆ

మసకగానూ, చిమచిమా మెరుస్తోనూ వస్తోన్న చంద్రకిరణాల వెలుగును చూస్తోన్నాడు—

ఇంటి రెల్లు కప్పులోనుంచీ దూరి ఇంటి ముందర వాకిట్లో పడుతోన్నది ఆ వెలుతురు. రజియా ఇంకా మేలుకొనే ఉన్నదని తెలుసుకున్నాడు— "డాచీ" వస్తూందని నిరీక్షిస్తూ ఉండొచ్చు...అతనింకాగూడా ఇట్లా ఆలోచించసాగాడు—వెలుగు మలిగిపోయి, రజియాకూడా నిద్రబోయినట్టయితే తాను గప్‌చిప్‌గా ఇంట్లో ప్రవేశింతామని !!

చంద్రుడు బారెడు పైకొచ్చాడు- ఇంటిముందున్న నల్లని చీకటి తెల్లని వెన్నెలగా మారిపోయింది.

రజియా చల్లగా—హాయిగా నిద్రపోయింది—

అతను పొదలలోనించి లేచి నిశ్శబ్దంగా ఒక్కొక్క అడుగేవేస్తూ ఛీ, పేదలకోరికలు....అనుకుంటూ, నిర్జీవంగా ఇంట్లోకి పొయ్యాడు....

---

రచయిత :
ఖుర్రాతుల్లాయిన్ హైదరీ"

# "భగ్న గీతం"

మూల కథ పేరు :
ఆస్మాఁభీహై సితమ్ ఈజాద్‌కియా"

1944 జూలై నాటికి ఒక మేఘమిశితమైన తరంగం. ఎప్పుడైతే సదుల-ఇండ్ల ఎర్రని కప్పులపైన చిక్కని నల్లని కావిరిగా కమ్మిందో, పర్వత శిఖరాగ్రాలమీద ఈదులాడే మబ్బులు వరండాలోని ద్వారాల అద్దాలకి తగులుతూన్నై.

వసారాలో చదరంగం ఆడుతోన్న నాకు కొంచెం దూరంలో మేజాకి చుట్టూ ఆ అయిదుగురు మాటాడకుండా కూర్చొనున్నారు.

వారు : అన్నపూర్ణ ప్రభాకర్, నాహేదా అనోరాం, రాజకుమార్ ఆస్మాఁపురం, లెఫ్టినెంటు కర్నల్ దస్తూర్, రుస్తుం జహంగీర్‌లూ; వీరితోబాటు జాతికుక్క డాఁకార్‌లూ,-

ఈ సమయంలో ఎవరైనాసరే వారి ఆటకుగానీ ఆలోచనకుగానీ ఆటంకం అయ్యేలా రిపోర్టరు మాదిరిగామాట్లాడితే అది ఇల్లా ఉండొచ్చు!

అర్జన్‌గఢ్ ఫైనాన్సుమినిష్టర్ బ్రజేశ్వర్రావు ప్రభాకర్ మనసు కొల్లగొట్టుకున్నభార్య అన్నపూర్ణ. ఆమె చక్కని చిక్కని ఆకుపచ్చరంగు మైసూరు జార్జెట్ చీరా, జాకెట్టూతో ఉంది. ఆమె తన నీలినీడల కళ్ళతో బాగా కనిపిస్తూ ఉంది. కాశ్మీరు పనితనం చేసిన తెల్లని ఓవర్‌కోటు తన భుజాల మీద వేసుకోనుంది ఆమె! ఆమె అందమైన చెవుల కుందనపు జూకాలు ఊగులాడుతోండటంవల్ల, అవీ, ఆమె చెంపలూ తళతళా మెరుస్తోన్నాయి. ఇక నాహేద్ : ఒత్తైన నారింజరంగు పెద్దకాళ్ళ పైజామా, అల్లిక అంచుల నల్లని శాలువా వేసుకుని ఎప్పటిలాగానే బాగా అందంగా చలాకీగా కనిపిస్తోంది——రాజకుమార్ నల్లనల్లని షేర్వానీ, తెల్లని చూటీదారీ

పైజామాతో, ఎటో విందుకు వేంచేస్తున్నట్టు కన్పిస్తున్నాడు—కర్నల్ జహాంగీరు బాదామీరంగు శార్క్‌స్కిన్ జాకెట్టుతో, బాధతో చుట్ట పొగ వదల్తూ, మామూలుకు విరుద్ధంగానూ, ఆవసరికుడూ అందగాడూగానూ అవుపించేవాడు. శ్రీమతి అనోర్ అమామ్ పెంపుడుకుక్క ఆమె' అందమూ ఆనందమూ తులదూస్తూ బలే చలాకీగా కనిపిస్తోంది.

పక్కనేవున్న బల్లలమీద బ్రిడ్జీ ఆడుతున్నారు బహుజోరుగా. ఈ అయిదుగురి ముందూ వున్న ఆటేమో చల్లబడుతూపోతోంది. బహుశా వారు ఒకరితో ఒకరు విసుగెత్తినట్టున్నారు. చాలా సేపైంది మౌనముద్రలు దాల్చి ! ..మూడురోజుల్నించీ ఏకధారగా వర్షం పడుతోంది. బైటికి అడుగుపెడదామంటే వీలు అవపట్టం లేదు. ఇండోరు గేముల్లాంటి ఏఆటలో గూడా మనస్సు నిలుపుకుండేటట్టు లేదు. అందరి ఆలోచనలూ అన్ని విధాలుగా వున్నాయి— "సీజన్"కు లొంగి అంతా ఎంతో డల్‌గా ఉంటున్నారు—యుద్ధం మూలాన్ని "రింక్" ఆపివేశారు. మరి ఇందులో సైనికుల కోసమని "కేంటిన్" తెరిచారు. రోడ్లమీదా, హోటళ్ళూ, దుకాణాల మీదా ప్రతీచోటూ ప్రతిమూడో వ్యక్తి రంగులో కనిపిస్తున్నాడు—తమతో కలిసివున్న వాళ్ళల్లోనించీ చాలా మంది తిరిగి వెళ్ళిపోతున్నారు. దక్షిణ భారతీయులూ, యు. పి. వారూ జూన్ నుంచే వచ్చేయటం ప్రారంభించారు. ఢిల్లీ-పంజాబు ప్రాంతం వాళ్లు ఇప్పుడిప్పుడే రావటం మొదలేశారు.

అన్నపూర్ణ ప్రభాకర్ మనసు మనసులోనే ఆలాపనని గుర్తు తెచ్చుకుని దానిని జ్ఞాపకం చేయటానికి ప్రయత్నిస్తోంది. క్రితం రాత్రి ఆమె దాన్ని "ఫీ, ఫీ" నుంచీ పియానోమీద విన్నది.

నాహేద్ అనోరమాం కుర్చీ కుషన్‌కు తల ఆన్చి కిటికీలోనుంచీ బైటికి కిందకు చూస్తోంది. అక్కడ ఆవరణలో మంచి మజ్బూతుగా కట్టిన నడవ మీదుగా అప్పుడప్పుడూ మనుషులు వస్తూ పోతోన్నారు - రెండు వేపులా వింగర్ వాకిళ్ళలో పడవ తెర నెత్తిన నీడల్లాగా ఇటూ అటూ తిరుగుతోన్నారు.

కర్నల్ జహాంగీరు ఈరాక్, మసరా, ఇంగ్లండ్, ఎక్కడెక్కడ తిరిగి ఈ నెలలోనే మళ్లా మాతృదేశం వచ్చాడో తెలియదు. గత పదిహేను రోజులూ తమ షికార్లలోని తమాషా తమాషా కథలన్నీ వినిపిస్తూ గడిపాడు. ఇప్పుడు పూర్తి విశ్రాంతిగా ప్రశాంతిగా కూచుని చుట్ట పొగ పీలుస్తూ వదులుతూ ఆ అందాలు చూస్తున్నాడు——

రాజకుమార్ రవికి అజ్మీరు పురాతన ప్రేమరాగపు కవ్వాలీలమీదా, ఫ్రాన్సు సారాయిమీదా, కోరిక లీరికలెత్తుతోన్నై. ప్రస్తుతం ఆ రెండూ తానున్న ప్రాంతంలో దొరికేట్టుగా లేవు. అంచేత అతని కివ్వాళ ఆలోచనల మీద ఆలోచనలు పోతున్నాయి. ఈ పరిస్థితిలో తన రాజకుమార్తె ఇందిరా దేవితోనో తాను రాజీ చేసుకున్నా తప్పేమీకాదు. కాని తానైతే ఒక మామూలీ జమీందారు కావటం, ఆమె తనకన్నా ఎన్నో రెట్లు పెద్దదైన రాజపుత్ర సంస్థానపు బిడ్డ కావటం....అందుకని ఆమెతో బాగా అతుకు కలవలేదు-ఆ రాజకుమారి రెండేళ్ళనుంచీ పుట్టింటనే ఉంటోంది.

బ్రజేశ్వర్రావ్ ప్రభాకర్ అప్పుడే విలాస విహారం ముగించుకుని చేరాడు-'లావంజ్'కు సగం దాకానూ, రెండోవేపు స్నేహితుల్తో 'గోల్ఫ్' ఇక''స్టాక్ ఎక్స్చేంజి''లో పూర్తిగానూ మునిగి, ఆ ఆలోచనలలోనే తేలుతోన్నాడు. పక్కనే వున్న ఒక మేజాకు దగ్గరగా పోలీసు సూపరిండెంటు 'ఇనాం మహమూద్' త్వరలోనే, డి.ఐ.జీ అవబోయే అదృష్టవంతుడు ఉన్నాడు. బ్రిడ్జ్ ఆడుతూ ఆడుతూ ఆలోచన చేస్తున్నాడు. బహుశా, ఆ నల్లని కళ్లూ, గిరజాల జుట్టూ, ఎర్రని బుగ్గల అమ్మాయి 'ఫీఫీ' ఎవరైతే పియానో మీద సంగీతం మోగించిందో, కనీసం ఇవాళ్టి ఉత్సాహం లేని సాయంత్రం ఆమెను కలుసుకోగలిగితే మటుకు ఎంతో అదృష్టం - ఆశ్చర్యం అనాలి !

ఈ ధారలో ఫరీద్ ఏదో అవసరం ఉండి రాజకుమార్ రవి కుర్చీ కేసి వంగి ఆయనతో చిన్నగా ఏమేమో రాజకీయాలు మాట్లాడాడు. రాజకుమార్ రవి ఆలోచించకుండానే తల వూపుతూనే వున్నాడు. మేము

సన్న్యాస వైరాగ్య తత్త్వం మనుషులం. మాకీ అనుభూతులతో, మాయలతో ఏం సంబంధం !

కర్నల్ జహంగీర్ చుట్ట బూడిద రాలుస్తూ కొంచెం బిగ్గరగా అన్నాడు "బ్రజేష్ - నడు - ఆఖరుకు 'బిగ్లేడ్' అయినా ఆడదాం'

"రవిని తీసుకోవెళ్లు - మేము లెఖ్ఖలేనన్ని నమస్యల పరిష్కారంలో ఉన్నాం" కూచున్నవాడు అలాగే కూచుని బ్రజేష్ సమాధానించాడు. మళ్లీ తన ధోరణిలో తాను ప్రవేశించాడు - తానేమాత్రమైనా మరోవేపు చూపు పోనిచ్చాడా. 'తాతా' 'స్పీలా' షేర్ల ఖిమ్మతు వెంటనే పడిపోతుందేమోనని;

"అన్నపూర్ణాదేవీ, ఇటు చూడూ. మీ ఆయన ఎంత గొప్పవాడో, ఒక అధికారం తాలూకు ఉదాహరణ నిస్తున్నాడు" కర్నల్ జహంగీర్ ఎంతో విసుగెత్తి అనేశాడే మాట !...

"ఆరి భగవంతుడా !-బ్రజేష్‌కు ఎంత దర్పం !...పోరాదండీ-మీరు పోయి ఆడుకోండి - మేమిప్పుడు శ్రీమతి ఆరజ్‌మంద్‌తో టీ పార్టీకి పోతున్నాం," నాహీదా లేస్తూ లేస్తూ అన్నది.

"నాహీదారాణీ. నీకు రాజకుమారిద్వారా ఏ యే కొత్త కొత్త సంగతులు తెలుస్తాయో అవి మాకు మాపటికి భోజన సమయంలో తప్పక చెప్పాలి సుమా !" రాజకుమార్ రవి కూడా లేస్తూనే అన్నాడు.

"ఆఖరుకు" నాహీదా తన చిలిపి గొంతుతో కొంచెం నవ్వింది- వెంటనే ఆ యిద్దరూ తమ ఓవర్‌కోట్లూ, శాలువలూ, సరిజేసుకుంటూ, మధ్యనున్న పెద్ద వసారాలోకి నడిచారు——

"-ఫీఫి - ఫీఫీ - ఏం పేరురా భగవంతుడా. సరీఘ్రాజలతరంగిణి మ్రోగినలాగా" ఇనాం మహమూద్ కొన్ని నిమిషాలదాకా జాతి కుక్క కార్‌లూను కుర్చీమీదకు తీసుకుని దింపి, తన చిన్ని తెల్లని అడుగులతో తన యజమానురాలి వెనక వెనకనే పరుగెత్తటం చూస్తూ ఉన్నాక, ఇప్పుడు గొంతు కొద్దిగా పెద్దదిజేసి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు.

చాలా ఉద్వేగివి అయితున్నావ్ తమ్ముడూ - కొంచెం కిందినుంచీ రానియ్యి నీ ప్రియురాలిని. చెవులు సరిజేయబడతాయి తమరివి !" కర్నల్ జహాంగీరు గద్దిస్తున్నట్టున్నాడు—

"ఆడంగులు ఎక్కడికి పోయారు?" ఇనాం మహమ్మదు అడిగాడు.

"శ్రీమతి అర్జ్‌మంద్ గదులకేసి"

"రాణీ బల్బీర్‌సింగ్‌కూడా ఉన్నారేమో అక్కడ ?"

"ఉండొచ్చు"

"నాకా ముసలిదాన్ని చూస్తే పరమాసహ్యం" అంటూ ఇనాం మహమూద్ మళ్లా చదరంగం కేసి తిరిగాడు—సాయంత్రం కాఫీలయ్యాక మళ్ళీ అందరూ లావంజ్‌లో గుమిగూడారు. ఆలోచిస్తూ పోయారు చాలాసేపు, ఏం చేయాలని—

"ఖుర్షీద్‌దయినా వచ్చినట్టయితే—" రాజకుమార్ రవి తనలోపలి మాటను చటుక్కున వదిలేశాడు.

"ఖుర్షీద్—అవును—తెలియదు ప్రస్తుతం అత నెక్కడున్నాడో" కర్నల్ జహాంగీర్ అన్నాడు. తరువాత అంతా కలిసి మహాసర్దాగా ఒక ఇలాంటి వ్యక్తిని గురించి ఇష్టాగోష్ఠి ప్రారంభించారు. అత నెవరో అక్కడున్న ఆడాళ్ళకెవరికీ అర్థమేకాలేదు. విసుగెత్తి నాహెద్ 'మసూరీటైమ్సు' కొత్త ప్రతిని అందుకుంది. కాయితాలు తిరగేస్తోంది.

దానిలో బొమ్మలన్నీ నగ్నాలూ, రహస్య క్రీడలకు సంబంధించినవీ ఉన్నాయి. రాబర్టు టైలర్— ఈ "లస్సీ" అంటే నా కసలు పడదు. "డ్రోతీ లెమూర్" నాకు బాగా నచ్చినది. "కేత్రీన్ హెప్‌బర్న్" రోజు రోజుకూ చెడ్డ వికృతాకారంగా తయారైతోంది. "హిక్‌మెంజ్"లో ఎవరో లూసీ పేరుగల "కేబర్"లు అవుతున్నాయి. అవీ కూడా మిక్కిలి కఠిన మైన పరిస్థితి ఏర్పడుతోంది—రాజ్‌కుమార్ రవి నాహెద్ కుర్చీవెనుకనుంచీ తొంగి వంగి చుట్టుతూ అన్నాడు.

"ఎందుకంటారా. ఇంతకంటే మంచి ప్రోగ్రాం లేదు. గౌరవనీయులంగా ఇంట్లో కూచుని 'బీర్' తాగుదాం."

"—మరి అన్నపూర్ణాదేవిగారి పియానో విందాం" కర్నల్ జహంగీర్ గభీమని కుమారుడు అర్జ్‌మంద్ తీర్మానాన్ని పెంచాడు. అంతా అతని అభిప్రాయంతో ఏకీభవించారు. వారంతా ఒక్కసారి అన్నపూర్ణకేసి చూశారు. ఆమె తన తియ్యతియ్యని చిన్నచిన్న నవ్వులనూ చిలుకుతూ, ఎందుకో శ్రీమతి అర్జ్‌మంద్ మేజాకేసివచ్చింది. వారందరూ "లావంజ్" నుంచీ బయటికి వచ్చి క్రింది భాగపు నడిమి గదిలోకి వచ్చారు.

"అన్నపూర్ణాదేవిని పట్టుకోండిప్పుడు" మిద్దెమీదినుండీ దిగుతూ ఎవరో పక్కగది సుమారునుంచి బిగ్గరగా అరిచారు.

"తన వేళ్ళతో పిల్లమంత్రం లేపుతోంది" కన్నూరాణీ ! బల్‌బీర్ సింగ్ "విక్సు" వాసన చూస్తూ తన పెత్తనపు ఎత్తుతో అన్నపూర్ణను పొగిడాడు. జేబురుమాలు తీసి ముక్కు తుడుచుకుంటూ ఒక సోఫామీద కూచున్నాడు.

"నాహెద్, నీకు జలుబుచేసినట్టుంది ?" అన్నపూర్ణ ఎప్పుడైతే పియానో అక్కడపెట్టి లేచిందో అర్జ్‌మంద్ నాహెద్ వైపు తిరిగాడు.

అరే! కాదు రజ్జూ అన్నయ్యా! ఏం పాడదాం మనం ?" నాహెద్ నాలుగేపులా దీపాలలా చూపులు తిప్పి అడిగింది.

బయట వాన మొదలైంది. మిన్నూమన్నూ తెలియనంత జోరైంది ఆ వాన.

నాహెద్ తన చిన్నారి చిలిపిగొంతుతో "నిద్రచేత లాగబడి నిద్రించారు గాయకులు" అన్నపాట ఆలాపన చేస్తోంది. అప్పుడు అన్నపూర్ణకు తన నాట్యాన్ని కాపాడుకోవాలి అన్న మాట జ్ఞాపకం వచ్చింది—ఎంత అనుకుంటున్నామో తక్కువలో తక్కువ అంత చెడ్డగా ఉండకపొయ్యేది జీవితం—అంతటా బాగా అలముకున్నతుపానులాగా, ఆకాశానికెగసే గాలి

దుమ్ములాగా, ఒకచిన్నవేడీ వెలుగూ ఉన్నగదిలో నిప్పుముందు కూచుని "చాకోలెట్" తాగుగూ తాగుతూనే జీవితం గడిచిపోయిన తీరు ఆమె తెల్సుకుంది. ఏం క్రూరతనం! ఆమెకు తన వూహలపై తనకే నవ్వొచ్చింది. పియానోమీద తాంపూర్ తీగెలు తెరలుతెరలుగా కదిలిస్తూనే ఆమెకు సతతమూ వెన్నెల రాత్రులూ, తామర పూవులూ గుర్తు కొచ్చేవి. ఇవ్వాళ మరి హోటలు దిగువ మిద్దె నాలుగు వేపుల పూల తోటలలోనూ రెపరెపలాడే తెల్లని పూలు జూలై వర్షంలో తడిసి ధగధగ లాడుతోన్నాయి. ఒక్కోసారి చందమామ మబ్బు గదులలో నుంచీ మనసుపడి వంగి చూస్తూండేవాడు. వెంటనే దాక్కుండేవాడు. ఎవరో పాడుతూన్నట్టుగాదు, వాతావరణంలో నుంచీ కరిగిన సంగీతం ధారాపాతంగా కురుస్తోన్నట్టుంది - నిజానికి సంగీతమే లేకపోతే ఈ రస విహీనమైన, విచ్ఛిన్నమైన బ్రతుకులో రుచీ శుచీ ఏముంటుంది!-'దుర్గా-పూర్వీ - మార్వా - వసంతం' - మరి ఎల్లాటి వెన్నెలనూ క్షణంలాగ లేని నా కళ్లు - తోంపూర్ నాలుగు తీగెల గంభీరమైన నాదంలో వ్యక్తిత్వపు సర్వావేదనా, సకలబాధా చుట్టుకోవస్తుందేమో!-గజ్జెల ఝుంకారమూ, మణిపూర్ చకచ్చికితమూ, భరత నాట్యపు గుంజా, గర్జలూ; కథక్ ఉసీ దెబ్బల మెరుపులలో, మరి నాటి ఆర్ద్రమైన రాత్రి ఆంతర్యపు శబ్దాలలో, ఎక్కడో సితార్ మోగుతూవుంటే ఎంత బాగుండేదో బాగుండేది! అన్నపూర్ణ ఆలోచించింది. ఇంత దివ్యసుందరమైన విశ్రాంతమైన ప్రపంచంలో ఎవరైతే అవుపించారో వారందరికీ రాత్రి భోజనలయ్యాకం నిద్రచేత లాగబడి నిద్రించారు గాయకులు," పాట ఆలాపన వినాలని వీనులు కోసుకుండేవారంతా——

అన్నపూర్ణ నాట్యంచేస్తూ చేస్తూ, కుషీఁమీద తలబెట్టి కళ్లు మూసుకుంది. ఆమెకు నాహిద్ పాడే ఆ పాట తీరు బాగా ఇష్టంగా ఉండేది. ఏదైతే తా నిప్పుడు పాడుతుందో దానికంటే; - ఆమెకు నాహెద్ పాడే పాటలన్నీ బాగనిపించేవి. ఆల్లాగే, అవే ఏరి కోరి వినిపించింది. అహో!

ఏమి సంగీతం!...ఏం సంగీతం!! బ్రజేష్ ఊరికా తమాషాగా అంటూండే వాడు. 'ఎల్లాగైతే పురాణ కథలలో దేవతలూ, రాజకుమార్తెలూ, వారి ప్రాణాలు ఏ విరహ వీధిలాగానో, ఎర్రని మిరపపండూ - రామచిలకల తోనూ బంధింపబడేదో, అల్లాగే అన్నపూర్ణ ప్రాణాలు ఆమె తాఞపూరీలో బంధింపబడిపోయాయి!'-ఎప్పుడామె పియానో వాయిస్తుందో అప్పుడు బ్రజేష్ తన గది గుమ్మంలో నుంచుని కలకత్తా 'యువకళ' వార్తలు చదువుతూండేవాడు. లేదా పడక కుర్చీలో జేరగిలబడి నిద్రలాగేవాడు. అలాంటప్పుడు నా హెడ్ భయపడి అంటూండేది. 'హారి భగవంతుడా! ఎంత కష్టతరమైన భర్తరా స్వామీ!' అని;-కాని, అన్నివేళలా ఒకరిమీద ఒకరు ప్రాణం విడిచేవారు - బ్రజేష్ అన్నపూర్ణను ఆరేడేళ్ళ క్రితం మొట్ట మొదట మహాబలేశ్వరంలో చూశాడు. ఆ పైన ఒకే ఒక నెల తరువాత అన్నపూర్ణను తన పేరు ముందు తప్పనిసరిగా తప్పించాల్సి వచ్చింది- ఆ రెండేళ్ళ ఎక్కువ కాలం రాష్ట్రపు ముఖ్యపట్టణమైన రాజపుతానాలో గడిపేవారు. శీతాకాలంలో మటుకు అప్పుడప్పుడూ బంధు మిత్రులను కలి పేందుకని పూనా - బొంబై నగరాలకు పోయేవారు. ఎండాకాలం విశ్రాంతి కని ఉత్తర హిందూదేశపు చల్లని కొండల మీదికి వెళ్లేవారు. ఈసారి వారేం అనుకున్నారంటే వచ్చే యేడు ఇద్దరమూ కాశ్మీర్ వెళ్దామని;-ఇంత వరకు అన్నపూర్ణ ఆ ప్రాంతం చూడలేదు. ఆమెకు 'నైనితాలు, సౌందర్యమూ, అక్కడి వాతావరణమూ, అక్కడి కొలనులలోని నాట్యపు వెలుగులూ ఎంతోప్రీతిగా ఉండేవి. ఇక'ముస్సోరీ'విరామం ఎరుగని సిమ్లా, అంతా ప్రభుత్వంగా ఉండేది - ఎక్కువలో ఎక్కువ విలాస యాత్రలు చేస్తూపోయి బుద్ధిహీనుల్లాగా 'స్కాండల్ పాయంట్' మీద కూర్చున్నారు. లేదా 'డేలీ'కి వెళ్ళిపోయారు. అన్నపూర్ణకు మసోరీ మా యిష్టంగా ఉండేది. తన భర్తా, తన ఇద్దరు పిల్లలూ, తన సన్నిహితమైన - ఇష్టమైన స్నేహితుల కూటమీ ఏదైతే ప్రతి యేడూ ఎక్కువైతూ ఉండేదో, అందుకని ఈ ప్రదేశం ఆమెకు అన్ని వస్తువులకన్నా గొప్పగా నచ్చేది.

ఇక్కడి ప్రజల సంస్కారమూ - ప్రకారమూ, మాటా - మంచీ, కట్టూ - గుట్టూ, రంగు రంగుల కేరింతలూ, నల్లని షేర్వాణీలూ - కవి సమ్మేళనాలూ, ఉన్నతమైన శాస్త్రీయ సంగీతమూ,-ఎప్పుడు వాతావరణము వ్యతిరేక కాంక్షితం అవుతుందో, కాక, వర్ష ప్రభావంవల్ల తాను నాహేద్ ఇంటిదాకా పోలేకపోతుందో, అప్పుడు తన పిల్లలను ముందర వేసుకుని గదిలో కూచుని అల్లిక పని చూసుకుంటోంది - ఎప్పుడన్నా వరండాలోకి వచ్చి తన పొరుగునే వున్న స్నేహితురాలు అర్జ్‌మంద్‌తో మాట్లాడు తుంది - గడచిన సంవత్సరంనుండీ ఆమె ఇద్దరు పిల్లలూ 'కే౹౹-హౌస్'లో చదువుకుంటున్నారు. పెద్ద పిల్లాడు అచ్చు బ్రజేష్ లాగుండేవాడు. చెబితే వినే గుణం గలవాడూ, కొంచెం కోపదారీ. ఎటుదిరిగీ తన మాట నెగ్గించు కునేవాడు - ఆడపిల్ల అన్నపూర్ణ వలెనే వుండేది. నల్ల కలువల్లాంటి కళ్లు గలదిన్నీ; నాలుగేళ్ళ ఈడునాడే ఆమె కథక్ నాట్యం ఇట్లా చేసేదిగదా చూసి తీరాల్సిందే ! ఆ బిడ్డ అన్నపూర్ణకు సకల వాంఛారాశిగానూ వుండేది. ఆమె ఆరామ్ కుర్చీలో పడుకుని ముద్దు బిడ్డ మీరా భవిష్యత్తును గురించే ఊహలు అల్లుకుండేది. ఆమె ఇంకా ఇల్లా ఆలోచనలు సాగించింది, వచ్చే యేడు లక్నోలో శంభుస్వామిగారి దగ్గరికి బిడ్డను తీసుకుపోవాలని——

నాహేదా తన గీతాన్ని పూర్తి చేసింది. బ్రహ్మాండంగా కరతాళ ధ్వనులు చేయబడుతున్నాయి - బయట వాన వెలిసింది - కాని రాత్రి దయ్యంలా నల్లగా ఆవరించుకునుంది——

డిన్నర్ అయ్యాక మళ్ళీ అందరూ అక్కడ కూడారు. నిద్రబోతోన్న ఆ గది మాటల్తో నవ్వుల్తో మేలుకొంది. అన్ని గోడల వెంబడే వరసగా వేసివున్న సోఫాలమీద కూచుని, కహీదా, సిగరెట్, పైప్, ఇంకా రక రకాల పొగలు ఎవరి కిష్టమైనవి వారు తాగుతూ మంచి హుషారులో ఉన్నారు. అనుకోనన్ని రకాల - విననన్ని విధాల మాటలు అక్కడ ప్రారంభమైనాయి. ప్రస్తుత యుద్ధ పరిస్థితీ, సాంఘికమైన నూతన పరిణా

మాలూ, స్కాండల్స్, టెన్నిస్, క్రికెట్, లను గురించిన జ్యోతిషాలూ- ఆగామి అదృష్ట తీరాలూ...

"మాకైతే ఇప్పుడు నిద్ర వస్తోంది స్వామీ! మేం వెళ్తున్నాం. నమస్కారాలు" అంటూ బ్రజేష్ తన టీ కప్పు ఖాళీచేసి లేచినుంచున్నాడు-

"ఇంకాసేపు కూచో. ఏం ఎగతాళి చేస్తావుగాని-" కర్నల్ జహంగీర్ కటువుగా అన్నాడు.

పాపం! అన్నపూర్ణ అరే అరే!! ఈ కవి ధోరణి కళా కలాపం లాంటి అమ్మాయి. ఎలాంటి రసమూ భావమూ ఎరగని మొద్దు పాలిట పడింది!?"

శ్రీమతి అరజ్మంద్ కొంచెం దూరంలో దర్వాజా దగ్గర ఉన్న సోఫాలో కూర్చుని ఉన్నది. చిన్నగా అన్నది. "ఆహా! ఈ మన భారత దేశపు జంటలు కలియని పెళ్ళిళ్లు!" - కన్నూరాణీ, బల్బీర్ సింగులు మూతి దగ్గరగా షోగ్గా పెట్టుకుని వున్న దస్తీ తీసేసి, సమాజపు అసందర్భ పరిస్థితుల మీద ఒక చిన్నని నిట్టూర్పు విడిచి - మళ్ళీ 'విక్స్' పీల్చారు. శ్రీమతి అర్జ్మందూ, కన్నూరాణీ, బల్బీర్ సింగులు రోజులోజల్లా తమ 'వింగ్'లో తమ గదులముందు వరండాలో కూచుని కూచుని ముస్సోరీ మొత్తం నిండి వున్న 'స్కాండల్సు' డైరెక్టు చేస్తూ వుంటారు - మేడ రెండో అంతస్తులోనుండీ ప్రపంచం యొక్క సంగ్రహ సింహావలోకనం మీదా-పండితుల విషయంలోనూ తుది తీర్మానాలు చేస్తోందేవారు అప్పుడు. 'రఫాత్ ఆరా' తన బావను పెండ్లి చేసుకోబోతోంది - 'అమీనా' విడాకులు తీసుకోబోతోంది - 'నసీమ్' ఒక హిందూ యువకుణ్ణి వివాహమాడింది- మేజర్ 'ఇర్షాద్' మూడోసారి ప్రేమకలాపాలలో తలమునకలై పొయ్యాడు - ఈ నాహేదా తన భవితవ్యాన్ని గురించి మనవ్యాధి పడుతోంది. దానిక్కారణం: ఆమెకు పూర్తిగా కింగ్జార్జి మెడికల్ కాలేజీలోని అందమైన డాక్టరుతో భావాలు కుదిరిపొయ్యాయి. అతను బేగం హమీదుల్లా మేనల్లుడు. ఇంకా ఇంకా - మిత్రులు శ్రీమతి అర్జ్మంద్ గారి

గుమ్మం పేరు. "అబ్జర్వేషన్ పోస్ట్ నెంబర్ వన్" అని, పెట్టి వదిలారు! "అబ్జర్వేషన్ పోస్టు నెంబరు టూ" హేకు బంగ్లా వెనక గ్యాలరీ ఉండేది.

మరి, వెంటనే అప్పుడు తమ తమ మాటలు వదిలేసి అందరూ కర్నల్ జహంగీరు కేసి అద్భుతమైన ఉత్సాహంతో తొణికిపొయ్యారు. ఏదో కొంచెంసేపులో 'ఫీఫీ' చేయి చూడటంలో మునిగారు. 'ఫీఫీ' గంధర్వ లోకంనుంచీ వచ్చిన గాయకి పేరుంది. ఆమె సుస్వరూపం అంతకూ ఆ కళ్ళు అలంకారాలు. వంకులు తిరిగిన ముంగురులు గల అందాల రాణి. ఆమె ఇప్పటిదాకా బొంబైలో తలిదండ్రుల దగ్గరే వుండి వచ్చింది-వస్తూనే, తన కుశాగ్రబుద్ధీ, దేవతా గానమూల వల్ల అందరి హృదయాలనూ ఆహరించుకుంది. అత్యంత సన్నిహితురాలైంది. అందరూ తమ తమ చేతులు చూపించుకోటం మొదలెట్టారు-ఇక, దయ్యాల కథలూ - ఆత్మల వృత్తాంతాలూ వ్యాపించాయి!...మాటల మాటల్లో కర్నల్ జహంగీరు ఒక ప్రతిజ్ఞ చేశాడు. తాను 'ఇప్పుడు ఎవరు ఏ ఆత్మని కోరినా పిలవగలను' అని;——

ఇక, మళ్ళీ అందరిచేతుల్లోకి ఒక కొత్తవిషయం వచ్చిపడ్డది. ఇప్పుడు కాలం నడవని విషయంలో ఎవరూ ఏమీ అనలేరు. వర్షం పడుతోన్నా, బ్రిడ్జ్ ఆడటం మనసు వేయకపోయినా, అందరూ జహంగీరు కూర్చుండే గదిలో మూగేవారు. బ్రిడ్జ్ మేజామీద విచిత్రంగా ఇంగ్లీషు అక్షరాలు వేరు వేరు కాయితం ముక్కలమీద రాసి వలయాకారంగా వాటిని పరిచేవారు. మధ్యగా ఒక గాజుగ్లాసు బోర్లవేసి ఉంచేవారు. అందరూ అన్నివేపులా నిశ్శబ్దంగా కూర్చుండేవారు. ఒక యిద్దరుమటుకు గ్లాసుమీద తమ వేళ్లు పెట్టేవారు. ఇక ఆ గ్లాసు తనంతటతనే కదిలి ఎక్కడో ఒక అక్షరం మీద ఆగిపొయ్యేది. అప్పుడా అక్షరాలనుకలిపి ఆత్మల సందేశాన్ని తెలుసుకుండేవారు. ఇందులో బలే విచిత్రమైన చెణుకులు ఉంటాయి! కొన్నికొన్ని సార్లు ఆత్మలుతప్పివస్తాయి. అప్పుడు బిగ్గరగా అరిచి, కోపతాపాలమాటలు అంటే తిరిగి వెనక్కుపోతాయి- అదేమిటో అశోక చక్రవర్తి ఎప్పుడూ మహాగంభీరంగా వచ్చేవాడు. పొయ్యేప్పుడు ఆత్మను ప్రార్థించేవారు "ఇప్పుడు

ఫలానా వారిని పంపించవలసింది" అని ;—జెయిన్‌హోర్‌లూ, లెయిజ్‌లీ హోవర్డులు చాలాసార్లు పిలవబడ్డారు. పండిత్ మోతీలాల్ నెహ్రూ వచ్చి ఒక మారు చెప్పాడు. "వచ్చే రెండు సంవత్సరాలలోపల తన కొడుకు భారత దేశపు ఏకైక నాయకుడు కాగలడు" అని ;– ఆత్మలుచెప్పే భవిష్యద్వాణి అప్పుడప్పుడూ ఖచ్చితంగా నిజమయ్యేది. వాటిలో రాజకీయ విషయాలేనా, పెండ్లిండ్లేనా, వయస్సూ–ప్రేమా – దాంపత్యాల భవిష్యత్తులనుగురించీ, విశేషించి ప్రశ్నలు జరుగుతూండేవి. పిల్లలు మాబాగా ప్రార్థించేవారు. బలే సరదాగా గడిచిపొయ్యేది కాలం !—కర్నల్ జహంగీర్ దాదాపు నలభై ఏండ్ల వాడేమోకాని, మాంచి యువకుడిలా వుండేవాడు. అతను ప్రతి విషయంలోనూ బహు జాగ్రత్త గలవాడు. అతని కీ ప్రపంచంలో ముఖ్యంగా మూడు వస్తువులంటే ప్రాణంగా వుండేది. ఒకటి : తోటపని, రెండోది : ఆత్మలతో సంభాషణా! మూడోది : పూనాలో వున్న మేన గోడలు నర్గీసూ;—ఆమె అతని కళ్ళకు అమృతదీపం. అతను ఎప్పుడు చెప్పినా, ఎవరితో చెప్పినా ఎక్కువగా ఆమె సంగతులే- ఇక శ్రీమతి అర్‌జ్‌మంద్ ఈ నిర్ణయానికి వచ్చేసింది. "ఈ నర్గీస్ అతనికి మేన గోడలూ వానకోడలూ మరేమీకాదు"—వారు ఆ మహిళాసంఘంలో బాగా మునిగిపొయ్యారు. జంద్ కవిత్వమూ, ఈరాణ్ దేశపు సూఫీ కావ్యమూ, జర్మనీ వేదాంతులనుగురించీ మహా తీవ్రంగానూ గంభీరంగానూ పరిశో ధించారు. ఎన్నో ఏండ్లు యూరప్ దేశాలలో గడిపారు. పారిస్‌లో ఆత్మల సొసైటీలో చేరారు. అవన్నీ కలిసి అతనొక మిక్కిలి ఇష్టమైన వ్యక్తి!... ఒకనాడు భోజనాల అనంతరం అందరూ యథాప్రకారంగా మిద్దెమీది మూల గదిలోకి వచ్చేశారు—అన్నపూర్ణ అల్లికపనిలో తెరిపిలేకుండా వున్నది. ఇనాం మహమూద్ 'ఫీఫీ' వెనక్కూ ముందుకూ తిరుగుతో వున్నాడు. నాహేదా జాతికుక్కను పడుకోమని చెబుతూన్నది. కాని అది కళ్ళు తెరుచు కుని అందరి మాటలూ వింటూనే వుంది - బ్రజేష్ ఒక మూల సోఫాలో కూలబడి ఎవరో ఐ.సి.యస్. బహద్దర్‌గారితో భారతదేశపు సంస్థానాల రాజ

కీయాలలో చుట్టుకుపోయాడు. పియానోకు దగ్గరగా ఒక స్టూలు మీద రాణీ కరంపూర్ తలారీ ప్రేమ దృష్టుల మజహారుద్దీన్ కూచుని పైపు లాగుతూ పొగ పాకిస్తున్నాడు. మజహరుద్దీన్ విలువలో విలువ గల సూటు వేసుకునేవాడు. గొప్పలో గొప్ప హోటళ్ళలో వుండేవాడు. 'పోన్ స్టైక్' కంటే తక్కువగా మాట్లాడడు - మరి అందరూ తెలుసుకున్నారు గదాంటే ఈ అట్టహాసమంతా ఏ రకంగా పరిణమిస్తుందో చూద్దాం అని! అయినా వీటన్నిటికి హద్దూ పద్దూ లేకండా డబ్బు ఎలా వస్తోంది! అతను రూపరేఖలలో అందంగా వుండే మాట నిజమే - బుద్ధిమటుకు అంత గొప్పదిగాదు. కాని, మాట్లాడ్డంలో చురుకు - మొదట్లో అతని ఈడు బోయిన శ్రీమతి ఫర్హానుద్దౌలా చూపులో చూపుగా ఉండేవాడు. ఇప్పుడు కొన్నాళ్ళనుంచీ రాణీ కరంపూర్ తలారీ వెంట కనబడుతున్నాడు. శ్రీమతి అర్జ్‌మందేమీ, అన్నపూర్ణాదేవి ఏమీ, ఇంకా ఇతరులున్నూ అతనితో ఏదో మాట్లాడీ మాట్లాడనట్టు మాత్రమే మాట్లాడేవారు. కాని వారి భర్తలతో మట్టుకు అతను బాగా కలిసి మెలిసి తిరుగుతోండేవాడు. గుంజుతోన్న పైపును ఆపి, బూడిద రాలిపి అతను అన్నపూర్ణ నడిగాడు. "శ్రీమతి ప్రభాకర్ మీకు సందిగ్ధ విషయాలమీద సరదా వుందా?" అని—

"నే నెప్పుడూ అటుకేసి బుద్ధినే వుంచలేదు - ఏం. ఎందుకు? మీక్కూడా ఆత్మలతో సంభాషణంటే బుద్ధి పుట్టుకొచ్చిందా?" అన్నపూర్ణకు అయిష్టమైన మబ్బు కమ్మినట్టయింది. కాని నైతికంగా, ఎందుకంటే ఆమె మజహరుద్దీన్‌కు చేరువలో కూర్చోనుంది. అందుచేత అతనితో మాట్లాడ్డం తప్పనిసరి అయింది - "కర్నల్ జహంగీరైతే బాగా నచ్చుతాడు. కాని, ఈసారి మనల్నందర్నీ సన్యాసుల్ని చేసి గాని వదలడు - ఈ రోజుల్లో ఎవర్నైనా చూడండి తమ తమ వేటలూ, స్టాక్ ఎక్స్ఛేంజీ, విషయాలు వదిలి ఆత్మల్లో చుట్టుకుపోతున్నారు." మజహరుద్దీన్ అన్నాడు.

ఈ మాటలు కర్నల్ జహంగీరు విన్నాడు. వెంటనే అన్నాడు. "అన్నపూర్ణాదేవీ ఎప్పుడూ ఇలా జరగ్గూడదు. ఏమిటంటే ఒకానొకరోజున

ష్టనమంతా ఈ మాయాజాలాన్ని వదిలేసి, గడ్డాలూ మీసాలూ పెంచి తంబురా వాయిస్తూ, ఎదురుగుండా హిమాలయ శిఖరాలకేసి పోతూ కన బడటం !!'' అని—

"ఒకవేళ నా భార్య గూడా తన తాంపూరా ఎత్తి వనాల్లోకే వెళ్ళి పోతే నేను నిన్ను ప్రాణం తీసేస్తా కర్నల్''-బ్రజేష్ చీదరించుకుని ఎంతో అసహ్యంగా అన్నాడు - "చాలుగాని వూరుకోవోయ్ ! నీవు నీ బజారు బేరాలూ, కొనుగోళ్ళతో చుట్ట చుట్టుకుపోయి వుండు ! ఈ సమస్యలూ, ఈ నిర్ధారణలూ, సోదరా !'' అర్‌జ్‌మంద్ నొక్కులు నొక్కుతూ గట్టిగా అన్నాడు - బ్రజేష్ ఒక కళ తగ్గిన నవ్వు నవ్వాడు - ఇటు తిరిగి ఎంతో జాగ్రత్తగా ఆ ఐ. సి. యస్ గారికి అర్జంగడ్ సంస్థానపు సిద్ధాంతాలు చెప్పడంలో తదేకంగా వున్నాడు. వచ్చే నెలలో బహుశా ఏదైతే అక్కడ కాబోయే రెసిడెంటో ఆ సంగతి సందర్భాలు నవ్వుల వరసలతోనూ, అరుపులతోనూ, దీర్ఘింపులతోనూ, తర్క వితర్కాలు సాగాయి. కర్నల్ జహంగీరు మాటలు వాటిలో మేటులుగా అందరికీ హుషారుగా వుండేవి. ఉదాహరణగా ఇప్పుడతను నాహేద్‌తో అన్నాడు. వెనకటి జన్మలో తాను పృథ్వీరాజుననీ, నాహేద్ అతనికి చాలా దగ్గర చుట్టంగా వుండేదనీనూ !

"ఒకవేళ సంజూగ్తా ??'' ఎవరో అడిగారు. అందరూ నవ్వారు-కొంచెం ఆగిన దగ్గర్నించీ మళ్ళా రసవంతమైన కొత్త కొత్త తలపులూ, వలపులూ, భావ సౌధాలూ మొదలైనాయి. పూర్వ జన్మంలో ఎవరెవరు ఎవరెవరో !...

"కర్నల్ ! వెనక జన్మలో నాహేద్‌కు ఎవరితో అయింది వివాహం !'' శ్రీమతి ఆర్‌జ్‌మంద్ మహా ఉత్సాహంగా కాటుక పిట్టల్లాంటి తన కళ్ళని పరుస్తూ అడిగింది.

"ఎవరో దిక్కూ మొక్కూ లేని జోంపూర్ మత గురువై ఉండొచ్చు !'' రాజకుమార్ రవి అన్నాడు. అంతా గొల్లుమన్నారు-నాహేద్ పెండ్లి పోయిన క్రిష్టమస్‌లో జరిగింది. అప్పుడు మిత్రులంతా కలిసి

ఆశీస్సులూ, అభినందనలు తంతీమార్గాన పంపించారు - దానిలో ఈ ఒక్క-పంక్తి వుంది. "నెచ్చెలీ నీకింక పోలీసు భయం ఎక్కడిది!"

కర్నల్ జహంగీర్ అన్నపూర్ణాదేవి చెయ్యి చూడ్డంలో తన్మయుడై వున్నాడు. మళ్లీ వెంటనే కర్నల్ జహంగీర్ బహు నింపాదిగా బరువైన బరువైన భాషలో ఆచి ఆచి అన్నాడు. "అన్నపూర్ణాదేవీ. మీకు గుర్తు కొస్తోంతా. మీతో ఎప్పుడైనా ఎవరైనా చెప్పారా ??" - "వెన్నెల నిశీధాలలో ఎప్పుడైతే కమల పుష్పాలు విప్పుకోనుంటాయో, మరి వసంతా గమనం వెంట వెంట హిమాలయాల మంచు కరిగి గంగా జలంలో కలిసి పోతూ ఉండొచ్చు. అప్పుడు నేను మళ్లా నీతో రెండోసారి కలుస్తాను-గుర్తుకుందా ?"

అన్నపూర్ణ చిత్రంగా తన వెడలుపైన కనురెప్పల్ని వంచి రెపరెపలాడిస్తూ కర్నల్‌వేపు చూస్తోంది. అప్పడే - అప్పుడు ఆ గదిలో బహు ప్రశాంతతా, నిశ్శబ్దతా అలుముకుంది. కర్నల్ ఆమె చిన్నని మృదుహస్తం కుషణ్ మీద పెట్టి మళ్లీ అనజొచ్చాడు. "గుర్తు తెచ్చుకో,...ఆతని పేరు కమలేందర్ గదూ. వెనకటి జన్మలో మీరు ఆయనకు రాణీగా వుంటిరి. వెన్నెల రాత్రిళ్ళలో మీ రాజభవనపు మెట్లమీద ఎక్కడైతే గంగానదిలోకి దిగటానికి వీలుగా వుండేనో,...ఆయన వీణ వాయించేవాడు. మరి మీరు అదే ధ్యాసగా వింటోండేవారు. అప్పుడప్పుడూ మీరు అభినయమూ, నాట్యమూ చేసేవారు. ఆయన తన్మయుడై చూస్తోండేవాడు - మరి, మీ వివాహానంతరం కొన్నాళ్ళకే ఆయనొక యుద్ధంలో వీరస్వర్గ మలంకరించాడు. ఇదంతా మీ అదృష్టరేఖలే చెబుతున్నాయి. మీరు తప్పకుండా ఈ జన్మలో ఆయనగారిని కలుసుకుంటారు - అది జరిగి తీరుతుంది-నక్షత్రాలు అదే కోరుతున్నాయి-" కర్నల్ కొంచెం ఆగి తన నుదురుమీద పోసిన ముదురు ముత్యాలలాంటి చెమటను తుడుచుకున్నాడు. అంతా శిలా ప్రతిమల మోస్తరుగా నిశ్చలంగా నిశ్శబ్దంగా చెవులుగోసుకు వింటున్నారు. ఆ నైశ్చల్యంలో ఎక్కడో దూరాన్నించివచ్చి శీతలత స్పృశించిపోతోంది-

అన్నపూర్ణాదేవి మటుకు అలాగే రెప్పలాడిస్తూ కూర్చునే వుంది. శ్రీమతి అర్‌జ్‌మంద్ కళ్లు పెద్దవైనాయి. "ఓహో కర్నల్ - ఎంత చిత్రమైన తెలివి తేటలు !"-కొన్ని క్షణాల తర్వాత నాహేద్ ఈ నిశ్శబ్దాన్ని చీల్చే శింది...మళ్లా చిన్న చిన్నగా మాటలూ నవ్వులూ మొదలయ్యాయి. కర్నల్ జ్యోతిషం అందరి భావాల్లోనూ గాఢంగా రాచుకుపోయి సాయం కాలపు గొప్ప వెణుకులాగా కూడా అయింది.

బ్రజేష్ ఐ. సి. యస్ బహదూర్ గారితో పిచ్చాపాటీ ఆపేసిం తరువాత, తనున్న మూలనుంచి అన్నపూర్ణని కేక వేశాడు. "పద ఇంక పోదాం. మహా జోరుగా నిద్ర వస్తోంది." మరి అంతా లేచి నుంచున్నారు. అందరూ ఒకరి కొకరు గుడ్ ఈవెనింగ్ చెప్పుకుని కరచాలనాలు చేసుకుని వారి వారి గదులవేపు వెళ్లారు. కొంచెంసేపట్లోనే మధ్య గది నిర్మానుష్యమై పోయింది.

అందరి తర్వాతా, ఈ మాట లన్నిటిమీదా తన దృష్టిని ప్రసరిస్తూ, ఆలోచిస్తూ, జాతి కుక్క తన కుర్చీలోంచీ దూకి, ఒక్కసారి బాగా వళ్ళు విరుచుకున్నాక తన చిన్ని చిన్ని పాదాలతో బైటవేపున్న వరండాలో మెట్లు గిది కింది ఆవరణలోకి వచ్చేసింది - అప్పుడక్కడ నాహేద్ తన యింటికి వెళ్ళటానికి రిక్షా ఎక్కుతోంది——

కాలం మార్పు రోజుకు రోజు ఉత్సాహానికి బదులు నీరసంగా ఎదు రైంది. పురుషులు రోజల్లా 'లావంజ్'లో బ్రిడ్జ్ ఆడతారు. అన్నపూర్ణ తన పిల్లలిద్దర్నీ తీసుకుని వాహ్యాళికి పోతుంది. లేదా తన అల్లిక గదిలో మీరాను తీసుకుని తబలా వాయిస్తూ, నాట్యమూ - అభినయమూలలో కాళ్లు నిలపటం నేర్పుతుంది. ఎప్పుడామె తాంబూర్ తీగలు కాస్త కది లిస్తుందో అప్పుడే ఆమెకు గుర్తు కొస్తుంది - ఎవరో ఆమెతో అంటు న్నారు - నేను నీతో మళ్లీ వచ్చి కలుస్తాను - నేను నీతో రెండోమారు కలుస్తాను. కలుస్తాను - ఆకాశాన తారలు కూడా ఇదే కోరుతున్నాయి- తారలు ఇదే - ఏం గర్వం - అమానుషానికైనా అంతున్నది - ఆమెకు

కోపం వస్తోంది - వెంటనే నవ్వూ వచ్చి పకా పకా నవ్వుతుంది. ఇలాగా మబ్బులు పట్టినట్టు వుండే మాటల్ని ఆమె స్వయంగా ఎగతాళిగా తోసేసేది. ఆ మాటల్ని మళ్లీ అని గేలి చేసేది - అన్నపూర్ణ - అన్నపూర్ణ—

ఇంత అందంగా తయారైతూ పోతోంది - అన్నపూర్ణ - ఆమె ముగ్ధాత్వం - దరహాసాలూ, సమావేశాలకు - సన్నివేశాలకు ప్రాణం పోసేవి !

"కర్నల్ కనీసం ఆత్మలనైనా పిలువు - చాలా నాళ్లైంది అశోక సామ్రాట్టుతో బాతాఖానీవేసి !-" నాహేద్ పూర్తిగా విసిగిపోయి ఒకనాడు కర్నల్ జహాంగీర్‌తో అన్నది. వారంతా "ఒంటె వీపులతో తిరిగి వస్తున్నారు - "భగవంతుడి కోసం ఇప్పుడు మీ గొప్పతనాలు వెదజల్లవోకండి- నా భావంలోకి వస్తోంది ఈ మీ ఆత్మలతో సమావేశం," శ్రీమతి అర్జ్‌మంద్ గట్టిగా అన్నది—

"కర్నల్ నీవు నిజంగా తమాషా మనిషివే ! సరి. నా చేతి సాముద్రికం నీవు ఇంతవరకూ పరీక్షించనే లేదు." నాహేద్ శ్రీమతి అర్జ్‌మంద్ మాటలు వినీ వినట్టు అనేసింది—

—"ఈ అదృష్టం మీద ఏం నమ్మకం-" కర్నల్ ఏదో ఆలోచిస్తూ గొప్ప విచార ధారతో అన్నాడు - అంతా మౌనం వహించారు.

"ఏం కర్నల్, నీకేమన్నా బాధగా వుందా ?" నాహేద్ మీమీద బలంవేసి అడిగింది—

"బాధ-? పిల్లలు విచారం కలిగించే మాటలు అనలేరు." అలా వారు లైబ్రరీ రోడ్డు దగ్గర మెట్ల దాకా వచ్చారు.

ఇవ్వాళ కన్నూరాణీ, బల్బీర్‌సింగ్ తమ అబ్జర్వేషన్ పోస్టు నెంబరు వన్ విషయంలో ప్రశ్న అడిగారు - తెలుసుకున్నారు - అన్నపూర్ణ ఈ తడవ విధిగా ఏదో ప్రమాదం తెచ్చిపెడుతుంది. దీనిక్కారణం. ఈ మెదడులేని కర్నల్ ఇల్లాటి మాట వదిలాడు - ఇక : బ్రజేష్ తనకు ఏమీ

సంబంధం లేనట్టు ఎల్లా వుంటాడు !...మరి ఈ భారతదేశపు సంస్థానాధిపతులు-నీకు తెలియదు నా ప్రియురాలా !...వీరి జీవితాలెల్లా వుంటాయో, ఏ ధ్యాస లుంటాయో, అందుకోసమే చూడూ బ్రజేష్ ఈ చిన్న ఈడులో ఇంత త్వరలో ఆర్థిక మంత్రి పదవికి వచ్చాడు——

"ప్రపంచం ఎటుకేసి పోతున్నదో తెలియదు" శ్రీమతి అర్జ్ మందొ అతని భావాలకు బల మిచ్చింది——

ఇక చివరకి ఒకరోజున రాజకుమార్ రవి టీ తీసుకునే సమయంలో అందరికీ తెలిపాడు "తాను" నిజంగా వస్తున్నాడు. అందరూ తమ తమ స్థానాలనుంచీ దాదాపు ఒక్కొక్క అడుగెత్తున ఎగిరిపడ్డారు. ఎన్నాళ్ళనుంచీ, ఏ వ్యక్తిని గురించి ఒక ఖచ్చితమైన మాటలు నడుస్తోన్నాయో, అతని కోసం ఎన్నో పార్టీలు, ఎన్నెన్నో వన భోజనాలు ఒకానొక ప్రత్యేకమయిన వ్యవధికోసం మానుకోబడుతున్నాయి - రక రకాల భావాలూ- వివిధ విధాల నిర్ణయాలూ జరుగుతోన్నాయి - చూడు. ఈ సారి అతని ఖచ్చితంగా పెళ్ళి చేసుకుంటాడు - అసంభవం - అతను పెళ్ళి చేసుకునే రకం మనిషిగాడు - కాని సంగీత కచేరీలలో అతని లేనిదీ ఉత్సాహమే లేదు - అరే ! బాబూ, ఇనాం మహమూద్, 'ఫీఫీ' పక్షాన జాగ్రత్తగా ఉండాలి !..."అతను" వస్తున్నాడు - చూడూ, సోదరుడు డాక్టర్ ఖాన్‌కు కబురుజేసి 'అమ్బులెన్సు కార్లు తెప్పించాలి. పాపం ! ఎంతమంది అమాయకులు చంపబడతారో, ఎందరు చంపబడ్తారో, తెలియకుండా ఉంది——

"అఖరుకి ఇతనెవరు డాన్ జాన్ సాహెబ్ ? తాను రాకముందే ఇంత గడబిడని కప్పేశాడు !" నాహేద్ ఎంతో విసుగుతో అడిగింది——

"డాన్ జాన్" - మీతోడు శ్రీమతి నాహేద్‌గారూ మహ మంచి పేరు పెట్టారు మీరు" 'అతను' నిజంగానైతే ఖుర్షీద్ అహమద్ - వెనక కొన్నేళ్ళపాటు తన గాలి పడవను తోసుకుని సముద్రం అవతలి ఒడ్డుకు పోయాడు. ఈ యేడే తిరిగి వచ్చాడు. ఇక్కడికి ఈ ఆదివారం సాయంత్రం

వరకు చేరుతున్నాడు - మిగతా విషయాలు తాము స్వయంగా పరిచయ సమయంలో తెలుసుకోగలుగుతారు——''

ఆనాటినుంచే ప్రారంభమైంది వర్షం. అదీగాక తన తల్లి ఆరోగ్యం బాగుండక పోవటాన నాహేదా చాలా రోజులదాకా అన్నపూర్ణా మరి ఇతర స్నేహితులను కలవటానికి సరాయ్‌కు రాలేకపోయింది.

రెండోనాడు సాయంకాలానికి 'అతను' వచ్చాడు. అతనితోపాటు అతని ఇద్దరు స్నేహితులు కూడా వున్నారు. వారంతా అతని గాలిపటం బంధువులే !....

టీ తాగారు. తరువాత భోజనాల గది మెట్లు దాటుతూ 'అతను' పడక గదికేసి పోతోన్నాడు-అది రెండోసారి చూడ్డం అన్నపూర్ణ అతనిని, ఎందుకంటే వాడే కమలేంద్రుడు - ఈ మాట అన్నపూర్ణ హృదయంలో మౌనంగా అన్నారు.

ఇంతవరకూ అన్నపూర్ణతో పరిచయం అతనికి సిద్ధాంత రీత్యా చేయ బడలేదు - అందుకోసం భోజనాల గది మిద్దెమీదినుంచి దిగి బంగళా పైకి పోయే దారివేపునుంచీ పోతోన్న అన్నపూర్ణమీద ఒక చూపు వేస్తూ ఆమెను గుర్తుపట్టకండానే పడక గదివేపు పోయాడు. అక్కడ మిత్రులంతా గుమిగూడి వున్నారు.

కొంచెంసేపు అయ్యాక మిద్దెమీద పెద్ద గదిలోకి మళ్లీ వచ్చి అన్న పూర్ణ ఓ పక్కగోడకు దగ్గర పడివున్న సోఫామీద పడిపోయింది - అస లయితే ఆమె ఆ గోడకు వున్న నిలువు టద్దంలో తన పెదవుల రాగరక్తి మను సరిదిద్దుకోవాలనుకుంది - పియానోమీద ఒక కొత్త గీతాన్ని సరి కొత్త మధుర రంజితంగా పాడాలనుకుంది - ఏమైతేనేం. ఆమె ఆ సోఫా కుషన్‌కు ఆన్చిన తల కదపలేకండా అలానే పడి వుంది !

ఇంతలో మధ్య హాలు మిద్దె మీదినుంచీ దిగి మిస్. ప్లామీన్లి ఆచార్య లోపలికి వచ్చింది. ఏ భావాలు లేకండానే!-కాని, ఆమె తన మీరా

కోసం అదేదో అల్లిక పనితనం తెల్సుకుందామని, నమోనా తీసుకుందా మనుకుంది. జరిగిందేమిటి ! మిస్. ఆచార్య తాను ఒక తేలికైన 'సాహలా' ఆలాపించిన తరువాత అ పెద్దద్దంలో తన శిరోజాలు పరిష్కరించుకు వెళ్ళిపోయింది. మరి, తాను – తానేమీ అనలేదు – గది కిటికీలలోంచి చూస్తే బైట 'లావంజ్'లో కూర్చున్న జనం అంతా మామూలుగా బ్రిడ్జ్ ఆడుతూ అవుపిస్తోనే వున్నారు. ఆమె తన కండ్లను చేతులతో కప్పుకుంది. దాదాపు చీకటి పడుతోంది. 'బిల్లర్డ్' రూం నుంచి వస్తూ బ్రజేష్ ఈమె గది గుమ్మం ముందుగా నిమ్మదిగా నడుస్తోన్నాడు. ఆమె కూడా అతనితో కలిసి తమ గదులకేసి పోయింది——

ఇక ఆ మర్నాటి ప్రొద్దుటిపూట. తన గదినుంచీ బైటకొచ్చి 'వింగ్' వసారాలోనుండీ పోతూ, మిద్దెవేపు నడుస్తోంది. ఆ మిద్దెకున్న కొద్దిపాటి మెట్లకు అడ్డంగా నుంచుని 'అతను' క్లోక్‌రూంకు దగ్గరగా సిగరెట్టు కాలుస్తూ కనిపించాడు – ఆమె అలా పోతూ అతనికి ఎక్కడైతే దగ్గరసా వచ్చిందో, వెంటనే అతను ఆమెవేపు తిరిగి ఎదురుగా వచ్చి మహా వినయ విధేయలతో నమస్కారం చేశాడు. ఆ నమస్కారంలోనే అతనెన్నో ఒదుగులూ, మెదలికలూ, జాగ్రత్తలూ కలిపి దొర్లించినట్టు అనిపించాడు. ఆ 'బిల్లర్డ్ రూం' లోనే అతనికి అన్నపూర్ణ పరోక్ష పరిచయురాలై ఉంటుంది. "నేను ఖుర్షీద్‌ను – ఖుర్షీద్ అహ్మద్‌ను——"

"నమస్కారాలు – బ్రజేష్ స్నేహితులలో నేను ఇంతవరకూ తమని చూళ్లేదు !——"

"అవునండీ. నేను భారత్‌నుంచీ బైటి దేశాలకు వెళ్లేవరకూ, అప్పటిదాకా బ్రజేష్ పెళ్ళి చేసుకోలేదు——"

అప్పుడామె హృదయ కర్ణాలలో ఎవరో ఇలా మౌనంగా అంటున్నారు. "అతనితో నీవు నిక్కచ్చిగా అనేసెయ్యి నీవు చెప్పేదంతా బుకాయింపేనని, నీ వసలు ఖుర్షీద్ అహ్మద్‌వే కావనీ, నీవు కమలేంద్రుడివే నిజంగాననీ,... పూర్ణిమా చంద్రికలలో నిగనిగలాడిపోయే తెల్లని రేకులతో

మెరిసేటువంటీ-వీణారావంలాంటీ కమలేంద్రుడివేనీవనీ, కమల కుసుమాల దైవానివనీ, ఇలా-'' ఆమె తనను తాను రక్షించే ఉపాయంగా మొదట ఒక నవ్వు నవ్వింది. ఈ సమయహీనమయిన నవ్వుని ఒక వినయపూర్వక సుప్రవర్తన చెంగలించే ముసిముసి నవ్వులోకి మారుస్తూ అతనన్నాడు. ''సరె. పదండి కిందికి పోదాం. మనకోసం వేచి ఉండటం జరుగుతుంది గామాలు !''...

టీ తాగుతూ తాగుతూ కన్నూరాణీ, బల్బీర్‌సింగ్‌లు గౌరవ పురస్సరంగా ఖుర్షీద్‌ను అడిగారు. ''మీరేం చేశారు మరి !'' ఇది తెల్సుకోవాలని వాళ్ళ కెంతో ఉబలాటంగా ఉంది. వా రేభాగానికి చెందినవారో 'అతను' కూడా, ఆ ''పర్‌దోయి'' భాగంలో వాడే - ''ప్రస్తుతమైతే 'బాంబర్సు'ని లేపుతోంటాను. యుద్ధానంతరం కూడా నౌకరీ దొరక్కపోతే కోళ్ళ వ్యాపారం చేసుకుంటాను. మంచి లాభదాయకమైన పని 'పోల్ట్రీ నార్మింగ్'...

''ఇంతదాకా పెళ్ళి ఎందుకని చేసుకోలేదు?'' శ్రీమతి అర్‌జ్‌మండ్ అన్నది అతని మాటమీది మాటగా——

''ఎందుకేముంది ! ఏ అమ్మాయీ నాతో పెళ్ళికి సిద్ధమే కాదు. నేనే అమ్మాయినన్నా హర్షించి కలుస్తానా తొందరపడి ఆమె పెళ్ళి చేసుకునే ఉన్నదో, లేక రేపు మాపు పెళ్ళి కాబొయ్యేదే అయ్యుంటోంది !... అదీగాక పెళ్ళికి కావల్సినంత డబ్బు మటుకు నా దగ్గర ఎక్కడిది !!... నా పొట్టా బట్టా గడవగా మిగిలేట్టే అయితే ఒక 'పిల్లి' నైనా పెంచుకుండేవాడిని——''

అప్పుడు బతీజా బేగం అంటే నాహేద్ తల్లి ఆరోగ్యం కనుక్కుందామని రిక్షాలు ఎక్కబోతోండగా రాజ్‌కుమార్ రవి అడిగాడు. ''ఖుర్షీద్‌బాబూ నీవు ఎందుకో చాలా హుషారుగా ఉన్నావ్ !...దేని విషయమైతే నీవు ఉత్తరాలలో 'బోర్' చేసేవాడివో, ఆ నీ అనూతన ప్రేమకాండ ఏమైంది !'' - ''నడుస్తోంది'' - చాలా అనాలోచితంగా

అన్నాడు 'అతను' - మన మంటామే 'మోటారు బాగా పని చేస్తోంది' అన్నట్టుగా !!...

మరి ఉత్సాహమయిన, విచిత్రమైన మాటలే కాక 'అతను' తేల్చి వేశాడు. 'ఇప్పు డెవరైనా ఓ అమ్మాయి తనకు నచ్చితే ఆమెను పెళ్లాడ టానికి సిద్ధంగా ఉన్నాడు. ఆమె ఎంత నల్లనిదైనా సరే, ఎంత కురూపి దైనా సరే,-'క్యాప్ ఫీట్' సిద్ధాంతాలు అతని దృష్టిలోనుంచి హృదయంలోకి పాకుతూండేవి అప్పుడప్పుడూ - కాని, గడచిన పూర్వపు రోజుల్లోని సన్ని వేశం అమాయికంగా మనస్సుకు బాధ కలిగిస్తూ పోతూండేది. ఈ మార్చి నెలలోనే ఇష్టంలేని ఒక ఆదివారంనాడు అతని 'మెస్' సహవాసులంతా పడుకునే ఉన్నారో, వాళ్ళు వాళ్ళ ఇళ్ళకు ఉత్తరాలూ అవీ రాయటంలోనే మునిగి ఉన్నారో, ఏమో మరి. 'కాంటీన్' పని చేసే పిల్లలందరూ సగం సగంగానే పనిలో లగ్నమై ఉన్నారు. వాతావరణం బహు కలుషితంగానూ కఠినంగానూ మేఘమిశితమై ఉంది. అప్పుడు ఏం చెయ్యాలి అనే విషయం ఎవరికీ ఆలోచనలోకి రావటమే లేదు - ఆ అమ్మాయితో ప్రేమ యోగం చెయ్యటానికి నిశ్చయించుకున్నాడు తాను. 'లిసనర్స్'లో తాను చూసిన అమ్మాయి ఆ అమ్మాయి !! ఆమె ఒక ప్రత్యేకమైన రూపసౌభాగ్యం గలది. ఉత్తర భారతదేశపు ఏ రేడియో కేంద్రంనుంచో మధ్యాహ్నం ఇంగ్లీషు సంగీత రికార్డులను గురించి ప్రకటన చేసేది. అంచేత ఎంతో మహా ఇష్టంతో ఒక రేడియో శ్రోత తన అభిప్రాయాన్ని స్పష్టంగా ఉత్తరంలో రాశాడు. 'మీ రికార్డుల సెలక్షన్ ఎంతో బావుందంటే నమ్మండి. మీరు మీ చిలిపి గొంతుతో, శ్రోతలు కోరిన రికార్డులతో పాటు ఒకరికి ఒకరి వార్తలు తెలుపుతూ ప్రకటిస్తోంటారు. అవి విన్నాక మా స్థితిగతుల్ని చెప్పటం ఇక్కడ నా అభిప్రాయం - మాకు రాత్రిళ్ళు నిద్ర దూరమైంది. మా పక్కనున్నవాళ్ళు మరో రకంగా అనుకుండేందుకు తావు దొరికిం దైనది. మూడోవాళ్ళకి అది చల్లని మెల్లని నేరారోపణకు సమయం. ఇంకా వారికి వారికి హృదయానికీ - మస్తిష్కానికీ సంబంధించిన ఎన్ని

రోగాలో లేవటమే తక్కువ! వారంతా కూడా తమ తమ అధికారాలనుంచీ గెంటివేయబడుతోన్నవారుగా అవుపిస్తున్నారు. చూడండి: మొన్నటి రాత్రి డ్రామాలో నీ పాత్ర విని మా పరిస్థితి ఎంతవరకు వచ్చిందంటే ఉన్న పళంగా రేడియో బంద్‌జేసి ఇన్ని ఆంబులెన్సు కార్లు తెప్పించాల్సివచ్చింది. వెనువెంటనే ఒక రిద్దరు మహానుభావులు ఆ అమ్మాయిని చూడటానికి వెళ్ళనే వెళ్లారు - దాదాపు సగం చచ్చి తిరిగి వచ్చేశారు. మళ్లీ ఒక పెద్ద మనిషితో అదే ప్రసార కేంద్రంలోని యస్.డీకి మిత్రుడుగా ఉండే ఆయన తెలిపిందేమిటీ! ఆమె చాలా చెడ్డ బుద్ధి గల అమ్మాయి. ఎవరికీ లిఫ్టు ఇవ్వదు. స్టూడియోల్లో తన పన్లేమిటో తనేమిటో! అందుకని అందరూ ఆమె అంటే భయపడతారు. మళ్లీ - మళ్లీ పేర్లు మారుస్తూ ఎన్నో ఉత్త రాలు రాశారు చాలామంది!——

కొంతకాలం తరవాత దానికి జవాబు వచ్చింది. ఆ ఉత్తరంలో ఎంతో నాగరకమైన అడ్రసు ఉంది. అది ఒక కామోద్దీపితమైన మాట! కాని ఉత్తరమంతా తేలికైన భాషలోనే ఉంది. అది చూసి ఎంత సంతోషం గంతు లేసిందంటే, 'మీకు మా ప్రోగ్రాములు నచ్చుతాయి' నుంచీ మొదలై - 'అనుకుంటాను మీరంతా కుశలమని' వరకూ అయిపోయింది- ఆ తరువాత మరి మూడు నాలుగు ఉత్తరా లొచ్చాయి. అన్ని ఉత్తరాల ప్రత్యుత్తరాలూ మాయం - చివరికి ఖుర్షీద్ ముస్సోరీకి రావటానికి కొన్నాళ్ళముందు ఈ అన్ని ఉత్తరాల ప్రత్యుత్తరాలూగా ఒక చిన్ని ఉత్తరం దొరికింది. దానిమీద ఇంకా షోకుగా నవలా రచనలాంటి అడ్రస్ వ్రాయబడి ఉంది. 'ఫెర్రీలాండ్' విన్సెంట్ హిల్. ముస్సోరీ'——

ఇక అప్పటినుంచీ ఖుర్షీదూ, అతని మిత్రు లిద్దరూ ముస్సోరీ చేరారు - ఇదే ఆలోచిస్తో పోతోందిగదాంటే ఆమె ఆ ఫెర్రీలాండ్‌ను వెదికి దొరికించుకోవాలి——

రెండోనాటి ఉదయం తమ సరాయిలో ఉండే మిత్రులకు చెప్ప కండానే 'విన్సెంట్ హిల్'ను వెదకటానికి బైల్దేరారు...చాలా ఎత్తైన ఎగు

వకు ఎక్కొక సుందరమూ సురుచిరమూ అయిన రెండంతస్తుల మేడ కని పించింది. దాని గేటుకు ఒక పక్క పాలరాతి ముక్కమీద 'ఫెర్రీలాండ్' అని వ్రాసి ఉంది - కొంచెం ముందుకు సాగేసరికి లోపలినుంచీ ఒక 'బుల్ డాగ్' బైటికి వచ్చింది. అలా ఒకటీ, రెండూ, చివరకు ఒక చిన్న తెల్ల కుక్క 'పేస్ట్రీ' తింటో బైటికి వచ్చింది. మొదటి మూడు కుక్కలూ కలిసి వీళ్ళకు వణుకు పుట్టేట్టు మొరగటానికి లంకించుకున్నాయి ! నాల్గో కుక్క నిజంగా చాలా మంచిది. అది దాని పనేమో, 'పేస్ట్రీ' డబ్బాలో మునిగి ఉంది !...ఈ అన్నిటి పిదపా ఓ అమ్మాయి నిమ్మళంగా బైటికి వచ్చింది. అరిచే ఈ కుక్క లన్నిటినీ లోపలికి ఈడ్చుకుపోయింది- ఈ విపరీతమైన చలిగాలి తగిల్తే వాటికి 'ఇన్ఫ్లూయంజా' వస్తుందని- ఇక వీరి సంగతి : మనం లోపలికి పోవాలా, బైటికి నడవాలా అని తేల్చుకోలేకుండా ఉన్నారు - ఇలా చూసేసరికి నన్నూరాణీ బల్బీర్‌సింగులు వస్తోన్న రిక్షా కనిపించింది - వారెలాగూ అడక్కమానరు అని వీరు కొంచెం పక్కకి నక్కారు.

"ఎందుకేమిటి పేస్ట్రీ తింటుంది ?-" నిమ్మళంగా, మౌనంగా, కపూర్తలా హౌస్ రోడ్డుమీద వాపస్ పోయి ఒక స్నేహితుడు ఎన్నో, ఏవో ఆలోచనలతో సతమతం అయ్యీ అయ్యీ అన్నాడు ఆఖరుకు.

మిగతా మూడు కుక్కలూ ఆ తిండిలోనే తీరకండావుంటే మొర గకపోయేవేమో !" రెండోవాడన్నాడు——

"అసలే మొరిగేవి గావు అలా అయితే !" అతని అభిప్రాయాన్ని బలపరచాడు ఖుర్షీద్."

సాయంకాలం రాజకుమార్ రవీ, ఖుర్షీదూ, బ్రజేష్ వెంబడి షికా రుగా బజారుకు బైలుదేరారు - ఎందుకో గభుక్కున అతనికో సంగతి జ్ఞాపకం వచ్చింది. 'అంతులేని అవసరం గల ఒక వస్తువు కొనాలి !' అని——

''మీరంతా హమీదుల్లాతో కల్సిరండి, మేం ఇప్పుడే వస్తాం-'' రాజకుమార్ రవి బ్రజేశ్‌కంటే ముందుగా పొయ్యాక అతని తన స్నేహితుల్తో కోతలు కోస్తూ కల్‌హడీదాకా చేరాడు. కాని కేక్‌పేస్ట్రీ దుకాణం ఎక్కడా అవుపించనేలేదు - చివరకు వారు పూర్తిగా నిరాశజెంది వెనక్కు తిరుగుతోండగా ఖుర్షీద్ చూపు రోడ్డు చివరి మలుపులో ఉన్న ఒక చిన్ని కొట్టుమీద పడ్డది. దానిమీద వల్లమాలినంత పెద్ద ఒక బోర్డు కట్టి వుంది. 'రాయల్ కాన్‌ఫెక్షనరీ' - ఒకాయన దుకాణాని కెదురుగా కుర్చీమీద కూర్చుని, 'హమ్ దర్ద్‌సెహత్' చదువుతోన్నాడు—

''ఏం బాబూ. మీరు కేక్‌పెస్ట్రీ'లు అమ్ముతారా ?''

''అయ్యో లేదు - ఏమిటీ మీ ఉద్దేశం. నేను షికార్‌కోసం కొట్టు పెట్టాననా ?''—

''అరే ! నేననుకున్న దేమిటంటే...''

''అనుకోటం ఏమిటండీ !...నేనిక్కడ ఊకదంపుడు ప్రశ్నలకోసం కూర్చున్నానంటారా !?...ఇక్కడ అమర్చి వున్న ఈ కిటికీని చూసి చూసి సంబరపడతాననుకున్నారా ? లేక వాటిని వాసన జూస్తున్నానా ? అసలు మీరనుకుండేదేమిటి ? అవును అనుకుంటూండాలి మీరు...''

''ఏం కావాలి బాబూ-'' లోపల్నించి గబగబా ఓ కుర్రాడు బైటికొచ్చి అడిగాడు—

సాయంత్రానికి వారందరూ 'హిక్‌మెంజ్' నిశ్చల నిశ్శబ్ద వాతావరణంలో మూగి టీ తాగుతోన్నారు - ''ఓహో ! అచ్చం ఒక మెరుపు మాత్రమే చూశాం. అతనిది ! - ఎంత అందమయిన ముక్కు ! గులాబీ కంటే ఆకర్షణీయంగా ఉంది ! చలిగాలివల్ల ఆర్ద్రింగా ఉంటుంది !! మరి కండ్లో ! మెరస్తూ, ఉత్సాహంగా, నర్గీస్ మాదిరి...సుదీర్ఘమైన ఆ శిరోజాలు, పట్టు కుచ్చులు ! అబ్బా ! ఆ చెవులు, ముద్దు ముద్దుగా, కేవలం

పూజార్హమైనవిగా-" ఖుర్షీదు చాలాసేపు మౌనంగా ఉన్నాక, అసమానమైన మృదు మధుర స్వరంలో అన్నాడు——

"ఎక్కడ చూశావ్ పీరుడా తొందరగా సెలవియ్యి!" ఇనాం మహమూద్ చెవులు నిక్కపొడిచాడు——

"ఓహో!...అది ప్రపంచంలోకల్లా అందమైన కుక్క-ఎంచేతంటే ప్రపంచ మహాసుందరి పెంపుడు కుక్క అది!! ఇంకా——"

ఒక ధ్యాసలో ఖుర్షీద్‌కు అది రెండుసార్లు అవుపించింది. అది కొంచెం దూరంలో గోడకు దగ్గరగా ఒక తిన్నెమీద కూచోనుంది. ఎంత నైసైన చాలాకీ అయిన కుక్క?! అది బిగ్గరగా అరవకనేపోతే కుక్క అన్నది వున్నట్టే అనిపించదు మరి! అచ్చం తెల్లగానూ, దాని తల పెద్ద పర్సులాగానూ తోచింది——

తరవాత 'డాఙకార్లూ'ను తన ముందు ఉంచుకుని సాసర్‌లో 'ప్లమ్ కేక్' ముక్కలు తింటూ తింటూండగా చటుక్కున గుర్తులో కొచ్చింది, వుడత విషయం - నీల నీలాల దుస్తులతో నిజంగా తానా వ్యక్తిని ఉదయమే చూసినలాగా ఉన్నది - అది కేక్ తినటం పూర్తి జేసి ఒక్కసారి వళ్ళు విరిచింది ఒయ్యారంగా - ఆ తరవాత ఆ వ్యక్తితో మాటా ముచ్చట లాడే ఉద్దేశంతో తిన్నెమీదనుంచీ దూకి, చిన్నిచిన్ని అడుగులు వేస్తూ గ్యాలరీకేసి నడిచింది——

దాని యజమాని ఈ గ్యాలరీకి రెండోవేపు, తన అక్క చెల్లెళ్లూ-అన్నదమ్ములతో టీ త్రాగుతోంది. మరి అది 'ఇండియఙ టీ' ప్రచార పత్రంవల్ల ఇలా తెలుస్తోంది. 'ఈ టీ తాగినట్టయితే మళ్లీ మీకు ప్రపంచంలోని ఏ వస్తువుమీదా కోరికా, అవసరమూ ఉండదు' - కాని అప్పుడామె అనుకుందిగదా, ఆ నవ యువకుడు కొద్దిసేపు వెనకగా - అరజ్‌మంద్ మూకతో హాలులోకి వచ్చాడో, నిజంగా అతను ఎలా వున్నాడంటే, పోయిన క్రిస్‌మస్‌లో అతని విషయం 'అలీరియాజ్' ఏ. యస్. పీతో

కాకుండా వున్నట్టయితే - మరి ఈ నూతన వ్యక్తి బహుశా దానిలో శ్రద్ధాసక్తులు తీసుకోదలచినట్లయితే - తుదకు ఏమీ అభ్యంతరం లేక పోయేది !—

"హలో ! శ్రీమతి నాహేద్ !...నీవు ఇన్నాళ్ళు ఎక్కడ దాక్కున్నావ్ ! ఇల్లారా నీవు ఎవరికి 'డాన్ జాన్' బిరుదిచ్చావో, అతని ఆ ఖుర్షీద్‌తో పరిచయం చేస్తాను !" రాజ్‌కుమార్ రవి ఆమె మేజా దగ్గరకు వచ్చి అన్నాడు - రాత్రి అతను 'హిక్‌మెంజ్' నుంచి తిరిగి వస్తున్నాడు. అప్పుడు నాహేద్ ఆ ఖుర్షీద్ స్నేహితుణ్ణి చూసి, 'రాయల్ కన్ ఫెక్షనరీ' నుంచీ ఎవరు ఇప్పటిదాకా కూడా వద్దనకండానూ, నమ్మకంగానూ, 'పేస్ట్రీ' డబ్బాను ఎత్తుకు తిరుగుతోన్నాడో - తన విశాలమైన కండ్లని ఇంకా పెద్దవిగా చేసి ఖుర్షీద్‌ను అడిగాడు. "మీ అందరికీ 'పేస్ట్రీ' అంటే ఇంత సరదాగదాంటే ఆ డబ్బాలని వెంటబెట్టుకు తిరుగుతోంటారు!"

మర్నాడు పొద్దుబొడుపు ఎంతోసుఖంగానూ, సుముఖంగానూఉంది- రాత్రంతా వర్షించి వర్షించి ఆకాశం కడిగిన పాలకడవలా వుంది- వీధుల్లో వున్న వింత వింత రాతిముక్కలు వర్షధారతో తోమి నీరార్చినట్టుగా మెరిసి పోతున్నాయి— వాతావరణపు వర్ణమాలలా పూలకాంతి, చిత్రకంబళం పరచినట్టున్న ఎర్రని నేలరంగూ, మత్తుగానూ—ఒత్తుగానూ హాసం చేసినట్టున్నాయి—జీవితం తడిగానూ—కొత్తగానూ, గంభీరంలో ఒదుగులు పోయినట్టుంది—అన్నపూర్ణ మీరాను దీసుకుని పచార్లు చేస్తూ క్రింది గోడదాకా వచ్చింది. అక్కడ కొన్ని రిక్షాలూ, మోటార్లూ ఉన్నాయి— లైబ్రరీ రోడ్డు మెట్లెక్కి 'అతను' హోటలువైపు అవుపడ్డాడు—దగ్గర దాకా వెళ్ళి ఆమె తన ప్రత్యేకమైన-హ్లాదనీయమైన నవహాసంతో 'నమస్తే' అంది. "జై కొట్టు తల్లీ-చిన్నాన్నకు-జే కొట్టలేదు నీవు" అన్నపూర్ణ అతని నమస్కారానికి ప్రతిజేస్తూ, మీరాను గట్టిగా అదమాయించింది. మీరా అమాయికపు ఆనందంతో తన చిన్నారి చేతులు జోడించి 'నమత్తే'

అన్నది. ఖుర్షీద్ ముందుకు వంగి ఆ పిల్లను అమాంతం పైకెత్తి ఒళ్ళో బెట్టుకున్నాడు—ఆ అమ్మాయి దాది వచ్చి అందుకుంది. పూర్ణా, ఖుర్షీదూ హోటలుకేసి వచ్చారు. బ్రజేశ్‌గారి వాకిట్లో 'పిక్‌నిక్' ప్రోగ్రాం ఏర్పాటు చేయబడుతోంది. వారంతా వీ రొచ్చేప్పటికే ఖుర్షీద్ కోసం ఎదురుచూస్తున్నట్టు అవుపించారు.

ఇలా తోస్తోండేది, అందరిలోనూ ప్రాణమొచ్చిందేమో అన్నట్టుగా! ఉత్సాహ శూన్యమైన వాతావరణ విషయాన్ని ఎవరయితే ఎత్తుతోండేవారో, వారందరి ప్రతి నిముషమూ తీరుతీర్ల కొత్తకొత్త ప్రోగ్రాంలను నిర్ణయించడంలో వెచ్చించబడుతోంది. ఎప్పుడూ పియనో, ఫిడేలూ మ్రోగినవి మ్రోగినట్టే ఉంటాయి. ఫ్రెరీలాండుకు వెళ్ళి నాహెద్ మృదంగ తరంగాల మీద తేలే మీగడ తరకల్లాంటి గీతాలు వింటోండేవారు. వర్షాలూ-తట్టలూ-గొడుగులూతో సదమదమై వారంతా ఎంతో దూరం వెళ్ళిపోతారు. ఒకనాడు వనభోజనానికి పోతూగూడా 'రాయల్ కన్ఫెక్షనరీ' వేపుకూడా దాడిచేశారు. బ్రజేశ్‌గూడా అప్పుడు 'కలకత్తా యువకళ' చదవటానికి బదులు ఈ షికార్లలో భాగం పంచుకోటానికి సిద్ధమయ్యాడు. ప్రపంచం వారి చూపుల్లో ఒక పెద్ద చిక్కని అందాలు చిందేలాంటి, మహాజ్యోతివంటి, ఎంతో ఉత్సాహంవెల్లి విరిసేలాటి, సువాతావరణమైన రసస్థలిగా తయారైంది !...

ఉండటానికి ఖుర్షీదు ఏ బంధువుడింట్లో వున్నాడో, అదికూడా చాలా ఉత్సాహవంతంగానూ, చాలా చిత్రంగానూ ఉండేది. పై అంతస్తులో ఏదైతే రోడ్డు పైభాగంతో సమానంగా ఉన్నదో దాంట్లో గుర్రాలుండేవి. ఆ రోడ్డు మీదినుంచీ తిన్నగా తమ శాలల్లోకి గుర్రాలు చేరుతై అక్కడే పైన 'డ్రాయింగురూం' ఉండేది. నడిమి అంతస్తులో కోళ్లూ, కుక్కలూ, పిల్లులూ, పిల్లలూ, ఆడపిల్లలూ ఉండేవారు. క్రింది అంతస్తులోనించీ దిగే మెట్ల వంపులో ఖుర్షీదును ఆపుజేశారు. ఆ గుర్రాలు అలారం పెట్టుకుని పడుక్కునేవేమో అన్నట్టుగా ప్రొద్దున్నే లేచేవి. ఆ మూడో అంతస్తుమీది కిటికీల్లోంచీ క్రిందికి తొంగి చూడ్డంతో మునిగి ఉండేవి. ఖుర్షీద్ తన

మదిలో అనుకుండేవాడు ఏదయినా మాంచి పాట జోరుగా తాను పాడదా మని; - వీరెవరు లేచారూ ? ఈ గుఱ్ఱాల్నెవరు లేపారూ !!-మళ్ళీ రెండో అంతస్తులో కోళ్లూ, కుక్కలూ, పిల్లులూ, పిల్లలూ, ఇంకా ఆడపిల్లలూ తమ తమ ఇష్టమైన పద్ధతులతో లేవటం మొదలెట్టారు. - ప్రళయమంత అల్లరి ప్రారంభమయింది. దీనికి తోడు తోడు ఖుర్షీదు ఇద్దరు మిత్రులూ స్నానాల గదిలో ప్రవేశించి తమ జాతీయ గీతాలు పాడటం మొదలెట్టారు- అది ఎవరు వచ్చారు ! ఉదయమే ! ఉదయమే !!-ఆ వెంటనే ఆడపిల్లలు గుఱ్ఱపు స్వారీకి పోతారు. కాని, పాపం ! ఆ పిల్లలెవరికీ స్వారీ వచ్చేది కాదు. అందుకని రోజూ రోడ్లమీద వీరగమనం తరవాత అంతులేని అంద మైన దృశ్యాలు చూడటానికి వస్తారు. అలాగే ఒకరోజు ఆడపిల్లలకు వీర గమనం నేర్పటానికి బలవంతం లేకండానే ఇష్టాపూర్తిగానే ఖుర్షీద్‌కు అప్పగించారు. కాని ఆయన అవ్వాళే తన మూటా ముల్లే సర్దుకుని 'సరాయ్' లోకి దూకిపడ్డాడు !-'ఎ స్టాండర్డు'లో వార్షిక కవిసమ్మేళనం జరుగుతోంది. అది కాగానే అంతా బైటికి వచ్చేశారు. భరించరానంత పెద్ద సమూహం అక్కడ ఉన్నది. భోపాల్ 'ఆల్ట్రా ఫాషన్ లేబుల్' ఆడమ్మాయిల, హైద్రాబాద్ జాగీర్దారుల, రాంపూర్ ధనవంతుల, న్యూఢిల్లీ లక్నో గౌరవ వీయుల, అందరి పెదవులనూ 'జగర్' కవి రాసిన నూతన గీతాల పంక్తులు తగిలి కదిలిస్తున్నాయి——

''కోటి సూర్యులు వచ్చీరి, దాటి పోయి
రే, ముమేమే ఎడారికి ఎదురు చూచి
నాము.......................''

మిద్దె మెట్లను దిగి ఆ స్నేహ బృందమంతా గూడా కిందికి రోడ్డు మీది కొచ్చారు - కవి సమ్మేళనం జరుగుతోండగానే ఖుర్షీదు అన్నపూర్ణకు కావ్యాలలోని కష్టతరమైన అక్షరాల అర్థం చెబుతూ పోయాడు - ఇదంతా వింటూ అన్నపూర్ణకు లోపలలోపలనే ఒక నిర్ణయం జరిగిపోయింది. అది: నా హేద్‌తో ఉర్దూ నేర్చుకోటం ప్రారంభింతామని; - ఉర్దూ ప్రపంచంలోని

అందమైన, రసవంతమైన భాషల్లో ఒకటి. అదీగాక లక్నోవారి వాగ్ధోరణీ, మాట పసందూ - అన్నిటికంటే ఖుర్షీద్ నివాసమైన లక్నో తప్పకుండా చూడాలని అన్నపూర్ణకు మిక్కిలి వాంఛగా ఉండేది. అక్కడి అచ్చపు పచ్చని తోటలూ, నీడలు కప్పుకోనున్న విశాలమైన ఆ రోడ్లూ, అంద చందాల మేడలూ - మిద్దెలూ, గౌరవనీయులైన మనుషులూ,...అక్కడి టాంగావారు గూడా, కూరలమ్మేవారు గూడా, ఇలాంటి వినయ విధేయ సంస్కారాలతో, ఇలాంటి చక్కని భాషలో మాట్లాడేవారు. అంతే విని తీరాలి !

తరువాత, మళ్లీ అక్కడి మెర్‌స్‌లు సంగీత కళాశాల - అక్కడి కథక్ నాట్యమూ - ఖుర్షీద్ ఆ కాలేజీలో ఫిడేలు నేర్చుకున్నాడు. బ్రజేశ్ ఎప్పుడూ అంటూండేవాడు : 'అన్నపూర్ణాదేవి ప్రాణం ఎలా ఐతే తాన్‌పూర్ తీగెల్లో ఇరుక్కుపోయిందో, ఆలాగే ఖుర్షీద్ జీవం ఫిడేలు తీగల్లో కట్టివేయబడ్డది' అని - దరహంమీద తురక పిల్లలు చాలా అందంగా ఉంటారు. నాహేద్ అనేవాడు 'ఇతర పిల్లలు గూడా బాగానే ఉంటారు' అని; - ఖుర్షీదు ఎంతో అందమైనవాడు. బ్రజేశూ, కర్నల్ జహంగీరూ స్ఫురద్రూపులే ! రాజకుమార్ రవి అయితే పేరుకు తగ్గట్టు రాజ శీవి తొణికిసలాడుతూ ఉంటాడు ఆహ్లాదకరంగా - సరే, ఆ వేళ ఎప్పుడైతే కవి సమ్మేళనం తరవాత వారంతా పచార్లు చేస్తూ ఆ స్టాండర్డునుంచీ వాపస్ వస్తూ బజారు ప్రక్క ప్రక్కలనే నడుచుకుంటూ ఒక్కసారే వెనక్కు తిరిగి, అన్నపూర్ణతో అన్నాడు. ''జీవితం మిక్కిలి ఆనందకరమైనదిగదా! అన్నపూర్ణాదేవీ కాదా !?'' తరువాత అతను హుషారుగానూ, ఆచి ఆచీ ఈలవేస్తూ జాతి కుక్కను పిలవటానికి లంకించుకున్నాడు. అది నాహేద్ వెనక వెనకగా పరుగెడుతోంది. అతనైతే అన్నపూర్ణకు ముందుగా పోతూ జనానికి కొంచెం దూరంగా రోడ్డు అంచుల వెంబడి నడుస్తోన్నాడు. ఆకాశం మీద తారలు జగ్‌మగ్ లాడుతో లేస్తున్నాయి ! పర్వత శిఖరాగ్రాల మీదిగా చల్లని పిల్లవాయువులు ఊగులాడుతో వస్తోన్నాయి !—

ఖుర్షీద్ అహ్మద్ నీవు పూర్తిగా జీవితాన్ని గురించి ఆలోచనే లేకుండా వున్నావ్ గదూ !" కొంచెంసేపు మౌనంగా ఉండి అలా నడుస్తోనే అన్నపూర్ణ అన్నది - "పూర్తిగా" - "నాకంటే ఆలోచనలేని వ్యక్తు లెవరున్నారు అన్నపూర్ణాదేవీ ? నాకు జీవితపు ఏకైక కార్యక్రమం, ఆడటం - ఆనందంగా ఉండటమూనూ ! ఎప్పుడు నేను నా భావ విమా నంలో ఆకాశంలో వాయుగోళానికి పైగా పోతానో అప్పుడు నాకు బాగా అన్పిస్తుందిగదా : నేను మృత్యువుతో పరిచయం చేసుకోటానికి కోరికతో పోతున్నాను అని, ఎప్పుడైనా, ఏ క్షణంలోనైనా మృత్యువు నన్ను జీవితం నుంచీ వెనక్కులాగవచ్చు. కాని, ఇప్పటివరకూ జీవితం నాకోసం పూర్తి గానూ - నిండుగానూ ఉన్నది అనిపిస్తుంది. ఒకవేళ ఇదే నిమిషంలో నేను చచ్చిపోయినా ఎవరికీ లేశమయినా దుఃఖం కలగదు. నేను కన్ను మూసుకున్నాక ఈ సుందరమైన ప్రపంచంలో ఒక్క నా స్నేహితులే ఉండిపోతారు - ఎవరైనా, ఇలాగే శుభ నిశీధాలలో ఎప్పుడైనా నన్ను జ్ఞాపకం చేసుకుంటారు——"

అన్నపూర్ణ మనసులో అనుకుంది తాను గట్టిగా నొక్కి పలకాలని- "కమలేందర్ నీవు పొరపాటు పడుతున్నావ్ ! బహుశా నీవు చచ్చిపోతే నీకోసం ఒక ఆత్మ జీవితాంతమూ ఏడుస్తుంది. నీవు రెండోసారి కలుస్తా నని వాగ్దానం చేశావు, కాని కలవలేకపోయావు——"

పిమ్మట, మళ్ళీ తన అబ్జర్వేషన్ పోస్టులో కూచుని కూచుని శ్రీమతి అర్జ్‌మందూ, కన్నూరాణీ నిర్ణయించారు. చాలా మంచికుర్రాడు. తినా త్రాగా వున్న ఘరానా ఇంటివాడూ, మంచిబుద్ధీ, ఉత్సాహమూ, బ్రతుక్కి ఇంత ఆధారమూ ఉన్నవాడూ, ఇప్పటివరకూ బ్రహ్మచారిగా తిరుగుతోన్న వాడూనూ——అతనికి పెండ్లి చేయించివెయ్యాలి—శ్రీమతి అర్జ్‌మందూ, కన్నూరాణీ మహాతీక్షణంగా పిల్లని వెదికే పనిలో నిమగ్నమైపోయారు. ఈ యేడు ఎన్నికుటుంబాలయితే ముస్సోరీ వచ్చాయో వారి పిల్లలూ, మరి

ఎన్నైతే రాలేదో వారి పిల్లలూ, ఇంకా ఎంతమంది అమ్మాయిలు కాలేజీల నుంచీ డిగ్రీలు తీసుకుని, పెండ్లిండ్లకు సిద్ధంగా ఇండ్లలో వున్నారో, ఇంకా ఎంతమంది పిల్లల్ని వారి తలిదండ్రులు ప్రతీయేడూ అచ్చం ఇందు కోసమే ముస్సూరీ తీసుకోచ్చేవారో ఎక్కడైనా నడుస్తూ తిరుగుతూ 'కామిల్‌హిల్'మీద ప్రయాణిస్తూ 'హిక్‌మంజ్'లో నాట్యంచేస్తూ, చక్కగా తినాకుడవా వున్న పిల్లలు దొరకాలని;—కారణం : అది తెలుస్తోనే ఉంది గదా. 'హిక్‌మంజ్‌లో ఏ పిల్లలు నాట్యంచేస్తారో, నాట్యం వారికి తెలుసో, వారంతా బాగా అన్న వస్త్రాలకు ఉన్నవారే! కాని వారందరున్నూ తినడం కంటే ఎక్కువగా త్రాగుతారు అనుకోవచ్చు ! వారందరిమీదా శ్రీమతి అర్‌జ్‌మంద్ తన గుమ్మం మీదినుంచీ ఒక భావ ప్రపూర్ణమైన దృష్టి సారించింది—ఖుర్షీదును ఏకాకి బ్రదుకుతో దూరం, అశాశ్వతమైన జీవి తానందాలలో నుంచీ మేల్కొల్పటం మొదలెట్టింది. ఆమె శ్రీమతి అనోర మామ్‌తోగూడా అప్పుడప్పుడూ అంటోండేది. మీరు నాహెదుకు ఎప్పుడు వివాహం నిశ్చయం చేశారో—ఇప్పుడు ఆ పెండ్లయినా చేసెయ్యండి. కాక, ఒకవేళ మీకు ఆ స్థలంలో చెయ్యటానికి ఇప్పుడు ఇష్టమేలేకపోతే అది వేరే విషయం!-నా దృష్టిలో ఇంకాగూడా చాలామంది మంచి పిల్లలున్నారు. ఇంకా-ఇంకా...అంటారుగదా 'ఒక పెళ్ళి చేస్తే ఒకసారి 'హజ్'కు వెళ్ళి వచ్చినంత పుణ్యం వస్తుంద'ని—ఇక 'హదేష్ షరీఫ్' 'సహీనజారీ'ల్లో నయితే అది ఎంతమటుకు వచ్చిందంటే 'శవాన్ని పూడ్చేసెయ్యటం— ఈడొచ్చిన పిల్ల పెళ్ళి చెయ్యటంలో ఆలస్యంచెయ్యకూడదు—ఏ యింటిలో నయితే పిల్ల యుక్తవయస్కయై పెండ్లికి ఎదురుచూపుల్లో ఉంటుందో, ఆ యింట్లో శోభనదేవతల రాక బహు తక్కువగా ఉంటుంది. మరి, దయ్యాల-భూతాల సంచారం ఎక్కువవుతూ ఉంటుంది.' పిల్లలు కలిగివున్న వారి అందరి పిల్లల మానాభిమానాలూ భగవంతుడు అభిమానంతో ఉత్తేజ పరచుగాక. వారందరూ తమతమ ఇళ్ళు గలవాళ్ళుగా జేయుగాక ! శుభమస్తు !

—శ్రీమతి అర్జ్‌మందు అన్న శుభాశంసలు విని నాహెదాకూడా ఏదో అనబోయింది ఆమెకు తగిలేట్టుగా. ఎలా అయితే 'అలీరియాజ్'ను ఇంతదాకా పెండ్లాడక ఆమె సహించరాని, క్షమించరాని గొప్ప తప్పుజేసింది. అది మరెప్పటికీ, ఆమె ఆఖరు రోజు వరకున్నూ స్వీకరించబడదు—

అప్పుడు 'లావంజ్'లో మధ్యనున్న పెద్దగదిలో—భోజనాల వసారాలో, మెల్లి మెల్లిగా గుసగుసలు మొదలయ్యాయి—వీరుడా బ్రజేశ్, కొంచెం ఇవతలికి వచ్చిచూడు. నీ భార్య ఆ తురకల అబ్బాయితో, వాడికోసం ఎంత భయభీతులేకుండా తయారయిందో! బుద్ధిహీనంగా!!— అయినప్పటికీ ఆమె విడాకులు గూడానున్నూ తీసుకోటానికి వీల్లేదు. హిందూ స్త్రీ అయితే తన ప్రియుడితో యావజ్జీవితమూ గడపాల్సి వుంటుంది. ఇది ఎవరో తురకసానుల అట్టహాసంలో ఐతే ఎట్లా వుంటుందంటే, ఇటు పెళ్ళి కాగానే, అటు ఎవరో రెండోవాడు నచ్చాడా అంటే ఖటుక్కున విడాకులిచ్చి పోవటానికి, ఏమేం మాటలో !!—ఇక : బ్రజేశ్ ఎక్కువగా రోజు రోజంతా బ్రిడ్జి ఆడుతోండడమో, మిత్రులతో గాలి పోగుజేసి చొల్లుకబుర్లు చెబుతోండడమోతో సరి !— రోజల్లా వాన కురుస్తోనేవుంది. పూల మొక్కలూ, పాయిన్, సాలూర్ ఓక్ చెట్లూ సాయింకాలపు గాలిలో ఆచిఆచి ఊగుతున్నాయి ! పక్కలకంటి ప్రవహించే నీటిలో పాలరాతి ముక్కలు మెరుస్తున్నాయి ! మట్టీ—మొక్కలూ, వీటి చిత్రమైన గాలులు మంచి మత్తులాంటి వాసనలు లేపుతున్నాయి ! ఇంకొంచెందూరంలో గొప్ప రొదతో కొండమీదినుంచీ దూకుతోన్న సెలయేరు ఆ రాళ్ళను నెట్టివేసుకుంటూ వేగంగా కిందపడిపోతోంది !—అన్నపూర్ణ మెట్లు దాటేసి కింద రోడ్డు అంచుమీదికి వంగింది. ఇండ్ల ఎర్రనికప్పులూ, చెట్ల పచ్చనిపచ్చలూ ఆకాశాన మసకమబ్బులూ, నీలపు కావిరిలో ఒకటితో ఒకటి కలిసిపోతున్నాయో అక్కడ వింతగా ఆ ప్రవాహాన్ని చూస్తోనుంచుంది ! ఆమె దగ్గరగా 'జంగ్లే' సహాయంతో నిల్చుండి నాహెదా ఉల్లాసంతో తనకు బాగా పసందయిన దేదో పాట చిన్నగా గొణుగులా ఆలాపిస్తోంది ! ఒక్కసారే

ఆమె నడిగింది. "అన్నపూర్ణా, ఖుర్షీదు మాంచి ప్రియమైన యువకుడు గదూ !!"

"హాఁ"

"నే నతనిని పెళ్ళి చేసుకోనా ?" నాహెదు అదే ఉల్లాసంతో అడిగింది. లీలారాం దగ్గరకు వచ్చిన ఏ కొత్తరకం చీరెనో కొనే విషయంలో అభిప్రాయం తీసుకున్నట్టు !—"ఓరి భగవంతుడా ! ఎంత కష్టతరమైన సంగతి బహు విచిత్ర సన్నివేశంగా పరిణమించింది !—"

శ్రీమతి ఆర్జ్‌మందుతో తా నెప్పుడో అనిపించింది—ఆమె అందుకనే ఇప్పటిదాకా మూగగా ఊరుకుంది. ఎందుకంటే, అమె విన్నది ఇది "నా విషయం ఇంతకు పూర్వమే నిర్ణయించబడ్డది—"

కాని, ఇదంతా ఎప్పుడు తెలిసివచ్చిందో అప్పుడు వంశాచారం విషయికంగా ఈ సంబంధం విచ్ఛిన్నమైంది. అందుకని ఆమెవెంటనే కమ్మేసింది. ఎంత తియ్యగా మాట్టాడింది.

కాని, ఇందులో ఇబ్బంది ఏమిటంటే, మా ఇంటివాళ్ళు ఒప్పుకోరు- అదీగాక పాపం ! ఆ అమ్మాయి మాకు సరైనది గాదు, మరి మా వంశా పద్ధతులకు వ్యతిరేకము. అంచేత ముఖ్యంగా కలవని మతాలు కలవారితో పెళ్ళి చేసుకోటమే కూడదు—

"ఇది చాలా విషాదాంతమే !"

"లేకపోతే ఏమిటి మరి ! సోదరీ అన్నపూర్ణా నీవు ఏమీ సలహా ఇవ్వనే ఇవ్వవు. దేముడితోడు నీ వెంత దొంగవు !! చూడు మేమేమో రేపు క్రిందికి వెళ్తాం !"

"మంచిది - నిజమా ?"

కొండమీది సెలయేరు అదే వేగంతో కిందపడిపోతూనే ఉంది- రోడ్డుమీద కాంతి పెరుగుతూ పోతూనే వుంది.

మళ్లీ అన్నపూర్ణ మెల్ల మెల్లగా అడుగులు వేస్తూ మెట్లు దిగి హోటల్‌లోకి వచ్చేసింది. మధ్య గదిలో ఏదో వాద్య ధ్వని వస్తోంది. చాలా మంద్ర స్థాయిలో ఫిడేలు తీగెలు కదపబడుతున్నాయేమో ఒకవేళ!- ఒక మిక్కిలి ప్రియమైన గీతం సంగీతం ఇంతవరకు అన్నపూర్ణ విననంత గొప్పది మ్రోగుతూ ఉంది. ఆమె 'లావంజ్' ముందునుంచీ తిరిగి తన 'వింగ్' లోకి వచ్చేసింది. బ్రజేశ్ తన గదిలో లేడు - బయట చిమ్మ చీకటీ - చలిగా ముసురుగా వాతావరణం వశం గాకుండా పెరిగిపోతోంది! తన పడకటింటి వరండాలో నుంచుని అశోక వృక్షాల సందుల్లోంచీ ఉద యిస్తోన్న పున్నమ చందమామను చూస్తూ అన్నపూర్ణకు ఆలోచన తట్టింది- 'ఇప్పటిదాకా బ్రజేశ్ షికార్‌నించీ తిరిగి రాలేదు. అతనికి ఎక్కడైనా జలుబు చేస్తుందేమో! ఓయ్ రామ ప్రభూ!' ఫిడేలు శబ్దంలోని నిశ్శబ్దంలో మునిగితేలుతూ అన్నది——

ఆ తర్వాత బ్రజేశ్ రాజకుమార్ రవి వెంట పచార్లు చేస్తూ చాలా దూరందాకా వెళ్ళిపోయాడు. 'షాన్‌దిల్' రోడ్డు మీదనుంచీ వారిద్దరూ 'కామిటీ ఫాల్స్' రోడ్డు మీదికి తిరిగారు. అలా మౌనంగా నడుస్తూ నడుస్తూ 'రెస్ట్ హౌస్' వరకూ చేరుకున్నారు.

"వీరుడా! నీకేమైనా సుమారన్నా తెలుసా మనం ఎంత దూరం వచ్చామో!...ఇక వాపస్ పోదాం పద! లేకపోతే నాకు నిమోనియా రావచ్చు!!" రాజకుమార్ రవి అలసిపోయి ఒక బండమీద కూచుని అన్నాడు - బ్రజేశ్ రాతి చివర నుంచుని ఆ లోయ ఒడ్డుమీదికి వంగివున్న చంద్రుణ్ణి చూస్తోన్నాడు.

"అరే తమ్ముడూ! ప్రాణం ఇప్పుడు పోతే ఎంత బావుండును!! ఏం ఇక్కడే రెస్ట్ హౌస్‌లో ఈ రాత్రి గడిపే ఉద్దేశముందా, ఏం చూస్తున్నావ్!?"

రాజకుమార్ రవి గర్జించినట్టు అడిగాడు.

"ఏమీ లేదు - నేనేం ఆలోచిస్తున్నానంటే ఇక్కణ్ణించీ చంద్రుడి దాకా 'అయిరన్ షాట్' ఎంత గావచ్చు !!..."

బ్రజేశ్ కింది రాయిమీదికి దిగి వచ్చేశాడు. చంద్రుడి కిరణాలలో జలపాతం అలజడిచేస్తూ పోయే నీళ్ళు కరిగిపోయిన వెన్నెలలాగా ధగధగా ఊగుతోంది. కావిరి పెరిగిపోతోంది. రాజకుమార్ రవి ఆ రాయి మీది నుంచీ లేచి రోడ్డుకేసి వెళ్ళిపోతోన్నాడు - ఆ సమయంలో వెంటనే రాత్రిని కమ్మిన గంభీర నిశ్శబ్దాన్ని చీలుస్తూ, వెనక రాతిపైనుండి ఒక బలమైన వస్తువు, తాము నిల్చున్న రాళ్ళమీదినుండీ క్రిందపడ్డట్టు ఘోరమైన మ్రోత వచ్చింది - మళ్లీ కిటికీనుంచి లోయలో ప్రవహిస్తోన్న జలపాతం శబ్ద వేగం హెచ్చిపోయింది - మరి సరాయ్ ఒక నిశ్శబ్దమైన గదిలో ఫిడేలు తీగలలో పుట్టిన సంగీతం ఎంతసేపటి దాకానో చీకటిలో మ్రోగుతూ పోయింది——

ఎందుకంటే అది బ్రజేశ్వర్రావ్ ప్రభాకర్ చివరి గడియ !!...

---

రచయిత :
క్రిషన్ చందర్

# మోహిని

మూల కథ పేరు :
"మోబీ"

మోబీ 'ఒహీ ఓకా' (అనే పట్నం) అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఉండేవాడు. అతను సైన్యంలో చేరకమునుపు న్యూయార్కులో వకాల్తా చేసేవాడు— మోబీ వెండ్రుకలు దట్టంగానూ, నిడుపుగానూ, బంగారురంగులో ఉండేవి. అదే బంగారుకాంతి అతని చెక్కిళ్ళమీద మెరిసేది. అది సెప్టెంబరు నెలలో సేపులమీద నిగనిగలాడే వర్ణం!—ఎత్తులో గూడా అతను ఆరడుగుల కంటే ఎక్కువగా వుండేవాడు. విశేష మేమిటంటే అతను చిన్నప్పటినుంచీ గూడా నిర్భీతిగా వుండేవాడు. ముక్కుచివర ఒక చిన్న పుట్టుమచ్చ వుండేది. ఆ నల్లని మచ్చే మోబీ చహరామీద సమస్తమైన యౌవన చిహ్నంగా అనిపించేది. చూడ్డానికి పిల్లాడిలా అవుపిస్తాడు. కొంతమంది అనుకుంటారు ఇత నేమన్నా ముక్కుకొసన సిరాతో చుక్కబెట్టుకున్నాడా అని ! అలా అనుకోడానికి ఆస్కారమూ లేకపోలేదు. అత నెక్కువగా గలీజైనవీ, చెడువీ అయిన వస్తువులు తింటూ ఉండేవాడు. అంచేత అతని వేళ్లూ, పళ్లూ అంతా మకిలగా ఉండేవి-మోబీని సాయంకాలం కలుసుకోవాలంటే జనసందోహంలోనే-మోబీ అస్సాం బెంగాలులలో తిరిగి తిరిగి ఇక్కడ కొన్ని నెల్లుందామని వచ్చాడు. మొదట్లో డిసెంబరు నెలలో ఎక్కువగా మసీదులూ, గుడిసెలూ ఉండే రోడ్లమీద ఒక్కడే తిరుగుతూ కన్పింస్తూండేవాడు. కాని ఆ దార్లలో సైకిలుతో తిరుగుతోండటం, ఈలలు వేయటం, ఒంటరిగా తిరగటం అతనికే అసహ్యం అనిపించటం మొదలెట్టింది. ఇప్పు డా తిరుగుడు బొత్తిగా ఇష్టం లే దతనికి ! సినిమాలకి మటుకు మంచిదని తెలిస్తే సరి చాలా ఎక్కువగా వెళ్లేవాడు. అతనికి చిత్రవిచిత్రాలంటే తగని ఇష్టం.—సినిమా ఆపరేటరు సైనికులను కొట్టే తిట్టే

తుంటరులుగా భావించేవాడు. ఎంచేతంటే వాళ్ళకు ఇటువంటి పద్ధతులతో తప్ప మరో రకమైనవేవీ పనికిరావు-ఇలా ఆలోచించి, ఇతన్ని చూసి ఎంత కోపం వచ్చిందంటే, ఇతన్ని సినీమాహాలు దగ్గరికి కూడా రానివ్వకుండేంత!...అతనికైతే సినీమాలంటే అసహ్యమన్నమాట లేదు. కాని అలీగఢ్‌వి మంచి పిక్చర్లయితే చూడగోరేవాడు. అవీ సాంఘికాలైతేనే. అందులోనే అపూర్వ చిత్రణం వుంటుందని——

* * * *

అందుకోసమే అతను విశేషించి సైకిలుతో రోడ్లమీద ఏకాకిగా తిరుగుతో కన్పిస్తూంటాడు. స్టూడియో ముందరగా ఎన్నోసార్లు పోతోండేవాడు. హృదయంలో స్టూడియో లోపలి కెళ్లాలని ఆకాంక్షతో——వీలు చిక్కక ఆ కోర్కెను గుండెలోకి ఎంత నొక్కుకున్నా, అదే మాటి మాటికీ పైకి పరుగులు బెడుతూండేది. 'విషయం ఎంత గాఢంగా ఉంటుందో కోరికగూడా అలాగే వ్యాకులంగా ఉంటుంది'.... తెలియదు ఈ ఎర్ర మగవాళ్ళసంగతి ఎలా జరుగుతోండవచ్చు !!...అవును క్రిష్టమస్ రోజుల్లో ఐతే స్వయంగా మోబీ స్థితి మగాళ్ళతో చెడ్డ ఇదిగా వుండేది! ఇల్లా విచారమూ, వృథా తిరుగుడూ, ఏమీ ఏమీ తోచక వెర్రితనాన్ననుభవించేవాడు. రెండుసార్లు స్టూడియో ముందునుంచీ వెళ్లాడు. దానిమీద ఒక చురుకుచూపున్నూ వేసి మరిట్టే వెళ్ళాడు. మూడోసారి మళ్లీ వచ్చాడు. ఒక ఆలోచన తట్టింది. ''ఏం నష్టముంది !!...హిందూస్తానీవాడూ, ఒక ఎందుకూ పనికిరాని సృష్టింపబడ్డవాడు. నిజమే ! మందకొడివాడూ, గులామూ, నల్లనివాడూ, వ్యర్థుడూ, విషయ జ్ఞాన శూన్యుడున్నూ, అయినప్పటికీ ఫిల్ములు తీస్తూనే వున్నాడు—— ఈ ఫిల్ములు టెక్నిక్ దృష్ట్యా తక్కువ తరగతివి కావచ్చు. కాని, ఫిలిం పరిశ్రమ ఫిల్ముల సంఖ్యమీద సంబంధం గలిగి ఉంది. నేటి కాలంలో చూస్తే హాలీవుడ్ తర్వాత హిందూదేశపు ఫిల్ముల పరిశ్రమ పేరు వినవస్తోంది. అయినప్పుడు ఇట్లాఎందుకొచ్చింది-మళ్లా ఇట్లా అనుకున్నాడు వీళ్ళని కలవటం మంచిదిగాదు అని ! ఇత నిదివరలో భారతీయుల్ని గురించి

విసున్న దేమిటంటే వీళ్ళు చాలా అవినీతిపరులూ, కృతఘ్నులూ అయి వుంటారు అని ! అంతేకాదు, నమ్మదగనివాళ్లూ-బీదవాళ్లూ-ఎందువల్ల అయి నారు! ఇక్కడి ఫిల్ములు ఇక్కడి ఆడవాళ్ళకంటే బాగా కొవ్వెక్కినట్టు కని పిస్తూంటాయి. ఏది ఏమైనాగానీ మానవ సమానత్వపు వేదాంతంమట్టుకు సరీగ్గా వుంది. కాని ఈ నల్లరంగులో నమ్మకాన్నీ-అసహ్యాన్నీ జీవించ జేసే శక్తి ఏదో ఉన్నది- ఈ ఆలోచనాపరంపరలో మోబీకి ఒక్కసారిగా 'కేమూ' వ్రాసిన ఉత్తరం సంగతి చటుక్కున జ్ఞాపకం వచ్చింది. మోబీ కేమూ గలిసి ఒక రకమైన ఫిల్ము గ్లాసు తయారుచెయ్యటానికి ప్రయత్ని స్తున్నారు. దీన్ని ప్రొజెక్టరుమీద కెక్కిస్తే నలుపూ తెలుపూ రంగుల్తో పిక్చర్సు వాటంతట అవే సహజమయిన రంగులుగా కనపడతాయి! 'కేమూ' యూదు భాషా, బుద్ధీ ఈ కష్టతరమైన ప్రయత్నాన్ని దాటటానికి కృతార్థమైంది. అది ఇప్పుడు మోబీ పెట్టుబడితో, నూతన దృక్పథంతో పేటెంటు చేస్తు న్నారు. కేమూ వ్రాశాడుగదా, ఇండియన్ స్టూడియోల, సినీమాహాళ్ళ యొక్క యజమానులతో గూడా సంప్రదించి ఈ నూతనత్వాన్ని ప్రవేశ పెట్టే విషయం మాట్టాడాల్సి వుంది. ఏం! దీనివల్ల ఏం నష్టం!! మోబీకి హిందూస్తానీ మొదలయిన నాలుగైదు భాషలు వచ్చును. అటువంటప్పుడు ఈ హిందూస్తానీలతో ఫిల్ములు ఎందుకు తీయలేడు!... మోబీ ఎంతో వేగంగా ఉద్వేగంగా సైకిలుమీద మళ్లీ స్టూడియో గేటుకేసి వెళ్లాడు—— అక్కడ ఆగాల్సి వచ్చింది. దారి కడ్డంగా చౌకీదారు 'పఠాను' నిలబడి వున్నాడు. అనుమతి పత్రాన్ని చూపనిదే లోని కెళ్ళటానికి వీలేదన్నాడు. మోబీకి 'పర్మిటు' ఎక్కణ్ణించి వస్తుంది ! కానీ హిందూస్తానీ చౌకీదారుకు ఈ ధైర్యమా ! అనుకుంటూనే ఇతడు సైకిలును ముందుకు పోనెట్టి 'నాకు స్టూడియో చూడాలని వుంది, నన్ను పోనియ్!' అంటూ సాగిపొయ్యాడు. ఇతని ఉచ్చారణలో అధికారమూ-గర్వమూ వినిపించినై. కాని చౌకీదారు అంతకూ లొంగిపోలేదు సరిగదా. మాటామాటా పెరిగింది. దార్నిపొయ్యే వాళ్ళంతా చుట్టూ మూగారు! అప్పుడతను ఆ జనంలో ఒక అమెరికా

సైనికుణ్ణి ఎగిరి చూశాడు. అతగాడప్పుడు 'పోర్చ్'లో నుంచుని సిగరెట్టు తాగుతోన్నాడు. కాని అక్కడినించి నిమ్మది నిమ్మదిగా స్టూడియోగేటు దాకా వెళ్లాడుగదా చూడండి ఏం తమాషో ! !

"ఏం సంగతి లాలా ?" అతను చౌకీదారును అడిగాడు!

చౌకీదారు ముఖం అప్పుడు ఒక కంధార్ దేశపు మిగలబండి పగిలిన దానిమ్మపండులాగా కొట్టవచ్చినట్టు కానవస్తున్నది. పెద్ద గొంతుతో అన్నాడు. "అయ్యగారూ మీరు లోపలికి వస్తున్నారు. నేం జెబుతున్నాను. నీ కాయితం ఏదీ ? మా యజమానినుంచీ కాయితం రాకపోతే నేనెట్లా పోనిస్తాను!" మోబీ పర్‌వేజ్‌తో అన్నాడు. "ఈ చౌకీదారు మహాచెడ్డ వాడులాగున్నాడు!"

పర్‌వేజ్ అన్నాడు. "స్వతంత్రదేశంలో ఉండేవాడేమో! ఇంకా బానిసతనం నేర్చుకోలేదు !

పర్‌వేజ్ పఠానుకు పర్మిటు పేపరు రాసిచ్చాడు. మోబీని లోపలికి వెళ్ళనియ్యమనీ చెప్పాడు.

పఠాను కాయితం తీసుకుని గబగబా వెళ్ళిపోయాడు. 'నేను కంధారీ పఠాన్ను. నేనెవరికీ భయపడను, నేను కాబూలునుంచీ వచ్చాను. అచ్చం నా దేశంలో వారెంత పెద్దమనుషులైనా, వారి ఘరానాలు జూసి రైల్లోకి గూడా జొరబడనియ్యను. ఏమండీ. రైలుబండీ వస్తే పెద్దలూ గూడా వస్తారుగదా! చూడగా మీ హిందూస్తానీలు బుద్ధిహీనులుగా కన్పిస్తున్నారు!!"

"ఏం వెధవా, ఏమంటున్నావూ !" అన్నాడు మోబీ.

పర్‌వేజ్ చూపించగానే వాడు నవ్వటం మొదలెట్టాడు. "మంచి పనైంది. నేను నా చెయ్యి ఆపుజేసుకున్నాను. లేక వీడిని ఒఖ్ఖ తడి తగిలించే వాడినే తప్పక !" 'ఐతే వాడు నాతో అన్నదేమిటంటే ఎప్పుడూ, ఏ రకంగానైనా...ఏ హిందూస్తానీనైనా చెంపదెబ్బ పెట్టగూడదు !'

పర్వేజ్ అన్నాడు. 'ఆఁ అవును. మంచిదైంది! ఎంచేతంటే వాడు హిందూస్తానీ వాడు గాదు. ఆఫ్గనీ,'!

'ఆఫ్గనే!' మోబీ కుర్రతనంగా అన్నాడు. 'వీళ్ళిద్దరిలో తేడా ఏమిటి?'

పర్వేజ్ అన్నాడు "వాడు హిందూస్తానీయే ఐతే చెంపదెబ్బ తిన్న తర్వాత రోజల్లా నీ బూట్లు తుడతాడు. రాత్రికి నీకు సలాంజేసి నీ కింద శిష్యుడుగా కూడా వుంటాడు! ఈ చౌకీదారైతే ఆఫ్గనిస్తాన్ వాడు, వీరిద్దరిలో ఏం భేదముంటుందంటే, ఆఫ్గన్‌వాడి దగ్గర కత్తి వుంటుంది-హిందూస్తాన్‌వాడి దగ్గర సలాం వుంటుంది!'—

"మోబీ చిన్నగా అదోలాగా నవ్వుతూ 'నేను నీతో రాజకీయాలు మాట్లాడదామనుకోటంలేదు!!...సరేలే, ఈ దేశంలో తన స్టూడియో భద్రతకోసం ఆ దేశస్థుణ్ణి ఎందుకు తెచ్చి వుంచుకున్నాడు. ఇది జెప్పు ముందు!?'—

"ఇదే మా జాతి ఆచారం. మేం మా దేశ భద్రతకు ఇంగ్లీషు వాళ్ళని ఉంచుతాం - మీరేమో ఆఫ్గనుల నుంచుతారు!' అన్నాడు పర్వేజ్.

"ఏమి మీ స్టూడియోలను మీరు సొంతంగా కాపాడుకోలేరా?" అన్నాడు మోబీ.

"ఒకవేళ అట్లాగే చెయ్యగలిగితేమటుకు మిమ్మల్ని సముద్రాంతరాలు దాటి ఇక్కడికి వచ్చే విందు చేస్తామా!?" అన్నాడు అదోలా పర్వేజ్.

మోబీ సంగతి సందర్భాలు వివరిస్తూ అన్నాడు. "నేను అమెరికా సోల్జరును. నా పేరు మోబీ. నేను మీ స్టూడియో చూడాలని కోరుతున్నాను!"

పర్వేజ్ జంకుతూ అన్నాడు. "స్వభావం ఎలా వుంది. నా పేరైతే పర్వేజ్!....కాని, స్టూడియోకు నేడు సెలవు. స్టూడియో యజమాని

ఇక్కడ లేరు...అదీగాక - ఇవ్వాళ క్రిష్టమస్ పండగా. నీ వెందు కను కుంటున్నావ్ స్టూడియో చూడాలని !...ఇవ్వాళ ఏదన్నా నాట్యశాలలో... ఏదైనా అందాల గదిలో...!''

మోబీ ముఖం నిబ్బరంగా పెట్టి, ''నాకు నాట్యం అంత యిష్టం గాదు !'

పర్వేజ్ అతన్ని విభ్రాంతిగా జూసి, 'రా. నిన్ను నీ స్నేహితుల్తో కలుపుతాను !'...

వచ్చి వున్నవాళ్ళల్లో చాలామంది బెత్తపు కుర్చీలలో కూర్చుని 'బ్రిడ్జ్' ఆడుతున్నారు - పర్వేజ్ వచ్చి పరిచయం చేస్తున్నాడు - 'ఇతను ప్రకాశ్, ఈమె ముంతాజ్, ఈమె అజ్రా బహెన్, ఈయన హమీద్, ఇతను శ్యాం... మేమంతా యిప్పుడు స్టూడియోవారి 'ఫార్గో' (కారు) కోసం నిరీక్షిస్తున్నాం, పిక్చరు చూడ్డానికి వెళ్తున్నాం !''

''ఏ పిక్చరు ?''

"ఏదైనా హిందూస్తానీ పిక్చర్ చూద్దాం—మీరుగూడా బయల్దేర తారుగా తప్పకుండా !''

మోబీ కొంచెం ఆగి, ''అవును....నేనైతే నేటిదాకా హిందూ స్తానీ పిక్చరు ఏదీ చూళ్లేదు...చూడాలని మటుకు ఉంది !''

''ఐతే పద !''

ఫార్గూ వచ్చింది. దానిలో కూచుని వెళ్ళిపోయాడు. సినీమాహాలుకు చేరారు. టిక్కెట్లు తీసుకుని లోపలికి వెళ్ళి కూర్చున్నారు—కూర్చున్న దగ్గరినుంచీ వేయించిన వేరుశనగకాయలు వలిచి ఉప్పూ, కారం రాసిన పెద్దపెద్ద బద్దలూ—కలాబులూ (ఎండబెట్టి ఉప్పూ కారం రాసిన మాంసం ముక్కలు) తినటం మొదలెట్టారు. కలాబులు తినగానే పాన్లు వచ్చినై— మోబీ ప్రతిసారీ తన జేబునుంచి డబ్బుతీస్తాడు, గాని, వాళ్లు అతన్నివ్వ కుండా టలాయిస్తారు. "కంగారుపడకు ! మేమెరుగుదుం అమెరికా సిపాయీ

మిక్కిలి శ్రీమంతుడుగా వుంటారని! మేం గూడా ఎప్పుడో అప్పుడు నీ చర్మం దీస్తాంలే! కాని ఇవ్వాళగాదు. ఇవ్వాళ్ళయితే క్రిష్టమస్ ఆయె!"

పిక్చరు చూశారు. అందరూ మోబీని అడిగారు ఎలా వుంది అని— మోబీగూడా మొహమాటపడి పొగిడాడు. "బాగానే వుంది. కాని పాటలు చాలా ఎక్కువగా ఉన్నై. ఇది సంగీత ప్రధానమైన చిత్రమేమో!" అన్నాడు.

"ఇక్కడ ప్రతిచిత్రమూ సంగీతంగా ఉంటుందా మిస్టర్?" శ్యాం గర్జించినట్టు అడిగాడు.

"తెల్సిందా మిస్టర్ మోబీ?" అంటూ సిగరెట్టు దమ్ము జోరు జోరుగా లాగుతూ మోబీతో అన్నాడు.

"మిస్టర్ ఎందుకుగాదు? మిస్టర్ ఏమిటి?" అన్నాడు మోబీ—

"చాలు. నేనైతే అతన్ని ఇలా అంటాను. ఎవరితో నాకు ప్రేమ కలుగుతుందో తెలుసా భూత్నికే!"

"భూత్నికే...అంటే ఏమన్నమాట!" మోబీ హడావుడిగా అడిగాడు.

"అర్థం గిర్థం నాకు తెలియదు. అంతే. ఇవి ప్రియమైన మాటలు. తెలుసా మోబీ.........శ్యాం మోబీ బంగారు రంగు వెంట్రుకలను అలా కదిలించాడు.

మోబీ సంతోషపడుతూ అన్నాడు. "మంచిది ఇప్పుడు నిన్ను నేను శ్యాం అనటానికి బదులు శీం అంటాను! సరేనా!!"

"శీం శీం" అని ఆశ్చర్యంగా అన్నాడు హమీద్.

"పగిలిన ముఖం" శ్యాం నోటినించీ అనుకోకుండా వచ్చిందీమాట!

"పగిలిన ముఖం ఏమిటి!"

"ఇదీగూడా ఒకతిట్టే—ఈ పోచుకోలువాడిచెయ్యి చాలా పెద్దది. తిట్లుతప్ప ఇంకేమీ రావు అతనికి. కాసేపు సంతోషం ఉంటుంది; కాసేపు ఉండదు.

"ఆఁ! నిజం అంటున్నాడు యీ బీద అబ్బాయ్" మోబీ భుజంమీద చెయ్యేసి చరిచి శ్యాం అన్నాడు-కాని చెబుదూ. ఇవ్వాళ మీరు ఏ చైనా రెస్టోరెంట్‌లో కన్నా తీసుకుపోయి క్రిష్టమస్ విందు చేస్తారా? తొరగా చెప్పు?"

"పగిలిన ముఖం" మోబీ తన టోపీని గాలిలో ఎగరేస్తూ అన్నాడు. "ఆగు. ఇవ్వాళ్టినుంచీ మన కర్నల్‌తో చెప్పేస్తాను. ఓ అబ్బాయ్!.... ఓ అబ్బాయ్"...

ఫంగ్‌కంగ్ రెస్టారెంటులో ఎలక్ట్రిక్ లైట్లూ, ఫాన్లూ క్రింద భోజనాలు చేసే మేజులున్నై. వాటికి ఎదురుగా గోడమీద 'చాంగ్‌కేషేక్-చర్చిల్ - రూజ్వెల్టు'ల పటాలు వ్రేళ్లాడుతోన్నై. చాంగ్ కళ్ళు దుఃఖ పూరితాలుగా ఉన్నట్టున్నాయి. కాని, వాలకం అన్ని విధాలా, చివరమాటగా అవమానంగా ఉన్నది - రూజ్వెల్టు ఒక నూతనమైన సంపన్నమైన దేశపు సర్వాధిపతిలాగా స్వస్థతగల అభిలాషగల వాడిలాగా అవుపిస్తోన్నాడు-చర్చిలు పెదవులు దగ్గరికి ఉన్నై, అంతేనా అతని పెదవులు చుట్టను గట్టిగా నొక్కి పట్టుకునున్నది. ఆ పెదవుల బలిష్ఠతా, ఆ కళ్ళ ఆర్ద్రితా స్ఫుటంగా అవుపిస్తోన్నై. మేము అధిపతులం, మేం అధిపతులుగానే వుంటాం!" ప్రకాశ్‌కు చర్చిలూ, స్వర్గీయ కలేన్షోల చహరాల్లో ఎకాయెకీ ఒక సామ్రాజ్యవాద రేఖ అవుపించటం మొదలెట్టింది. చిన్ని పుట్టు మచ్చా, మరిన్ని పైకి అవుపించే ఆడంబరమూ విడిపోయాక ఏ యిద్దరి జ్ఞానుల రూపరేఖల ఆత్మ ఒకటిగా ఉండెనో, అదే చిత్రరచనావేశమూ, అదే జ్ఞాపకశక్తీ, కంచుపూనికా, కలేన్షోనుగూడా ఎక్కువగా 'చిరుతపులే!' అంటోండేవారు...ప్రకాశ్ మాటిమాటికిన్నీ ఆ ఫోటోలను చూసి ఆగిపోతోండేవాడు. అకస్మాత్తుగా అతనికి ఆకర్షకంగా తోచిందిగదాంటే, అతని కండ్లు ఆ గోడమీద ఇంకా ఎవరినో గూడా చూడగోరుతున్నాయి. ఎవరిని?....నేడే క్రిస్‌మసు. సాంఘిక పతాకాలు గోడలమీదా, చుట్టుపట్లా, కట్టేసిన వాళ్ళ మాదిరిగా అనిపించింది. ప్రకాశ్ చూపు మాటిమాటికీ

ఇంకా ఏవో జెండాలను గూడా వెదకుతోంది. కానీ, ఎవరికి ? ఆ చిత్రం ఇంకా ఇప్పటి దాకా వెయ్యనే లేదు. ఆ జెండాలు ఇప్పటివరకూ ఇంకా ఎత్తనేలేదు .. ప్రకాశ్ ఇట్లా ఆలోచించాడు—అతని మనస్సుకు ఔదార్యం ఎందుకు ఎక్కువౌతూ ఉంది ! ఎందుకు పాపం !! .. ఇతను షరీఫులైన చైనీలూ-మిక్కిలిసౌందర్యమైన అమెరికనులూ-కెనెడెనులూ-గాలివాటంలో గూడా ప్రభుత్వ చిహ్నాలు కానవస్తున్నాయి-ఆ చీనీ ఒకచేతిలో పెన్సిలూ ఒక కాయితమూ పుచ్చుకుని ఆర్డరుకోసం....నాగరికుడుగా నిల్చున్నాడు. ప్రకాశ్‌కు అతను నించోవటంలోని అర్థంలో గూడా ఒక ఆశ్చర్యమైన అర్థం, ఆడంబరమైన గర్వకాంతీ అవుపించసాగింది. ఏమిటి ఇది ! దృష్టి లోనే మోసం ఉందా ? కాక ఇతని మానసికమైన రక్తసంబంధమా ?...

శ్యాం గూడా మాటాడకుండా వూరుకున్నాడు. సభ అంతా నిశ్శబ్దంగానే వుంది. తెలియకపోవటమేమిటి ! మోబీ ఈ పతనానికి తెంచుకుంటూ అన్నాడు. "నాకు ఈ రెస్టారెంటులో చాలా హాయిగా ఉంది ! నీకుగూడా అట్లాగే వుందా శీమీ !?"

శ్యాం ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు. అతడు నింపాది నింపాదిగా అన్నాడు. మళ్లీ ఒక పాన్‌దీసి నోట్లో పెట్టుకున్నాడు. మళ్ళా అతను నాలుగువేపులా చూపులను పాకించాడు. కాని, అతని మేజుకుదప్ప ఇంకా ఏ మేజుల దగ్గరా హిందూస్తానీలు లేరు. ఇక్కడ మన స్వదేశీయులు చాలా తక్కువ. అతను ఆలోచించాడు. మళ్లీ అతనికి ఎకాయెకీ జ్ఞాపకం వచ్చింది. హిందూస్తానీ ఇక్కడెవరున్నారు! అదైతే బెంగాల్‌లో, బీహారులో, ఒరిస్సాలో, ఆంధ్రాలో, మద్రాసులో, ఆకలి చావులు చస్తున్నారు. మూర్ఖులు. అతను గొంతు నొక్కుకున్నట్టు ఆగాడు. ప్రకాశ్ మాట్లాడదామనే ప్రయత్నం జేస్తూ అన్నాడు. 'చైనావారు చేసిన సూదిలో సౌందర్యం ఉండదు. అదే అమెరికా దాంట్లో వుంటుంది'—హమీద్ అన్నాడు. 'దాని శక్తీ కూడా తక్కువే వుంటుంది!'—ముంతాజ్ అన్నది 'నాక్కూడా అమెరికా తయారీ సూదే బాగా బాగుంటుంది!'—'కృతజ్ఞతలు' అన్నాడు

మోబీ సంతోషంతో! "ఇది నేను ఈ క్రిస్‌మస్ పర్వదినపు శ్రేష్ఠమైన 'టోస్ట్' గా గ్రహిస్తాను. ఇద్దరు కెనెడియనులు ఆ గాలి పంకాల దగ్గర దగ్గరగా వెళ్తూ వెళ్తూ ఆగిపోయారు. మోబీ తలెత్తి వారివేపు చూశాడు. వెంటనే లేచి వారివేపు నడిచాడు—

"ఇతను జానూ, ఇతను టామ్మూ, వీళ్ళిద్దరూ ముండ్యాల్‌నుంచి వచ్చారు." మోబీ తన హిందూస్తానీ స్నేహితులతో పరిచయంజేశాడు. వీరి ఆచారపు పరిచయం తరువాత వాళ్ళిద్దరూ ఆ మేజుమీదనే కూచున్నారు. కాని, 'మేమేమీ తినం' అన్నాడు టాం!— 'మేము ఇప్పుడే, ఇప్పుడే...'

తరువాత కొంతసేపు అంతా నిశ్శబ్దంగా ఉన్నారు.

చైనా రికార్డునుంచీ జంత్రవాద్యం మధ్యమస్థాయిలో సుస్వరంగా గీతం గాబోలు వినిపిస్తోంది.

"మోబీ అన్నాడు...జాన్...ఇది క్రిస్‌మస్...స్వస్థలం నుంచీ ఎంత దూరం వచ్చావ్!"

జాన్ ఏమీ మాటాడలేదు.

"చీకటి వృక్షాలమీద మంచు బిందువులు చూడాలని ప్రాణం ఆరాట పడుతోంది...కాని, దృష్టి బయటికి సారించగానే ఆకాశంమీద మినుకు మినుకు మనే నక్షత్రాలు నాట్యం చేస్తున్నట్టవుపిస్తున్నాయి!" అన్నాడు టాం.

"ఒక గ్లాసెడు బీర్ తే" అన్నాడు జాన్.

"నీ చిన్నిచిన్ని తమ్ముళ్లూ, చెల్లెళ్లూ, మీ అమ్మా నాన్నల మనస్సు సుఖపెట్టటానికి సిద్ధంగా ఉండి ఉంటారు—కాని, మా అమ్మదగ్గర నా తండ్రి చనిపోయాక నేను దప్ప ఇంకెవరున్నారు!...మొట్టమొదటినుంచీ జానూ నేనూ ఇద్దరం మిక్కిలి సన్నిహితంగా కలిసి మెలిసి ఉన్నాం. అప్పు డప్పుడూ అమ్మ జ్ఞాపకం తగిలి నన్ను మతిలేకుండా చేస్తుంది" అన్నాడు మోబీ—

ఆ సమయంలో ఇంట్లో కొవ్వొత్తులు వెలిగించబడ్డాయి. క్రిస్‌మస్ మహోత్సవం, బయట వీధులలో ప్రజల కోలాహలం. హోయ్‌హోయ్! చాలు. ఒక్కసారైతే దాన్ని వినాలని ప్రాణం ఉబలాట పడుతుంది!" అన్నాడు టాం.

"నేనైతే ఆ చుట్టాలకూ గాఢమైన కృతజ్ఞత కలిగియున్నాను— ఎవరైతే ఈనాడు......" అని గొంతు ఇక పలకలేదు మోబీకి.

అత ననేదాన్ని జాన్ మార్చుకుంటూ 'పర్‌వేజ్‌గారూ మీరెంత తీసుకుంటున్నారు జీతం? అన్నాడు.

'800-' రూపాయ లన్నాడు పర్‌వేజ్.

"చాలు!—" జాన్ ఆ పర్‌వేజ్ జవాబు విని ఎంతో ఆశ్చర్య పడ్డాడు.

"మా దగ్గరైతే ఇంత జీతం ఒక గనిలో పనిజేసేవాడు తీసు కుంటాడు.

"ఇక్కడ ఈ జీతం మిక్కిలీ ఎక్కువగా ఉంది! హిందూస్తాన్ తలసరి ఆదాయం రోజుకు ఆరు పైసలు ఉన్నది!" అన్నాడు హమీద్.

"అవును ఇది అంతులేని బీద దేశం" అన్నాడు నిర్లక్ష్యంగా ముండ్యాల్ ఎయిర్ మాస్టర్ జాన్ - 'మోబీ క్యాంపుకు వాపస్ వెళ్లాడా?'

ఇంకా లేదు. నీవు వెళ్ళు. నేను కొంచెం ఆగి......"

ఆ యిద్దరు కెనెడియనులూ ఎయిర్ మాస్టర్‌కు గుడ్‌నైట్ చెప్పి సెలవు తీసుకున్నారు. దాని తర్వాత మోబీ బిల్లు చెల్లించటానికి చాలాసేపటి దాకా అలాగే ఉన్నాడు. ఆఖరుకు అప్పుడు శ్యాం అతన్ని తిట్లు తిట్టాడు. అప్పుడు అతను వెళ్ళి ఊరుకున్నాడు. బిల్లు దాఖలుచేసి హోటలునుంచీ బైటికి రాగానే, పర్‌వేజ్, ప్రకాశ్, హమీదూ, ఉజరాబహెనూ, ముంతాజూ సెలవు పుచ్చుకున్నారు—

'సోలాంగ్'

'సోలాంగ్'

శ్యామూ, మోబీ ఒంటరిగా ఉండిపోయారు. వాళ్ళిద్దరూ నిమ్మళంగా అదే రోడ్డుమీద నడుస్తూ పోతున్నారు - ఎక్కడ ఇంగ్లీషువాళ్ళ సినిమా థియేటర్లు ఉన్నాయో!...గాలిలో ఏదో మత్తు ఉన్నది. బట్టల్లోంచీ అత్తరు వాసనలు వస్తున్నాయి. పెదవులమీద పాశ్చాత్య గీతాలు కదులుతోన్నాయి!- 'నాషేర్వాణ్ అండు సన్స్' మద్య విక్రయశాలయొక్క విశాల ప్రదేశంలో ఒక లౌడ్‌స్పీకరు పెట్టబడి ఉంది. అక్కడ ఒక మిల్టరీ అతను తన చుట్టూ నున్న వాళ్ళకు ఏసుక్రీస్తు మతోపన్యాసం చేస్తున్నాడు.

"మనం పాపాత్ములం. మనం అందరం గూడా పాపాత్ములమే! రాండి. ఏసు ప్రభువు పాదాలమీద వంగి వ్రాలండి!" ఇది వినే వాళ్ళలో అమెరికనులూ, కెనెడియనులూ, ఆస్ట్రేలియనులూ, ఇంకా ఇంగ్లీషు సోల్జర్లూ ఉన్నారు. ఆ చౌకులోనించీ వస్తూ పోతోండేవారు కొంచెంసేపు ఆగి విని మళ్ళీ పోతున్నారు. ముగ్గురు నలుగురు హిందూస్తానీలు మటుకు ఆ హితోపదేశం చాలా శ్రద్ధగా వింటున్నారు - ఒక మద్రాసీ దానిని తర్జుమా గూడా చేస్తున్నాడూ - ఒక బిచ్చగాడూ - ఒక కుష్టువ్యాధి పీడితుడూ-ఒక నౌకరు చేసుకు జీవించేవాడూ - వింటున్నవాళ్ళలో ఉన్నారు. రెండు మేలు జాతి కుక్కలు గొలుసులతో కట్టేయబడి ఉన్నాయి.

"ఏసుస్వామి పాదాలముందు మోకరిలండి! మనం అందరం ఆ ప్రభుదేవుని గొర్రెలం!!"

"గొర్రెలమా! తోడేళ్ళమా!!" అన్నాడు శ్యాం.

'బహుశా. నీ సైగ యుద్ధంవేపు ఉన్నది. నేనూ యుద్ధం అంటే వ్యతిరేకిని గాను. అంతేగాదు. నేననుకొంటూంటానుగదా. యుద్ధం అంటే మానవత్వపు అభివృద్ధిని ఆవిష్కరించటానికి చేసే నెత్తురు బలి అని! అది న్యాయమే!' అన్నాడు మోబీ——

"ఎవరి అభివృద్ధి ఆవిష్కారం?' అన్నాడు శ్యాం. ఒక ఆవిష్కారం భాగ్యవంతుడికి అవుతుంది. ఒకటి బీదవాడి కౌతుంది. ఒక అభివృద్ధి తెల్ల వాడికి గావచ్చు. ఒకేటేమో నల్లవాడికి గావచ్చు! ఇద్దరూ మానవుల

అభ్యుదయం కోసమే ఆలోచిస్తున్నారు. కాని వేరువేరు. ఆ యిద్దరి స్వప్నాలు విడివిడిగానే వున్నాయి. నాకైతే ఏం తోస్తున్నదంటే, ఇదైతే అసలు యుద్ధం గానే గాదు. రెండు స్వప్నాల పోట్లాట మాత్రమే !''—

'నీవు చాలా నిజం పలుకుతున్నావు' అన్నాడు మోబీ. కాని ఈ నలుపూ, ఎరుపూ మనుషుల స్వప్నాల పోట్లాట గాదు యుద్ధం అంటే ! మనమైతే ఈ స్వప్నాలకు వ్యతిరేకంగా పోట్లాడుతున్నాం. ఎవరైతే యుద్ధ ప్రేరేపణకు గుత్తా దీసుకున్నామని చూస్తున్నారో, ఆ స్వప్నాలు ఏ 'టోజో' చూస్తున్నాడో, ఏ హిట్లరు చూస్తున్నాడో, ఒకడు నల్లవాడూ-ఒకడు యెర్రవాడూ ! నీ దృష్టాంతమే చాలా తప్పుగా అనిపిస్తున్నది !—

''నే నెరుగుదును. ఈ కలలు మిక్కిలీ భయంకరమైనవని ! నాకు అవంటే అసహ్యం గూడానూ, నీవూ అవే కలలు కనటంలేదని నాకు సాక్ష్యం ఏమిటి ?'' అన్నాడు శ్యాం—

''దానికి ఉదాహరణ మన అమెరికా చరిత్రే !'' అన్నాడు ధీమాతో మోబీ. ఇంగ్లీషు వాళ్ళ స్వాతంత్ర్యం పసందైనది—రష్యనులది ఐక్య ప్రజాసంఘటన—చీనాది కోమింగ్‌టాంగ్ పరిపాలన. ఎల్లా ఐతే సోవియెట్ నేతా స్వాతంత్ర్యపు ఆకాంక్షకు రూపురేఖలు దిద్దాడో అది !— మన హృదయం బహు పవిత్రంగా ఉంది !—

''మరి హిందూదేశము!!'' శ్యాం కోపంతో ముఖం చిట్లించుకుంటూ అన్నాడు. బహుశా మీ హృదయం గూడా యుద్ధాలోచనలతో ఇనుమూ సిమ్మెంటు కాంక్రీటుగా తయారైంది ! దానిమీద ఏ విజ్ఞానబాంబున్నూ ఉపయోగపడదు. అనుకుంటాను !

''నేను ఈ దేశంలో నీ అతిథిగా ఉన్నాను. మీ ప్రభుత్వానికిన్నీ అతిథిని ! నాకు ఈ దేశపు స్థితిగతులు బాగా తెలియవు. అదీగాక నేను ఇక్కడి రాజకీయపు చిక్కు పరిస్థితులను యథాతథంగా అవగాహించుకో లేను గూడా !—నాకు ఇదిమాత్రం తెలుసుగదాంటే, వెనకటికి బెంగాలులో క్షామం వచ్చి అనేక వేల లక్షలమంది నిండు ప్రాణాలు కోల్పోవటం !

కాని, నా ఆలోచనలో ఇది చాలా ఆశ్చర్యంగా అనిపించేది. ఈ దేశపు ప్రజలు యెలాంటివాళ్ళు! తమ యెదుట తమ ఇరుగు పొరుగువాళ్లూ—చుట్టాలూ, స్నేహితులూ చచ్చిపోతోంటే చూస్తూ ఊరుకున్నారు. గానీ, లేశమైనా వారికి ఎలాంటి సహాయమూ చెయ్యరే!!— ఎవరిచేతిలో ఒక బియ్యపు గింజైనా లేదో—ఎవరికండ్లలో ఒక్క నీటిబొట్టయినా లేదో! నిజం అంటే నీకు కష్టంగా ఉంటుందేమో! ఇటువంటి పాషాణ హృదయులను నేనెక్కడా చూసి యెరుగను!— దీన్ని మతద్వేష మనగూడదా? శీమీ. నీ కెట్లా తోస్తున్నదంటే మీ దేశం కథ, ఇది ఒక్క దేశమేగాదు, అనేక దేశాల కలయికగా ఉన్న దేశం ఇది! ఒక మతమూ గాదు, నానా మతాలు! ఒక్క భాషన్నాగాదు, ఆఖరుకు వివిధభాష లున్నాయి! కల్చరూ ఒకటిగా అనిపించటం లేదు. అదీ భిన్నత్వంగానే ఉంది! ప్రతి ఒకటీ రెండో దాన్నుంచీ ప్రత్యేకంగా ఉంది. ప్రతీదీ దాని లాభాలు అది చూసుగుంటోంది'—ఇది నిజం కాదంటావా శీం!?"—

"నీ ఉద్దేశం ఏమిటి? బెంగాల్‌కు ఎవరు సాయపడ్డారు? ఏమిటిదీ!! ఎన్ని లక్షల రూపాయలు, ఎన్ని లక్షల ధాన్యబ్బస్తాలు, అవి సర్కారువే గానివ్వ, ప్రజలవేగానివ్వ! పబ్లికు సేకరించితేయేమీ, ప్రభుత్వం పేరుతో యేమీ సేకరించబడ్డవా!? అవి బెంగాల్ ఆకలిని తుడిచిపెట్టడానికి సరిపోయేంతవి! ఈ సహాయం పిండిలో ఉప్పుగల్లుతో సమానమైందేగావచ్చు! బెంగాల్‌ను బెంగాలుమాత్రమే రక్షించుకో గలిగింది. అలాగే కాకపోతే ఈనాడు ఒక్క బెంగాలీ కూడా మన కవుపించేవాడు గాడు! కరువు పరిస్థితా: మహాఘోరంగా ఉంది. అలాంటప్పుడు సహాయానిగ్గూడా ఒకహద్దూపద్దూ వుంటుంది. ఏ మనిషైనాగానీ, తానే మృత్యుముఖంలోకి లాగబడుతోంటే అతను ఇతరులకేం సాయం చేయగల్గుతాడు!?—మీ ఇండ్లలో మీరు సుఖంగా ఉన్నారు. కావలిసినంత ధనమూ ధాన్యమున్నూ ఉన్నాయి. మీరెంతో సానుభూతితో మీ ఇరుగు పొరుగు వాళ్ళకు సహాయపడగల్గుతారు! వారి కష్టాలకు మీరు కన్నీరుగూడా కాన్క పెట్టగలరు! కాని—ఒక దరిద్రుడు

తన కడుపుకే గంజి లేనప్పుడు ఇతరులకేం మదదు చేయగల్గుతాడో అర్థం గాదు! ఇక కన్నీళ్లా!?—ఆ అంతస్తుమీదకు చేరుకుని అశ్రువులున్నా జవాబిచ్చిపోతాయి! ఆఖరుకు అశ్రువులన్నా అన్నం లేందే రావు! ఆ అన్నమే అవుపించకపోతే మనిషి ఎట్లా ఇతరుల ఆకలి కేకలను విని అశ్రువులు కారుస్తాడు!?—మేమంతా ఒక కులం గాము. నిజం, చాలా కులాలన్నమాట అంతకూ నిజం, కాని, యూరప్‌లోగూడా చాలా కులాలున్నాయి! 'వ్రా' వారికి సహాయం చేయటానికి సంసిద్ధంగా ఉన్నారు. మరి మమ్మల్నిగురించి ఎందుకులేరు! బల్గానియన్ కులాలు మరీ ప్రత్యేకంగా గ్రీసుదేశపు క్షామాన్ని ఏ అంతస్తునుంచీ దాటుతున్నారు?—అక్కడి ప్రజంతా కలిసి కష్టపడి గోధుమలు బస్తాలకు బస్తాలు అందజేసింది!—ఇక ఇక్కడ మేం మొత్తుకుంటాం గోధుమలో అని, మాకు దానం చేస్తారు పాలపిండి సీసాలు!!...."

ఇదంతా విని మోబీ నవ్వి అన్నాడు. "చాలు నేను నా చెవులతో వింటోనే వున్నాను. దీని అర్థం ఏమిటంటావ్?—అంతావింటోనే వున్నాను. తలలో స్థానం ఇస్తోనే వున్నాను. కాని ఏమీ మాత్రం అనను!.'

"ఏం? ఎందు కనవు?"

"మనమే మార్గదర్శకులం! అన్నీ విను—నీవు నోటితో ఏదీ అనకు అచ్చంగా ఆ సమస్యనుగురించి!— ఇక విను, నాకు అప్పుడు ఒక హృదయాకర్షకమైన మాట తోచింది—నాకు ఒక హితోపదేశం చెయ్యబడ్డది. ఏమనంటే, హిందూదేశస్తులతో ఎటువంటి బహుమతులున్నా అంగీకరించ గూడదు. ఒకవేళ ఒప్పకున్నా అవి ఎలాంటివై ఉండాలంటే చాలాతక్కువ వెలగలవై ఉండాలి!"

"ఎందుచేత?"

"ఎందుకంటే, నేను విన్నమాట 'హిందూదేశస్తుల ఆచారం ఒక మామూలీ కానుక యిచ్చి చాలా పెద్ద బహుమానంపొందాలని అపేక్షిస్తారు. అని!"

శ్యాంకు లోపల ఆవేదన అగ్రులెత్తుతోనే వుంది. అయినా, అతడు నిమ్మళంగా అన్నాడు. 'ఇదినిజం ! కాని, ఆహా ! ఈ ఉపదేశం ఇవ్వాళ్టిది గాదు. 150 ఏళ్ళకు పూర్వం ఈస్టిండియా కంపెనీ ఉద్యోగులకు ఇవ్వబడేవి. మేమైతే మా బహుమానాల్లో మా యిళ్లే తుడిచిపెట్టుక్కూచున్నాం ! వాటి వల్ల మేం పొందిన లాభం ప్రపంచం అంతటికీ తెలుసు ! చరిత్ర సాక్ష్యం ఉన్నది. ఏమిటంటే, హిందూస్తాన్ ఎప్పుడూ ఎవరినీ దోచివెయ్యలేదు. అది యెప్పుడూ తానే దోపిడీ చెయ్యబడుతున్నది ! దానికీ చరిత్ర సాక్ష్యం ఉన్నదిగదా. హిందూదేశానికి ఎప్పుడూ దోపిడీ దొంగలు వస్తూనేవున్నారు. చూడు. చూడు-హిందూస్తానీలు ఎప్పుడేగానీ బయటిదేశాలకు బోయి ఏ దేశాన్నయినా—ఏ మతాన్నయినా లూటీ చేశారా చెప్పు !?— ఇవ్వాళ మామీద ఈ నేరం మోపబడుతున్నదిగదాంటే, ఆ సంస్కారం గలవాళ్ళ వారసుల తరఫునుంచి...ఎవరు ఎర్ర ఇండియను ప్రజలనుంచీ, వారి దేశం హస్తగతం చేసుకున్నారో ! ఆ భగవంతుడికే ఎరుక ! అప్పుడు ఈ ఉపదేశాలు చెయ్యబడలేదు !!........''

మోబీ నిర్ఘాంతపోయి అన్నాడు. "అఖరుకు నీవే మంటావ్ ??"

"అదంతా ఏదో ! నీ వేదైతే గులాం యూరప్‌ను గురించి తీర్పు చెబుతున్నావో స్వతంత్రమూ, రొట్టే;—కాని మాకైతే అచ్చం స్వతంత్రం చాలును ! తరువాత మాఅన్నం మేమే స్వయంగా సంపాయించుకుంటాం!'

''స్వాతంత్ర్యం ఒకరిచ్చేదిగాదు. స్వయంగా తీసుకోవాల్సింది !'' అన్నాడు మోబీ—

'అయితే బానిస యూరప్‌కు గూడా ఎందుకు దాని అదృష్టంమీద వదలిపెట్టగూడదు ? దాన్ని స్వయంగానే తన నొప్పికి చికిత్స చేసుకోనియ్యండి !'—

'ఇది నీ స్వంతమూ, అంతరంగికమూ అయిన సమస్య ! మేము దాంట్లో జోక్యం ఎట్లా చేసుకుంటాం !'

"ఇదే పద్ధతిని యూరపు మతాలలో గూడా అమల్లో వుంచు. అప్పుడు నీ తర్కశీల శక్తి స్థిరమైపోతుంది. కాని, బుద్ధి విశేషాన్ని బట్టి అదీ గూడా హద్దు లేకుండా ఖరాబై పోతుంది. ఎంచేతంటే మానవ సమాజపు శరీరమంతా ఒకటే గనుక !...ఒకవేళ కాలిమీద గాయం అయితే మెదడు సహాయం చెయ్యటంవల్ల దాన్ని మాన్పగల్గుతుంది ! బహుశా ఇప్పటికీ నీవు ఆ వాస్తవాన్ని తెల్సుకోలేకపొయ్యావు ! '8-10' యుద్ధాల తరువాత తెలుసుకుంటావు గదాంటే, శాంతి-యుద్ధములయొక్క తరహాగా, మానవతా - స్వాతంత్ర్యమూ గూడా అననుకూలమైన విభాగాలు గలవి అని ! అది రేపు సృష్టికర్త అయిన భగవంతుడి సంతానపు మిరాశ. ఎప్పటిదాకా అయితే అది మానవులందరి సమష్టి హక్కుగాదో, పోనీ మేమైతే బానిసలుగానే వుంటాం ! కాని నీవుగూడా ప్రతి పాతికేళ్ళకూ తను నవ యౌవన పటుత్వంతో మృత్యుదేవతా ఘట్టాన్ని దింపుతోంటావు ! ప్రతి ఇరవై అయిదు సంవత్సరాలకూ తమ నవయౌవన వధువులను విధవలుగానూ, తమ పిల్లలను దిక్కులేని వాళ్ళగానూ చేస్తూవుంటావు ! మీ రాజకీయవేత్తలు బహుశా దాన్ని మిక్కిలి తెలివైన పనిగానే భావిస్తారనుకుంటాను. నేనైతే దానిని ఆత్మహత్య అని అంటాను."

టాం 'నిజం' అన్నాడు—

"రాయటమూ, చదవటమూ వచ్చిన ఏ హిందూదేశస్థుడితోనూ నీవు మాట్లాడవద్దు, వాళ్ళు ఎటుదిరిగి రాజకీయాలలోకే లాక్కొస్తారు! అన్నారు" అంటూ నవ్వాడు మోబీ.

శ్యాం మాట ఒక్కసారే మెత్తబడిపోయింది. అతను సిగ్గుపడుతూ మోబీతో అన్నాడు. "మంచిది. అయితే చూపించు - అదీగాక - ఏం అన్నావు ?!"

పగిలినట్టున్న నోటితో మోబీ బిగ్గరగా నవ్వుతూ అన్నాడు. 'శ్యాం' మోబీ నవ్వటానికి లంకించుకున్నాడు. అప్పటిదాకా చేసిన సంభాషణలవల్ల కలిగిన మనో భారాలన్నీ దూరమైపొయ్యాయి...

శ్యాం మోబీ భుజంమీద చెయ్యేసి అన్నాడు - 'మంచిది...రా... వికసించిన ధైర్యంగల వారి మాటలు చెప్పుకుందాం...మొదట్లో నేను మన మహాబూబు సంగతులు చెబుతాను...తరువాత నీకు అవకాశం ఇస్తాను.... వినూ...వాడి పేరు 'రమూ'...''

శ్యాం కళ్ళు అర్ధ నిమీలితాలైనాయి. అతను తన మహబూబ్ పేరు గూడా పూర్తిగా చెప్పలేకపొయ్యాడు. కాని ఆ పేరు ఈ విశాల విశ్వంలో తేనే పంచదారల్లాగా కరిగిపోయింది.

మహబూబ్ పేరు తీసుకోగానే అతని ధోరణిలో ఇల్లాంటి సాధుత్వం వచ్చింది గదాంటే మోబీ ఆ పేరును అనగానే ఒక్కసారే తియ్యని శ్వాస తీసుకున్నట్టుగా నొసలి రేఖలవల్ల తెలుస్తోంది - అతడు చూశాడు. రాత్రి తిన్నగా చాలా లోతుగా పోయింది. తారలు ఒక్కసారే జగ్‌మగా లేచాయి. గాలి సువాసనలతో నిండిపోయింది-ఇక యుద్ధము దూరదూరంగా ఎక్కడికో అఖాతాలలోకి పోయి దాక్కున్నది.

మోబీ నిశ్శబ్దంగా, అలసిపోయిన తన చెయ్యి, తన పక్కనున్న శ్యాం భుజంమీద వేశాడు...నింపాదిగా ఏదో అన్నాడు - "ఒకసారి మళ్ళీ అనుశీమీ, నీ పెదవులు నీ ప్రియతముడి పేరును ఒక తడవ మళ్లా ముద్దుపెట్టుకుంటాయి!...ఓ అబ్బాయీ...ఓ అబ్బాయీ...!?" శ్యాం చిన్న నవ్వు నవ్వి మోబీ చేతిని జోరుగా దబాయించాడు-వాళ్ళిద్దరూ రోడ్డు మీద నడక సాగించారు. దగ్గర బంధువుల మాదిరిగా ఒకరి చేతిని ఒకరు పట్టుకుని, తారల కొంచెం కొంచెం కాంతుల నీడల్లో - మంచు తెరలలో- ఆకాశం క్రింద ఇద్దరు చివరి మానవులు!...

విఠల్‌వాడీలో ఏర్పాటు చేసిన వన భోజనానికి, హమీదూ - ఉజ్రా బహెణలు మోబీని గూడా ఆహ్వానించారు. కొన్నాళ్ళ పిదప మోబీ వారితో కలిశాడు. ఇప్పుడతని రంగు బాగా ఎర్రగా ఉంది. మెడ మీదా, మొహం మీదా పుట్టు మచ్చల గుర్తులున్నాయి. 'పిల్లల్ని పెంచుతున్నారా ఏమిటి?' అన్నాడు అర్థాన్ని ఊహించకుండానే హమీద్——

మోబీ నిర్భయంగా నవ్వాడు. అనజొచ్చాడు "న్యూయార్కులో ఒక పిల్లి ఉన్నది. చాలు. ఆ పిల్లిని పెంచాలని నాకు ఎంతో కుతూహలం. ఇదైతే 'జూజుత్సు'ల చిహ్నంగా ఉంది—

''ఇవ్వాళా రేపూ జూజుత్సో నేర్చుకుంటున్నావా?'' అన్నాడు పర్వేజ్.

''నేర్చుకోటంలా. నేను చాలాకాలమైంది నేర్చుకుని జపాన్‌లో!''

"జూజుత్సో - బాక్సింగ్‌లలో నీవు దేన్ని గొప్పదిగా భావిస్తావు'' పర్వేజ్ అడిగాడు—

"బాక్సింగ్‌లో మగతనం వుంది - జూజుత్సోలో చాలాకీ వున్నది. బాక్సింగ్‌లో నిజాయితీ ఉంది - జూజుత్సోలో పరిశ్రమ ఉంది. బాక్సింగ్‌లో మొఖాబిలా, సాఫ్ సీదా వుంటుంది - జూజుత్సోలో అవకాశాన్ని ఉపయోగించుకోటమూ, మోసంతో పని తీసుకోటమూ ఉంటుంది!'' మోబీ ఈ మాటలు తన వేళ్ళు లెక్కబెడుతూ అన్నాడు—

"ఈ రెండు ఆటలూ రెండు ప్రత్యేకమైన మతాల స్వభావాన్ని గుర్తింపజేస్తున్నాయి!'' అన్నాడు ప్రకాశ్.

"సరేలే. మళ్ళీమాట. నీవీ రెంటిలో దేన్ని ఉత్తమమైందిగా తలుస్తున్నావ్?'' అని మొండికేసి అన్నాడు పర్వేజ్.

వెంటనే ఉజ్రాబహెన్ అందుకుని అన్నది "నీవు మోబీని అడుగుతున్నావేమో! ఆయన అమెరికా - జపాన్‌లలో దేన్ని పసందు జేస్తాడు?''

అంతట అందరూ గల్లున నవ్వారు—

"జూజుత్సోలో నేననుకుంటాను ఈ ఆట సాంతమూ కాలికి కాలు పెనవేసేది. ఆ పట్టులోకి వచ్చేప్పటికే ప్రతిపక్షులు వచ్చి మీద దూకుతారు. అసలు ఈ ప్రపంచంలో జట్టీ పట్టు ఆట గొప్ప వస్తువు!....కావచ్చు, అది ఏదో ఒక యూనానీ తత్వపు సామ్యం అయివుంది! అంటే ఒకవేళ ఈ భూగోళాన్ని ఎక్కడైనా తిన్నగా జట్టీ పట్టు ఆటలోకి తీసుకువస్తే

భూమి ఇట్లా చిటికెలలో అక్షాంశరేఖమీద తల్లక్రిందులుగా తిరిగిపోతుంది!!" అన్నాడు ఆవేశంతో హమీదు—

మాటలో మాటగా ప్రకాశ్ అందుకుని "జాపానీలు ఇదే ప్రయత్నం చేస్తున్నారటగా! కాని, జట్టీ పట్టులోకి తీసుకురావటానికి ఎలాంటి బలం అవసరపడుతుందో తెల్సుకోలేక పోతున్నారు!" అన్నాడు—

"మరి 'ఖువ్వతు' (బలం) బాక్సింగ్ వల్లనే వస్తుంది." అంటూ మోబీ తన సంభాషణతీరు మార్చి, "ఉజ్రాబహెన్! అనాడు వాడియాహాలులో మీరు బెంగాలు క్షామ నివారణకోసమని చేసిన నాటక ప్రదర్శనం ఉందే, అది మాకు మిక్కిలి సంతృప్తి కలిగించింది!!" అన్నాడు—

"నువ్వెక్కడ కూచుని ఉన్నావ్!?" అని ఎత్తిపొడిచినట్టు అడిగింది ముంతాజ్.

"నాలుగో వరసలో—మా కర్నలుగూడా నా ప్రక్కనేకూచున్నాడు—" పగిలినట్టున్న నోటితో అరచినట్టు అన్నాడు మోబీ. వెంటనే పకపకా నవ్వుతూ చెయ్యి పైకెత్తి "శీమీ నీకు తెలుసా? ..మా కర్నల్ నాతో, నోరు బద్దలైనట్టు నవ్వుతోంటే, అతను చాలా సంతోషపడతాడు... బహుశా అందువల్లనే అతడు నిన్ను జూజుస్తో గ్రూపుకు ఆఫీసరుగా నియమించాడు...అదీగాక, నీకు తెలుసా ఇది! ఆరోజు నీ ఆట చూసి ఆయన నాతో ఏమన్నాడో!?...అతడు నాతో ఏమన్నాడంటే...ఓ అబ్బాయ్... ఓ అబ్బాయ్...మాకు తెలియదు హిందూస్తానీ నాటకంలోగూడా ఇంత గొప్ప వాస్తవమైన విషయాలు కొనియాడదగినట్టుగా ఉంటాయని!... అంచేత ఇకనుంచీ నేను హిందూస్తానీ ఫిల్ములు గూడా తప్పకచూస్తాను... నిన్ననే అదే జోష్‌లో వచ్చి 'శకుంతల' చూట్టానికి వెళ్లాము, సరే. ఉజ్రా బహెన్! నీ నృత్యం నీ నాటకం అంతటికీ ప్రాణం!!" అన్నాడు.

శ్యాం మోబీని గుడ్లురిమిచూస్తూ, "మా జోలే తీసుకురావు నీవు. నిజానికి ఆ నాటకానికి దర్శకుణ్ణి నేను!" అన్నాడు.

బిగ్గరగా నవ్వుతూ మోబీ అతన్ని వెక్కిరించటానికి ఏదో అన్నాడు-శ్యాం అతనివేపు గంతువేశాడు. మోబీ అక్కడినుంచీ పరుగెత్తాడు. శ్యాం అతన్ని వెంటనంటాడు. ఒక పచ్చని మైదానంలో ఇద్దరూ బాగా గుత్తంగా కలబడ్డారు. మోబీ జూజుస్తోతో యుద్ధం చేశాడు. వెంటనే బాక్సింగుతో—శ్యాం పహిల్వాను పట్లు పట్టాడు—ఆ కుస్తీలో అటుబడీ ఇటుబడీ మోబీ క్రిందా, శ్యాం పైనా—మళ్లా ఇద్దరూ నవ్వుతూలేచి తమ దుస్తులు దులుపుకుంటూ నిలబడ్డారు—

"విను మోబీ" అని ప్రకాశ్ తెలియజెప్పుతున్నట్టన్నాడు. "ఈ జూజుస్తో నీకు ఎట్లాంటి లాభదాయకమూ అయిందిగాదు. శుద్ధ పనికిరానిది. మిత్రమా పహిల్వానీ నేర్చుకో!"

శ్యాం అన్నాడు "కర్నల్‌తో చెప్పుగదా, తన సోల్జర్లకు ఈ ఆట నేర్పమని, నన్ను వెంటదీసుకు పో...హిందూపహిల్వానుల మొఖాబిలాలో నీ బాక్సింగూ పనికిరాదు! ఈ జూజుస్తో పనికిగాదు! కాని, మీ దేశంలో ఇదేమీ ఉపయోగపడలేదనుకుంటా ఈ పహిల్వానీ!—మోబీ అయితే యుద్ధం జేశాడు. దాంట్లో అతను స్వయంగా చూసిందేమిటంటే, బాణం తిన్నగా గురిమీద ఎలా తగిలిందో!—ఉత్తర క్షణంలో ప్రతిహిందూస్తానీ ముఖం జేగురు గడ్డలా ఎర్రబడిపోయింది!"—

శ్యాం ఏదో ఇప్పుడిప్పుడు ఎంతో ఖుషీగానూ—హుషారుగానూ కనబడుతున్నాడు...ఇప్పుడు తలకాయ వంచుకు నిలబడ్డాడు!....

"నాకు ఆశ్చర్యంగా వుంది! చాలా ఆశ్చర్యంగా ఉన్నది!" మోబీ నిష్కల్మషంగా అన్నాడు. నా కిట్లాంటి వాంఛ అసలే అసలే లేదు!!"...

ఉగ్రాబహెన్ సామరస్యభావంతో అన్నది "కూచో...కొంచెం చాయ్ తీసుకో ఇప్పుడు!... తర్వాత నదీతీరానికి వెళ్ళి కూచుందాం—పర్‌వేజ్ సంగీతం విందాం!!"

చాయ్ తాగుతూ తాగుతూ మోబీ విఠల్‌వాడీ వాతావరణాన్ని గ్రతన చుట్టుపట్టుల్లో ఉన్న ధ్వనులను గతించిన కాలపు శిక్షనుంచీ విముక్తి జెందించ టానికి ప్రయత్నించాడు—అట్లాగే ఆ ప్రయత్న ఫలితంగానే అతని పురా తన అనుభవాలూ, ఉత్సాహాలూ అల్లుకున్న ఇనుపవల. అతని వివేకమూ-అతని చుట్టుప్రక్కల ఉన్న వివేకమూ- ఇంకా, ఇవన్నీ కలిసిన వివేకము లతో వేరై పోతోంది—అతని శరీరమూ, ప్రాణమూ ఈ విఠల్‌వాడీ సౌందర్యసీమలో అనుసంధానం జేస్తున్నాడు—ఈ అందం 'విషయం' గాదు—ఈ అందం 'సారాయి' గూడా కాదు, కాని, ఒక మహా గొప్ప భోగ్యవంతమైన సంతోషంతో నిండిన నవ్వుమాదిరిగా, కళంకరహితంగా, అమాయికంగా, ఒక ఆశ్రయం ఇచ్చేలాంటి ఆకర్షణీయంగా ఉంది...

ఆ మూక మామిడిచెట్టునీడలో తన దండచెయ్యి తలక్రింద బెట్టుకుని పండుకున్నాడు. ఆ యేటి ఒడ్డు వెంబడే చాలుగా వున్న మందారవృక్షాల తీరును చూడటం మొదలెట్టాడు. ఈ మందారాల నిప్పు కణికల్లాంటి పూలు నదీ ప్రవాహంలో అతి అందాల దీపాల్లాగా తళతళా మెరుస్తూండడం కొంచెం కొంచెం అవుపిస్తూనే వుంది! ఆ జల ప్రవాహధ్వని ఏదో శ్రావ్య మైన పాటలాగా ఆ అందాల వెలుగుచుట్టూ మ్రోగుతూ పోతోండడం అని పిస్తూనే వుంది!... ఈ నృత్యగీతాల స్పర్శ, తాను ఎప్పుడోచూసిన ఉజ్రా బహార్ నృత్యాన్ని స్మరణకు తెచ్చింది!...అప్పుడు ఆ కొవ్వొత్తుల దీప కాంతిలో నృత్యం చేస్తూ, దరహాసం చేస్తున్నది మాధవదేవుని ముసిముసి నవ్వు!...క్రిష్టమస్ పర్వంపండినట్టున్న కొవ్వొత్తుల దీపాలూ...ఆ భగ వంతుడికే ఎరుక!! ఈ హిందూస్త్రీల ముఖాలు సాక్షాత్తూ వసంతమాధవ స్వామి హసన్ముఖం మాదిరిగా అనిపిస్తోన్నాయి! అవుపిస్తోనూఉన్నాయి!! ఎందుకు ఈ నేల ఆమెకు తెలిసినట్టుగా కలిసినట్టుగా కనిపిస్తోంది!!... ఎందుకు ఈ జనం ఆమెకు స్నేహితులుగా, బంధువులుగా అవుపిస్తున్నారు!! ...ఈ చెట్టూ, ఈ పుట్టా, ఈ పచ్చని బయలూ, ఈ యేరూ, ఇదంతా... ఈ పడమటి కనుమల నీలవర్ణ శిఖరాగ్రాల ప్రకాశపు అంచులనుంచీ దేవ

కన్యలు నె_త్తిన బంగారు కలశాలు బెట్టుకుని ఈ నదీజలాల కోసం క్రిందికి దిగుతున్నారా !!... ఇది జెరూసలమా ! విఠల్‌వాడీయా !! మందిరపు శిఖ రాని కె_త్తిన స్వర్ణకుంభం—దాని బంగారు నీరు దీసిన తోడుగూ—దాని త్రిశూలమూ అతని నేత్రాంతాల పర్యంతమూ ప్రతిభాసిస్తోన్నాయి!...త్రిశూలం క్రీ_స్తుమత చిహ్నమేగదా !...అవును అద్దైతే అవును. ఈ మందిరం నదీ తీరాన ఉన్నది. దీని ప్రతిరూపం ఈ నదిలో కంటా వ్యాపించి ఉన్నది ! రైతులు ఈ యేటి ఒడ్డున్నే తమతమ చేలలో నాగళ్లు దున్నుకుంటున్నారు. అయినా, వాళ్ళంతా దర్శనీయమైన ఈ శృంగార భూమిని ఇంతకాలం నుంచీ—ఎంతకాలంనుంచో తెలుసుకుంటూనే వున్నారా !! ఏమో ! ఒక వేళ గ్రహించీకూడా ఈ రోజుదాకా తెల్సుకోని వాళ్ళలాగా ఉండిఉంటారు! మానవుడూ—భూమీ వీట్ల ఆకారమైతే మిక్కిలి సాదా అయినవే. దీంట్లో పచ్చని పచ్చదనం ఉంది—నీలాలలాంటి నీళ్లున్నాయి—గుండుకత్తుల్లాంటి నాగళ్ళున్నాయి—అంతేనా, సంధ్యారాగపు బంగారం ఉన్నది—ప్రార్థన కోసం ఒక ఆలయం ఉన్నది—ఆ అమాయకపు బొమ్మలో ఎందుకోసం చక్కని నగిషీల వంపులు సొంపులు మెరిసి విరిసి పోతున్నై !!...ఎందు కోసం !! ఎందుకోసం !?......

ఉన్నట్టుండి పర్‌వేజ్ అన్నాడు. "మోబీ, నేను ఎప్పుడూ ఈ ఆల యాన్ని ఈ నదీతటంలో చూస్తూనే వుంటాను—నా ప్రాణం అవశమై ప్రార్థన చెయ్యటానికి దానంత టదే పూనుకుంటుంది !"

"ఎవరి ప్రార్థనో !!" అని షోగ్గా అడిగింది ముంతాజ్—

"మోబీ ఉన్మత్తుడిలా కేక వేశాడు, "ఓ శ్యాం. ఓ శ్యాం...ఓ అబ్బాయ్ ఇట్లా రావాలి. ప్రేమ వేస్తోంది !!"

శ్యాం అల్లంతదూరంలో అడవి పూలు ఏరుకుండే పనిలో మునిగి ఉన్నాడు. అతను జేబు రుమాలులో ఎన్నో రకాల పూలు ఏరి కట్టుకుని పట్టుకొచ్చాడు - వచ్చీరాగానే ఆ పూలను ముంతాజ్, పర్‌వేజ్‌ల శిరస్సు

మీద చల్లాడు - మోబీ గబగబా వారి దగ్గరికి ఉరికి ముంతాజ్ పర్వేజ్‌ల చేతులను తన చేతులతో పట్టుకుని ఒక ఫాదిరీ మాదిరిగా పెళ్ళి మంత్రాలు చదవటం మొదలెట్టాడు. ముంతాజ్ గభుక్కున తన చేతిని ఊడదీసుకుంది- అక్కడున్న మిత్రకోటి అంతా పకా పకా నవ్వారు—

తోమిన ఇత్తడి బిందెలు చంకన బెట్టుకుని మహారాష్ట్ర కన్యలు మందిరం దగ్గరున్న అందాల బావి దగ్గరి కొచ్చారు. వారి చీరలు మధ్యన రంగు వేయబడీ, అంచులు నెమిలి పింఛంలాగానూ గాలిలో ఆడు తోన్నాయి—

ప్రకాశ్ నిట్టూర్పు పుచ్చి అనజొాచ్చాడు "ఎప్పుడు స్త్రీ చిరునవ్వు నవ్వుతుందో అప్పుడు పూలమీద మంచు బిందువులు మెరిసినట్టుంటుంది! చెలమనీరే చిన్నారి పాట పాడుతుంది!"

హమీద్ అందుకున్నాడు "హల్లో, ఉన్నావురా నీ వక్కడ! ఆడా శిక్కడెక్కడా లేరు. ఇది అచ్చం పురుషులుండే చోటే!" ఉజాబహిణ హమీదును ఆగ్రహం గ్రక్కే చూపుతో చూసింది.

బాలికలు ఇత్తడి బిందెలు నెత్తిన బెట్టుకుని గుట్టలమీది కెక్కు తోన్నారు. ఆ చిన్న గుట్టల మీదిగానే వెళ్లాలి వారి ఊరికి. ఆ పర్వత పంక్తి వర్ణం మైదాకు రంగులో ఉంది. దాని మట్టి ప్రభావంవల్ల ఆ కన్యలు ఎల్లప్పుడూ సువాసినులుగా ఉంటారుట!...విఠల్‌వాడీ నీటి చెలమ అమృతం లాంటిది. విఠల్‌వాడీ భూమిలో పంచదార కరిగి కలిసినలాంటిది. విఠల్‌వాడీ చెరుకు గడలు ఇంత తియ్యగా ఎందుకుండవు?...కుమారికల గళాలలో రసం ఎందుకు చిందదు?...విఠల్‌వాడీ గీతాలు ఆలాపించండి... విఠల్‌వాడీ పీష్వాల అందరి అన్నిటికంటే సనాతనమైన చక్కని గ్రామం—

ప్రకాశ్ ఎప్పుడైతే ఆ పాటను మోబీకి వినిపించాడో అతను సంతోషంతో గంతులేశాడు, అనజొాచ్చాడు...'శీమీ' ఒకవేళ అభ్యంతరం ఏమీలేకపోతే, నేనీ పొదల చాటుగా దాక్కుని ఆ కొమ్మలమీద నడిచే బంగారు పాపల 'ఫోటో'లు తీసుకుండేవాడిని.

"ఎందుకు !" అన్నాడు శ్యాం. కాని, అతని ధోరణిలో సంతృప్తి కేమీ లోటు లేకుండానే వుంది.

"మేము 'వాటర్ వర్క్స్' సమాజంలో ఉంటూంటాము సోదరా!" ఇది మోబీ జవాబు——

"నీకు తెలియదు. ఈ దృశ్యం నా భావాల చివళ్ళమీద ఏ రకమైన రంగులు గీసిందో !"

శ్యాం 'సరే' అన్నాడు——

మోబీ 'కెమేరా' సరిజేశాడు. ఇంకా నిమ్మళ నిమ్మళంగా ఆ పొదల లోకి పోయాడు...అలా పోయి పోయి చివరకు అతనొక పెద్ద గుబురు వెనకాల మాయమయ్యాడు...కొన్ని క్షణాలు ఖాళీగా గడిచాయి——

వారంతా ఆ చెట్లకేసే చూస్తూ ఉండిపోయారు - రేవులో పిల్లల పాటలు ఎదురు మోగుతూనే ఉన్నాయి.

మళ్లీ ఆ చెట్ల వెనకగా మోబీ తల పైకి లేచింది. అతను జోరుగా పెద్ధగా ఒక తుమ్ము తుమ్మాడు. 'పాము పాము' అనే కేకతో మళ్ళీ ఆ చెట్లలో మాయమైనాడు.

అందరూ అతనున్నవేపు దూకారు. ఎందుకో వెంటనే ఆగిపోయారు. మళ్లా సాగారు—మళ్ళీ అరవటం ప్రారంభించారు. 'పాము పాము'...

కొమ్మల కొస నడుస్తోన్న బాలలఅడుగులు ఆగిపోయాయి. పాటలు బందైనాయి...వాళ్ళున్నా రంయి రంయిన దిగివచ్చారు.

మోబీ పాము తలని అరికాలుతో నలిపివేశాడు. కాని, అతనిముఖం పచ్చబడిపోతోంది. మోబీ విడివిడి అక్షరాలుగా అన్నాడు. "పా . ము... నన్ను...క.రు.చు.కు...తిన్నది...చూ.డు... కాలిమీద...వే.ళ్ళ.కి.పైన ..." వళ్ళంతా పచ్చబడుతూ పోతోంది——

శ్యాం కామేరా కున్న తోలుసంచీ విరిచి మోబీ మోకాలుమీద వేసి బిగలాగి కట్టాడు — ముంతాజ్ తన వల్లెవాటు తీసి శ్యాం చేతికిచ్చేసింది.

"వుల్లిగడ్డతిను...అతనికీ వుల్లిగడ్డ!" అంటూ పరుగెత్తింది. అలా ఉరికి ఉరికి మామిడిగున్నక్రింద పడివున్న సామానులో తినుబండారంలోవున్న ఉల్లిగడ్డకోసం వెదకటం సాగించింది.

పల్లెపిల్ల ఒకతె అన్నది, 'కాని ఇది ప్రమాదమే! ఎల్లా! అయ్యో!'

హమీద్ గాభరాపడుతూ అన్నాడు "ఒకవేళ ఇప్పుడు ఎక్కడైనా మోటారు దొరికితే..."

"మోటారయితే సాయంత్రం ఏడుగంటలకి వచ్చేస్తుంది" అన్నాడు ప్రకాశ్—

మరో పల్లెటూరిపిల్ల అన్నది. "అయినా ఇది ప్రమాదమే బాబూ! ఇది ఐదు నిమిషాల్లో..."

మోబీ స్థితి ప్రతి క్షణంలో మారుతూపోతోంది—

ఒక బక్కపల్చటి, చామనచాయరంగు అమ్మాయి వణుకుతూ వణుకుతూ ముందుకొచ్చింది. ఆమె తన పాపట బొట్టు పలమీదనుంచీ తీసి భూమిమీద పెట్టింది. ఆ అమ్మాయి ఇంకాస్త ముందుకు నడిచి ఆ చిన్ని గాయంకేసి పరీక్షగా మరీమరీ చూడటానికి లంకించుకుంది. ఏదైతే వేళ్ళకు పైనుంచీ శరీరాన్ని నలుపెక్కిస్తూపోతోందో! దానికి మొదలుగా, ఎవరూ అనుకోని తీరుగా...ఆమె పెదవులను ఆ గాయానికేసి అంటించింది, అలా పట్టిన పట్టుతో దాంట్లోవున్న విషాన్ని బాగా వుక్కిట్లోకి లాగి ఉమ్మేసింది! ఒకసారి...రెండోమారు...మోబీ తన కాలును ఆ అమ్మాయి నోటి దగ్గర్నించీ లాగేసుకోవా లనుకున్నాడు. కాని, ఆ పిల్ల కాలిని వదలందే!!...

మూడోమారు అతని ఎగసి లేచి నుంచున్నాడు. దానితో అతని కాలుకు తగిలి ఆ అమ్మాయి పాపట చుక్కతిరిగిపోయి—దెబ్బతిని అల్లరి చేస్తోన్న కొమ్మల్లోకి రివ్వున సుడి తిరిగినట్టు పడిపోయింది! ఆ పిల్ల తన పాపట చుక్కకేసి పరుగుబెట్టింది. ఆమె నది ఒడ్డుదాకా పోయి వెదికి దాన్ని సంపాయించుకుంది. నదిలోకి దిగి ఆమె నీళ్ళు పుక్కిలించి ఉమి

సింది...ఒక చిన్న రెమ్మలాంటి కొమ్మను విరిచి పండ్లకొరికి పడేసింది. చెలమనేరు బిందెకు నింపింది. దాన్ని ఎత్తుకుని ప్రాకినట్టుగా రేవు ఎక్కటం మొదలెట్టింది!...అ అమ్మాయికేసి చూసి ఒక్కసారే అనేశాడు మోబీ "ఇదిగో విను"—నడిచే పిల్ల అడుగు ఆగింది. నిరుత్తరంగా అతని వేపు చూస్తూ అలా నుంచుంది—

'నీ పేరు?' అన్నాడు మోబీ. ఆ పిల్ల సిగ్గుతో మొహంతిప్పుకుంది. పక్కనున్న పిల్ల అన్నది నింపాదిగా "దాని పేరా! 'మోహిని'— కాని, ఇది మూగిది!"

మోహిని నవ్వింది. ఆమె చూపులు భూమికేసి వంగాయి—

"నేను ఈమె తలిదండ్రుల్తో కలవాలనుకుంటున్నాను" అన్నాడు మోబీ.

ఇంకో అమ్మాయి అన్నది "ఈమెకు తల్లీదండ్రులు లేరు. తన పిన తండ్రి దగ్గరే వుంటోంది!"

మోబీ శ్యాంతోఅన్నాడు. "బ్రదర్...కాని, ఈ అమ్మాయినిత్వరగా నాతోబాటు ఆస్పత్రికి తీసుకుపోవాలి!"

"మెదలకుండా వుండు భూత్నీకే!" (భోసిడీ) అన్నాడు శ్యాం.

ఆ పిల్లలు గబగబా ముందుకు సాగిపోతూనే వున్నారు - మోబీ అక్కడే చాలా సేపు...విచిత్రానుభూతిలో...!

హాస్పిటల్లో మోబీతో డాక్టరన్నాడు. "మంచిదైంది. ఆ పిల్ల విషం లాగి ఉమ్మెయ్యటం! అల్లాగే చెయ్యకపోతే నీ ప్రాణం నీకు దక్కేది గాదు!"——

కాని, నేను పాము కాటుకు ఇంజక్షన్ ఇండియాకు వస్తూనే తీసుకున్నా. ఆ యింజక్షన్‌లో ఈ పాము విషపు మోతాదు కలిసిలేనట్టున్నది!"

డాక్టరు ఆ చిన్ని పాము నలిగిన తలకేసి పరీక్షగా చూశాడు. "షో. ఇక నీకు మరేం భయం లేదు!..." - మోబీ పెదవుల మీదికి దూకినై మూడక్షరాలేమో! 'మోహిని' అని.

నోరు మూసుకో భోసిడీకే' అన్నాడు శ్యాం.

ఇంటికి చేరుకున్నారు. అంతలో జాపానీలు అస్సాంలో యుద్ధాన్ని ప్రకటించినట్టు తెల్సింది...రెండు మూడు రోజుల్లోనే అతన్ని అస్సాం రావాల్సిందిగా పిలుపు వచ్చింది...రేపు ఉదయమే మోబీ అస్సాం ప్రయాణం——

ప్రకాశ్ గూడా మిల్టరీలో చేరాడు. అతను ఇతనికంటే ఒకరోజు ముందే పోతున్నాడు.

వీరి మిత్ర సభా సమావేశం మౌనంగా ఉంది. ముంతాజ్ కళ్ళల్లో ఎర్రని దారాలు లాగినట్టుంది. హమీద్, ఇవ్వాళ సిగరెట్టుకు బదులు చుట్ట మీద చుట్ట కాల్చేస్తున్నాడు. ఉజ్రాబహెణ్ కళ్ళ రంగు అసలే మారి పోయింది. ఆమె రెప్పలు ఈనాడు మరీ నిండుకుని ఉన్నాయి!...మోబీ నిత్యోత్సాహి. అదేమిటో నేడు నిశ్శబ్దాల చివళ్ళ చివళ్ళ దాకా దూసుకు పొయ్యాడు——

పర్వేజ్ సిగరెట్టు పీలుస్తూ మోబీతో అన్నాడు. "నీవైతే పెరల్ హార్బర్ కోసం యుద్ధం చేస్తున్నావు. కాని ఈ ప్రకాశ్ ఎందుకోసం యుద్ధంలోకి వెళ్ళినట్టు!?"

శ్యాం అన్నాడు. "బహుశా ఇవ్వాళ నేనూ సైనికుల దుస్తులు తొడుక్కొని ఉన్నట్టయితే, కాని, మనస్సులో ఆ ఉత్సాహం లేదు. ఆ కోరికా లేదు. ఆ సంతోషమూ లేదు...మన బానిసతనానికి ఎవరిమీద ప్రతీకారం తీసుకోవాలి? జపానీలతోనా! జాపనీలు పాపం! బాధితులు,- ఇంగ్లీషువాళ్లు వాళ్ళ దేశంలో సర్వ స్వతంత్రులు, అయితే అవుదురుగాక. ఈ దేశంలో అనేక పర్యాయాలు వారి ప్రవర్తన బాధితులతో చెప్పుకోటం బాధగా వుంటుంది.........మోబీ నిజం జెప్పు. నీవెందుకు యుద్ధానికి పోతున్నావో!...నీవు మీ అమ్మకు ఒక్కగా నొక్క కొడుకువి. నీవు..."

మోబీ పక్కగా తిరిగి, ఎనిమిది డబ్బాల బీరూ సంచీలోంచీ లాగి బల్లమీద పెట్టి అన్నాడు. "ఈ బీరు నేను ఆ రోజుకోసం దాచి వుంచాను. ఇవ్వాళ్టికి వచ్చింది ఆ రోజు...తాగెయ్!"

శ్యాం ఆ డబ్బాల మూతులు చాకుతో బెజ్జం జేశాడు. బీర్ ధార ఎగిసి అతని మొహంమీద పడ్డది - అతను త్వరగా ఆ బంగారు రంగు బీరును నల్లని గ్లాసులోకి వంపేశాడు - ఎలా అయితే దరిదాపు యిసుక తిన్నెలమీద సముద్రపు నురుగు ఉరికి చింది ఆడుతుందో అలా ఆ బీర్ పొంగు ఆ గ్లాసుమీద పడి మెరుస్తోంది.

"నీవు నా ప్రశ్నకు జవాబియ్యలేదు!" అన్నాడు శ్యాం.

"నీవు నన్నడగరాదటోయ్! నేం జెబుతాను నేనెందుకు యుద్ధానికి పోతున్నానో!" అన్నాడు ఉద్వేగంతో ప్రకాశ్.

"ఎందుకోసమంటావా నీవు బుద్ధిహీనుడివి!"..."ఇంగ్లీషు వాళ్ళు హిందువులకు 'హిందూస్తాన్' ఇవ్వరు? తురకలకి 'పాకిస్తాన్' ఇయ్యరు! వాళ్ళు ఈ యిద్దరినీ బుద్ధిలేని వాళ్లుగా చేస్తున్నారు. చూస్తున్నారు! అనాగరకు లెక్కడో!!..." అన్నాడు పర్వేజ్ రోషంతో

'సొంతం అననియ్యి వాడిని!' అన్నది ముంతాజ్ 'వీడి మాటకూడా విననియ్యి' అంటూనే కళ్ళలోకి నీళ్ళు తెచ్చుకుంది ముంతాజ్.

ప్రకాశ్ తృప్తికరమైన చూపులతో ముంతాజ్ ముఖంలోకిచూశాడు. "నేను చావటానికి పోతున్నాను. ఇక తిరిగి రాను. నేను జపానీ బాధితులకు వ్యతిరేకంగా నా నెత్తురు పారించటానికి పోతున్నాను!' అన్నాడు.

అందరూ గొల్లుమన్నారు—మోబీ మౌనంగా వారి మాటలు వింటోన్నాడు.

ప్రకాశ్ అన్నాడు. "ఇవ్వాళ—బహుకాలానికి త్రాగటానికి బీర్ దొరికింది. నాలుక తపించి పోయింది దాని రుచికి!!"

'శహబాస్. చావుకి ముందు మనసుతీరా తాగేసేయ్!' అన్నాడు హమీద్.

తనని తానే సమర్థించుకుంటూ ప్రకాశ్ ఇలా అనటం మొదలెట్టాడు ..."ఎప్పుడైతే నాకు బుద్ధి సంచారంకలుగుతుందో అప్పుడు ఆలోచిస్తోండే వాడిని...ఏం జెయ్యాలి! పోర్చుగీసుల దాస్యమూ మంచిదిగాదు. జపానీ లదీ గాదు...ఏం జెయ్యాలిప్పుడు మరి! అతుక్కుని కూచోనున్నాను... ఎప్పుడూ, ఎప్పటికయినా కానియ్. ఈ ప్రమాదకర వాతావరణానికి గురైతూ వస్తున్నాను...మనదేశంలో జపానువాళ్లూ—ఇంగ్లీషువాళ్ళూ యుద్ధ మాడుతోంటే చూడాలి. మనచేలనీ, మన గ్రామాలనీ, మన పట్టణాలనీ సర్వధ్వంసం చేస్తూంటే చూడాలి. కాలుమీద కాలు వేసుకుని మౌనంగా కూచోవాలి...దాస్యానికి చివర సిగ్గు మాలిన తనం, దానికి చివరన దౌర్జ న్యం వస్తుంది—దాని చివళ్ళలోకి పోయి ప్రతీజాతీ శవం అయిపోతుంది— దాస్యంతో స్వాతంత్ర్యంలభించగల్గుతుందిగాని, ఎప్పుడైతే ఏజాతైతే దాస్యపు హద్దులను దాటి సిగ్గుమాలినతనం, దౌర్జన్యం, నిష్కర్మలకు సాక్షిగా నిలు స్తుందో అప్పు డా జాతి చచ్చినా స్వతంత్రం పొందలేదు—అందుకోసమే నేను జపాను విద్రోహులకు వ్యతిరేకంగా యుద్ధం జేసి రక్తం ధారబోయ దల్చుకున్నాను...నాయీ ప్రతిజ్ఞ విద్రోహులు అందరికీ, వారి దౌర్జన్య చర్యలు అన్నిటికీ, ప్రతీకార కాంక్షగా నిల్చింది...వారు ప్రపంచంలో ఏ మూలమూలల్లోనయినా ఉండనివ్వండిగాక, వారి ప్రభావాలు కొన్నికొన్ని రకాల ఐక్యతల్లో దూసుకుని పోనియ్యండిగాక, నా చావూ—నాపోరాటం— ఆ దుర్మార్గులని ఎప్పటికైనా బలహీనులనీ, హీనులనీ చేసితీర్తుంది! దాని ఒకానొకమెరుపు బహుశా మన గూటిలోకూడా మనకు దొరికితీర్తుంది!... అందుకోసం..." ఇలా అంటూ అంటూ ఎందుకో మెదలకుండా ఆగి పోయాడు ప్రకాశ్—అతని ముఖం కందగడ్డలాగా ఎర్రబడ్డది. అతనువెంటనే బీర్ గ్లాసు అంచును తన పెదవులతో కమ్మేశాడు.

"బుడత కీచులతో ఎందుకు పోరాడవు! వారేమన్నా ముఖ మలా! పట్టా!!......ఉన్ని అంతకంటే కారుగా!!" అన్నాడు పర్వేజ్ మళ్లా—

"ప్రకాశ్‌కు బహుశా రెండు శక్తులతో ఒకేసారి యుద్ధం చెయ్యా లని లేదేమో ! హిట్లరు ప్రభావాన్ని చూస్తున్నావ్‌గా !" అన్నాడు హమీద్.

అంతా నవ్వారు—మోబీ మాట్లాడకండా అలాగే వున్నాడు—

"ఛోసిడీకే. నీవేం అనవేం !" అన్నాడు శ్యాం.

"ఎందాకానయితే రాజకీయానికి సంబంధముందో, అందాకా నేను మౌనంగా ఉంటాను....ఏ ఆజ్ఞలైతే నా శిరస్సుమీద మోపబడ్డాయో సాయశక్తులా నేను వాటికి బద్ధుడనైతాను...ఇది మటుకు తప్పని సరిగా అంటాను. నేను ఎప్పుడు ఇక్కడికి వచ్చానో అప్పుడు నాకు ఇట్లాంటి మాటలు వినిపించాయి. అవి భారతీయ సంఘానికీ, సంస్కృతికీ సంబం ధించినవి !...తరువాత ఏవి ఆచరణతో, అనుభవంతో అబద్ధాలుగా నిరూ పింపబడ్డాయో, అయితే కావచ్చు - ఇవ్వాళ నేను ఈ మాటలకి తగిన నిర్ణయం ఇక్కడ చెయ్యలేను...ఐనా, నేను యుద్ధరంగానికి ఉరుకుతున్న వాడిని !" అందరూ నిశ్శబ్దంగా యీ మాటలు వింటున్నారు—

"నాకు చూపబడ్డది గదాంటే హిందూవనితలు మహా పిరికివాళ్ళుగా ఉంటారని ! వాళ్లు గోషా పరదాల్లో ఉంటారనీ ! తెల్లవాళ్ళ నీడలకే భయం పడతారనీనూ !...ఇప్పుడు ఆ మాటలకి కేవలం భిన్నంగా నేను తెల్సు కున్న సత్యం ఏమిటి ? వాళ్ళు పరదాల్లో ఉండేది నిజమే, కాని, వాళ్లు మహా అభిమానధనులుగా ఉంటారని, అంతేగాదు. వారు పిరికివారు అసలుగారు. వారు మగవారికంటే గూడా ధీరత్వం గలవారు అనీ, వారు చావుకు కూడా పోటీ పడగల శక్తిమంతులు సమయంవస్తే అనీనూ !..."

"ఈ పలుకులు మోబీవి గావు - పాము విషం పలుకుతోంది !" అన్నాడు తడబడుతూ హమీద్—

"ప్రతి మానవుడూ కోరుకుంటాడు తాను ఇతరుల చెడ్డమాటలను వినాలనీ, వాటిమీద విశ్వాసం ఉంచాలనీ, ఇది మానవతత్వం - అట్లాగే నేను గూడా నీ విషయంలో ఎన్నో దుర్భాషలు విన్నాను. వాటిమీద

నమ్మకం గూడా వుంచాను...శీమీ. నీకు ఆ బహుమానాలూ-అభిమానాల మాట గుర్తుండవచ్చు! నీవు నన్ను నీచుడిగా భావిస్తావేమో!...కాని, ఇదొక వాస్తవం నేటివరకూ! నీ ప్రవర్తన ఈ పెనగులాటలోనే చూస్తోం టాను. అయినా, ఇదీ గూడా తప్పుగానే తేలిపోయింది!'' అన్నాడు మోబీ.

''తప్పెట్లా!?...భోసిడీకే. ఏదైతే ఈ బీర్ నాతో తాగిస్తున్నావో 40/-రూపాయలది, అయితే ఇదొకే బీర్ గావచ్చు!...దీనిమీద గూడా ఎంతమంది సద్భావంతోనే లాభార్జన చెయ్యటంలేదు!...ఏం. బీర్‌వల్ల ఇంత మత్తెక్కుతుందా నీకు!?'' అన్నాడు శ్యాం—

మోబీ నవ్వుతూ, కదలకండా అన్నాడు. "నాకు రాజకీయాలు తెలియవు. హృదయం ఒక్కటే చూస్తాన్నేను! దాన్ని తెల్సుకుండేందుకు ప్రయత్నిస్తాను...నేను మీ హృదయాలు లోతులకంటూ బాగా వెదికి గాలించి చూశాను...ఎప్పుడు నేను అమెరికా వెళ్తానో...అప్పుడు..."

''అయితే ఏమౌతుంది?'' పర్‌వేజ్ అడిగాడు.

మోబీ వెంటనే అనేశాడు. "ఏమీగాదు...విను...వాళ్ళు బహుశా అది బుల్ బుల్ గావచ్చు. ఎక్కడో పలుకుతుంది!"

బుల్ బుల్ పలుకుతోందా ఇక్కడెక్కడన్నా!?—మోబీ ఇది నీ చర్యలు దాటవెయ్యటంగాని, ఇక్కడ పశ్చిమతీరాన బుల్ బుల్ పలకదు.'' పర్‌వేజ్ అన్నాడు—

ఒక్క నిమిషం అలా ఆగి మోబీ చిన్నగా అన్నాడు - ''కాని అచ్చం అదే ధ్వనిలాగుంది - ఈ సంగీతం ఎక్కణ్ణో దూరంనుంచీ వస్తోంది!'' అంటూండగానే అతని కళ్ళు నీళ్ళతో నిండిపోయినై—

''న్యూయార్కు నుంచేమో!'' అని అడిగాడు శ్యాం

''అవును. న్యూయార్కునుంచి గూడా రావచ్చు. ఎక్కడైతే నా ప్రేయసి వుందో; లేక 'ఓహీ ఓకా' నుంచి గూడా. ఎక్కడైతే నా కన్న తల్లి ఉందో-'' ఇలా స్మృతులలో లీనమై పోయాడు మోబీ—

ఈ పూలగుత్తుల తేట వెన్నెల తెలుపు నా ప్రియురాలి చిన్నెలలా వాడకుండా ఉన్నాయి! మా అమ్మ తెల్లని వెంట్రుకలలాగా పవిత్రంగా ఉన్నాయి! మోబీ నెమ్మదిగా మృదువుగా ఆ పూల గిన్నెలో ఉన్న కొన్ని తెల్లని పూలగుత్తులను ముట్టుకున్నాడు. వాటి నెంతో ప్రేమిస్తున్నట్టుగా-ఆప్యాయంగా—

ప్రకాశ్‌కు ఎక్కిళ్ళు వచ్చాయి.

మోబీ మళ్లీ అన్నాడు. "సాయంత్రం ఇది, దీని సాక్షిగా నిజం చెబుతున్నాను. నేను పెరల్ హార్‌బర్ కోసం యుద్ధం చెయ్యటం లేదు." ఆలోచిస్తూపోయాడు- "బహుశా-నేను-ఈ స్వచ్ఛమైన తెల్లని పూలకోసం యుద్ధం చేస్తున్నాను." మోబీ తెల్లని పూలగుత్తులను తన బుగ్గలకేసి అదుముకున్నాడు, కండ్లకు అద్దుకున్నాడు...అంతా మౌనంగా వున్నారు... రాత్రిగూడా నిశ్చలంగా నీరవంగానేవుంది-గాని, బీర్ బుసబుసలు అల్లాగే వున్నై...ఎక్కడో దూరాన—చాలాదూరాన—ఒకవేళ, ఏ బుల్‌బుల్ పాటో ధ్వనులు పరుచుకుంటూ పోతోంది......

ఎన్ని నెల్లో గడిచిపోయాయి—మోబీకి ఒక్క ఉత్తరం ముక్క వచ్చిన పాపాన బోలేదు—బహుశా సెన్సార్...

ప్రకాశ్ సురక్షితంగా ఉన్నాడు.

తరువాత్తరువాత తెలిసిందేమిటంటే, ప్రకాశ్ జపానువారికి వ్యతిరేకంగా పోరాడుతూ పోరాడుతూ వీరస్వర్గం చేరుకున్నాడు అని.—

అయినా మోబీకి ఒక్క ఉత్తరమూ రానేలేదు.

పర్‌వేజ్ అన్నాడు. "ఈ అమెరికా వారిదేం నమ్మకం! ఇక్కడ ఎంత ఆప్యాయంగానో వుండేవాడుగదా!...మరి అక్కడికెళ్ళి..." అతను సిగరెట్టు కొసబూడిదను గిన్నెలో దులిపి, తన హృదయంలో ఇక ఎప్పటికీ ఎప్పటికీ మోబీ జ్ఞాపకం రాకుండా ఉండాలని శూన్యస్మృతులతో కళ్ళు మూసుకున్నాడు.

కొన్నివారాలు ముంతాజ్ మృదులాలైన దృగంతాలు అర్థరహితంగా అవుపించాయి—ఆఖరుకు ఆమెగూడా ప్రయత్నపూర్వకంగానే అతన్ని మరచిపోయింది.

శ్యాం టైఫాయిడ్‌లో మునకవేశాడు—రోగకాలంలో అతనికి ఒక సెన్సార్ అయిన లెటరు వచ్చింది. అది 'ఒహీ ఓకా' నుంచే వచ్చింది. ఉత్తరం విప్పుతూ విప్పుతూ శ్యాం ఆలోచించాడు. ''వెధవ. మళ్లీ 'ఒహీ ఓకే' చేరాడు! మరి...''

ఉత్తరంలోని సంగతి ఏమిటంటే, 'ప్రియమైన కుమారా. నిన్ను నా కుమారుడివి అంటున్నాను- ఎందుకంటే నా కొడుకు మోబీకి నీవు నెచ్చెలివి. అందుకే నేను నీకు ఉత్తరం రాస్తున్నది - బహుశా నీవు నీ తల్లికి ఏమైనా సాయపడతావేమో !' మోబీ చావుకిముందు తన వీలునామాలోవ్యక్తపరచాడు. తాను విఠల్‌వాడీలో ఒకపిల్లని చెల్లెలిగా ప్రేమించినట్టూ, ఆ అమ్మాయిపేరు మోహిని అనీ;—ఇంకా, మోబీ ఇదీ గూడా రాశాడు. 'నీవా అమ్మాయిని బాగా గుర్తుబట్టగల్తావు! ఏం, ఇది వీలుపడదా? ఇప్పుడు నా కొడుకు నా దగ్గరగానీ, ప్రపంచంలోనేలేడో, నీవు నా బిడ్డని నా కడకు పంపించటం...కాని, ఏ కారణాన్నయినా ఇది సంభవించని తీరుకు నాకు తెలియజెయ్యి. ఎందుకంటే నేను స్వయంగా హిందూస్తాన్ రావటానికి ఏర్పాట్లు చేసుకోగలందుకు. ముసిలిదాన్నిగదా. జీవితం సహాయం జేస్తే తప్పనిసరిగా రావాలనుకుంటున్నాను. నేను మోహినిని ఎత్తి ముద్దాడాలనుకుంటున్నాను. ఆ అమ్మాయిని నా గుండెలోగుండెగా అదుముకోవాలని తాపత్రయ పడుతున్నాను...ఒకవేళ, వీలే ఐతే నా మోహినిని నాతోపాటు ఇంటికి తీసుకోపోదల్చుకున్నాను. ఏం? ఇది వీలుపడదా ?— ఇదీగూడా గావచ్చు. నీవు అమెరికా మహిళ ఈ నైతికవ్రతాన్ని దుష్టంగా భావించి, మరి దీనిని యువక ఉద్రేకాలకు బలిచేసెయ్యవచ్చు—కాని, ఇది ఏ మానసిక ఉద్వేగాలకూ సంబంధించింది గాదు. ఇదొక గాఢవాంఛ. నైతిక వ్రతం. ఇది వాస్తవ సౌందర్యానికి సాక్ష్యం గూడా! ఏదైతే

నా కొడుకు నా నెత్తురు ఇచ్చి సంపాయించుకున్నాడో, వాడు నా—ఏకైక సుపుత్రుడు.'

తన ఉత్తరం చివరన వాడు రాశాడు గదా, 'మోహిని నాదైతే, మోహిని వాడి కాలి వ్రేళ్ళ విషం నోటితో పీల్చిందో, ఆ విషం మోహిని వాడి దేహంనుంచీ గాదు - ఆత్మనుంచీ పీల్చిందనీ, ఏదైతే ఆ విషం ఉన్నదో, నలుపును ఎరుపునుండీ, బీదవాణ్ణి ధనవంతుడినుండీ, మానవుడిని మానవుడినుండీ, వేరుగా ఉంచుతుందో, అవ్వాళ వాడికి తెలిసిందిట: ప్రేమ ప్రతి సౌందర్య మానవ సమాజంయొక్కా మొదటీ మరిచివరా ఒప్పందం. దీనికి భిన్నంగా, ఇది లేకండా ప్రపంచంలో ఏ మనుష్య సంఘమూ, సమాజమూ నిట్టూర్పు పుచ్చలేదు - విఠల్‌వాడీ రేవులో వాడికి మొట్ట మొదట తెలిసిందిటగదా : ప్రేమకు ఏ రంగూ వుండదనీ, ఏ దేశంగానీ ఏ మతంగానీ వుండదనిన్నీ,...అది జీవితపు చిట్టచివరి గట్టి ఆదర్శం— వాడు ఎప్పుడైతే అస్సాం పోతోండెనో, ఇదంతా నీకు చెప్పాలని వాడను కున్నాడు. కాని, వాడు ఇంత సిగ్గులమూట గదాంటే...ఆ పిల్లాడు—నా కొడుకు - వాడు నీకు చెప్పాలనుకుండేవాడుట వాడు ఇంకా ఇలా రాశాడు. తాను ఒకే ఈ ప్రేమకోసం యుద్ధం జేస్తున్నాననీ, ఏ ప్రెమైతే మానవత్వంలో పుట్టుతుందో, ఏది ద్వేషానికి వ్యతిరేకంగా అస్వతంత్రానికి దగ్గరగా వుండి మానవుణ్ణి దాసుణ్ణిగా చేస్తుందో - వాడు అభిప్రాయపడ్డాడు గదా, తాను యుద్ధాన్నించీ తిరిగి వచ్చేట్టయితే తప్పకండా నీకు వచ్చి చెప్పాలని - కాని వాడి శవం అస్సాం భూముల ఏ తీరపు వక్షాన ముద్ర వేసిందో, మరి వాడి నెత్తిమీద మృత్యువు ముసుగువేసిందో—

ప్రతి తల్లికీ తన కొడుకు చావు బాధకు బాధంత బాధ వేస్తుంది. మరి. నాకు వాడొక్కడే గదా సంతానం. నా యే దురదృష్టం వల్లనో వాడు నా నుంచి లాక్కోపోబడ్డాడు. కాని, వాడి తుది ఉత్తరం చదివాక నాకేమని పిస్తున్నదంటే, నేను వాడి నెక్కడా పోగొట్టుకోలేదు. వాడింకా నా దగ్గరే కూచున్నట్టే వుంది. ఇంకా ముసిముసి నవ్వులు చిలుకుతూనే వున్నాడు—

అలా నవ్వుతూ నవ్వుతూ నా దగ్గరికి వచ్చి అంటున్నాడు. చూడూ అమ్మా. నీకు ఒక చక్కని బిడ్డని తెచ్చాను-'' ఇల్లా - వాడి ఉత్తరం చదివి మళ్లీ నాకు ఈరోజు అంతులేని బాధా సఖాల స్పర్శ కలుగుతోంది. ఏదైతే నేను నా కొడుకు పుట్టిన మొదటి గడియలో పడ్డానో !...చాలు. ఇంక నేను రాయలేను——'' 'నీ తల్లి అల్‌సి‌త్రా'.

పర్‌వేజ్ కూడా మంచం దగ్గరికి వంగి శ్యాంకు దగ్గరగా ఆ వుత్తరం చదువుతూ అన్నాడు. గొంతు నీళ్ళతో నిండిపోయింది. అలా ఆచి ఆచి చదువుతూ చదువుతూ అతని వ్రేళ్ళు కఠినంగా శ్యాం చేతిమీద పడ్డాయి. మరి అతని నోటినుంచీ అనుకోకుండా వచ్చింది. 'మోబీ' అని——

శ్యాం తన ముఖం పక్కకు తిప్పేసుకున్నాడు...కన్నీళ్ళు తుడుచుకుంటూ, వణికే తన చేతులతో ఆ తెల్లని అందాల పూలగుత్తులను బుగ్గల మీద నొక్కుకున్నాడు.

రాత్రంతా నీరవంగా నిశ్చలంగా ఉంది—పూలున్నూ మౌనముద్రలో ఉన్నాయి ! కాని, దూరాన ఎక్కడో--చాలాదూరంగా ఎక్కడో, బహుశా ఏదో బుల్‌బుల్ జీరవోయిన గళంతో ఎలుగెత్తుతోంది.........

---

# ఎ్రర నేల

రచయిత:
దేవేంద్ర సత్యార్థి
మూల కథ పేరు:
"లాల్ ధర్తీ"

ఏదో ఒకరంగు తెలియని చూపుల మోస్తరు మౌనంగా మొరబెట్టు కుంటున్నట్టుంటుంది. ఏదో ఓరంగు సాక్షాత్తూ సౌందర్యంగా మరేదో అంటూ అభినందిస్తోన్నట్టగుపిస్తుంది. ఏదో రంగు పెనగులాడుతూ మారాం జేసే అబ్బాయిని జ్ఞాపకం జేస్తుంది. మరెవరినైనా చూసి వారిమీద తన భావాన్ని కమ్మేస్తుంది !...

లారీ డ్రైవరు నదిని దాటుతూ అన్నాడు. ''మనం ఇప్పుడు ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రవేశిస్తున్నాం బాబుగారూ !''—నేను నాలుగు వేపులా పరుచుకుని వున్న ఎ్రరని నేలను చూస్తూ అన్నాను. ''ఆంధ్రప్రదేశపు ఎ్రరనేల ఏమనంటుంది ?''—కళ్ళు మూసుకుని నేను నా హృదయంలోకి తొంగి చూశాను. అక్కడ పచ్చనిరంగు రెపరెపలాడుతోంది. నా మెదడుతో ఈ రంగుయొక్క అర్థాన్ని తెల్సుకునేందుకు ఒత్తిడి అనవసరం అనుకున్నా. మరి కళ్ళు తెరిచి నేలను పరికించటం ప్రారంభించా. నిమ్మళ నిమ్మళంగా తెలుసుకున్నా. "ఈ రంగు చాలా బలకరమైంది. మరి నా రంగు ఈ రంగు ముందు నిలవలేదు."

డ్రైవరు ఏదో అర్థిస్తోన్న చూపులతో నావేపు చూశాడు. నా కిలా కన్పించాడు. ఎలాగైతే తాను ఎ్రరనినేల రహస్యం స్వయంగా దాని నాలుకతో విన్నలాగా ! ఆ రహస్యాలన్నీ దాచి వుంచటం మరిప్పుడు అతనికి చాలా బాధగా వుంది !... లారీ పరుగు తీస్తోనే వుంది. ఎ్రరని ధూళీ లేచి లేచి డ్రైవరు చెక్కిళ్ళమీద తన రంగుని కప్పేసింది. నేను నా బుగ్గలమీద చేతులతో తడుముకున్నాను. ఈ దుమ్ము అక్కడకూడా అద్దుకునే వుంది,

నా కనిపించింది. ముఖానికున్న మకిలమీద ఈ యెఱ్ఱనిరంగును కప్పేసు కుందేమోనని ! ముఖం ఎంతో వికారంగా లేదేమో !

మొదలు ఈ జిల్లా మొత్తం ఒరిస్సా, బీహార్లలో ఉండేది బాబు గారూ!"

"మరి యిప్పుడో !?"

"ఇప్పుడు పటం మారిపోయింది చాలా"

"నక్షా మారిందంటావా ?"

"అయ్యా అవును. ఎప్పటినుంచీ ఒరిస్సా వేరే ప్రదేశంగా మారిందో, ఈ జిల్లాలో తెలుగు మాట్లాడే వారి భాగం ఆంధ్ర ప్రదేశంలో కలిసి పోయింది."

"చాలా బాగుంది."

"ఏం బాగుంది బాబుగారూ. ఏం సంతోషంగా ఉన్నాం ! సర్కారు ఇప్పటిక్కూడా ఆంధ్రప్రదేశాన్ని ప్రత్యేక రాష్ట్రంగా ఒప్పుకోనేలేదాయె!"

"కాని, కాంగ్రెస్ ఎప్పుడో ఈ తీర్మానాన్ని ఆమోదించిందిగదా భాషా సిద్ధాంతంగా. ప్రతి పెద్దభాషకూ ఒక రాష్ట్రం ఉండాలి—ఎందుకంటే ప్రతి ప్రధాన భాషయొక్క సాహిత్యమూ, సంస్కారమూ సాకబడాలి— ప్రతి విధేయతా తమతమ పరిధుల్లో స్వాతంత్ర్యం పొంది చివురించాలి."

"అయ్యా అవును. కాంగ్రెసు అన్నమాట నిజమే. 'ఆంధ్రా'న్ని ప్రత్యేక ప్రదేశంగా ఏర్పరచాలి అని, కాని ప్రభుత్వం ఒప్పుకోటం లేదు గదా బాబుగారూ !"

"గవర్నమెంటు ఎందుకు అంగీకరించటం లేదు ? మద్రాసులోనైతే ఇప్పుడు కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడిందిగా, మరి దాని ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు చాలా గొప్పవ్యక్తి, వా రీ పని తప్పకుండా చెయ్యొచ్చునే !!"

"కాని, దీని ఆర్డరు లండన్‌నించీ రావాలిటగదా బాబుగారూ."

"లండన్ నుంచా ?!"

"అయ్యో అవును. కాని ఈ ఆర్డరు రాని తీరుకు మనం ఎంతో గొప్ప త్యాగం చెయ్యాల్సుంటుంది...మన నెత్తురును పారించటానికైనా వెనుదీయం!"

"రక్తం ధారపోస్తామా మనం! అసలే ఈ భూమి కేమన్నా ఎరుపు తక్కువగా ఉందనా!!"

డ్రైవరు ఒకసారి తిరిగి అర్థరహితమైనచూపులతో నావేపుచూశాడు- అతని కళ్ళలో ఏవో కొత్తరంగులు వంగి చూస్తోన్నాయి—అప్పుడతను కొత్తవాడిలా కన్పించాడు. భూమి ఎర్రగా వుంది. ఒక్కొక్కప్పుడు చిక్కని బాదామీరంగు గట్టిగా పట్టుకుంటుంది. మళ్ళీ కొంతదూరంలో ఇది సింధూరం అవుతుంది...అది వంగపండులా మారుతుంది అంతలోనే... ఎర్రని రంగు నన్ను గట్టిగా ఊపేస్తుంది...నా రక్తనాళికలలో ఎందుకో తీవ్రత హెచ్చింది! ఎన్నో పెద్దా చిన్నా, ఎత్తూ లోతూ - నేలలూ, పొదలూ, దాటుతూ లారీ విజయనగరానికి చేరువగా చేరుతోంది. దేవాలయాల పెద్దపెద్ద గోపురాలూ-శిఖరాలూ అల్లంతదూరంలో కనిపిస్తోన్నై. వేగమైన మా లారీ పరుగులో విజయనగరమే మాకేసి పరుగెడుతూ వస్తోన్నట్టు మా కనిపిస్తోంది. పైపెచ్చు మా లారీ నిశ్చలంగానూ నిశ్శబ్దంగానూ ఉన్నట్టు!"

పట్టణంలోకి అడుగుబెడుతూనే రోడ్డు అమ్మలాగామూడు వేపులకూ విడిపోతోంది. రెండు రోడ్ల కూడలిలో భీమారావు యిల్లుంది. డ్రైవరు అతన్ని తెలిసి ఉన్నవాడు. అత నింటిముందు నన్ను దింపేస్తూ, అదోలా స్నేహం చిమ్మేట్టు నాకేసి చూశాడు. "ఆంధ్రప్రదేశపు ఎర్రని నేల ఏమంటుంది?" అన్నాన్నేను—అతను నవ్వాడు. లారీ ముందుకు సాగిపోయింది.

నేను ఇంటిముందుకెళ్ళి కేక పెట్టాను. భీమారావు బయటికొచ్చాడు. ఆయన ఒక మధ్య వయస్సుగల మనిషి. ముఖంమీద ముత్యాలమ్మ సంతకం కనిపిస్తున్నది. స్ఫోటకపు ఆ పెద్దపెద్ద మచ్చలు ఆయనపూర్వ జీవితంలోకి ఆలోచనలు పంపిస్తోంటే నేను చాలా కష్టంగా ఆపుకోగలిగాను.

మా స్కూలులో ఇలాంటి హెడ్మాష్టరుగూడా పిల్లలమీద యిలా తన ప్రభావం వెయ్యలేకపొయ్యాడు.

పరిచయపు ఉత్తరాన్ని చదువుతూనే నన్ను లోపలికి తీసుకుపొయ్యాడు...

"మీరు చాలా మంచిపనిచేశారు. ఈ బీదవాడింటికి వచ్చారు. ఈ వుత్తరం గూడా అక్కర్లేదు !"

"ఆంధ్రదేశపు పెద్ద ప్రశస్తిని విని యుంటిని !" అని నేను నవ్వుతో అనేశాను.

"చాలానాళ్ళనుంచీ ఇక్కడికి రావాలనుకుంటున్నా !"...

"మీ రిక్కడ కొత్తవాడిలా ఉండక్కర్లేదు !— ఉత్సాహంగా ఉండండి !"

నాకు ప్రత్యేకంగా ఒక గది దొరికిపోయింది. నేలమీద ఎర్రని దుప్పటీ పరచివుంది. బరికాళ్ళతో నడవటంతో ఎప్పుడూ ఇలా ఫీలయ్యేవాణ్ణి. ఆంధ్రదేశపు ఎర్రని నేల నా పాదాలను ముద్దెట్టుకుంటుంది. లోపల తలుపు గడి బిగించి అప్పుడప్పుడూ దుప్పటిమీద వాలిపొయ్యేవాణ్ణి. కళ్ళు మూసుకుని ఆలోచన లోపలికి పోయి నా హృదయ స్పందనలని వింటోండేవాడిని. మంచి కార్యకలాపమూ ఉండేది. "ఎర్రనిరంగు ఏమంటుంది ?" తేపతేపా ఈ ప్రశ్న నాలుకచివరలదాకా వచ్చి ఆగిపొయ్యేది. కాని, పెదవులు కదలకండా వుండాలి—భీమారావు ఇంటిమీద మూడురంగుల జెండా రెపరెపలాడుతూ వుంది...పచ్చని, తెల్లని, ఎర్రని, ఈ త్రివర్ణాల ధ్వజము నా గుండెమీద ఆడుతున్నట్టుండేది. హృదయమేగదా మధ్యమధ్య ఈమాటంటూ వుండేది. "ఈ పతాకపు రక్తవర్ణము ఆంధ్రప్రదేశాన్ని బలిచేస్తుంది. మళ్ళీ ఈ ఆలోచన తట్టగానే నాకు అయోగ్యమైన ఆనందం వేసేది. ఎక్కడైతే తెల్లనిరంగు తరిగిపోయి ఎర్రనిరంగు మొదలయ్యేదో అక్కడే నా చూపులు నిల్చిపోయి, యువకుడైన ఆ లారీడ్రైవరుమాటల్ని నాచెవుల్లో

మారుమోత పెట్టేది! "ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశిస్తున్నాం బాబు గారూ!''

నా గదిలో చాలా కొద్దిపాటి ఫర్నిచరు ఉండేది. ఒకవేపు ఒక సింగారపు బల్లా పడేసి ఉంది. రెండు కుర్చీలూ, ఒక ముక్కాలిపీటా, మరోవేపు ఇంకో బల్లా ఉండేవి. ఆ పెద్దబల్లమీదే నా పడక జరుగుతూండేది. పగలు పక్కమీద తెల్లని ఖద్దరు దుప్పటీ, అలాంటివే రెండు దిండ్లూ—ఇక ఇప్పుడు ఆలోచన వచ్చేది. ఈ సింగారపు బల్లకున్న గుండ్రని అద్దం అక్కడ ఉండకనే పోతే తాను కొన్నివారాలు ఇలా ఇంత ఉత్సాహంగా ఉండేవాడినే గాదు! నా భావాల రంగు బాగా పండిన ఇటుకలమాదిరి ఎఱ్ఱగా ఎఱ్ఱగా నవ్వుతూ పొయ్యాయి! అదే రంగు నా ముఖం మీద గూడా అద్దకంలా అలుముకుపోతోంది. అందుకే నేను అద్దంతో విడబడతాను!

19819

నా గదికి ఎడమవేపు కిటికీ మైదానంకేసి విప్పుకుండేది. అక్కడి పచ్చని పచ్చిక కదుల్తూన్నట్టు కమ్మగా కనిపిస్తోండేది. నీళ్ళు లేకనేపోతే ఈ పచ్చిగడ్డి పండిపొయ్యేది. ఎఱ్ఱనయ్యేదిగాదు—

పొద్దెక్కిపొయ్యేది. మరి ఎంతకూ తెలిసేదే గాదు! పొద్దు గుంకినా అదెల్లా జరిగిందో తెలిసేదేగాదు! విజయనగరం నాకు కొత్తది - నేను దానికి కొత్తవాణ్ణి! ప్రతి చూపులోనూ ఏదో ఒక శతాబ్దాల పేరుకుపోయిన రంగు లేచి నిల్చున్నట్టుండేది. ఇంత క్రితం ఎప్పుడూ గత, ప్రస్తుతాల కౌగిళ్ళు కౌగిలించుకుంటూ చూడలేదు. రాత్రి కాస్తా గడిచిపోయిందంటే, చిమచిమలాడుతోన్న సూర్యుణ్ణి తిలకంగా తీర్చుకుని వచ్చేసేది. దాన్ని చూసి నాకు కృష్ణవేణి నుదురుమీది తిలకం తీర్పు గుర్తుకొచ్చేది. వెనక నుంచీ వచ్చి కృష్ణవేణి నా కళ్ళు మూసేసేది. తిరిగి పగలబడి నవ్వేది. ఇంకా నవ్వుతూనే వెంటనే నా చూపులు ఆమె అర్ధ చంద్రునివంటి నుదురు మీద గంతెట్టేవి. ఎఱ్ఱని కుంకుమ బొట్టు. ఒక కాండిలు బదులు యాభై కాండిల్సు కరెంటు లైటైపై అది నొసలును వెలిగిస్తోన్నట్టు కనిపించేది—

ప్రయత్నించగా కూడా నేనెప్పుడూ ఇలాంటి పరిస్థితిగా చూడలేదు. స్నానం చేసేప్పుడు ఈ తిలకం కడిగివేయబడ్డప్పుడు మాత్రమే మళ్ళీ నేనీ ప్రయత్నం మానుకున్నాను. బాలు. నిజమే – అవును ఈ దీపం ఎప్పుడూ వెల గాలి ఉదయమే కానియ్యి రాత్రేగానీ! కుంకుమ ఎర్రని చుక్క!......

అన్నపూర్ణా, కృష్ణవేణీ ఇద్దరూ అక్కా చెల్లెళ్ళు. వేణి పూర్ణకన్నా రెండేళ్ళు చిన్న. ఇద్దరూ ఇంటిలోనే చదువుకుంటోండేవారు. అక్క సంగీతపు ప్రథమ సోపానా లధిగమించి దాని లోతుల్లోకి దూసుకుపోయింది. చెల్లెలు అక్క వీణ మటుకు చూసి వదిలేది. ఆమె పాటను వింటోండేది. ఎప్పుడైనా యీ సంగీతం ఆమె నిదురించిన మానసికత్వాలమీద రంగులు రేపితే కాద్దోగాప్పో తాను కూడా పాడుకుంటోండేది – లేకపోతే ఎవరు వేణి? ఎవరు పూర్ణ! ఆమె తన పుస్తకాలలో చుట్టుకునుండేది. భీమారావు తన బిడ్డల గొప్పలు నాముందు గూడా చెప్పుతూ కూచేండేవాడు. వారిద్దరి ఎర్రని బొట్టూ నా హృదయంలో ఈదులాడేది. ఎందుకో నాకు తోచేది కిళ్ళీ వేసుకున్న నా నోరు కూడా అలానే బాగా ఎర్రబారింది. నా కాంక్షలు పచ్చి వక్కల సన్న సన్నని ముక్కలుగా తయారై కిళ్ళీ నమిలేప్పుడు పళ్ళల్లోని సందుల్లోనించీ చిగుళ్ళదాకా దూసుకుని పోయినట్టు——

"ఇతను మనవాడేకదా, కూచో" భీమారావు అనేవాడు.

"ఇతనితో బాగా మాట్లాడండి, ఇతని కథలు వినండి, దేశదేశాల నీళ్ళనీ త్రాగా డితను"——

"అవును దేశదేశాల" నన్ను గురించిన గొప్పలు విని నా ప్రతి రోమానికీ చెవులు వచ్చేవి! ఒక విచిత్రమైన అనుభూతి నాకు గుండెల్లో కదిలేది. నా మేధస్సులో చక్కిలిగింతలు పెట్టినలాగుండేది. నేను ఆంధ్ర ప్రదేశపు ఎర్రని నేల గాఢాలింగనంలో ఉన్నాను. ఒక అభ్యుదయ వాంఛిత ప్రదేశంలో——

"ఈ కృష్ణవేణైతే నా చిన్నారి ముద్దుల ఉడుత! రావుగారూ... ఒకనాడు నేను అక్కచెల్లెళ్ళిద్దరూ ఉండగా అన్నాను...మరీ మాట ఎంతో బాగుందిగూడా గదూ!!"

"చాలా బాగుంది. అటు ఇటో, ఇటు అటో, నెచ్చెలైతే కూచోనే లేదు. ఉడుతేగదా!..."

కృష్ణవేణి నవ్వలేదు. చివరకు తనలో ఉడుత మాటేముంది! బహుశా మా అభిమాన ఆతిథేయుల దేశంలో పెళ్ళిగాని కన్యలు ఉండరేమో! సిగ్గును అతుక్కునుంటారేమో! కాని దేశదేశానికీ - భూమి భూమికీ భేదముంటుందిగదా!

భీమారావు అన్నాడు. "ఇది ఆంధ్ర దేశం"

అన్నపూర్ణ అతని మాటని అధిగమిస్తూ అన్నది. "మరిక్కడి పిల్లలు స్వతంత్ర గీతాలుగా మారిపొయ్యారు."

కృష్ణవేణి కళ్ళలో ఒక మెరుపు విరిసి అన్నది "అవును స్వతంత్ర గీతాలు" - అప్పుడు నేను తెలుసుకున్నానుగదా, దాదాపు కృష్ణవేణి తప్పకుండా ఒక స్వతంత్ర గీతమే! సముద్రపు అలల పొంగు గానీ - చెలియలి కట్టల అడ్డంకి గానీ ఏమీ లేదు - అన్నపూర్ణ తన భుజాలను కృష్ణవేణి భుజాలతో రాస్తూ అన్నది. "వేణీ పోదాం పద! ఇవ్వాళ శశిరీ దగ్గరికి వెళ్దాం. నిన్న ఇటుకేసైతే వచ్చింది. ఇవ్వాళ ఆవిడ అసలు అవుపడనే లేదు." - కృష్ణవేణి చిన్నగా అందంగా తల కదిలించింది అంగీకారంగా, విసనకర్ర చివరిని దుప్పటిమీద అటూ ఇటూ రాస్తూ అంది. "అన్నపూర్ణా, నేను బైటికి రాలే నివ్వాళ!"

"ఏం బైటికెందుకు రాలేవుట?" గాభరాగా అడిగింది అన్నపూర్ణ.

వేణి జవాబైతే ఏమీ ఇయ్యలేదు. ఆమె పూర్ణ మెళ్లో చేతులువేసి అన్నది. "అక్కయ్యా——" ఆ తర్వాత అక్క చెల్లెలితో ఏదో అన్నది. పూర్ణ ఉత్సాహంతో ఒక్క గంతేసి 'నిజం' అన్నది.

వేణి అవునన్నట్టు తలూపింది. నేనేమీ అర్థం చేసుకోలేకపోయా. నా హృదయం గాయపడ్డ పక్షిలాగా టపటపా కొట్టుకోంటోంది. వేణి లేచి నుంచుంది-స్నానాల గదికేసి వెళ్ళింది. పూర్ణ చప్పట్లు కొట్టింది నవ్వుతూ కిలకిలా. వెంటనే గడియారంకేసి చూసింది. అప్పుడు ఉదయం '10' గంట లైంది. ఆమె గూడా తన గదిలోకే నేమో పోయింది......వంట గది గుమ్మంలో వెళ్ళి నుంచుంది. అక్కడ తల్లి వంటగది తుడుస్తోంది.

"అమ్మా" అన్నది అన్నపూర్ణ.

తల్లి తలెత్తి చూసింది. అన్నపూర్ణ ఆమెకు దగ్గరగా పోయి వంగి ఆమె చెవిలో ఏదో చెప్పింది. అమ్మ ముఖం రెండింతలుగా తెరుచుకుని అలానే నిల్చుండిపోయింది. ఆమె చెంపలమీద పల్చని ఎర్రని చారలు వచ్చాయి!—కొంచెంసేపట్లో ఒక చిరునవ్వు ఆమె వెడలుపాటి బల్లలాంటి ముఖంమీద నాట్యం చేస్తూ మెరిసింది. తల్లి ముందర వేసుకున్న కత్తిపీటా కూరగాయలూ పక్కగా పెట్టి లేచి నుంచుంది.

"పంతులుగారూ—"

నాకైతే, చూడగా ఇవన్నీ గూడా మొదటికంటే ఎక్కువగానే ఉన్నాయి. నా భావనలో భీమారావు ఆమెకన్నా మిక్కిలీ వయస్సుగల వాడిలా కనిపిస్తాడు. ఆయన లేచి భార్య దగ్గరికి పోయాడు. నాకు రైలు బండిలో కూచున్నట్టు తోచింది అది ధణధణ లాడుతూ ఒక గుహలోనించి పోతోన్నట్టూ అనిపించింది. చిక్కచీకటి చిలుం పట్టినట్టు పట్టింది. ఎవరివో స్త్రీల మాటలు కావచ్చు-ఇలా ఆలోచనతో తిరుగుతోండగా నేను గుహను దాటేశాను—

కృష్ణవేణి మొదణ్ణించీ ఎప్పుడూ పచ్చని రంగు బట్టలు ధరించేది కాదు—బాగా చిక్కని పచ్చనిరంగు పావడా, లేత పచ్చరంగు జాకెట్టూ వేసుకుంది - ఆమె కళ్ళలో కూడా నీలిరంగు నీడలు పడుతున్నాయి. ఈ రంగు ఏమంటుంది? ఈ ప్రశ్న నే నామెతో తప్పనిసరిగా వేయాలి. ఆమె నెత్తురులో ఎవరో బంగారం కరిగి పోసినలా వుంది. అది బంగారమేగదా!

ఆమె చెక్కిలమీద ఏదైతే మెరిసిపోతోందో ఆ బంగారం రంగు ఏమంటుంది ?—కోరిక ఏముంది ? పూర్తిగా, సంపూర్తిగా పచ్చని కొమ్మలా వుంది ! ఆమెను కొల్లగొట్టటానికి ఎవడికి దమ్ములున్నై నిజానికి ! ఒక్క శిరోజాన్నన్నా కదపటానికి వీల్లేదన్నట్టుగా తలకట్టు అలంకారపు పట్టుగా వయసుతోపాటు చకచకా పాకిపోతున్నది. ముక్కుకు సూటీగా, తిన్నగా నడిం పాపిడి తీయటం అన్నపూర్ణకు నఖశిఖా పర్యంతమూ అయిష్టంగా ఉండేది. కాని, కృష్ణవేణి చక్కని పాపిడి అన్నపూర్ణ పక్క పాపిడికన్నా అందంగా అవుపించేది ! ఇప్పుడిద్దరు అక్క చెల్లెళ్ళూ నా పక్కన సరసగా కూచుని ఉంటే నా ఓటు చెల్లెలికే ఇచ్చేవాణ్ణి !!

ఓ గంట పిదప పూర్తిగా. 11 గంటలయ్యాక లోపలినుంచీ వీణా శ్రుతులు వినిపించాయి. ప్రత్యేకంగా అన్నపూర్ణ వీణ అయినట్టయితే ఈ రంగులు కూడేవి గావు. తెలుస్తోనే వుందిగదా ! వీధిలోని వీణ వాయించే పిల్లలందరు శ్రుతిలో శ్రుతి గలిపి ఏదో ఒక రాగం దిద్దుతున్నలాగున్నారు. ఇది ఏమి సంతోషమో !!...

చాలామంది ఆడాళ్లూ - పిల్లలూ, వారి కేరింతలూ, ఎగతాళులూ, సంతోషాలూ, వెటకారాలూ, గాలిని చీలుస్తోన్నాయి ! అసలు ఏ విందును గురించి పిల్చారు వీరందర్నీ ? నేను ఉండలేకపోయా ! ఎడమవేపు కిటికీ తెర కొంచెం ఒత్తిగించి వాకిలివేపు నేను చూసేసరికి, ఏమి చూశాను నేను! ఎదురుగుండా ఉన్న గదిలో కృష్ణవేణి వాయిలు చీర కట్టుకుని కూచునుంది. మంగళహారతుల పట్టి, పాడుతున్నారు. పళ్లెంలో కుంకుమ కన్పిస్తోంది. కాని, దానిలో దీపం వెలిగించబడి లేదు. వేణి కళ్ళు వాల్చి వుంది. ఏం ఇంత సిగ్గెందుకో ! ఇదేమన్నా దేవత అయి కూర్చుండే ఉపాయమేమో !!

కృష్ణవేణి తల్లికి అభినందనలు దొంతర్లు కడుతున్నాయి. అన్నపూర్ణ వీణ అన్నిటికంటే మిన్నగా మెరుస్తోంది. రంగు రంగుల చీరలు నా హృదయంలో తప్పు ఒప్పు ఆలోచనల్ని ఆహ్వానిస్తున్నాయి. అప్పుడే ఒక అమ్మాయి ఏడిచింది. ఆమెకో అరిటిపండిచ్చారు. మరో చిన్ని

అమ్మాయి తన బుడ్డి తమ్ముడికి నోట్లో బెల్లం నువ్వుల లడ్డూలు కుక్కుతోంది. పిల్లాడు ఎగిరి దూకి వుండ మొత్తం మొత్తం గుంజేసుకున్నాడు. మరేం పర్వాలేదు. లడ్డూలకేం కొదువుంది బాబు సంతోషంగా ఆడుకోవాలి! చిరంజీవిగా వుండాలి...నా స్వభావపు సంపూర్ణ కోణంలో ఎవరో తానే-సేనే మేలుకున్నాడు. అతనిని అన్నపూర్ణ తన సంగీత తరంగాల పైపైన ఆసీనుణ్ణి చేసింది. ఇది ఎలాంటి పాట! బహుశా ఇది పాలూ, తేనే, పంచదారా, కలిపి చిలికిన సంగీతమేమో! పాలు తీసేప్పుడు ఏ ధ్వనైతే వస్తుందో అదే మాదిరి సుశబ్దం అన్నపూర్ణ వీణమీద మోగుతోంది—

"ఇప్పుడు నీవు పాడూ శశిరీ"

"నీకన్నా మెరుగ్గా అయితే పాళ్లేను పూర్ణా! సరే చెప్పు ఏ పాట పాడమంటావో!...

"అదే!—అవ్వాళ నీవు పాడావుచూడూ, ఎప్పుడంటావ్, నేను వేణీ మోస్తరుగా పలాచని చీరకట్టుకున్నానే!...మరీచూడు. ఇదేరంగులో, ఈ వాకిట్లోనే, అచ్చివచ్చే వాకిలిలో!... ఆ నాడూ ఇలాగే పేరంటాళ్లూ—పిల్లలూ గుమికూడుతున్నారు...అదే తేనెటీగలు! అదే సంగీతం!!..."

శశిరి పాట మొదలెట్టింది—ఆంధ్రప్రదేశపు తేనెటీగలు ఏమంటోన్నయ్! ఈ ప్రశ్న నా హృదయ కోణకోణాలలో అన్నిమూలలా కట్టుబడింది. వీణారావంమెట్టుపైమెట్టెక్కుతూపోయింది. ఇదంత తేలికపాటేమీ గాదు. శతాబ్దాలనాటి స్త్రీత్వం ఒదిగిన ఉద్వేగం మెరుస్తూ విరుస్తూ ఉంది. అప్పుడు సూర్యుడు నెత్తిమీది కొచ్చాడు సరిగ్గా—ప్రతి స్త్రీ, ప్రతి పసిబిడ్డా ఫాలతలాలు యెర్రని కుంకుమ బొట్లతో మధ్యాహ్నంలాగా వెలిగిపోతున్నై! కృష్ణవేణి కనురెప్పలు పైకి ఎత్తనే లేదు. ఇది అమ్మాయేనా! ఎవరైతే ఇప్పటిదాకా తన చిలిపి చిందులు మరిచిపోలేదో—ఆమెచూపులు సిగ్గుతను మలచుకున్నాయి. ఆమె చేష్టలు నిశ్చలంగా ఉన్నాయి. లజ్జా - కన్యాత్వమూ ఎప్పుడూ మొదట ఏ సోదరీమణుల రూపాలలోనూ కనిపించ

లేదా ఆమెకు ?...కాని, ఆమె ఒక్క పావుర మైతే కాదుగదా మొదటిమాటు గుడ్లను పొదిగేందుకు తారసిల్లటానికి !

గలభా, నవ్వులూ, వెక్కిరింపులూ, చిన్నచిన్నగా నెట్టివేయబడుతూ నిశ్శబ్దత ఆవరించుకుంటోంది, సంగీతంగూడా తృప్తిగా పాడారు. వీణా తంత్రులున్నూ చాలా అలసిపోయ్యాయి. కృష్ణవేణి తల్లీ అక్కా కుంకుమ పళ్లాలు ఎత్తి ఎత్తి ప్రతి పరుచుకున్న నుదురుమీదా కొత్తబొట్టునుంచారు. కొబ్బరిచిప్పలూ—అరిటిపళ్లూ పంచిపెట్టారు అందరికీ. చిలకలూ గోరింకలూ కలిసి మాట్లాడుకున్నట్టు ఏమేమో మాట్లాడుకున్నారు అందరితోనూ అందరూ ! వందలేండ్లనుండీ ఇలానే చేస్తూ వస్తూన్నారులాగుంది వీరు !... ఎందుకూ ఏమీలేకపోయినా కాలికి పచ్చని పసుపూ, మొఖానికి ఎర్రని కుంకుమ బొట్టూ, లెక్కలేనన్ని తరాలుగానిలిచేవున్నై. మంగళకరమైన ఈ కుంకుమ రంగు ఎప్పటికీ పేలిపోవటానిగ్గానీ, మారిపోవటానిగ్గానీ అవకాశాన్నే ఇయ్యదు !!

రెండోరోజు ఈ సమావేశం సాయంత్రం జరిగింది. అలాగే మూడో నాడుగూడా—నాలుగోనాడు సాయంత్రానికి బదులు ఉదయాన్నే ఈ వెలుగు కమ్మింది. ఆ అద్దంలో నా అంతట నేను తెల్సుకున్నానుగదాంటే, ఇంతకూ కృష్ణవేణి ప్రథమ రజోవతి అయింది అని ! నాకు విచిత్రం అయితే అనిపించింది. ఎంచేతంటే ఇంతకుముందు గూడా భారతదేశంలో నేను ఇల్లాంటి ఏ వినోదమూ చూసి ఉండలేదు !

భీమారావు మాటల్లో బరువు కప్పుకున్న రంగులు పుట్టుకొచ్చాయి, అన్నాడు.

"అబద్దాల సిగ్గులో ఆంధ్రప్రదేశం ఏ విశ్వాసాన్నీ ఉంచలేదు. నిజం అంటున్నాను. నాకు విచిత్రంగా ఉంది ఇది విని ! మీదగ్గర ఇలాంటి వినోదాలేవీ చెయ్యబడవనుకుంటా !"

"అవునండీ—విచిత్రపడాల్సిన విషయమే !" నేను సాగదీస్తూ అన్నాను.

''ఎంత భేదం నేల భాగభాగానికీ !!''

''అవును. ఇది తెలుస్తూనే వుందిగదూ''

''రజస్వలా కావటంతోటే కన్యకు భగవదాశీర్వాదం లభిస్తుంది''

''మీ నిశ్చితాభిప్రాయం నిజమే రావుగారూ. మరి ఇలాటి సమయాల్లో సంతోషం అనుభవించటానికి భయపడగూడదు.''

"మా, యీ పాటలు మీకెలా అనిపిస్తాయి ?"

"ఈ పాటలన్నీ, వీణా ప్రతిశ్రుతి, మీ ఆంధ్రుల కళా సంస్కారాన్ని తెలుపుతోంటాయి !''

"ఆంధ్రుల సంస్కృతా! మా, యీ ఆచారం చాలా ప్రాచీనమైంది"

"నిజమే పురాతనమే కావచ్చు''

"మొదటిరోజు ఎప్పుడైతే కన్యకు తాను రజస్వలా అయినట్టు తెలుస్తుందో ఆమె ఏదోరకంగా తొందరగా తల్లికి ఈ సంగతి అందిస్తుంది—మూడు రోజులదాకా ఆమెకు పసుపూ నీళ్ళలో, పసుపు రంగులో ముంచి ఆరవేసిన చీరను కట్టబెట్టి, ప్రత్యేకంగా ఓ గదిలో పచ్చి తాటాకులు పరిచి దానిమీద కూచోబెడతారు. ఆమెను బైటికెటూ పోనియ్యరు. ఆమెకు మంగళారతి కూడా దూరంనించే ఇస్తారు...''

"హారతి పళ్లెంలో మూవైపు వెలుగుతోన్న దీపం పెడతాం, నాలుగు వైపులా దీపాలు వెలిగించే కుందిలేకున్నా పర్వాలేదు. దీపం మాత్రం తప్పకుండా వుండాలని అనుకుంటారు...కాని, మీ...మీ వైపు...''

''తేడా అయితే ఉండనే వుంటుంది ప్రాంత ప్రాంతానికీ''

"మీ ప్రాంతంలో ఒక్క కుంకుమే అవసరంగా భావిస్తారు మంగళారతికి, యెర్రని కుంకుమ"

"కుంకుమ ఎప్పుడూ, ఎక్కడా ఎర్రగానే వుంటుంది"

నేను నవ్వి నేలకూసిచూశాను. భీమారావు మాట్లాడుతూనే వున్నాడు. "తిండి విషయంలో గూడా రజస్వలికి బాగా పథ్య పానాలు చెయ్యాల్సుంటుంది. ఎర్రని కారం, ఆవపోపులూ. ఆమెకు నిషేధం. ఏ పనీ

చెయ్యనియ్యకుండా అలా కూచోబెట్టి ఆమెకు పోణి బియ్యం, పాలూ, ఏవైనా పండ్లూ ఫలాలూ యిస్తారు. బాగా తినాలి. ఇంకా బాగా విశ్రాంతి తీసుకోవాలి. ఇది చాలా ముఖ్యం''

"మూన్నాళ్ళ తరువాత ఏం జేస్తారు?" నేను సాగి అడిగాను.

"కన్య శుద్ధి స్నానంజేసి పవిత్ర అవుతుంది. ఆమె మొదటి చీర చాకలికి బహుమానంగా ఇస్తారు. అప్పుడామె తలిదండ్రుల పరిస్థితికి తగిన బట్టలు తట్టుకు కూచుంటుంది. అది నాలుగో హారతి - చివరి హారతి. ఆ హారతి పట్టి దింపేప్పుడు కుంకుమ బొట్టు పెడతారు''

"బొట్టుకు కుంకుమ లేకపోతే ఆంధ్ర దేశపు పనులే ఏమీ నడవ నట్టున్నాయి! ఏం రావుగారూ?''

"కుంకుమ—అదైతే తప్పకండా కావాలి''

"దానికన్నా బాగు ఈ మాటంటే! ఆంధ్ర దేశం అన్నా కుంకుమ అన్నా రెండు మాటలకూ ఒకటే అర్థం!''

"చాలు. ఇంత త్వరలోనే ఇప్పుడు మీరు నిజమైన మాట తెల్సుకో గల్గారు''

"నా దృష్టి ఎప్పుడూ, ప్రథమంనించీ పచ్చని రంగు మీదే నిల్చి పోయింది రావ్‌గారూ''

"పచ్చని రంగుకేశా!! కాని ఎర్రని రంగు అదో చిత్రమైన భావాన్ని కలిగిస్తుంది. కుంకుమరేఖ ఆదేశాన్ని ఆంధ్రదేశం తొలినాటి నుంచీ వింటూనే వచ్చింది''

''రావుగారూ'' రంగులను నేను బాగా పరికించి ఉంచాను. పచ్చని రంగు తన చోటనే వుంది. అది శాంతికి చిహ్నంగా ఉన్న రంగు. ప్రతీ పచ్చని వస్తువూ, శాంతీ - విశ్రాంతీ - ప్రశాంతులకు ప్రతీక. వాటినే చూపుతుంది. సృష్టికి బహుశా అదే బాగా అన్నిటికన్నా మిన్నగా ఇష్ట మేమో! ఎప్పటిదాకా నైతే భూమి ఎడారిగాదో అప్పటిదాకా దాని అంత రాళాలలోనుండీ ఆ రంగు కార్యకలాపాలు ఎప్పుడూ మన దృష్టిని తనకేసి

లాగుతూనే ఉంటుంది. కాంగ్రెస్ ఒక మంచి పనే చేసింది. తన పతాకం రంగు కోసం దానికి చోటు ఇచ్చే ప్రదేశాన్ని ఇవ్వటంలో తక్కువగా ఏమీ గౌరవించలేదు - తెల్లని రంగు నా దృష్టిలో పవిత్రతకు చిహ్నం. మన జెండా పైన అప్పుడే ఈ రంగు ఉండటానికి అవకాశం - మరి ఎరుపురంగు నా భావంలో ఇది నెత్తురుకు గుర్తు. మంచి ఆరోగ్యవంతమైనది నెత్తురు రంగు, అది తాజా అయిన, బలకరమైన జీవితపు రంగు- పసుపూ, తెలుపూ, ఎరుపూ, బలేరంగులు ఎన్నుకుంది కాంగ్రెస్, ఈ పతాక నిర్మాణ భారం ఆంధ్రదేశానికే కైవసం చేసేట్లయితే జెండా మొత్తం కుంకుమే కుంకుమ పాకిపొయ్యేదనుకుంటా !''

"కాని ఇది బాగా జ్ఞాపకం ఉంచుకోవాలి. ఎర్ర రంగు అర్థం తెల్సుకోవటంలో ఆంధ్ర దేశం ఎంతో ముందడుగేసింది..."

''కాంగ్రెస్ ఎడమ చేతిలో ఇటు ఏదైతే బలంగా పట్టుకుందో అదీ కూడా తెలుస్తోనే వుంది. వెనకటిరోజుల్లో - నాడు సుభాస్‌బాబు కాంగ్రెస్ అధ్యక్షుడిగా ఎన్నికకు రెండోసారి నిల్చాడో అప్పుడు ఆంధ్ర దేశపు ఓట్లు ఎక్కువ మోతాదులో ఆయనకే దొరికాయి. ఆయన కెదురుగా ఆంధ్రుడు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు నిలబడ్డప్పటికీ ! పట్టాభిగారు ఆంధ్ర దేశీయుడు - మనవాడు. కాని మీకు తెలుసు ఈ మాటల్లో విలువ ఎంత ఉందో ! సోషలిజం - భారతదేశం స్వాతంత్ర్యం - ఈ రెండూ మన నిశ్చయమైన ఆదర్శాలు. మరి, ఆంధ్ర దేశానికి ప్రత్యేక ప్రదేశ ప్రతిపత్తికి అవకాశం లభించాలి. దీనికోసం మా ప్రాణాలను సైతం ఒడ్డడానికి మేము సిద్ధంగా ఉన్నాం.''

''పంతులుగారూ'' బయటినుంచీ ఎవరో కేకవేశారు. భీమారావులేచి బయటికిపొయ్యాడు. నేను కిటికీలోనించీ ఆయన్ను చూస్తోనే ఉన్నాను. నా కెందుకో ఇలా అనిపించింది. ఏదో అదృశ్య హస్తం నా ఫాలభాగం మీద కుంకుమ తీరుస్తోన్నట్టు - నేను వెంటనే అక్కడినుంచీ తొలిగాను గది తలుపుల్ను బిగించేసి కుడివేపు కిటికీ తెరల్ని చిన్నచిన్నగా జరిపి.

జరపనట్టు ఒక మూలకు ఒత్తిగించాను. ఎట్ట ఎదురుగా ఒక అపూర్వ రమణీయమైన సన్నివేశ దర్శనం. కృష్ణవేణి పాముకూసమంత పల్చని నీలం జాకెట్టుతో, ముదురు నీలపు చీరతోనూ, కొత్తగా ఎత్తిన శిఖరాల్లాగ వక్షోజాలు ముందుకు వస్తోన్నాయి, ముందుకు ముందుకే కనిపిస్తోన్నాయి. ధైర్యం చూడలేకపోతున్నాగానీ సాక్షాత్తూ నగ్నసుందరివలెనే ఉంది— నా భావావధిలో మిగిలిపోయిన పచ్చనిరంగు ఈ రమ్యవర్ణంలో తలదాచు కున్నట్టు స్పష్టంగా తోచింది—

బైటనించీ బంధువుల తల లవుపిస్తున్నాయి-

అన్నపూర్ణ ఒళ్ళో వీణ పెట్టుకుని ప్రియుణ్ణి లాలిస్తోన్నట్టు మల హరి రాగాలాపన మొదలెట్టింది. ఆమె వేళ్ళు మహా తేలికగా కదులు తోన్నాయి వీణ తీగలమీద తీగల్లాగా. మనస్సే కదిలి పైకి లేస్తోంది. గాని, ఈ రాగానిక్కూడా కృష్ణవేణి కనుదమ్ములు కదలనేలేదు. పూర్ణ ఆకాశంకేసి చూస్తోంది. వేణి నేలను చూస్తోంది అలాగే కళ్ళువంచి ;— తమ విప్లవ హస్తాలతో ఎవరో ఆమెను చుట్టేసినట్టుంది. ప్రతి సమర్త పడుచూ ఇలానే కుంచుకుపోయి, ఇంత ఉదాసీనంగా కూచోలేదేమో !.... తేలిక నీలపురంగు - చిక్కని నీలపురంగు - ముసుగులేని తలా.... బైటి నుంచీ మనస్సుకు తాకే నచ్చిన చల్లని పవనాలు...

చాలా నేపు అలా గడిచింది. ఈమెకు పేరు కృష్ణవేణిగాని, నిజానికి లజ్జావేణి !- అన్నపూర్ణ అననే అన్నది. "నేనూ నీలాగే రజోవతినైనాను. ఇలా మకురుతనం ఎరగను వేణీ ! మొదటిరోజు ఎలా గడిపానో, ఎంత అదుముకున్నా పెదవులమీదికెక్కివచ్చే నవ్వును అదుపులో పెట్టటంమానేశా. నీవేమన్నా అను. పైనా, కిందా, కుడీ, ఎడమా, అంతటా తల కదప కుండానే చూసేదాన్ని ! ఎందుకంటావా ! అందాన్నీ అవసరాన్నీ చూడ కండా ఆగలేము" నేను ఎప్పుడూ ఎవర్నీ బాధించేదాన్నిగాదు"—కృష్ణ వేణి ముఖంలోనూ అదే ఉత్సాహం దొంగదొంగగా ఎగబాకింది ! .. తల్లి గబగబా ముందరికి వచ్చి, ఎర్ర పళ్లెం ఎత్తి ఆమె అందాల నొష్టన బొట్టు

పెట్టింది - ఇప్పుడిక కృష్ణ చిన్నపిల్ల గాదు, పెద్దమనిషి. అందుకేనేమో తెలుగువారు రజస్వలా అయినపిల్లను పెద్దమనిషి అయిందంటారు!!— అనుకోకుండాసుమండీ, ఎందుకో, ప్రతి ముఖంకేసీ ఆమె కళ్ళు అభరణాల పెట్టె మూత తెరిచినట్టు లేచేవి! ఆ నల్లని కొలనులలో ఎన్ని అలలు దరికి తాకి వెనక్కుపోతాయో ఎవరికి తెలుసు!!...

మంచిగంధపు వాసనా, రంగూ, కృష్ణవేణి జబ్బలు, వాటినిచూసేమో తాజాగా అప్పుడే ఆవిర్భవిస్తోన్న యౌవనంమీద అనుమానాలు వేసేవి! లేచి నుంచుని అందరికీ నమస్కారాలు పెట్టింది ఆమె—

అందరు స్త్రీలూ, పిల్లలందరూ, అంతా నవ్వారు. వారందరి ఎర్రని కుంకుమబొట్లమీదా మళ్లా పేరంటం కుంకుమపెట్టారు. ఏమో అంటున్న ట్టున్నారు. తెలియదు. ప్రతికంటికీ కజ్జలరేఖలున్నాయి. తాంబూలాలిచ్చారు. అందరికీ పచ్చని తమలపాకులు. తమ హృదయంలో రక్తిమను దాచుకొనే ఉన్నారు. అరటిపళ్ళూ కొబ్బరి బొండాలూ పెద్దలకూ, అచ్చం అరటిపండు పిల్లలకూ పంచిపెట్టారు...సువాసినులు దీవెనలు చేసి లేచారు. వారి ఆ కద లికలలో చెక్కిళ్లూ, కళ్లూ పాలిళ్లూ ఏ చిత్రకారుడు వీరిని కనీసం రేఖగా నన్నా గీయగలుగుతాడు!!...ఎవడో వాడు భూమిదేవి ప్రతి ఆడబిడ్డనూ సరిగ్గా, వేళ దప్పకుండా రజస్వలిని చేసేది!!!...... ఇదైతే తప్పనిసరి. అంతూ పంతూలేని ఏళ్ళనించీ పసుపూ తెలుపూ ఎరుపూ వందలూ వేలేం డ్లుగా ఇదే జరుగుతోవస్తోంది—ముత్తైదువలంతా వెళ్ళిపోయారు. కన్నె లందరూ గడిబిడగా వారివారిండ్లకు పరుగెత్తారు—ఇప్పుడు కృష్ణా, అన్నా, మాత్రమే మిగిలిపొయ్యారు. తల్లీ వంటింట్లోకి పోయింది—

"సరే పూర్ణా. ఒకమాట చెప్పగల్తావా?"

"అడుగు అడుగు"

"రజస్వలఅయ్యాక మరేమంత బలహీనతగా లేదుకదూ!? ఎంచేత!"

"ఎందుకు??"

"కాదమ్మా చెల్లీ. ప్రపంచంలో మొదట్నించీ ఇలాగే జరుగుతూ వచ్చింది. నేనేమంత బలహీనురాలినయ్యాను ?....కాకపోగా రంగు విప్పు కుంటుందిగూడా దీనివల్ల....తర్వాత...ప్రతినెలా.. "

"ప్రతినెలా !?"—

నిశ్శబ్దం—

"వేణీ ఎవరైనా వినిపోతారు !!"

అలా కొంచెం ఆగి అప్ప చెల్లెళ్ళిద్దరూ లేచి లోపలికి పొయ్యారు. నేను నా ఎర్రనిదుప్పటిమీద పడుకున్నాను. నా గుండె లోతులనుంచీ పెకిలి పెకిలి ఒక భావం పైకి పడగెత్తింది. బైటినుంచి వచ్చే ప్రతి గాలితాకిడికీ అది అభిముఖంగా ఉంది ! నా భావాకాశంలో కాంగ్రెస్ పతాక రెపరెప లాడుతోంది. మువ్వన్నెలతోనూ - ఈ జెండా ఈడు ఏమంత పెద్దదైతే కాదు. గాని, ఈ రంగులు అతి పురాతనాలే ! హిమాలయాల వయసంత వయసుగల రంగు - గంగా, బ్రహ్మపుత్రా, గోదావరులతో సమానమైన వయసుగలది గామాలు ఈ రంగు! వాటి స్వభావాలున్నూ అంతవేగదా!... కాని నేను ఈ రంగుల ఇంగితాలమీద బొంగరాన్ని !....ఏదైతే, భారత దేశం ఈ వర్ణాలతో సంబంధం కలిగించిందో....మరి నా కళ్ళ రూపు గుణంలో అదే. ఆ లారీ పరుగు ! దేనిమీద నేనీ యింటికి చేరానో... ఎడమా, కుడీ, వెనకా, ముందూ, ఎంతదాకా అయితే నా భావాలు పాకు తాయో అంతలెక్కా ఎర్రనినేల చుట్టుకుంది. ఒక రజస్వల అయిన కన్య మాదిరి ! తాను విశ్రాంతి తీసుకుంటోంది. ఆవేళ నాకు బాగా దగ్గరగా వస్తూ అవుపించింది. అప్పుడుగాని దీని దుగ్ధ తీరదు...ఎవరో ఒక ఇలాటి మనిషి పుడతాడు తిరిగి, శబ్ద సమేతంగా గొంతులు చాచుకు పుడతాడు నాగళ్ళ మోస్తరు !...మరి, ఈ పొలాలలో ధాన్యం ఉండదేమో !... ఇది 'ఎర్రని నేల' !.......

---

రచయిత:
"హయాతుల్లా అన్సారీ"

# మా "బాబాయి"

మూలకథ:
"చిట్బాజా"

ఇంకా, సూర్యోదయం కాకముందే మా లారీ 'మహా కోసీ' ఆన కట్ట స్థలానికి చేరుకుంది. నేనూ, నాతో పాటుగా మరో నలుగు రైదుగురు ప్రయాణీకులూకూడా కిందికి దిగాం - ఉత్తరం వైపుగా కనిపించే అత్యున్నత వృక్షాలూ, సౌందర్య దృశ్యాల మధ్యనుండీ ముందుకు పరిగెడుతూ, పోను పోను మహా కోసీనది అదృశ్యమైపోయింది. ఆ పైన ఇంకా దూరంగా, దూరంగా మేఘాల మధ్యన శివాలక పర్వతాల శిఖరాలు రెండు కనిపిస్తున్నాయి లీలగా—

నేను రెండు ఫర్లాంగుల దూరం నడిచి, తెగిపోయిన ఆనకట్ట వద్దకు చేరుకునేసరికి, హఠాత్తుగా దక్షిణ దిశ వైపుకు నా దృష్టి మళ్ళింది.... ఇంతవరకూ చెట్ల గుంపు మధ్యనవున్న దృశ్యం కళ్ళ ముందుకు వచ్చింది—

*　　*　　*　　*

ఇప్పటికి యిరవై సంవత్సరాల క్రితం యీ దృశ్యాన్ని నేను గంటల తరబడి తదేకంగా, చూస్తోండేవాణ్ణి. అయినా తనివి తీరకపోయేది. మహా కోసీనది దిగువ భాగానికి ప్రవహిస్తూ, అడివి చెట్లూ, గుట్టలూ, పంటచేలూ, వనాల మధ్యగా మెలికలు తిరుగుతూ వెళుతోంటం రమణీయంగా ఉంటుంది. యీ నది గట్లమీదవున్న చిన్న చిన్న పల్లెల్లో, మానవ సంరంభం ప్రకృతి సౌందర్యంతో సమ్మిశితమై ఉంటుంది...ఇక్కడ నిల బడి, నది దిగువ భాగంలో అక్కడక్కడా బట్టలు ఉతుక్కుంటూ వుండే చాకలివాండ్లనూ, పశువులను మేపుకుంటూవున్న కాపరులనూ చూడగలిగే

వాణ్ణి...వాళ్ళ పిలుపులూ, అరుపులూ, పశువుల కాపరుల పాటల ధ్వనులూ, అరణ్యంలోనుండి వినిపించే ధ్వనులతో ఏకమై వినిపిస్తోంటాయి—

* * * *

మా బాబాయిగారు చిత్రమైన వ్యక్తి. తన వాండ్లను ఎంత మర్యాదగా చూస్తాడో, అంతకన్నా మర్యాదగా, గౌరవంగా పరాయి వాండ్లను కూడా చూస్తోంటారు—

ఎవరో ఒక ముఖ్యుడు రైలుకు వస్తాడని మా బాబాయిగారు ఒక నాడు రైల్వే స్టేషనుకు వెళ్లారు. అక్కడ ప్లాట్‌ఫారంమీద ఆయన ఒక కుర్రవాణ్ణి చూశాడు. రైల్వే నౌకరును పిలిచి, ఆ కుర్రవాణ్ణి చూపుతూ అతన్ని తన వద్దకు పిలుచుకురమ్మన్నాడు. కుర్రవాడు, యీ అపరిచితమైన ఆహ్వానానికి కొంచెం భయపడుతూ వచ్చాడు.

"ఎవరి అబ్బాయివి నాయనా ?" అని అడిగాడు బాబాయి.

"సేఠ్ రామదాసు గారి కొడుకునండీ !" అన్నాడు.

"అవును...నేనూ అదే అనుకున్నాను....సరేకాని, ఎక్కడికి వెళ్ళ తూన్నావ్ నాయనా !" అన్నాడు బాబాయి.

"కలకత్తా"

"ఎందుకూ ?—"

బాబాయి ఇలాంటి ప్రశ్న వేస్తాడనుకోలేదు. జవాబివ్వడానికి కుర్రవాడు కొంచెం తికమకపడ్డాడు. సందేహం కూడా కలిగింది.

"ఇట్లా ప్రశ్నించటం ఆధునిక నాగరికతకు విరుద్ధమే . కాని, నేను పాతకాలం మనిషినిలే నాయనా ! చెప్పు ఏంపని ?" అన్నాడు బాబాయి.

బాబాయి గొంతులోని మార్దవం పసిగట్టి, కుర్రవాడుకూడా కొంచెం మెత్తపడ్డాడు. ఉద్యోగం వెతుక్కుందామని వెళుతున్నాను" అన్నాడు.

"భగవత్కృపవల్ల కృతకృత్యుడివి కాగలుగుతావు...పరవాలేదు. ఎంత డబ్బు తీసుకుని బయల్దేరావ్ ?" ప్రశ్నించాడు బాబాయి మళ్ళీ. ఈ ప్రశ్న పిల్లవాడి ముఖంలో కొద్దిగా అశాంతినీ, సందేహాన్నీ సృష్టించింది. అయినా కుదుటపరుచుకొని "ముప్పైరూపాయలు" అన్నాడు.

"ఛా ! ఛో ! నువ్వేతాడెవడన్నా ! ముప్పైరూపాయలతో కలకత్తాకు బయలుదేరాడట మగాడు" అంటూ బాబాయి జేబులోకి చేయిపోనిచ్చి, వందరూపాయల నోటు చర్రున బయటికి లాగి, దాన్ని ఆ కుర్రవాడిచేతిలో పెట్టాడు. "మీ నాన్న నాకు ప్రాణస్నేహితుడు...అందుకని నీవుకూడా నా కొడుకుతో సమానమే....మీ నాన్న జోరుగా వ్యాపారం చేసేరోజుల్లో నేను అక్కడికి వస్తూపోతూ వున్నప్పుడు నిన్ను చూసేవాణ్ణి. అప్పుడు నీకు యే డెనిమిదేండ్లు ఉంటాయేమో !...బహుశా యిప్పుడు పదిహేడు పద్దెనిమిదేళ్లుంటా యనుకుంటాను...అప్పుడు చూసిన జ్ఞాపకమూ, మారని పోలికలవల్ల నిన్ను గుర్తుపట్టగలిగాను." అన్నాడు బాబాయి. అక్కడ అలా నిలబడ్డవాడు నిలబడ్డట్టుగానే కలకత్తాలోని తన స్నేహితు లిద్దరికి రెండు వుత్తరాలు యీ కుర్రవాడిని పరిచయం చేస్తూ వ్రాసి యిచ్చాడు. "యీ వుత్తరాలు వాండ్లకిచ్చేసెయ్యి...నీకు వసతి సౌకర్యాలకు యిబ్బంది లేకుండా అన్ని యేర్పాట్లూ జరుగుతాయి...ఇంకా అవకాశం వుంటే నీ కేదన్నా ఉద్యోగం చూపెట్టడంలోకూడా సహాయం లభిస్తుంది." అన్నాడు.

కుర్రవాణ్ణి రైల్లో కెక్కిస్తూ "నీకేదన్నా అవసరం వుంటే, మీ నాన్నకు రాయకుండా నాకే వుత్తరం ముక్క రాసెయ్" అని కూడా పదే పదే చెప్పాడు—

బాబాయిగారింటిని యిల్లు అనటంకన్నా ధర్మసత్రం అంటే సరిపోతుంది. అది సత్రం లాగానే కనపడుతుంది. పసివాళ్లూ, కొంచెం పెద్దవాళ్ళూ అంతా కలిపితే, మొత్తం పిల్లల సంఖ్యే రెండున్నర డజన్లుంటుంది ఆ యింట్లో !—

ఇందులో బాబాయి కుటుంబం అంటూ చెప్పుకోవలసింది, ఆయన భార్య, ఇద్దరు ఆడకూతుళ్ళు మాత్రమే. ఈ యిద్దరు ఆడ కూతుళ్ళలో ఒకావిడ విధవరాలు...ఇంకొకావిడ భర్త నిర్వ్యాపారి...అకర్మణ్యుడు... ఇక మిగిలిన జనాభా అంతా, పూట గడుపుకోవటమే ప్రియమైన వృత్తిగా పెట్టుకున్న బంధు వర్గం...యేదన్నా పండగా, పబ్బం వచ్చినప్పుడు నాలుగు రోజులుండటానికి వచ్చి, యెప్పటికీ కదలకుండా తిష్ఠ వేసుకుని తింటూండే రకాలు—వాళ్ళు కదలకపోతే కదలకపోయారు; తాము ఒంటరిగా అక్కడ వుంటం బావుండదని, ఆర్నెల్లో, సంవత్సరం ఆగి, భార్యా పిల్లల్ని కూడా అక్కడికే రప్పించుకుని అంతా కలిసి వుంటున్నారు.

నేను కూడా యిదే విధంగా బాబాయిగారి కుటుంబంలో సభ్యత్వం స్వీకరించాను...మా నాన్న; బాబాయికి స్వయంగా అన్న. కచ్చేరీలో దరఖాస్తులు రాసిపెట్టే వుద్యోగం...సంపాదన నామ మాత్రం...కుటుంబం మాత్రం హెచ్చుగా పెరిగింది...నేను హైస్కూలులో స్కూల్‌ఫైనల్ పరీక్ష పాసైనట్టు విన్నాక మా నాన్నగారు నా పై చదువుని గురించి పెద్ద చిక్కు అవస్థలో పడ్డారు. చాలా ఆలోచించిన మీదట, ఆయన నా చేయి పట్టుకుని, తిన్నగా రైలెక్కి బాబాయిగారి వూరికి చేరి, నన్ను బాబాయి ముందు నిలబెట్టాడు.

“ఇడుగోనోయ్ ! నీ అన్న కొడుకు, స్కూల్‌ఫైనల్ సెకండ్ క్లాస్‌లో పాసైనాడు....నా శక్తి ఉడిగిపోయింది...నీకు అవకాశం వుంటే వీణ్ణి ఇంకా పైన చదివించు...లేకుంటే, యేదన్నా వుద్యోగంలో ప్రవేశ పెట్టు...యిక నేను చేయగలిగిందేమీ లేదు” అన్నాడు నాన్న.

బాబాయి చిరునవ్వు నవ్వుతూ, నావైపు జూశాడు “పరాయివాండ్లంతా వచ్చి తింటూంటే, యిక మన అబ్బాయిని గురించి చెప్పాలా అన్నయ్యా!” అంటూ “నీ వయస్సెంతరా బాబూ !” అన్నాడు.

“పదహారేండ్లు” అన్నాను నేను.

"అయితే యింకా కుర్రతనమే...చిలిపితనమన్నా వదలని పసి వయస్సు...అరే! బాబూ! ఇదిగో! ఇదంతా మన యిల్లేననుకో. నీ యిష్టం వచ్చినట్టు స్వేచ్ఛగా వుండవచ్చు...యిష్టం వచ్చినంత అల్లరి చేయ వచ్చు...కావాలంటే మీ పిన్ని దగ్గరనుంచి, పావలా అర్ధా కాజేసుక పోవచ్చు" అంటున్నాడు బాబాయి.

యీ సంఘటన, కుర్రవాడినైన నా మీద ఎలాంటి ప్రభావం చూపు తుందో వివరించ నవసరంలేదు......ఆ రోజునుంచీ నేను బాబాయి కొడుకునై పోయాను...వాళ్ళ పెట్టుపోతలు కూడా కొడుక్కులాగానే జరుగుతూండేవి.

ఆ రోజుల్లో బాబాయి జిల్లా ఎగ్జిక్యూటివ్ ఇంజనీయర్ ఉద్యోగంలో వున్నాడు. ఒకసారి వర్షాకాలంలో ఇన్స్పెక్షన్ నిమిత్తం బయలుదేరాడు... షికారుగా వెళ్ళి వచ్చినట్టుంటుందన్న ఉత్సాహంతో నేను కూడా కారులో యెక్కి కూర్చున్నాను. త్రోవలో ఒకచోట రోడ్డు ఇలా ఉన్నదిగదాంటే, పూర్తిగా కొట్టుకపోయి, చెడి, నీరునిలిచి కారు చాలా నెమ్మదిగా వెళ్ళవలసి వచ్చింది - అదొక పల్లెటూరు...ఆ వూళ్ళోంచే రోడ్డు వెళుతుంది...వూరి గట్టుకు చేరగానే, అక్కడ ఒకచోట చాలామంది జనం నిలబడి వుంటం, ఒక ముసలమ్మ పెద్దగా యేడుస్తూ వుంటం చూశాం...ఒక యువతి, తల వంచి నిలబడి వుంది. ఆమె ప్రక్కన్నే మరో పది పన్నెండేళ్ళ పిల్లవాడు ఏడుస్తూ వున్నాడు.

యీ గుంపును చూసి, డ్రైవరుతో కారు ఆపమని చెప్పాడు బాబాయి...వెంటనే ఆయన కారులోంచి క్రిందికి దిగాడు. ఖరీదైన బూట్లు బురదలో కూరుకపోయాయి. వాటి పట్టు దారాలూ, తొడుక్కున్న ప్యాంటు చివరి భాగం అంతా బురద నీరు చిమ్మి తడుస్తున్నా లక్ష్యపెట్టకుండా, బాబాయి ఆ గుంపులోకి దూరి, సంగతేమిటని ప్రశ్నించాడు. తేలిన సారాంశం యిది.

ముసలమ్మా, వయస్సులో వున్న యువతీ, అత్తా కోడండ్లు... ఇద్దరూ విధవలే. కుర్రవాడు ముసలమ్మ మనుమడు...మాతృభాషా పాఠశాలలో చదువుకుంటున్నాడు. ముసలమ్మ కొడుకు, ఇంత సంపాయించే శక్తి గలవాడు, మంచి వయస్సులోనే మరణించడంతో ఆ కుటుంబం నిస్సహాయస్థితిలో పడ్డది. ఒక మట్టి గోడల చిన్న పూరిల్లూ, ఒక గేదె మాత్రం వీళ్ళ ఆస్థిగా మిగిలింది. ఆ గేదె పాలను అమ్ముకుని జీవిస్తూ, ఈ కొంపలోనే ఎలాగో కాలక్షేపం చేస్తున్నారు. ఇప్పుడే, ఒక గంట క్రితం కురిసిన ఘోర వర్షంలో ఆ కాస్తా కొంపా కూలిపోయింది. దాని క్రింద పడి గేదె కూడా చనిపోయింది.

అంతా విని, అక్కడే వున్న ఒక మంచాన్ని లాక్కుని దానిమీద కూర్చున్నాడు బాబాయి. కారు పంపించి, వెంటనే కాలవలమీద అక్కడ పని చేస్తూండే ఓవర్సీర్‌ను పిలిపించాడు...చెక్కు రాసి ఓవర్సీర్ చేతికిస్తూ, కచ్చితంగా పది హేనురోజుల్లో ముసలమ్మకు మళ్లీ యిల్లు తయారై పోవాలనీ, పుష్కలంగా పాలిచ్చే ఒక గేదెను కొని ముసలమ్మకు యివ్వాలనీ ఆజ్ఞ యిచ్చాడు...యీ సారి టూర్ వచ్చినపుడు యింటినీ, గేదెనూ కూడా చూస్తానని చెప్పాడు.

ముసలమ్మ మనవడిని తనతోపాటు కారులో కూర్చోబెట్టుకుని తనకు బాగా పరిచితుడైన ఆ తాలూకా అధికారి దగ్గరకు తీసికెళ్లాడు. పేద పిల్లవాడి చదువుకు శ్రద్ధగా అవసరమైన యేర్పాట్లు చేయించాలని కోరాడు. యీ సంఘటన గురించిన వార్తలు దూర దూరాలకూ వ్యాపించినై. బాబాయి చరిత్రను కథలుగా చెప్పుకోవటం, బాబాయిని దేవుడితో సమానుడని అనటం యెంతో గౌరవాన్నియటం జరిగిపోయింది !—

'నమాజ్' ప్రార్థన విషయంలో బాబాయి మంచి క్రమ శిక్షణతో వుండేవాడు...ఆయన నమాజ్ 'కజా' అయి యే ఒక్కపూటన్నా యెప్పుడన్నా పడిపోయిందో లేదో సరిగా చెప్పలేను కాని, మొత్తం మీద, ఈ విషయంలో చాలా కట్టుదిట్టమైన మనిషి. ఒక్కోసారి నెలలకొద్దీ, అర్ధ

రాత్రి దాటాక నమాజ్ చేయటం కూడా కార్యక్రమంగా పెట్టుకునేవాడు. నరాలు జివ్వున లాక్కుపోయే, యెముకలు కొరుక్కుతినే చలికాలంలో యీయనకు రాత్రి పూట నమాజ్ బుద్ధి పుడుతోంటుందెక్కువగా... కొమ్ములు తిరిగిన పెద్ద పెద్ద భగవద్భక్తులే, శీతాకాలంలో యీ కార్యక్రమం పెట్టుకోవటానికి భయపడుతుంటారు...దీన్నైనా బాబాయి మంచి అట్టహాసంగా నిర్మిస్తూండేవాడు...స్నానాలకూ, గది వెచ్చగా వుండటానికీ, మణుగుల కొలదీ కట్టెలు ప్రతిరోజూ కాలుతోండేవి...బాబాయి సరిగ్గా మూడు గంటల రాత్రి కాగానే మేలుకుని, లేచి, స్నానం చేయడానికి వెళతాడు. అక్కడ స్నానం ముగించుకొని, వెచ్చగా వుండే గదిలోకివచ్చి, తెల్లవారుజాము నాలుగున్నరదాకా నమాజ్ ప్రార్థన, గీతాల పఠనం జరుపుతోండేవాడు. ఒక్కోసారి, ఈ అళయాళం అంతా పూర్తిగా వదిలిపెట్టి, ఆ యెముకల కొరుక్కుతినే చలిలోనే లేచి, కుండల్లో నింపిన చన్నీటితో స్నానంచేసి, కంబళి కప్పుకుని, బయట వరండాలో తెల్లవారుజాము నమాజ్ నిర్వర్తించుకుంటూండేవాడు.

బాబాయి, హజ్ యాత్రకు రిటైరైం తర్వాతనే అవకాశం చిక్కింది కాని, ఉద్యోగం రోజుల్లో, ప్రతి సంవత్సరమూ, 'అజ్మీర్ షరీఫ్'కు అట్టహాసంగా వెళ్ళితీరేవాడు...తినుబండారాల సామగ్రీ, ఆహారపు నిలవలూ, పండ్లూ, పాలూ, పెద్ద పెద్ద ఫ్లాస్కుల్లో మంచూ, కాఫీ, టీ నింపుకుని, యిద్దరు ముగ్గురు నౌకర్లని వెంటదీసుకుని మాంచి హంగామాతో వెళ్లేవాడు. ఒక్కోసారి యీ ప్రయాణం రైలు మీద, మరోసారి, రెండు మూడు కార్లతోనూ సాగుతోండేది...ప్రయాణంలో భార్యా పిల్లలు తప్పకుండా వెంట వుండేవాళ్లు——

ఒక పర్యాయం అజ్మీర్ షరీఫ్ ప్రయాణంలో వీళ్ళతోపాటు నేను కూడా వున్నాను. రెండు కార్లతో ప్రయాణం జరుగుతోంది. ఢిల్లీ మీదుగా తిరిగి వెళ్ళాలని నిశ్చయం అయింది...బాబాయి కూర్చున్న కారు ఢిల్లీ చేరగానే చెడిపోయింది...మరమ్మత్తుకోసం గ్యారేజికి పంపితే, మరమ్మత్తు

కావటానికి రెండు మూడు రోజులు పడుతుందన్నారు. అజ్మీర్ షరీఫ్‌లో ఉర్సులో పాల్గొనాలంటే ఇంత ఆలస్యం కుదరదు. కాబట్టి రైల్లో వెళ్ళి తీరవలసిందే...బాబాయికి పట్టుదల హెచ్చింది. కారులో ప్రయాణం అనుకున్నప్పుడు కారులో జరగాల్సిందే. వెంటనే బాబాయి లేచి, న్యూఢిల్లీకి వెళ్ళాడు...పదకొండు వేల రూపాయలు పెట్టి కొత్త కారునే కొనుక్కొచ్చాడు. అనుకున్న ప్రకారం, అనుకున్న సమయానికి నిరాటంకంగా చేరుకోవటం జరిగింది.

అజ్మీర్‌లో 'కవాలీ' (భక్తి సంగీత కార్యక్రమము) మొదలైన భక్తి సంగీత కార్యక్రమాల్లో పాల్గొంటూన్నప్పుడు బాబాయి, పూనకం వచ్చినవాడి వలె మైకంలో పడిపోయేవాడు. తల వంచుకుని, నిశ్చలంగా, మౌనంగా గంటలకొలదీ కూర్చునేవాడు. ఒక్కోసారి యీ స్థితిలో కండ్ల వెంట నీళ్లు చిమ్ముతూ చాలా సేపు ప్రవహిస్తూండేవి. ఎక్కిళ్ళుకూడా వచ్చేవి. ఒకసారి ఆ క్షేత్రంలోని సమాధి ముందు తల నేలకువేసి బాదుకుంటే తల చితికి పోయింది!—

భక్తి ప్రపత్తుల కారణంగా బాబాయి మరింత విఖ్యాతుడూ-మరింత ఆదరపాత్రుడూ అయినాడు...అన్నిచోట్లా ఆయనకు అసమానమైన గౌరవ మర్యాదలు లభిస్తుండేవి...అదే విధంగా భగవత్కృప కూడా ఆయనకు సహాయపడుతూన్నదన్నట్లుగా, మట్టిని చేత్తో ముట్టుకుంటే బంగారం అవుతోండేది !...

* * * *

నాకు తెలిసినంతవరకూ బాబాయి ఎంతో డబ్బు సంపాదించినా, ఆయనదగ్గ రెప్పుడూ డబ్బు నిలవ వుండకపోయేది – ఆయన చేతి రేఖల్లో కత్తెర వుందని మా పిన్నిగా రంటుంటుంది. వందలు, వేలు, లక్షల రూపాయలు చేతికి వస్తూండేవి...వారాలలోనే మాయం అవుతోండేవి.

నేను యూనివర్సిటీలో ప్రవేశించేటప్పుడు వేయి రూపాయలు కావలసి వచ్చినై ...ఈ విషయం ఒక నెల రోజులు ముందుగా నేను

బాబాయిగారితో చెప్పాను. ఆయన మంచిదన్నాడు. వారంరోజులు ముందుగా మళ్ళీ ఒకసారి చెప్పాను...మళ్ళీ మంచిదన్నాడు. రెండురోజులముందు మళ్ళీ గుర్తు చేశాను..."యేర్పాటు చేస్తానులే" అన్నాడు బాబాయి. రైలెక్కడానికి మరో ఆరు గంటలు మాత్రం ఆలస్యం వుందనగా మళ్ళీ అడిగాను. బాబాయి కొద్దిగా ఆలోచనలో పడ్డాడు.

"సేఠ్ రామదాస్‌కి టెలిఫోన్ చేసి పిలువు...ట్రెజరర్‌నూ ఓవర్సీరునూ, యిక్కడికి రమ్మని మనిషిద్వారా కబురుచెయ్యి అన్నాడు.

ఒక్క గంటలో యీ ముగ్గురూ ఒక్కచోటికి చేరారు. నేనక్కడే వున్నాను. వాళ్ళ సంభాషణ యీ విధంగా సాగింది.

"ఎమర్జెన్సీ ఫండ్" పద్దులో మీ స్వాధీనంలో యెంత మొత్తం వుంది ?" అని ట్రెజరీ ఎక్కౌంటెంట్‌ని ప్రశ్నించాడు బాబాయి.

"పదహారు వందల యాభై రూపాయలు మాత్రం" అన్నాడాయన.

బాబాయి "హుఁ" అంటూ కొద్దిగా ఆలోచించాడు. "ఏమండీ ఓవర్సీర్ గారూ! బేలీపల్లె దగ్గర కాలవ వంతెనలో మట్టి బాగా పేరుకొనిపోయి బందయిందటగదా! యిందువల్ల వంతెనే దెబ్బ తినే ప్రమాదం వుంది...దీన్ని తక్షణం తవ్వించి, నీటి మార్గం సాఫుచేయాలి" అన్నాడు.

"అవును సార్" అన్నాడు ఓవర్సీర్ వినయంగా.

"అయితే వెంటనే యిక్కడికిక్కడే రిపోర్టు సిద్ధంచేసి, ఎస్టిమేట్ డిమాండ్ యివ్వండి" అన్నాడు బాబాయి అధికార హోదాలో.

ఓవర్సీర్ సంతోషంతో పక్క గదిలోకి వెళ్ళి ఐదు నిమిషాల్లో తన రిపోర్టు, ఎస్టిమేషన్ డిమాండు, టైపు చేసుకుని తెచ్చాడు.

బాబాయి, రాందాస్ సేఠ్, వైపు చూస్తూ "యేమండీ కంట్రాక్టర్ గారూ! యీ అర్జంటు పర్కని మీ రెంతటిలో పూర్తిచేసి యివ్వగలరు?" అని ప్రశ్నించాడు.

సేఠ్ రాందాస్ అందరి ముఖాలూ చూసి "యేం జేస్తాం! ఆ పదహారు వందల యాభై కే చేస్తాను...యిప్పించండి!" అన్నాడు.

"సరే! టెండర్ పూర్తిచేసి యివ్వండి!" అన్నాడు బాబాయి.

సేఠ్‌జీ వెంటనే టెండర్ సీల్ చేసి యిచ్చాడు. బాబాయి దాన్ని విప్పి, సంతకం చేసి, టెండర్‌ని అంగీకరించినట్లూ, పని ప్రారంభించమనీ ఆర్డర్ వేసి యిచ్చాడు. ఓవర్సీర్‌వైపు తిరిగి "ఓవర్సీర్‌గారూ! పనిని శ్రద్ధగా కనిపెట్టి వుండి, తనిఖీ చేసి, అది శుభ్రం చేయబడిందీ లేనిదీ నిర్ణీత సమయంలో రిపోర్టు అందచేయండి!" అన్నాడు.

ఓవర్సీర్ తన రిపోర్టును వ్రాసి పని ప్రారంభాన్నీ ముగింపునూ గురించి తెలిపాడు. బాబాయి దానిమీద సంతకం చేశాడు...వెంటనే సేఠ్ రామదాస్ పదహారు వందల యాభై రూపాయలకు ఫైనల్ 'బిల్లు'ను పెట్టేశాడు. 'ఇమిడియెట్ పేమెంట్' వ్రాసి సంతకం చేసి, బిల్లును శాంక్షన్ చేశాడు బాబాయి...ట్రెజరీ ఎక్కౌంటెంట్ అలవాటు ప్రకారం జరిగే పనిలో ఆలస్యం లేకుండా పదహారువందల యాభై రూపాయలూ బాబాయి ముందు బల్లమీద వుంచాడు. ఆయన అందులోంచి వెయ్యి రూపాయలు తీసి లెక్కించి నా చేతి కిచ్చాడు. తక్షణం లేచి, గదిలోంచి బయటికి వెళ్ళిపోయాడు బాబాయి. మిగిలిన రూపాయలు, మిగతా అక్కడున్న ముగ్గురూ, వాళ్ళకు లోగడనుండీ అలవాటుగా వున్న యేర్పాటే ననుకునే పద్ధతిలో వారి వారి లెక్క ప్రకారం పంచుకున్నారు. "దొరవారు భారీ మనస్సు గల మనిషి" అని పొగడి, ఆశీర్వదించి, ఎవళ్ళ దోవన వాళ్ళు వెళ్ళిపోయారు.

* * * *

ఒక పర్యాయం బాబాయికి మాంఛి గడ్డు పరిస్థితి వచ్చి పడింది. కాని, చిట్టచివరి వరకూ ఆశను వదలకుండా, ప్రయత్నిస్తూనే వచ్చాడు. భగవదిచ్ఛ ఆయనకే అనుకూలంగా మారి ప్రయత్నాలు ఫలించాయి!—

ఆయన చిన్నకూతురి వివాహం సమయంలో కూడా ఇలాగే డబ్బుకు తీవ్రమయిన కటకట యేర్పడింది. పెండ్లి యింకా వారం రోజు లుందన్న దగ్గరనుంచీ, బాబాయి చింతాక్రాంతుడు కావటం ప్రారంభించాడు. ఒకనా డాయన ఇద్దరు ముగ్గురు సేఠ్‌జీలూ, అసిస్టెంట్ ఇంజనీయర్లూ, కాలవ సూపర్వైజర్లూ, ట్రెజరీ ఆఫీసరూ, మరికొంతమంది స్నేహ బంధువులతో ఏకాంతంగా గదిలో కూర్చున్నాడు. ఆ రోజుల్లో విశ్రాంతి లేకుండానే గడిపారు. యేవేవో ప్లానులు గీశారు...అచ్చు ఫారాలు రాశారు. క్లర్కులూ, చప్రాసీలూ (జవాన్) హడావిడీగా తిరుగుతోన్నారు. సాయంత్రం చీకటిపడే సమయానికి వీళ్ళ సమావేశం పూర్తి అయింది. బాబాయి చిరునవ్వు ముఖంతో సంతోషంగా ఇంట్లోకి వచ్చాడు. పిన్నితో మాట్లాడుతూ "యెల్లుండి ఈ యిల్లు రూపాయలతో నిండిపోతుంది" అన్నాడు.

పెళ్ళి కార్యం....యేర్పాట్లన్నీ సాగిపోతూనే వున్నాయి. వినోద కాలక్షేపాలూ, నృత్య గానాలూ, అనునిత్యం సంతోషతాండవం చెలరేగి పోతూనే వుంది. కాని, అవ్వాళ ప్రత్యేకంగా యీ సంతోష సంరంభం మరింత ఉప్పొంగింది. బాబాయి తన నియమానికి విరుద్ధంగా యీ కార్య క్రమాలలో సంతోషంగా పాల్గొని ఆ రాత్రంతా నిద్రలేకుండానే గడిపాడు.

మర్నాడు మధ్యాహ్నం దాటిం తరవాత బాబాయికి యెక్కడినుంచో ఒక టెలిగ్రాం వచ్చింది. దాన్ని చూసుకోగానే బాబాయి నోటినుంచి "అరి భగవంతుడా ?" అన్న మాట వినవచ్చింది...తరవాత చాలాసేపటి వరకూ నోట మాట రాకుండా ప్రతిమవలె మౌనంగా అట్లాగే కూలబడ్డాడు. అక్కడే వున్న క్లర్కూ, నేనూ ఇద్దరం భయపడిపోయాం ఆయన ముఖం చూసి పది నిముషాల తరవాత, యేదో గట్టి నిర్ణయానికి వచ్చినవాడివలె ఒక్క ఊపున లేచి, బాబాయి నాతో ఇలా అన్నాడు.

"అబ్బాయ్! నీవు తక్షణం కారు తీసుకునివెళ్ళి, సేఠ్ మఖ్ఖన్‌లాల్‌ని అర్జంటుగా వెంటపెట్టుక రావాలి...అత్యంతావసరమైన పని వుందని

చెప్పాలి'' అన్నాడు. మున్షీ (క్లర్కు) వైపు చూస్తూ ఫలానా వాళ్ళని పిలుచుకరమ్మని మరికొందరి పేర్లు చెప్పాడు.

నేను కారు తీసుకుని వాయువేగంతో సేఠ్ జీ వద్దకు వెళ్ళి చెప్పాను. కూచున్నవాడు కూచున్నట్టుగానే బయలుదేరాడు. అతను సరిగ్గా యింట్లోకి అడుగు పెట్టకముందే బాబాయి ఆత్రంగా ఇలా అన్నాడు గదాంటే :—

''సేఠ్ జీ కొంప మునిగింది...రేపు ప్రొద్దున్నే చీఫ్ ఇంజనీయర్ ఇన్స్పెక్షణ నిమిత్తం వచ్చేస్తున్నారు'' అని:—

సేఠ్ జీ భయపడినట్లుగా కనిపించాడు. ''యెవడో పుల్లెగండు వెధవ యేదో వార్త చేరవేసి వుంటాడు...చాలా చెడ్డపని జరిగిందే'' అన్నాడు వగరుస్తూ.

''నేనూ అదే అభిప్రాయంతో వున్నాను...ఏదేమైనా, ఇప్పుడు నాకు ప్రాణం మీదికి వచ్చింది మరి...అరవై వేల రూపాయలు లేందే పీకలు పోయే యోగం వచ్చింది...యెలా వీలుంటే అలా, యే షరతు మీద నైనా, యెంత వడ్డీకైనా సరే. ఈ మొత్తాన్ని మీరు సమకూర్చాలి సేఠ్ జీ!—వీటికి హామీగా నా యిండ్లు, ఆస్తీ, కార్లూ, యేమి కావాలంటే అవి తాకట్టుగా ఉంచుకోవచ్చు...లేకుంటే వాటిని కొనైనా డబ్బివ్వండి' అదీ కాకుంటే నాతో ప్రోనోటు వ్రాయించుకోండి...దేనికైనా నేను సిద్ధమే...నాకు డబ్బు అర్జంటుగా కావాలి. అన్నాడు బాబాయి.

తనకు వున్న చురుకైన తెలివితో వీలైనంతవరకు వ్యవహారాన్ని సింహావలోకనం చేశాడు సేఠ్ జీ...చాలా గౌరవ మర్యాదలు ప్రదర్శిస్తూ ఇలా అన్నాడు.

''మీ వల్ల నేను చాలా లాభాలు సంపాదించాను. ఇప్పుడు మీకు ఇరుకు పరిస్థితి వచ్చిందని చెప్పి, అక్రమంగా లాభం పొందడం నాకు మనస్కరిస్తుందా చెప్పండి! మీ యిండ్లు కార్లూ యివన్నీ నా స్వాధీనంలో

యెందుకు ? యేవో రెండు పంక్తులు మీ స్వదస్తూరితోనే వ్రాసివ్వండి ! అదే నాకు చాలు....డబ్బు కావలిస్తే పట్టుకు వస్తాను'' అన్నాడు.

బాబాయి తన మనస్సులో కార్యక్రమం అంతా నిర్ణయించుకునే వున్నాడు. రూపాయలు చేతులో పడంగానే నన్ను పిలిచాడు. అజ్మీర్‌లో ఫలానా గురువుగారికి టెలిగ్రాం యివ్వమన్నాడు. ''చాలా గడ్డు సమయం వచ్చేసిందనీ, దర్గాకు వెళ్ళి దస్తగిరీకి ప్రార్థన జరిపించవలసిందనీ'' టెలిగ్రాం సారాంశం. తరవాత ఆయనే స్వయంగా కారు వేసుకుని బయలుదేరాడు వూళ్లోకి.

పొద్దు పొద్దుగూకే సమయానికి ఆయన తిరిగి యింటికి చేరుకునే సరికి, మధ్యాహ్నం ఆయన పిలిపించిన వాళ్ళంతా హాజరై యెదురు చూస్తూ కూచుని వున్నారు.

బాబాయి ఒక్కసారి వాళ్ళందరినీ చూశాడు...''అత్యవసరం... ఎమర్జంట్ పని ఒకటుంది...కూలీ, అద్దె, అంతా ఇబ్బడి లభిస్తుంది... పైన కొంత ఇనాం కూడా——'' అన్నాడు.

వాళ్ళంతా కంట్రాక్టర్లు...ఒకళ్ళ నొకళ్లు చూసుకున్నారు. బాబాయి మళ్ళీ అన్నాడు...''మీ దగ్గర యెంతమంది కూలీలుంటే అంతమందిని, యెన్ని ట్రక్కులూ, లారీలు వుంటే అన్నిటినీ ఫలానా నది వద్దకు ఫలానా చోటికి పంపండనీ, చెప్పాడు...ఆ ప్రాంతానికి అర్జంటుగా, వున్న పళంగా చేరుకోవలసిందిగా ఓవర్సీర్లకు హుకుం జారీ చేశాడు.

అధికార హోదాలో ఉత్తరువులు యివ్వటమే గాక, అవి అమలు జరిపించడానికి ఆయన స్వయంగా కారు వేసుకుని మళ్ళీ అందరి దగ్గరకూ వెళ్లాడు. ఒక కంట్రాక్టర్ క్రింద గల కూలీలు పనిలోకి పోవటానికి వెనకా ముందూ ఆడుతూంటే బాబాయి వాళ్ళందరికీ తలకు రెండేసి రూపాయల చొప్పున యిచ్చాడు...ఇది కూలి డబ్బు కాదనీ, ఇనాం అని కూడా చెప్పెయ్యటంతోనే కూలీలు యెగిరి గంతేసి బయల్దేరారు——

గ్యాస్ లైట్లు సప్లై అవుతోన్న స్థితి గమనించటానికి బాబాయి వెళ్ళే వరకే అతను కంట్రాక్టర్‌తో యేవో అభ్యంతరాలు చెబుతున్నాడు. మాంటిల్స్ అన్నీ బ్రద్దలై పోతాయనీ, రాత్రి ప్రొద్దుపోవటంతో వీధుల్లో దుకాణాలన్నీ మూసివేసిన కారణాన యెక్కడా ఇప్పుడు మాంటిల్స్ లభించవనీ యేదేదో చెబుతున్నాడు. బాబాయి తక్షణం ఒక దుకాణానికి వెళ్ళి షాపును ప్రత్యేకంగా తెరిపించి, ఒక్క గ్రోసు మాంటిల్స్‌ని పది రెట్లు ఖరీదు చెల్లించి తీసుకున్నాడు—

కూలీలూ, తదితరులూ, అంతా తమ తమ సామానులూ, సరంజామా సర్దుకుని, లారీలకు వేసుకుని, నదీ ప్రదేశానికి చేరుకునేసరికీ, దాదాపు రాత్రి పదకొండు గంటలైంది...అక్కడ వీళ్ళందరినీ నాలుగు మైళ్ళ వైశాల్యంలోకి వ్యాపింపజేస్తూ సర్దివేయటం జరిగింది...గ్యాస్ లైట్లు ధగద్ధగాయమానంగా వెలిగిపోతున్నాయి. క్షణం తీరిక లేకుండా ట్రక్కులు మట్టి వేసుకుని రావాలనీ, ఆ మట్టిని కూలీలు, నీళ్ళులేని ఆ నదికి అడ్డంగా నదీగర్భంలో కట్టగా పోయాలనీ ఉత్తరువు లైనవి.

పని ప్రారంభమైంది...ట్రక్కులు బర్ర్ బర్ర్ మంటూ విధీ విరామం లేకుండా చలిస్తూ మట్టిని తెస్తున్నాయి. కూలీలు నిర్విరామంగా మట్టిని నదీగర్భంలోకి పోస్తున్నారు. బాబాయి తన కారుతో అవిరామంగా అటూ యిటూ తిరుగుతూ పనిని స్వయంగా జరిపిస్తున్నాడు. ఎక్కడన్నా పని కాస్త మందకొడిగా జరుగుతూంటే హెచ్చరిస్తూ, పని చురుగ్గా జరిగేచోట, కంట్రాక్టర్లకూ, కూలీలకూ, ఐదులూ, పదులూ బహుమానం అందజేస్తూ, దాదాపు ఎంత లేదన్నా పదివేల రూపాయల మొత్తం నోట్లు పంచిపెట్టేశాడు బాబాయి.

వేకువ జామున ఐదు గంటలకు పని పూర్తి అయిపోయింది. కూలీలంతా తమ తమ సామానుల్తో లారీలూ, ట్రక్కుల్లో ఎక్కి వెళ్ళిపోయారు. చాలా జాగ్రత్తగా యెక్కడ ట్రక్కులూ, కార్లూ, మనుష్యులూ తిరిగిన

జాడ లేకుండా చదరం చేసివేయబడిందా ప్రదేశమంతా...దాదాపు ఐదున్నర అయేవరకూ ఆనకట్ట వద్దకు నీరు కూడా వచ్చి చేరటం జరిగింది.

రాత్రి పదకొండు గంటలప్పుడే బాబాయి ఒక జవానును కారిచ్చి, అక్కడికి తొమ్మిదోమైలు మీద యెగువలో వున్న ఆనకట్టవద్దకు పంపాడు. సరిగ్గా తెల్లవారుజాము నాలుగింటికి ఆనకట్ట తలుపులు తెరిచి క్రమంగా యేటికి నీరు వదలాలనీ, తాను రైల్లో వస్తున్నట్టుగా ఓవర్శీరుకు చెప్పమనీ చెప్పాడు. ఆనకట్టకు అరమైలు దూరంలోనే కారు ఆపుకుని, నడిచి వెళ్ళ మని కూడా జవానుతో చెప్పాడు—

సరిగ్గా ఉదయం ఆరుగంటలకు దుమ్ము కొట్టుకున్న శరీరంతో బాబాయి ఇంటికి చేరుకుని, తక్షణమే స్నానాల గదికి వెళ్ళాడు...ఆయన అట్లా గదిలోకి వెళ్ళాడోలేదో, చీఫ్ ఇంజనీయర్ తన సిబ్బందితో సహా వాకిట్లో ప్రవేశించాడు. బాబాయి స్నానం చేస్తున్నారని చెప్పి, నేనే వారిని డ్రాయింగ్ రూంలో కూచోబెట్టాను. చీఫ్ ఇంజనీయర్ చాలా యువ కుడు...విదేశాలకు వెళ్ళి విద్యాభ్యాసం చేసి వచ్చాడు...ముఖంలో చిరు నవ్వుతోపాటు తీవ్రమైన పట్టుదలా, ఆలోచనా భంగిమా కనపడుతున్నయ్! సాంకేతికంగా వున్నట్టున్న అతని చిరునవ్వు చూసి నాలో నేనే నవ్వు కున్నాను...బాబాయిని సాధింతామని చీఫ్ ఇంజనీయర్ వచ్చాడు కాని, బాబాయి గెలిచే కూచున్నాడని నా విశ్వాసం...అందుకే నాకు నవ్వు వచ్చింది.

బాబాయి స్నానంచేసి వచ్చి, సగౌరవంగా చీఫ్ ఇంజనీయర్ని పలక రించాడు. తరవాత కాఫీ ఇత్యాదులు వచ్చేశాయి...ఫలహారాలూ, కాఫీలూ పూర్తి అయ్యాక సి.ఇతో ఇలా అన్నాడు బాబాయి నమ్రతగా—

—"సర్ ! తమ మెస్సేజ్ నాకు నిన్న సాయంత్రం నాలుగ్గంటలకి అందింది. అప్పటికి రెండు గంటల ముందే, నేను కాలవకు నీళ్ళు వదల వలసిందిగా, సూపర్వైజర్కు ఉత్తరువు పంపించాను. మీ టెలిగ్రాం అందాక, నీళ్లు వదలటాన్ని ఆపు చేయించడం ఎంత ప్రయత్నించినా వీలు

కాలేదు. టెలిఫోన్ లైన్ చెడిపోయి వుంది....కబురందకముందే నీళ్ళు వదిలే పని పూర్తి అయింది. యిప్పుడంతా జలమయం అయివుంది...మట్టి కట్టను కొలవడం సాధ్యం కాదేమో...?'' అన్నాడు బాబాయి వినయంగా,

అసలు మట్టి కట్ట అంటూ ఒకటి అక్కడ వుంటేగా నీళ్ళు నిలవ డానికి అని చీఫ్ ఇంజనీయర్ తన మనస్సులోనే అనుకున్నట్టుగా వుంది... యెంతో నిర్లక్ష్య వైఖరితో యిలా అన్నాడు గదాంటే:—

"పరవాలేదండీ ! లంగరు దింపించి, అడుగు మట్టాన్ని కొల్చుకో వచ్చు. యేమాత్రం ఇబ్బందిలేదు. పదండి ! వెళదాం'' అన్నాడు పరీక్షగా.

మధ్యాహ్నం రెండుగంటలన్నరకు చీఫ్ ఇంజనీయర్, నదీ ప్రదే శాన్ని చూసి, బాబాయితో సహా తిరిగి ఇంటికి చేరుకున్నాడు...చీఫ్ ముఖంలో కొంత ఆశ్చర్యం, కొంత లజ్జా, రెండూ మిశితమై గోచ రించినయ్. భోజనాల టేబిల్ వద్ద బాబాయితో ఇలా అన్నాడు.

''మీరు చాలా చురుకైనవాళ్ళు'' అన్నాడు. యీ మాటలో విమర్శ వుందో, పొగడ్త వుందో నేను సరిగా అంచనా వేయలేకపోయాను.

''తమ దయ...నేను సాధారణ మనిషిని...ఈ చురుకుదనం తమ బోటి వారి దర్శనం, అనుభవంవల్ల కలిగినవే కాని, స్వయంగా నేను తమ పొగడ్తకు అనర్హుణ్ణి'' అన్నాడు బాబాయి యెంతో విధేయతగా—

కాసేపాగి సి.ఇ. మళ్ళీ అన్నాడు ''ఒక్కోచోట మట్టి మీ ఎస్టి మేట్సుని మించిన మందంలో కూడా వుందే ?!''—

''బహుశా నీళ్ళు నిండడంవల్ల అలా కనిపించిందనుకుంటాను'' అన్నాడు బాబాయి తొణుకు బెణుకు లేకుండా.

చీఫ్ ఇంజనీయర్ వెళ్ళిపోయిం తరవాత బాబాయి పెద్ద అట్ట హాసంగా, పూజనీయులైన వాళ్ళందరినీ ఆదర గౌరవాలతో సత్కరించి, వందలకొద్దీ రూపాయలు దాన ధర్మాల నిమిత్తం ఖర్చు పెట్టాడు. అసలు జరిగిన సంగతేమిటో ఊళ్ళోవాళ్ళకి సరిగా అంతుపట్టకపోయినప్పటికీ,

లంచ పంచాల విషయంలో ఇంజనీయర్‌గారికి పైనుండి యేదో పరీక్ష వచ్చి, చాలా గడ్డు స్థితికి గురి అయినట్టుగా ఆ నోటా ఆ నోటా కొందరు విన్నారు. ఇంజనీయర్‌గారు దాన ధర్మాలూ, కానుకలూ గుప్పిస్తున్నారన్న సంగతి తెలిసి, ఇబ్బంది గడిచి ఉంటుందని, శుభాకాంక్షలు అందచేయడానికి చాలామంది వచ్చారు. వీళ్ళల్లో ప్రభుత్వోద్యోగులూ, ప్రముఖ పౌరులూ, మత గురువులూ అంతా రకరకాల వాళ్ళున్నారు.

* * * *

బాబాయి ఆధ్వర్యంలో నిర్వహింపబడిన చిట్టచివరి పనీ, బ్రహ్మాండమైన పనీ ఒకటి వుంది. అది 'మహా కోసీ' డాం నిర్మాణం. ఈ ఆనకట్ట నిర్మాణానికి ఐదు సంవత్సరాల కాలం నిర్విరామంగా పని చేశాడు బాబాయి. ఈ సమయంలోనే బాబాయి ముగ్గురు ఆంగ్లేయ ప్రముఖులకి హిమాలయారణ్యాలలో వేట రుచి చూపించాడు. వాళ్లున్నంతకాలం అడివంతా కలకలలాడిపోయింది. పట్నంనుంచి, మంచు గడ్డలతో వచ్చే పానీయాలూ, మత్తు పదార్థాలూ, సంగీత నృత్య వినోదాలూ...ఓ !...యెన్నో అనుభవాలు!...

బ్రహ్మాండమైన ఈ ఆనకట్టకు చట్టబద్ధంగా శంకు స్థాపన జరిపి పునాది రాయిని వేసింది గవర్నరుగారు. కాని, నిజంగా బునాది రాయి వేసింది మాత్రం బాబాయి అజ్మీర్ షరీఫ్ నుంచీ, ఇతర పుణ్య స్థలాల నుంచీ పిలిపించిన మత గురువులు...పెద్దలు వేశారు. తన మనస్సులో వేసుకున్న పథకం ప్రకారం, ఈ 'డాం' నిండుగా రెండు వందల సంవత్సరాల పర్యంతం దసిలిపోకుండా వుండాలనీ, ఇది బహు జనోపయోగకరం కాబట్టి శాశ్వతాయుర్దాయం కలిగి వుండాలనీ బాబాయి అభిప్రాయపడి, పుణ్యమూర్తుల హస్తాలతో మరొక బునాది వేయించి సుముహూర్తంలో పని ప్రారంభించాడు. ఈ హస్తవాసి, సిమెంట్‌కన్నా అధిక బలీయమైందని ఆయన విశ్వాసం. 'డాం' గట్టితనం కోసం నమ్మకమైన ఒక ఇంగ్లీష్ కర్మాగారం సిమెంటుని ప్రత్యేకించి వాడటానికి అనుమతి పొందాడు.

ఒకసారి నిర్మాణాన్ని బాబాయి తనిఖీ చేస్తూంటే, ఓవర్సీర్లముందు నిలబడి ఒక కంట్రాక్టర్ నమ్రతగా ఇలా అన్నాడు :—

"సప్లయి అవుతూ వున్న యీ సిమెంటులో కొంచెం కల్తీ వున్నట్టు కనిపిస్తున్నది హుజూర్ (దొర) !" అన్నాడు. దీన్ని బాబాయి విన్నాడు.

"అట్టే వాగేస్తున్నావ్ ! యేమిటి ? యీ సిమెంటు అచ్చంగా ఒక ఇంగ్లీష్ కంపెనీ కర్మాగారానిది తెలుసా ? వెర్రి వేషాలు వేయకు" అని గద్దించి పలికాడు బాబాయి...గాడిదవలె మాట్లాడిన అతడికి ఓవర్సీర్లు తగిన బుద్ధి చెప్పారు తరువాత—

మహాకోసీ డాం నిర్మాణార్థం, ఐదు సంవత్సరాలు అదే ప్రదేశంలో వున్న బాబాయికి ఆ ప్రదేశం అంటే విడరాని మమకారం ప్రేమాభిమానం యేర్పడ్డాయి. ఆయన తమ్ముడూ, నేనూ ఒకసారి ఆయన యెదట వున్నప్పుడు మమ్మల్ని చూసి బాబాయి యిలా అన్నాడు.

"నేను మరణించాక నా శరీరాన్ని యిక్కడే ఖననం చేయాలి" అటూ యిటూ దృష్టి సారించి చూసి "అదుగో ! ఆ కనపడే యెత్తైన దిబ్బ యిందుకు అనుకూలంగా వుంటుంది" అని చూపాడు.

బాబాయి మనస్సులోగల అభిప్రాయాలని మేమంతా గమనించాము. ఒకటి...ఆ ప్రదేశం అత్యంత రమణీయమైన వాతావరణం కలిగి వుంది... ఇంకోటి...ఆయన కృషి ఫలితం, పెన్నిధి, మహా కోసీ ఆనకట్ట అక్కడే శాశ్వతంగా వుండిపోతుంది. ఆనకట్ట నిర్మాణ వైఖరినీ, ఆనకట్టనూ చూట్టానికి వచ్చే పోయే జనం అంతా, దాంతోపాటు తన గోరీని, అంటే ఆనకట్ట నిర్మాత గోరీని కూడా దర్శించుకుని రెండు అశ్రు బిందువులతోనైనా సానుభూతి ప్రదర్శిస్తారని ఆయన ప్రగాఢ విశ్వాసం. అది నిజమే కాని, శిథిల స్థితిలో వున్న ఆ దిబ్బమీద గోరీ అంతటి దర్శనీయంగా వుంటుందా అని పరిసరాలు పరిశీలించిన నాకు అప్పుడు ఆశ్చర్యం వేసింది ! స్థలాన్నే యెందుకు బాబాయి యెంచుకుంటున్నాడా అన్న ప్రశ్న వచ్చింది...కాని,

ఆయన గోరీ వ్యవహారం గురించి ఇప్పుడే స్థల నిర్ణయం విషయంలో ఆయన్నే అడగటం అమంగళం అనిపించింది.

ఈ నిర్ణయంలో ఆయన దూరదృష్టి, దూరాలోచనా ఎంతగా కనిపించినవో ఈనాడు గాని నా కర్థం కాలేదు...ఆయన చెప్పిన ప్రకారం గోరి అదే దిబ్బ మీద నిర్మించబడి వుంటే, 'డాం' తెగిన ప్రవాహానికి అది గురి కాకుండానే నిలిచి వుండగలిగేది...

ఘోరమైన ప్రవాహం వచ్చి, 'మహా కోసీ ఆనకట్ట' తెగి ధ్వంసం అయిపోయిందని పత్రికల్లో వార్త చదవగానే, తక్షణం బాబాయి జ్ఞప్తికి వచ్చాడు...పదిహేను సంవత్సరాల క్రితం నా చేతులతో స్వయంగా ఆయనను మట్టిపాలు చేయటం ఒక్కసారి నా హృదయంలో మెదిలింది... అది సరీగ్గా ఇదే రోజున జరిగింది. నాటినుండి నేడు...ఈ మధ్యకాలంలో కనీసం ఒకసారి కూడా గోరీ మీద 'ఫాతిహా' చదవటానికి నేను వెళ్ళలేదు. ఈ వార్త చూశాక అక్కడికి వెళ్ళకుండా ఒక్క క్షణం వుండబుద్ధి కాలేదు. ఆయన గోరీకి యేమన్నా నష్టం జరిగిందేమో చూడాలని తాపత్రయం యెక్కువైంది.

ఒక రోజున్నర, రైల్లోనూ, లారీలోనూ ప్రయాణం చేసి యీ స్థలానికి చేరుకోని, హృదయ విదారకమైన దృశ్యాన్ని చూశాను...... ఆనకట్టతోపాటు ఆనకట్ట నిర్మాత గోరీ కూడా నామరూపాలు లేకుండా ప్రవాహానికి బలి అయిపోయింది !!!—

* * * *

ఇప్పుడు మహాకోసీనది దిగువ భాగం, వెనకటిలా రమణీయంగా కాక, ప్రత్యేక విధంగా కనిపిస్తోంది...యెంతో తారతమ్యం ఉంది దృశ్యంలో...దిగువ భాగంలో వున్న వనాలు కుళ్ళగిల్లిపోయినై...పంట పొలాలు ప్రవాహంతో డొక్కుపోయినై. దిగువభాగంలో గట్లమీద ఉన్న పల్లెలు, పడిపోయిన గోడలతో, కుళ్ళిన పశు శరీరాలతో కుప్పలు కూలి

ఉన్నాయి...ఆనాటివలె బట్టలు వుతికే చాకళ్ళూ లేరు...పశువుల కాపరులూ కనపట్టం లేదు...ఆ ధ్వనులూ లేవు...ఆ పాటలు వినపట్టం లేదు. మనుష్యులకు బదులుగా గద్దలు గుంపులుగా కూడి వుండటం కనిపిస్తోంది. ప్రవాహంలో మరణించిన పశువులూ తదితర జంతువుల కుళ్ళు మాంసాన్ని బహుశా ఈ గద్దలు ఆరగిస్తూంటాయేమో !...కాకుంటే అవి మానవ కళేబరాలైనా కావచ్చు...వాటిని వరద బాధితుల సహాయ సంఘంవారు బహుశా ఇంకా తొలగించి ఉండకపోవచ్చు !—

'డాం' రెండు వైపులా తెగి శిధిలమైపోయింది. నీటి వరద ఆ తెంపుల్లోంచి వెనకటికన్నా వత్తిడితో తన్నుక వస్తూన్నది. కాని ఈ ప్రవాహంలో వెనకటి సంతోష మర్మర ధ్వనులు లేవు...శ్రుతి కఠోరంగా, రస విహీనంగా, ఘోరంగా ఉందీ ధ్వని...

నది దిగువ భాగంలో ఒక ఫర్లాంగు దూరంలో——ఒక చెట్టు గుబురు కొమ్మల్లో ఇరుక్కుని ఉన్న ఒక జంతువు శవం కనిపిస్తున్నది... బహుశా బాబాయి గోరీ ఉన్న స్థలం అదే కావచ్చునని నా హృదయం చెబుతున్నది.

---

రచయిత:
"అస్మత్ చుగ్తాయీ"

# "నరక జీవి"

మూల కథ పేరు:
"దోజఖీ"

కళాశాలా జీవితం గడిపినన్నాళ్లూ, చదువు సంధ్యల్లోనే విశ్రాంతి లేకుండా వుండేది. సాహిత్యం పట్ల శ్రద్ధ ప్రదర్శించే సమయమే లేకుండా పోయింది. కాలేజీనుంచి బయటపడ్డ తరవాత, సారస్వతం పట్ల అభిరుచి అధికమవుతోన్నకొద్దీ, ఒక అభిప్రాయం కూడా బలపడుతూ వచ్చింది. రెండు సంవత్సరాల క్రితమూ, అంతకు పూర్వమూ తయారైన సారస్వతం అంతా వట్టిచెత్త అనీ, విరసమూ అభూతకల్పనలతో కూడుకున్న చెదలుపుట్ట లాంటిదనీ, నిన్నా ఇవ్వాళా ప్రకటింపబడుతున్నదే వినూత్నమైన ఉజ్వల సారస్వతమనీ ఒక విశ్వాసం యేర్పడ్డది - కాని, పుంఖాన, పుంఖంగా వెలువడుతోన్న నూతన సారస్వతంలో పుస్తకాల అట్టమీద పేరుచూసి, యేవో చెత్త అని అవతల పారవేస్తున్నవి ఎన్నో ఉంటున్నాయి. చదివే ఓపిక లేకుండా పోతోంది!—

"అన్నిటికన్నా నిష్ప్రయోజనకరమైన పుస్తకాలు, అధిక సంఖ్యలో వెలువడుతోన్న "అజీంబేగ్ చుగ్తాయీ" రచనలేనని నాకనిపించింది. "ఇంట్లో వండిన కోడి కూర పప్పులాగా చప్పగా వుంటుంది అన్న రచన కూడ వుంది. అజీంబేగ్ రచనలు మా యింట్లో ఒకరిద్దరు పాతకాలం వదినెలూ, అమ్మగారూ తప్ప మరెవరూ స్పృశించనైనా స్పృశించరు...వాటిల్లో వుండి చచ్చిందేమిటన్నదే అందరి భావమూనూ! ఇది సారస్వతం కాదనీ, వట్టి అసహ్యాకరమైన, పరిహాసభాజనమైన పాత తుక్కు ప్రణయ కథలనీ, నీచాభిరుచులని ప్రకోపింపజేసే సంభాషణలు తప్ప మరేమీ వుండవనీ,

వాటిని చదవకుండానే ఒక దృఢాభిప్రాయం. 'అజీం భాయీ' రచనలను నేనెందుకు చదవకూడదో నాకే కారణం కనిపించకపోయేది. కారణం బహుశా నాలోవున్న అహంభావం, ఈర్ష్యాపరత్వం కావచ్చు...ఆ రచనలు పాతకాలానివనీ, మనం నవ్యయుగం వాళ్ళమనీ అనుక్షణం అనిపించేది——

ఒకనా డెందుకో తీరిగ్గా పడుకుని అటూ యిటూ దొర్లుతుంటే యాదాలాపంగా, అజీంబేగ్ వ్రాసిన 'యక్కా' అనే రచనమీద దృష్టిపడ్డది. పొద్దుపోవటంలేదు. యేదో కాసేపు పేజీలు తిరిగేద్దామని పుస్తకం చేతిలో పట్టుకున్నా, నా పక్కనే రహీమ్ కూడా వున్నాడు. ఇద్దరం చదువుకుందా మనుకున్నాం. యే స్థితిలో వుండి చదవటం ప్రారంభించామో తెలీదుకాని, పుస్తకం ఒక్కో పేజీ చదువుతోన్న కొద్దీ, కడుపుబ్బ నవ్వు వచ్చేంత హాస్యం...పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వు వస్తుంటే రానురాను చదవటమే కష్టమైపోయింది...ఇలా నవ్వుకుంటూ మేము చదివే సమయంలోనే 'అజీం' వచ్చాడు. తన పుస్తకాన్నే చదువుతూంటం చూసి అతని ముఖం విప్పారింది. అతని ముందు అతని పుస్తకం చదవటానికి యెందుకో నాకు మనస్కరించలేదు. అజీం చాలా చురుకైన వ్యక్తి. "నేను చదివి విని పిస్తాను యిటివ్వు" అని పుస్తకం తీసుకుని, అక్కడక్కడా రెండు మూడు ఖండికలు చదివి వినిపించాడు. అవి వింటూ మేము నవ్వీ నవ్వీ కడుపుబ్బి భూమ్మీద దొర్లేంతవరకూ వచ్చింది నిజంగానే. అతని రచన...అతనే చదువుతోంటే, రసవత్తంగా వుండి, మేం చదివినదానికంటే హాస్యరస పూరితమై, నవ్వుల రవ్వలు రేగిపోయినై...అతన్ని గురించి యేర్పరచు కున్న అభిప్రాయం ఆ క్షణం అదృశ్యమైపోయింది. ఒకరకంగా అతను మమ్మల్ని బుద్ధిహీనులను చేసి వదిలాడనే చెప్పొచ్చు.

"నా రచనల్లో యేమీ వుండదని అంటూంటారుగా మీరు? ఏమన్నా వుందా? అని యెత్తిపొడిచాడు అజీం....అతను నిజం మాట్లాడుతున్నప్ప టికీ ఆ యెత్తిపొడుపు స్వరం విన్నాక, సదభిప్రాయం నశించి, చికాకు వేసింది...మనస్సు రోషపడి, అడ్డదిడ్డంగా అతనితోవాదించవలసివచ్చింది.

తర్కం - వాగ్వాదం - పెరిగింది. ఈ సంఘటన తర్వాత, అతని పుస్తకాలంటే తగని అసహ్యం పెరిగిపోయింది...అజీం రచనలని, అతను బ్రతికి వుండగా ఒక్కదాన్నికూడా నేను మెచ్చుకోలేదు...అతనుమాత్రం నారచనలనూ, వాటి ఉదాత్తతనూ అపరిమిత సంతోషంతో అభినందిస్తూండేవాడు. అజీం యేదన్నా మాట్లాడితే అదంతా గిట్టకనే మాట్లాడతాడని మొదటినుంచీ అందరి అభిప్రాయం కావటంతో, అతని పొగడ్తలు విన్నా నాకు చిరాకు వేసేది...నన్నూ నా రచనలనూ వెక్కిరిస్తున్నాడనిపించేది. అది వెక్కిరింత కాదని అనిపిస్తూనే వున్నప్పటికీ ఆ అభిప్రాయం అలాగే వుండేది. నిజంగా అతనొకర్ని వెక్కిరిస్తున్నా విమర్శిస్తున్నా, అతను ఉపయోగించే పదజాలం, తీవ్రవిమర్శనా ధోరణీ, కడుపుబ్బ నవ్వు పుట్టించే వ్యంగ్య సరణిలో ఉంటాయి ...నన్ను పరిహాసం చేస్తే నేను ఉద్రేకంలో యేదన్నా అంటానేమోననే భయమే నన్నెప్పుడూ పీడిస్తుండేది :—

"నీవు నాకన్నా మంచిగా రచనలు సాగిస్తావేమోనని నాకు అమితమైన భయంగా వుంది" అని ఒక్కోసారి అతను అంటూంటే, యేవో నాలుగైదు కథలుమాత్రమే రాసిన నా కది వెక్కిరింతగా కనపడి హృదయం ఉడికిపోయినట్టుండేది. అజీం బ్రతికినన్నాళ్ళూ ఇలానే గడిచింది.

"చనిపోయిం తరువాత మనిషిమీద అధిక ప్రేమ, విలువ యేర్పడుతుంద"న్న సామెత అక్షరాలా నిజమనిపిస్తుంది. అతను చనిపోయాక యెందుకో అతని రచనలు ఆమూలాగ్రం చదవాలనిపించి, ఒక్కటీ వదలకుండా చదివేశాను. జీవితంలో అతని రచనలు పఠించడం నాకదే ప్రథమం. చదువుతోంటే ప్రయత్నించి, పట్టుదలగా చదవనవసరంలేకుండానే, నా హృదయాన్నే అతని ప్రతి అక్షరం ఆకర్షించి వదలకుండా చదివించింది...అతని రచనల్లో అతని అసమాన ప్రతిభ స్పష్టంగా అడుగడుగునా కనిపించింది. ఒక్కోవాక్యంలో అతని వ్యక్తిత్వమే చిత్రించబడి గోచరం అయింది... ఒక్కక్షణంలో కలిగిన తీవ్రదుఃఖం - మరుక్షణంలోనే ఆనందంగా మారిపోయి కనిపించే ముఖం—, యెప్పుడూ నవ్వుతూనే మెరవడానికియత్నించే

కండ్లూ—పాలిపోయిన ముఖంమీద, భయాస్పదమైన మేఘంలా వాలి పోతోన్న జుట్టూ—ఎత్తుగా వుండి పాలిపోయిన నుదురూ—యెండిపోయి బీటలు పడుతూన్న పెదవులూ—వాటివెనుక నిర్ణీతదశకన్నా ముందుగానే విరిగిపోయి, యెగుడు దిగుడుగా కనిపించే దంతాలూ—బొమికలు తేరిన కండలు లేని పొడుగాటి చేతులూ—ఆడవాళ్ళలాగా గోళ్ళరంగుతోకనిపించే సన్నని పొడుగాటి చేతి వ్రేళ్లూ—వెదురు గడల్లాంటి సన్నని కాళ్ళతో యెప్పుడూ ప్రత్యక్షం అవుతూండే అజీం హృదయ దర్పణంలో ప్రతి ఫలించాడు.

పాపం! చివరి దశలో శరీరానికి నంజునీరు యెక్కటంతో వెదురు పుల్లల్లాంటి సన్నని చేతులూ, కాళ్ళూ తెగవాచి పోయినయ్... వాపుతో లావెక్కి బండలవలె తయారైన అతని కాళ్ళను చూసి భయపడి, వెళ్ళ వలసివస్తే తలావుదిక్కుగా వెళుతూండేవాళ్ళం...ఎండిపోయిన అస్థి పంజ రంలా సాధారణసమయాల్లో కనిపించే అతని గుండెలు, వాపుతో మిలమిల లాడుతూంటే చూట్టానికే భయం వేసేది...ఆ స్థితిలోకూడా అతనెప్పుడూ నవ్వుతూనే వుండేవాడు...ఆ యెండిన గుండెలలో, అంతటి ధైర్య హృద యం, ఉత్సాహం యెక్కడ వున్నదో అవగతం కాకపోయేది...ఆరిదేవుడా! ఇతనింకా ఇంత ఉత్సాహంగా యెలా నవ్వ గలుగుతున్నాడా అని పించేది...ఇతనేదన్నా భూతమా అనిపించటమేగాక, భగవదిచ్చా శక్తితో కుస్తీ పడుతూన్నట్టుండేది. . తన స్థితిని గురించిన చింతలేకుండా మరణిం చేంతవరకూ నవ్వుతూ జీవించాడు. దైవకృప వక్రిస్తూ, దగ్గు, ఆయాసం వస్తున్నప్పటికీ ఆ హృదయం చిరునవ్వును వదల్లేదు. ప్రపంచానుభవం నిమిత్తం, దైవ, భౌతిక తత్వాలు సృష్టించి అట్టే ప్రత్యేకించి పెట్టిన యావత్తు దుఃఖశక్తికూడా అతన్ని యేడ్పించలేకపోయింది. దుఃఖాగ్నిలో తప్తం అవుతూకూడా, నవ్వుతూ, నవ్విస్తోవుంటం మానవు డెవడికీ సాధ్య మయ్యే పనిగాదు. అతన్నిచూసి మామయ్య "బ్రతికివున్న శవం" అంటూ వుండేవాడు...మామయ్య అన్నట్టు, దైవం అనుకూలించి, శవాలుకూడా

యీ విధంగా చలనశక్తీ, నిర్వీరామ స్పందనశక్తీ కలిగివుండేటట్టయితే ప్రపంచమే అంతా శవప్రాయం యెందుక్కాదు ? అనిపించేది.

నేను అతనికి చెల్లెలిననే దృష్టితో కాకుండా, కేవలం ఒక స్త్రీననే దృష్టితో అజీంను చూస్తుంటే హృదయం కంపిస్తుండేది...అతనిహృదయం యెంత అచంచలమైంది...! అందులో యెంత జీవశక్తి వుంది...! ఆశ్చర్యం వేసేది...అతని ముఖంమీద వెదికి చూదామన్నా మాంసకండరం లేదు...కాని, కొన్నాళ్ళనుంచీ వంటికి నీరురావడంవల్ల ముఖం వుబ్బుగానూ, సుందరంగానూ మారింది. గుంటలుపడ్డ చెక్కిళ్ళు ఉబికినయ్...ముఖంలో చావుదల సౌందర్యం ఆవేశించింది. శరీరవర్ణంలో చిత్రమైన మార్పువచ్చి పచ్చగా మారి చేతబడి బొమ్మలా తయారైంది. కండ్లల్లోమాత్రం, ఒక్కోసారి స్వల్పానికే ఉత్సాహవంతమయే పసిపిల్లల తత్వం, మరోసారి, నవ యువకుల కోరికల వెలుగులూ ప్రదర్శితమవుతూండేవి...అవే నేత్రాలు ఒక్కోసారి దగ్గుతెర ఆయాసం వచ్చినప్పుడు ఉక్కిరి బిక్కిరై బాధతో వేదన పడుతూండేవి గదాంటే, స్వచ్ఛమైన కండ్ల నీలపురంగు అడుగుభాగం రక్తహీనమై పసుపుపచ్చగా మారి, నిస్సహాయ స్థితిలో చేతులు గిలగిలా కొట్టుకుండేవి...గుండెలు బ్రద్దలై పోతయ్యేమోనన్నంత ఆయాసం... కొద్దిసేపటికి ఆయాసం, వగర్పూ, తగ్గిపోగానే, మళ్ళీ యధా ప్రకారం... ఆ కండ్లల్లో అదే వెలుగు...అదే హాస్యనృత్యం...అదే మెరుపు....

నేను మొదటిసారిగా అతని రచన "ఖానం" అనేది చదివి కొద్ది రోజులే అయింది.... అందులో కథానాయక పాత్ర అత్యద్భుతమైన జీవ శక్తి గలది...అజీంలో స్వయంగా కథా నాయకుడి లక్షణాలు లేకపోయినా అతని అంతరాంతరాలలో అణగిపడివున్న భావశక్తికీ, ఆదర్శాలకూ ప్రతినిధిగా ఆ కథలో కథానాయకుడు సృష్టి అయినాడు...కుంటివాడు స్వప్న లోకంలో విహరిస్తూ, తను యెగిరి, దూకి, గంతులువేస్తున్నట్టూ, పరుగెత్తుతున్నట్టూ దర్శించినట్టుగానే, అతని హృదయంలోని ఇచ్ఛా శక్తికి సంబంధించిన ఉద్రేకం, అలాంటి కథానాయకపాత్ర సృష్టికి మూలం

అయింది. వ్యాధిగ్రస్తుడై మంచంలోపడివుండీ, తన తోటివాళ్ళు చేసే అల్లరినంతా భరిస్తూ, ఆ హీరోవలెనే, తన "ఖానం" మళ్లీ తన నొకసారి చూసుకోగల్గుతుందన్నట్టుగా వుండేవాడు—

"ఖానం"లో ఇతరుల కక్కరనిపించేదేమీలేదు. రాసిన వ్యక్తి తప్ప మిగతా పాత్రలన్నీ జీవభరితమైనవే. సరియైనవే. అన్నయ్య, వదినె-నాయనమ్మ - అమ్మ - నాన్న - అన్నయ్య - కొడుకులూ చిల్లర మల్లర జనం అంతా ఆ పాత్రల్లో వున్నారు. అలా వుంటారుకూడాను. అంతే వుంటుంది. అన్ని యిండ్లలోనూ అలానేవుంటుంది...అజీంవ్రాసిన ఆ పుస్తకం నా వరకు నాకు అచ్చంగా మా యింటికి రూపచిత్రంలా వుంది అక్షరాక్షరమూ- మా యింట్లో అంతా అజీంకు కథలో పాత్రలంగానే వుంటూంటాము...మేము కదలాడే చిత్రాలం ...అతను శిల్పి. ఈ చిత్రాలను సజీవంగా సారస్వత శిల్పంలా చెక్కడం అతని పని. 'ఖానం' యెన్నిసార్లు చదివినా నా కంటికి కనిపించేదీ, మనస్సుకి అనిపించేదీ యిదే...అందులో కుటుంబం బృందాన్ని చూస్తుంటాను. ఆ వదినే, ఖానం తగూలాడు కుంటున్నారు. ఒకసోదరుడు అల్లరిపనులు చేస్తున్నాడు...రచయిత తను స్వయంగా తలవంచి చిత్రం చెక్కడంలో నిమగ్నుడై వుంటాడు--

అజీం రచనల్లో "ఖర్వా బహద్దూర్" అనేది ఒక ఊహాత్మక ఇతివృత్తం. దీని మొదటిభాగం "రూహెలతాఫత్"లో ప్రచురితం అయింది. నిరామయుడూ, నిరాశ్రయత్వంతో విధిలేనివాడూ, అయిన ఒక వ్యక్తి తన తోబుట్టువులతో అల్లరి చేయిస్తూ ఉంటాడు. అతను స్వయంగా రెండడుగులు కూడా వేయలేడు. కాని అతని తోబుట్టువులు దోపిళ్ళుచేస్తుంటారు. తనైతే స్వయంగా ఒక వేలు బరువు మోయలేడుకాని, తోబుట్టువుల తీవ్రాఘాతాల క్కూడా తట్టుకుని సురక్షితంగా నిలబడతాడు...ఈ యితివృత్తంలో రచయితలోని అణగివున్న ఉద్రిక్తభావం, తనుకూడా ఆరోగ్యవంతుడై తనవాళ్ళతోపాటు శక్తి సహనాలు కలిగివుంటే యెంత బావుండు నన్న భావం స్పష్టం అవుతూ ఉంటుంది...ఒక వ్యాధిగ్రస్తుడి హృదయంలో

యెన్ని ఆకాంక్షలు ఉంటుంటాయో ఆరోగ్యవంతులకి అర్థం కాదు. వాస్తవ ప్రపంచంలో విహరించి తృప్తిపొందలేని వ్యక్తి స్వాప్నిక ప్రపంచంలో విహరిస్తూ, తనకు అభిమాన లక్షణాలన్నిటినీ తనలో ఆరోపించుకుని తృప్తి పడుతుంటాడు. అలాగే అజీం కూడా. తనకు మంచివనుకున్నవీ, వాస్తవంగా తనకు లేనివీ అయిన వాటన్నిటినీ, కథల్లో సృష్టించుకుని, హృదయాగ్నిని చల్లార్చుకుంటుండేవాడు. బతకటానికి ఒక ఆత్మతృప్తి యేర్పడటం అవసరం కదా మరి!...

అసలు పుట్టటమే ఈసురో మంటూ పుట్టాడు అజీం!- దూదిమెత్తలు చుట్టి పెంచవలసి వచ్చింది... అనారోగ్యవంతుడైన అతను యే నేరం చేసినా, అందరినీ కొట్టి తిట్టినా నాన్నగారు క్షమిస్తూ వుండేవారు. అందరికీ ఇది మంటగానే వుండేది. అయినా చేసేదేముంది? వ్యాధిపీడితుణ్ణి ఎప్పుడూ జబ్బువాడు, జబ్బువాడు అనే అంటుంటే అతనికిక సంతోషం యెప్పుడు కలుగుతుంది?...కాని, ఇలా దయతలవటంవల్ల, తాను తక్కువవాడిననే భావం మరీ బలపడుతుంటుంది....తిరుగుబాటుతనం ప్రబలుతుంది. కోపం పెచ్చు పెరుగుతుంది.. కాని యివన్నీ తీరేమార్గం యేముంది? అందుకే అజీం హృదయంలో అంత కళపెళలు...అంతా ఇంట్లో అతనిపట్ల గాంధీజీ అహింసావిధానం అవలంబిస్తూండేవాళ్ళం... తననుకూడా ఒక మానవుడుగా అంతా గుర్తించాలనీ, అందరు ఆరోగ్యవంతులతోపాటు తననుకూడా దండించరేమనీ, తన నసలు అందరితోపాటు బ్రతికివున్న వాడుగా లెక్కించరేమనీ అతను నిరంతరం ఆవేదనపడుతూంటాడు. ఆవేదనతో చివరికి అతనికోఉపాయం తట్టింది... ఎక్కడపడితే అక్కడ, ఎప్పుడంటే అప్పుడు, ఇద్దరు మనుషులుంటేచాలు, వాళ్ళమధ్య ఏదో ఒక తగాదా సృష్టిస్తుండేవాడు. క్షయవ్యాధిగ్రస్తుడూ; అనారోగ్యవంతుడైనా అజీంకు భగవంతుడు చురుకైన మెదడనీ, తీవ్రమైన ఆలోచనాశక్తినీ వాగ్ధాటినీప్రసాదించడంతో, యెప్పుడూ యేదో ఒక తతంగం తన ఆత్మతృప్తి నిమిత్తం సృష్టిస్తుండేవాడు....అతను మాట్లాడితే యింట్లో తగాదారాకుండా వుండదుమరి....చివరకు అందరికీ,

నాన్నకూ, అమ్మకూ, అన్నదమ్ములూ, అక్కచెల్లెండ్లు అందరికీ అతనంటే విసుగెత్తిపోయింది. చక్కని సంసారజీవితం గడిపే ఐక్యకుటుంబం యుద్ధ రంగం అయిపోయింది.... ఇంతటికీ మూలకారణం తనే....అజీం....ఇలా అతనిలో స్వార్థం, ఆత్మభూషణా తీవ్రస్థాయికి చేరుకుంది. అనారోగ్యవంతుడూ, సదా రోగీ, బలహీనుడూ, అందరి దయవల్ల క్షమింపబడుతున్నవాడైన వ్యక్తే యింట్లో 'హీరో'గా మారిపోయాడు....ఇంకేంకావాలి? అతని బలహీనతలన్నీ అతనికి పదునైన ఆయుధాలూ, మందుగుండు సామగ్రిగా ఉపయోగిస్తున్నాయి. నోరు మరీ కొవ్విపోయింది. తాటాకు నాలికైంది. అతనంటే ప్రపంచానికే పరమాసహ్యం యేర్పడ్డది!— అతన్ని చూస్తేనే మనస్సుకి వాంతి అయినట్టుండేది. నవ్వుతూ నవ్వుతూనే అందరినీ శత్రువులనుగా చేసుకోవటం అతనికి అవలీలగాచేసేపని అయింది.

అందరికీ అసహ్యాకారకుడైనా, అతన్ని నిర్దయగా వదలిపుచ్చాలన్న అభిప్రాయం మాత్రం యెవరికీ లేదు...ఇంట్లోవాళ్ళు, అతనిమీద జాలిపడి అతనికి యెంతగా ఒదిగివుండేవాళ్లో అంతగా అతను అందరి మీదా విరుచుకపడుతూండేవాడు...అతని ముఖం చూస్తేనే అసహ్యం వేస్తుంది అన కూడదు గాని, అతనికి అంతా శత్రువులలాగే వుండేవాళ్లు...భార్య అతన్ని భర్త అనుకోకపొయ్యేది! పిల్లలు, తండ్రి అని గుర్తించకపోయేవాళ్ళు!... చెల్లెలు అతన్ని అన్నవు కావు పొమ్మంటుంది!...అన్నదమ్ములు అతన్ని చూస్తేనే ముఖం మాడ్చుకుంటారు... ''నేను పామును కన్నాను'' అంటుంది కన్న తల్లి!!!—

చావబోయేముందు అజీం అన్నయ్య స్థితి మరింత దయనీయంగా వుంది...నిజంగా నా మట్టుకు నాకు; అతని చెల్లెలుగా కాకుండా, మాను షత్వ దృష్టితో చూస్తే, అతనింకా త్వరగా చావడేమనిపించేది...కండ్లల్లో చివరి ప్రాణం వున్నప్పటికీ, ఒకరి మనస్సుని నొప్పించడానికే అతను ప్రయత్నిస్తూ వున్నాడు. నరకానికి అతిధిగా పోతూ, నరకప్రాయుడైనాడు. తను వ్రాసుకునే కథలన్నిటిలోనూ వేలాది రచనల్లో తనే హీరో, విలన్

అయి కూచున్నాడు. ఇప్పటికీ యింకా తన నంతా ప్రేమించాలనీ, భార్య పూజించాలనీ, పిల్లలు భక్తిని ప్రదర్శించాలనీ, చెల్లెలు గౌరవించాలనీ, తల్లి తనను ప్రేమగా గుండెలకు హత్తుకొని లాలించాలనీ ఆశిస్తూండేవాడు!——

అమ్మ నిజంగానే అతన్ని హృదయానికి హత్తుకుంటుంది. యెంత విద్వేషి అయినా కన్నకడుపు మరి...! కాని, మిగతావాళ్ళ ద్వేషం అలాగే వుండిపోయింది...ఊపిరితిత్తులు పూర్తిగా తినిపోయాయి...నీరు అధిక మైంది. కండ్లు మూతలు పడిపోయినై...గుడ్డివాళ్ళవలె, పరకాయించి వెతుక్కున్నా మార్గం కనిపించని స్థితి వచ్చింది....హీరో అయికూడా ఓటమి అతనిదే అయిపోయింది...అతనికి కావాలనుకుని వాంఛించింది లభించనే లేదు. దానికి బదులుగా, అందరి ద్వేషం, అసహ్యం, నిరసన మాత్రం లభించినయ్...మానవుడి దేముంది? ఎంత పేరు ప్రఖ్యాతులు వున్నప్పటికీ, అసహ్య ద్వేషాలకు గురిఅయి, జీవితాన్ని వదిలాడు.

సరిగా యిప్పటికి నలభై రెండు సంవత్సరాల క్రితం, ఒక ఉదయం బలహీనుడైన రోగిష్టి పసిపాప జన్మించి, జీవిత నాటకాన్ని ప్రదర్శించాడు. ఇరవయ్యో ఆగస్టున, ఉదయం ఆరు గంటల సమయంలో షమీమ్ నా దగ్గరకు వచ్చి "అన్నయ్య చనిపోతున్నాడు. లే....లే..." అని లేపాడు. నా కసలే లేవబుద్ధి కాలేదు...ఇంకా బిర్రబిగిసి, పడుకుని ఉదయం పూట వీచే చల్లగాలిలో నిద్రపోదామనుకుంటూ "అతడెప్పుడూ చావడు.... వట్టిది....అనవసరంగా నన్ను మేల్కొల్పుతున్నావు?" అన్నాను.

"దౌర్భాగ్యురాలా! నిన్ను తల్చుకుంటున్నాడు." అన్నాడు షమీమ్ ఆందోళనా పూరిత స్వరంతో——.

"ఐతే, మధ్యాహ్నం మాట్లాడతాన్లే! అలా చెప్పు...వెళ్ళు... ఐనా, షమీమ్, నీవు అనుకుంటున్నావుగాని, అతనెప్పటికీ చావడు" అన్నాను నేను బద్ధకంగా, నిశ్చితంగా——

నేను క్రిందికి దిగి వచ్చేసరికి అతని నోటి మాట పడిపోయింది. గదంతా సామాను ఖాళీ చేసి వుంచారు. చెత్తా చెదారం, పుస్తకాలూ అన్నీ

తీసి అవతల వేశారు. మందు సీసాలు ఆ నిర్భాగ్యుడి రూప చిత్రంవలె దిగబడి వున్నాయక్కడ. ఇద్దరు పసిపిల్లలు భయపడుతూ మొత్తల్లోకి చూస్తూ నిలబడి అన్నారు. వదినె బలవంతంగా ఆయనకి టీ త్రాగిస్తున్నది. అమ్మ పక్కమీద ఛద్దరు (దుప్పటి) దులిపి సవరిస్తున్నది. అతని హృదయం లోంచి, శుష్కమైన వేడి నిట్టూర్పులు వస్తున్నాయి. అశ్రువులు ఇంకిపోయినై.

అతని మీదికి వంగి "చిన్నన్నయ్యా!" అని పిల్చాను నేను. ఒక్క క్షణమాత్రం అతని కండ్లు బలవంతంగా తెరిపిడి పడినవి. పెదవులు కొద్దిగా చిరునవ్వినయ్!...అంతే...మళ్లీ మృత్యుచ్ఛాయలు ప్రసరించినయి. మేమంతా బయట నిలబడి, దాదాపు నాలుగు గంటలసేపు, శుష్కమైన ఆ చేతులు మృత్యువుతో చివరిసారిగా యుద్ధం చేయటం చూశాము. ఈ యుద్ధం ఇప్పట్లో అయిపోతుందని కూడా మేము అనుకోలేదు. ఆ శుష్కత్వంలో కూడా యింకా తీవ్ర శక్తి ఉందనిపించింది——

"చిన్నన్నయ్య అయిపోయాడు" అన్నారెవరో.

ఎప్పుడూ...ఎప్పటికీ చావడు" అన్న భావం నాలో కలిగింది——,

ఇప్పుడివ్వాళ్ళ ఆయన రచనలు చదువుతూన్నా...ఆయనెప్పుడూ మరణించడనీ, ఆయన యుద్ధం నిరంతరంగా సాగుతోనే వుందనీ అనుకుంటున్నాను. చావటంతో యేమవుతుందని? చచ్చిన తరవాత కూడా వాళ్ళు యెంతమందికోసమో, యెన్నో జన్మలు యెత్తుతోంటారు. యెత్తితీరతారు. "దుఃఖంతో, విద్వేషంతో యుద్ధం చేయండి! చచ్చేవరకూ, చస్తూనే చచ్చిన తరవాతా కూడా యుద్ధం చేయండి!" అన్నదే వాళ్ళ సందేశంగా వుంటుంది.

ఆయనెప్పుడు చావడు. తిరుగుబాటు రేపే అతని విప్లవాత్మను యేదీ చంపలేదు. అతను మంచివాడు కాడు. అతని ఆరోగ్యమే మంచిగా వుంటే అసలు పవిత్రుడే కాకపోయేవాడు. అతను అబద్ధాల పుట్ట. అతని జీవితం అసత్యపంకం. అన్నిటినీ మించిన అసత్యం. అతని దుఃఖం, హాసం,

అన్నీ అసత్యాలే. తల్లిదండ్రులనీ, పెళ్ళాం పిల్లలనీ, చివరికి లోకాన్నీ అనేకంగా దుఃఖపెట్టాడని జనం అంటుంటారు. అత నొక విచిత్రజీవి. ప్రపంచానికే శాపం, బాధాకారణంగా అవతరించాడు. అతనికి నరకంతప్ప మరోచోట ఆశ్రయం లేదు... నరకం అంతాకూడా ఇలాటివాళ్ళతోనే నిండి వుండి ఆశ్రయమై వున్నట్లయితే, ఒక్కసారి తప్పకుండా ఆ నరకంలోకి వెళ్ళి; ప్రపంచ నరకంలో అనుక్షణం నవ్వుతూ, బాణఘాతాలు వేస్తూ, వాటిని తట్టుకుంటూ బ్రతికిన ఈ వ్యక్తి, ఆ నరకంలో పెట్టే యాతనలనూ, యాతనలు పెట్టేవారినీకూడా వెక్కిరించి పరిహసిస్తూ ఎలా నవ్వగలుగు తున్నాడో ప్రత్యేకంగా చూడాలని వుంది. అతి కఠోరమైన, నిందాపూర్వక మైన, విమర్శను ప్రదర్శించే ఆ నవ్వును చూడాలి...అంతే...అతని ఆనవ్వుని చూసి నరకాధిపతికూ్కడా వళ్ళు మంటెక్కుతుంది—

అతనిప్పటికీ నవ్వుతూనే ఉంటాడని నా నమ్మకం...పురుగులు అతని శరీర చర్మాన్ని తొలిచి తినివేస్తుండవచ్చు... బొమికలు మట్టిలో చెదలు పట్టి వుండవచ్చు. నరకంలో కింకరులు అతని పీక నులుముతూ ఉండి ఉంటారు. రంపాలతో అతని శరీరం చెక్కలు ముక్కలుగా కోయబడుతూ వుండవచ్చు. అయినా, అతను నవ్వుతూనేవుండివుంటాడు. కళ్ళు విపరీతంగా తిరుగుతూనే వుంటాయి...యెండి, నల్లబడిపోయిన పెదవులు, శుష్కంగా కదలాడుతూనే వుంటాయి...కాని, అతన్ని మాత్రం యెవరూ యేడ్పించ లేరు.

ఊపిరితిత్తులన్నీ కొరుక్కుపోయి, యేండ్లతరబడిగా కదల్లేనిస్థితిలో కాళ్ళు పడిపోయి, ఇంజక్షన్ తూట్లతో దండలన్నీ చిల్లులుపడి, నడుము పక్క దిగువ భాగంలో పుండ్లుపడి, తుదినిశ్వాసం విడిచేస్థితిలో వుండి కూడా, సహజమైన వికృత విమర్శనా తత్వాల్ని విడిచిపెట్టలేదు..,చావటాని కింకా రెండురోజుల ముందుమాట...శరీరానికి చీమలు పట్టడం ప్రారంభిస్తే నవ్వుతూ "అబ్బో ! యీ చీమమ్మగారికి యేమాత్రం ఓపికలేనట్టుందే !... నిర్ణీత సమయంకన్నా ముందుగానే తన భాగం కోసం వచ్చి చేరుతున్నది"

అన్నాడు.., చనిపోయేస్థితిలో వుండికూడా యిలా హాస్యంగా విమర్శిస్తూ వుండడానికి యెంత రాతిగుండె కావాలి ?——

అతనిది ఒకమాట కాదు - ఒక వాక్యం కాదు - అతని రచనలన్నీ ఇలాంటి సినికల్ దృక్పథంతోనే నిండివున్నాయి. అది మెదడు కాదు... ఇంజన్ అనిపిస్తుంది...నిప్పూ, నీరూ అవసరం లేకుండా అహర్నిశలూ తిరుగుతూండే ఇంజను...అతని వాక్కు కత్తెర...ఇవతలి వాళ్ళ శరీరాలు ఆ ధాటకు చీలికలు పేలికలుగా కత్తిరించుకు పోవలసిందే !——

ఇప్పటి కొత్త రచయితల ముందు అతని బండి సాగదు. ప్రపంచం మారిపోయింది. ఆలోచనలు పరిణామం చెందినయ్. హృదయం కంపిస్తే యేడుపు వస్తుందిప్పటివాళ్ళకు...పెట్టుబడిదారీ విధానం—సోషలిజం—నిరుద్యోగం—యీ కాలం రచయితల్ని వలవేసి లాగుతోన్నాయ్. మనం యిప్పుడు యేది రాసినా పండ్లు పటపటలాడిస్తూ రాస్తాం...గుప్తమై, సుప్తమై వున్న దుఃఖాన్నీ, అందని కోరికలనూ విషంలాగా వెళ్ళగక్కుతోంటాం...అజీం భాయీ కూడా దుఃఖితుడే...అవిటివాడు...వ్యాధిపీడితుడూ, దరిద్రుడు కూడాను. ధన స్వామ్యతకు విధేయుడు...అయినప్పటికీ జీవితాన్నే ధిక్కరించగల ధైర్యం అతనికి వుంది. దుఃఖంతో ఢీకొని పోట్లాడే సాహసంవుంది. అతను తన రచనల్లోనే నవ్వటం కాకుండా, వాస్తవ జీవితంలో, ప్రతి వ్యవహారంలో కూడా నవ్వుతూ దుఃఖాన్ని తన్ని అవతల పారేసేవాడు.

ప్రపంచంలో వున్న ఎలాంటి వాడికైనా చూస్తూ చూస్తూ ఎలా శత్రువు కాగలుగుతాడో, అలాగే మాటల్లో అందరినీ స్నేహితులుగా చేసుకునే ప్రావీణ్యం కూడా ఉంది అతనికి. చెప్పుకోతగినట్టుగా తను రాసిన "ఖుర్బా బహదూర్" చర్యలే ఎవరితోనైనా అధికంగా సాగిస్తూండేవాడు—

దోవన పోయే వాళ్ళందరినీ పనిగట్టుకుని పిలిచి ఖాతాఖానీ వేస్తూండేవాడు. ఆస్పత్రిలో వుండే రోజుల్లోకూడా, అర్ధరాత్రి నిశ్శబ్ద సమయాల్లో

నైనా అందరు రోగులనూ నిద్రపోనీయకుండా గప్పాలు దంచి పారేస్తుండే వాడు. వందలు, వేల కథలు వాళ్ళు చెబితే వింటూ, తను చెబుతోండేవాడు. అవన్నీ అవే కథలు...దయ్యాల ప్రతాపాలూ, మహారాణీల కలలూ, చమ్కీ, ఇత్యాదులు...అతని కథల్లో ఇతివృత్తాలన్నీ తన జీవితంలోంచే తీసుకునేవాడు...అవన్నీ కల్పితాలు...అతని కథలన్నీ వాస్తవ విరుద్ధమైన సాహసాలతో నిండి వుండడానికి కారణం, అతని కవితా దృష్టి. ఆవేశ భావాలతో, తనలో లేని సాహసాలను ఆ యథార్థంగానైనా సరే, అభి వర్ణించడమే—

అతని నవలు కొన్ని కొన్ని చోట్ల వట్టి గాలికబుర్ల వలె, పొల్లు మాటలతో నిండి వుంటాయి...ముఖ్యంగా, 'కొల్‌తార్' అనేదో చెత్త... అందులో కూడా యథార్థాన్ని వక్రంగా చిత్రించి అల్లరి చేశాడు. "అల్లరి పెళ్ళాం" అనే నవల కూడా కొరమాలిందే కాని, ఆ కాలపు రోజుల్లో యిలాంటి సంఘటనలే అధికంగా ఉండేవి.

"చమ్కీ" అనే నవల ఒక అగ్నిజ్వాల అని చెప్పవచ్చు !—శుష్క మైన శరీరంతో, వ్యాధి గ్రస్తుడై వుండి, యెన్నడూ తన భార్యను తప్ప మరో పరాయి ఆడదాని ముఖమన్నా చూడని, అస్థిపంజరం భావ జగత్తులో నిద్రాణంగా యెంత ప్రగాఢ ప్రణయ తృష్ణ వుందో దీంట్లో కనిపించి అత్యా శ్చర్యకరం అనిపిస్తుంది. అది వ్రాసింది ఇతనేనా అనిపిస్తుంది. చమ్కీ మౌన దృష్టుల్లోని సందేశం. హీరో కార్యకలాపాలూ తననే హీరోగా చిత్రించుకుని ఊహించుకుంటూ రచయిత అల్లిన అల్లకం, ..స్వీయజీవి తంలో లేని అభూతకల్పన...ఊహామాధుర్యం...

అజీం భాయీ వాక్యరచనా పద్ధతి యిప్పటి, యీ వినూత్న సార సత్వంలోవలె తేటతెల్లం కాకుండా వుంటుండేది—ఆయన స్త్రీ సౌందర్యాన్నే మనో నేత్రంతో చూసేవాడు కాని, శరీరాన్ని ప్రాధాన్యతగా చూళ్ళేదు. శారీరక నిర్మాణం, ఒంపుదింపుల వర్ణనలు, ఇవన్నీ పాతకాలపు

గులేబకావలి, ప్రణయవిషం తదితర నవలల్లో వుంటే వాటిని పాతవి అని త్రోసివేశాం!...కాని, యిప్పుడు యీ మన కాలంలో తిరిగిఅదే అభివర్ణన మన వినూత్న సారసత్వంలో ప్రవేశించింది. అదేరకంగా వక్షస్థలంలోని ఒంపుదింపులూ, అవయవాల బిగువులోని యింపులూ, తొడలలోని స్నిగ్ధత్వం, అభివర్ణనలతో ఆధునిక సాహిత్యం అభివృద్ధి అవుతుంది. ఇలాంటి దాన్ని అజీం 'నగ్న సాహిత్యం' అంటుండేవాడు. అదంటే ఆయన భయపడేవాడు. అతనికి భావ నగ్నత్వం అధికంగా యిష్టం. అతి నీచంగా మాటల్లో ప్రదర్శించడానికి జంకలేదు. స్త్రీ హృద్గత భావాలను మాత్రం ఆయన నగ్నంగా దర్శించేవాడు. కాని, దానికి ఆయనే వస్త్రధారణం స్వయంగా చేయించేవాడు.

అజీం భాయీ, యెన్నడూ నాతో చనువుగా అరవిడిచి మాట్లాడక పోయేవాడు. నన్ను పసిపిల్లక్రింద పరిగణిస్తూండేవాడెప్పుడూ...యెప్పుడూ యెవరితోనైనా ఆయన లైంగిక సమస్యలమీద చర్చలు సాగించకపోయే వాడు—యెన్నడో ఒకసారి ఒక స్నేహితుడితో ఇలా అంటుండగామాత్రం విన్నాను.

"ఆధునిక రచయితలు, చాలా ఉద్రేక పూరితులు...వట్టి క్షుత్పీడితులు. పైగా వాళ్ళమీద లైంగిక తత్వ ప్రభావం తీవ్రంగా ప్రసరిస్తోంది. వాళ్ళు యేది రాసినా...లాగే ఉంటుంది".

ఇంకా యీ అభిప్రాయం కూడా చెబుతుండేవాడుగదాంటే "భారతీయ సాహిత్యంలో లైంగిక తత్వానికి ప్రతి యుగంలోనూ తగినస్థానం కల్పించబడివుంది...ఈ మనదేశీయులు లైంగిక తత్వాభిమానం కలవాళ్లు. మన కవిత్వం, ప్రాచీన పురాణేతిహాసాలూ, ప్రాచీన పూజా విధానం, యేది తీసుకున్నా లైంగిక వాంఛల ఉద్రేకం స్పష్టంగా కనిపిస్తుంది. లైంగిక తత్వాన్నీ ప్రణయాన్నీ ఒక్కక్షణం మరిచిపోయినా, పదిమందికీ పరిచయం లేకుండా పోయేస్థితీ, జనాభిప్రాయాల్ని విస్మరించిన స్థితీ

యేర్పడటం ఫలితంగానే, రానురాను, ఆ నగ్న ప్రణయం అదృశ్యమై 'లైలా ప్రణయం' లాంటి సున్నిత ప్రణయం రంగం మీదికి దిగింది.''

ఆయనకు హజాబ్ ఇంతెయాజ్ అలీ అంటే ప్రత్యేక శ్రద్ధవుండేది. (ఈ సందర్భంగా శ్రీమతిని నేను క్షమాపణ వేడుకుంటున్నాను. ఇది మరణించేవారి రహస్యం కాబెట్టి చెప్పవలసివచ్చింది.) ఈవిడ చాలా అందంగా అసత్యకల్పన చేస్తుందని అంటుండేవాడు. నేను అసత్యాలు రాసినా, 'ఉల్టా సీదా'గా రాస్తానని ఆయ నెప్పుడూ నామీద ఆరోపణలు చేస్తుండేవాడు...నా అసత్యకల్పన, అన్నార్తుడి ఆక్రందనవలె ఉంటుందనీ, తన అసత్యం ఆకలిగొన్నవాడి చిరునవ్వులా వుంటుందనీ అనేవాడు.. యిందులోని అర్థం యేమిటో ఆ భగవంతుడికే తెలియాలి.

అజీంభాయీ కథలన్నిటినీ సాధారణంగా మేమంతా 'అసత్యం' అనే పేరుతో పిలుస్తుండేవాళ్ళం. ఆయన వాక్యం ప్రారంభిస్తేచాలు, కీర్తిశేషులైన తండ్రిగారు నవ్వారనో, లేక 'తత్వవిహారం' పేరుతోనో ప్రారంభం అయేవి...తను రాసే గప్పాలూ, కబుర్లన్నిటినీ అజీంభాయీ 'ఖసరెసహరా' అంటుండేవాడు. మరిన్నీ అతనింకా ఇలా అభిప్రాయాన్ని ప్రకటించేవాడు.

"అయ్యా! ప్రపంచంలో అబద్ధంకన్నా ఆకర్షణీయమైన వస్తువు మరేదీలేదు. వాక్యాన్ని ఆహ్లాదకరంగా మలచాలంటే కొంత అబద్ధంపాలును అందులో కలిపితీరాల్సిందే'' అని.

స్వర్గనరకాల వర్ణనకూడా 'ఖసరె సహరా'యే నని కూడా అతనంటాడు——

ఈ మాటలు విని మామయ్య మండిపోయేవాడు. "యీ జీవచ్ఛవానికిదంతా కాఫిర్ తత్వం అనిచెప్పి ఆవుచేయండి!'' అనేవాడు. దానిమీద అజీంభాయీ, మామయ్యా బంధువులూ, శిష్యుల పరిహాసం మొదలుపెట్టేవాడు....మామయ్య గురుపీఠం అంటే వట్టి మోసంలా అతనికి కనిపించేది.

కాని, "ప్రపంచంలో ప్రతిమోసమూ అబద్ధమైందే. అబద్ధమే అతి మధుర మైంది" అంటుండేవాడు.

"నేనే ఆరోగ్యవంతుణ్ణయివుంటే మా నాన్న గోరీని ప్రతిరోజూ పూజిస్తుండేవాణ్ణి...రెండు సంవత్సరాలపాటు యేదో పూజా పురస్కారాలూ భజనలూ, కవాలీలూ, యేర్పాటు చేయించి, చాదర్ చఢాయిస్తే, మూడో యేటికల్లా అదొక పెద్ద పుణ్యస్థలమై, ఆ దర్గాకి నేను గురు పీఠం వహిస్తాను...బోలెడంత సంపాదన" అని చమత్కారంగా అంటుండేవాడు అజీంభాయీ—

పక్కా దగాకోర్లూ, వంచకులనూ చూస్తే అజీం భాయీకి పరమ సంతోషం, మోసమూ, వంచనా, పరిహాసభాజనమైనవీ, నీచమైనవీ కావనీ, వాటికి యెంతో సాహసమూ, కౌశలమూ వుండాలనీ అంటుండేవాడు. అతనికి నృత్య గీత వినోదాలంటే మంచి యిష్టం...అదైనా యెటువంటి నాట్యం అని...? యెవరన్నా బిచ్చగత్తెలూ, పకీర్ల పిల్లలూ, బజార్లలో అడుక్కుతింటూ డబ్బులు తీసుకుని డ్యాన్సు చేసేవాళ్లు యిలాంటి వాళ్ళ నాట్యం అంటే శ్రద్ధగా చెవి కోసుకుని వింటూ చూస్తూ ఆనందిస్తాడు. ఆ ఆనందం శ్రద్ధా చూస్తుంటే నాకు వళ్ళు మండిపోయేది...ఆ ఆకలి కడుపుల నగ్న నాట్యంలో అతనికే మాధుర్యం అనుభవం అయేదో అర్థం కాదు !!

అజీం భాయీ నమాజ్ చదువుతూండగా నేనెప్పుడూ నా కండ్లతో చూళ్లేదు. పక్కమీద అడ్డంగా కాళ్ళారజాపి పడుకుని 'ఖురాన్ షరీఫ్'ని పఠిస్తుండేవాడు. అవిధేయతగా పవిత్ర గ్రంథాన్ని అలాగే పెట్టుకుని గుర్రుకొట్టి నిద్రపోతూండేవాడు...ఖురాన్ షరీపుని అలా ఉపయోగించరాదనీ, ఆ పుస్తకం యేమిటనీ అంతా అంటూ అడుగుతుంటే వాళ్ళ బాధ పడలేక, దానికి పైన ఒక కాగితం అట్టదిట్టంగా వేసి, అదేదో లా పుస్తకం లేండి' అంటుండేవాడు. అబద్ధం ఆడటం ఆయనకు కొనగోటిలో వున్న అంశం...

మత సూత్రాలు పూరికే వల్లించి వేస్తూండేవాడు...ఎవరితోనన్నా తర్కం, చర్చలూ పెట్టుకోవడానికి ఉపయోగపడే విధంగా అవసరమైన సూత్రాలన్నిటినీ భద్రంగా జ్ఞప్తిలో వుంచుకునేవాడు. అవి లక్ష్యాలుగా వినిపిస్తూ చర్చాయుద్ధం కొనసాగించడం అలవాటు...అవి వినటం అవతలి వాళ్ళకి యెంతో ఆనందంగా వుండేది...ఖురాన్ ఆయతనాలు కూడా చాలా జ్ఞప్తిలో వుంచుకుంటూండేవాడు. యెక్కడ పడితే అక్కడ ఉదాహరణలూ, లక్ష్యాలూ ఖురాణ్‌లోంచి చదివి వినిపించి తన వాదాన్ని నిలబెట్టుకునేవాడు. అవి ఖురాన్‌లోనివి అవునా కాదా అని సంశయం యెవరన్నా సూచనా ప్రాయంగా వెల్లడిస్తే తక్షణం తలగడ క్రింద వున్న ఖురాణ్ తీసి ప్రత్యక్షంగా చూపుతుండేవాడు. అతను మజీద్‌కు నమ్మిన భక్తుడు. ఇమాం హుస్సేణ్ మాట్లాడినట్లు మాట్లాడుతూ గంటలకొద్దీ సంభాషణ సాగించేవాడు——

"నాకో కల వచ్చింది గదాంటే...హజ్రత్ ఇమాం హుసేణ్ నిలబడి వున్నాడు. అటునుంచి 'మజీదుల్ అయన్' ప్రవేశం జరిగింది... ఆయన హజరత్ పాదాలను పట్టుకుని భక్తితో ప్రార్థించారు. చేతులు రెండూ జోడించి, ఉప్పొంగిన హృదయంతో వుండగా, ఆయన్ని లేవనెత్తి, హృదయానికి హత్తుకున్నారు...అంతే...ఆ రోజునుంచీ నేను మజీద్‌ను అధికంగా గౌరవించటం ప్రారంభించాను...స్వర్గంలో వారిద్దరూ సన్నిహితులై పొత్తు కలుపుకున్నారు కూడా. యిక మధ్యన మనం పోట్లాడి చావటం యెందుకూ ?" అంటుండేవాడు.

అజీం భాయీకి రాజకీయాలంటే కొంచెం శ్రద్ధ తక్కువగానే వుండేది "నాయనా ! మనం యెప్పుడూ నాయకులం కాలేము. మనకెందుకీ రాజకీయాలు ?" అంటుండేవాడు...నీవు కూడా యేదో ఒకటి రాజకీయ వ్యవహారం చేస్తుండరాదా అని అంతా అతన్ని అడుగుతోండేవారు... కాని, పాడైన దగ్గూ, ఆయాసం అతన్ని వదిలిపెట్టక, కదలనీయక వుండేవి. చాలా రోజులక్రిందట, 'రియాసత్' పత్రికలో రాజకీయ, ఆర్థిక

వ్యవహారాలను గురించిన వ్యాసాలు కొన్ని రాయబడినై. అవి యేమ య్యాయో తెలీదు...మత పిచ్చే అధికం అయింది....రానురాను చిట్టచివరి రోజుల్లో చర్చలూ, వాదాలూ, తర్కాలూ, తగ్గించివేశాడు—

"అబ్బాయిలూ! మీరంతా మంచి దిట్టంగా, పుష్టిగా వున్న ఆరోగ్య వంతులు....నేనో మృత్యువు ఆసన్నమై వున్నవాడిని...స్వర్గం, నరకం అనేవి యెదురైతే యెలానని నా భయం! కాబట్టి, అవాకులూ, చెవాకులూ మాట్లాడకుండా పవిత్రంగా వుండాలని నా నిశ్చయం" అనేవాడు అజీం.

అతను పరదా పద్ధతికి పూర్తిగా వ్యతిరేకి...కాని, చివరిరోజుల్లో ఇలా అంటుండేవాడు. "యిది పురాతనమైన విషయం—ఇప్పుడు పరదాలు ఆపినా ఆగనిదశ...ఈ సందర్భంగా ఇదివరకు మేము చాలాచాలాచేశాం. యిప్పుడు అన్నీ కొత్తసమస్యలు వచ్చి దీనికి చుట్టుకున్నాయి" అని.

'ఆ నరకానికి పోతేగాని తెలవదు" అని యెవరన్నా అంటే వెంటనే యిలా అనేవాడు.

"ఇక్కడ బ్రతికి వున్నప్పుడు యే భగవంతుడు యేం స్వర్గం ఒరి గించాడని అక్కడ నరకం గురించి భయపడటం...? యేం పరవాలేదు... యివన్నీ మనకు అలవాటే...దేవుడు నరకంలో పడేసి మనలను గనక కాలుస్తాడంటే, ఆయనకే కట్టెలూ, పైపెచ్చు బొగ్గుల నష్టంకూడా కలుగు తుంది. అన్ని బాధలకూ మనం అలవాటుపడే వున్నాం కాబట్టి, నరకయాతన భయాస్పదం కాదులే!" అంటూ.

"అయినా నరకంలో పడితే, మన శరీరంలోని విషక్రిములన్నా చస్తాయి. కొంతనయమే. యిక స్వర్గంలోనే పడ్డామా....చూసుకో అక్క డున్న మౌల్వీలందరికీ మనద్వారా క్షయవ్యాధి సంప్రాప్తం అయినట్టే" అని చమత్కారం వర్ణించేవాడు అజీం.

అతను తిరుగుబాటు తత్వం మనిషనీ, 'నరకజీవి' అనీ అంతా అంటూండడానికి యిదే ముఖ్య కారణం...

అత నెక్కడన్నా చేరనివ్వండి, స్వర్గంలోకానీ, నరకంలోకానీ... అక్కడకూడా కత్తెరలాంటి నాలుక ఆడుతూనే వుందో లేదో చూసి రావాలని నాకు బలీయమైన కోరిక పుడుతున్నది. అక్కడ అతను అందరికీ జుట్టు ముళ్ళుపెట్టి దగాదాలు సృష్టిస్తున్నాడో, లేక ఇంకా, నరకంలోని అప్సర స్త్రీలని నవ్వుతో జ్వలింపచేస్తున్నాడో చూడాలని వుంది——

మౌల్వీలతో వాదిస్తూ తలపట్లకు తయారవుతున్నాడో లేక గణగణ మండే నరకాగ్నిలో పేలిపోతున్న దగ్గు ప్రతిధ్వనింపజేస్తున్నాడో——! ఊపిరితిత్తులు బద్దలయ్యేట్టు ఉబ్బిపోతున్నాయేమో ...!...నరకదేవతలు, అతనికి ఇంజక్షనులు పొడుస్తున్నారేమో...!...వ్యవహారం చూస్తే బావుంటుందనిపిస్తున్నది !!......

అతను ఈ భూమిమీద అనుభవించిన నరకంనుంచీ పైనవున్న నరకానికి వెళ్లాడు...అతని దృష్టిలోనూ, అనుభవంలోనూ రెంటికీ తేడా యేమీ లేదు.......నరకం అనేదానికి నిలకడ యెక్కడ...?——

---

మూల కథ:
"ఆనందీ"

# ఆనందీ

రచయిత:
"గులాం అబ్బాస్"

మునిసిపల్ ఆఫీసులో సందడి మాంఛి జోరుగా ఉంది—మీటింగ్ హాలు ఖాళీలేకుండా నిండిపోవటమేగాక, మునిసిపాలిటీ చరిత్రలోనే అసాధారణంగా, సభ్యులందరూ సమావేశానికి హాజరైనారు—పట్టణంలో పడుపు వృత్తితో జీవించేస్త్రీలు, నివసించే వీధిని, పట్నం అవతలికి ఎత్తివెయ్యాలి అన్నదే ఈనాటి సమావేశంలో ముఖ్య చర్చనీయాంశం—ఈ వేశ్యావాటిక ఉనికి, మానవత్వం, ఆభిజాత్యం, సంప్రదాయం, సంస్కృతులకు అసహ్యమైన కళంకపంకంలా ఉంటమే దానిక్కారణం—

సమావేశంలో చర్చలు కొనసాగుతోన్నాయి. నగరంలో సుప్రసిద్ధ దేశసేవకుడుగా లబ్ధప్రతిష్ఠుడై దేశప్రజాక్షేమాన్నే అనునిత్యమూ కాంక్షించే మహావ్యక్తిగా ప్రసిద్ధిజెందిన పురపాలక సంఘసభ్యు లొకాయన తాపీగా, తార్కికంగా ఈ సమస్యమీద ప్రసంగం జేస్తున్నాడు.

"సభ్య మహాశయులు మరొక విషయం గూడా గమనించాల్సి ఉంది...ఈ వీధి నగరానికి ప్రధానంగా నడిబొడ్డున ఉండడమేగాక, నగరంలో అధికంగా వ్యాపార కార్యక్రమం, రాకపోకలు జరిగే ముఖ్యమైన ప్రాంతంలో ఉంది. ఇందువల్ల మర్యాదస్థుడైన ప్రతిపెద్దమనిషికీ, తప్పనిసరిగా ఈ వీధిలో కాలుపెట్టవలసిన స్థితి ఏర్పడి తీరుతోంటుంది. ఆభిజాత్య సంపన్నులైన పెద్దమనుషులే గాకుండా, వారి కూతుళ్ళూ, కోడళ్ళూ, ఇల్లాళ్ళూ అంతా అవసర వస్తువుల కొనుగోలుకోసం రావాల్సిఉంటుంది—స్వంతంగా చూసుకోవాల్సిన షాపింగ్ వ్యవహారాలు అందరికీ ఉంటుంటాయి గదా! మహాశయులారా! ఆభిజాత్య మర్యాదలుగల కుటుంబాలకు చెందిన

మన యువతులు ఈ వీధిలో కనిపించే అర్ధ నగ్న సౌందర్య ప్రదర్శితలైన వేశ్యల కృత్రిమాలంకరణ పద్ధతులు ఒకటికి రెండుసార్లు చూస్తే, మానవ ప్రకృతి సహజంగానే వారు ఈ ఆకర్షణలకులోనై పోవటం సంభవిస్తుంది. హృదయాలలో అపూర్వమైన ఉత్తేజమూ, వినూత్నవాంఛలూ, ఉద్రేకమూ, తప్పనిసరిగా కలిగితీర్తాయి! దానిమీద వారు అమాయకులైన తమ భర్తలను అలాంటి అలంకారాలకోసం స్నోలూ, లవెండర్లూ, జిగేలు మంటూ మెరిసే వలువలూ నగలూ కోసం వేధించుకుతింటం ప్రారంభిస్తారు. ఫలితంగా ఆనంద నిలయాలైన గృహాలూ, సౌఖ్యభరితాలైన జీవితాలూ, శాశ్వతంగా నరకానికి ప్రతిబింబాలై కూచుంటాయి!... సోదరులారా, ఇంతకన్నా ఇంకో ముఖ్య విషయంగురించిగూడా ఆలోచించాలి గదాంటే, ప్రస్తుతం పాఠశాలల్లో - కళాశాలల్లో విద్యాభ్యాసంచేస్తూ జాతి భవిష్యత్తు యావత్తూ వారియొక్క అభ్యుదయంమీదనే ఆధారపడిన వారున్నూ ఏదో ఒకరోజున తుపాను సుడిగుండంలో జిక్కుకున్న ఈ దేశ నౌకను బయటికిలాగే బరువు బాధ్యతలను వహించి చేయూతనియ్యవలసిన వారున్నూ అయిన నవయువకులు - భావి పౌరులు - అంతా ఈ వీధి గుండానే రాకపోకలు సాగించవలసి ఉంటుంది...ఆ సందర్భాలలో చక్కగా కళ్ళు జిగేలుమనేలా ముస్తాబై, వీధిన నడిచే నవయువకుల శృంగార వీక్షణాలను అదేపనిగా ఈ బజారు స్త్రీలు ప్రసరిస్తోంటే సౌందర్యారాధనకోసం ఆహ్వానించి కవ్విస్తోంటే, అనుభవం లేని అమాయికులైన యువకులు యౌవనోద్రేకంతో ఒళ్ళు మరిచి, సుళ్ళు దిరిగి, తమ భావిబాధ్యతలనూ, ఉన్నతాశయాలనూ విస్మరించి, చెడిపోరన్న విశ్వాసం ఏముంది?... కనుక మహాశయులారా! ఈ వీధికాంతల సౌందర్యం - తళుకు బెళుకులూ - మన భవిష్యజ్జాతి పౌరులనే ఆశయ పథంనుంచీ తప్పించి హృదయాలలో నీచాభిరుచులను సృష్టించి, ఆవేశాన్ని పురిగొల్పితే సాంఘిక వాతావరణం కల్లోల భూయిష్ఠమై దౌర్భాగ్య సంచలనం ఏర్పడడానికి అవకాశాలెందుకు యేర్పడవన్నది మనమంమంతా పరిశీలించాలి......"

పూర్వకాలంలో ఉపాధ్యాయుడుగా ఉద్యోగం జేసి అన్నిటికీ అంచ నాల లెఖ్ఖలు గట్టటంలో ప్రత్యేక అభిరుచిగల మరో పురపాలక సంఘ సభ్యుడు ఈ సందర్భంలో మాట్టాడుతూ, "మహాశయులారా! అదిన్నీగాక, పరీక్షలలో తప్పిపోతోన్న విద్యార్థుల సంఖ్యలో గత ఐదు సంవత్సరాల కన్నా రెండున్నర శాతం అభివృద్ధి ఏర్పడిందన్న సంగతి అందరికీ విది తమే!" అన్నాడు—

ఒక వారపత్రికకు సంపాదకవర్గ సభ్యులలో వాడుగా ఉన్న కళ్ళ జోడు ధరించిన సభ్యు డొకాయన ఇలా ఉపన్యసించటం మొదలెట్టాడు గదాంటే, "గౌరవనీయులైన సభ్యులారా! అభిమానం - ఆభిజాత్యం - పౌరుషం - చురుకుదనం - అపరిగ్రహం - ప్రావిత్ర్యం ఇత్యాదులన్నీ మన నగరంలోంచీ దినదిన క్రమంగా హరించుకుపోతున్నాయి!—వీటికిమారుగా లజ్జా విహీనతా - పిరికితనం - అనిశ్చితబుద్ధీ దుష్ప్రవర్తనా - దొంగ తనం - వంచనాశిల్పం - యథేచ్ఛగా విహరిస్తున్నాయి! మత్తుపదార్థాల సేవనం అధికతరం అయినది-హత్యలూ, రక్తపాతాలూ, ఆత్మహత్యలూ, ప్రతిహింసాతత్వం, ఆవేశకావేషాలూ, తదితర సంఘటనలూ పెచ్చుపెరిగి పోతున్నాయిమరి!...ఇన్నింటికీ మూలకారణం ఇదిగదాంటే, అపవిత్ర మైన ఈ పడుపువీథిని మనమంతా చూస్తూ చూడనట్టుగా ఇక్కడ ఉండ నియ్యటమే ననటం సత్యేతరం ఎంత మాత్రమూ గాదనుకుంటా! ఏ పాపమూ యెరుగని అమాయకులైన మన నగర పౌరులు ఈ బజారు వనితల అంద చందాలూ, ఒడుపూ ఒయ్యారాలకు వశులై, వివశులై పోయి వారి మెప్పుకోసం, అధికాధిక మూల్యాలు చెల్లించేందుకై తాపత్రయ పడుతూ, క్రమంగా వీలుగాకపోతే అక్రమంగానైనా ధన ద్రవ్యాలు వెచ్చిస్తున్నారు!...కొన్ని సందర్భాలలో ఈ ప్రయత్నాల్లోబడి మానవత్వ నియమ నిబంధనలను కూడా ఉల్లంఘించి ఘోరమైన దారుణాలకు ఒడి గట్టటం కూడా జరుగుతోంటుంది!......కనక, దీని ఫలితంగా అమూల్య

మైన ధన మాన ప్రాణాలకు తిలోదకాలు వదులుకోవడం, లేకుంటే, జైలు కటకటాల్లో కుళ్ళిపోవడం సంభవిస్తూంటుంది !..."

వయస్సు మళ్ళి, ఉద్యోగంలోంచి రిటైరై పెన్షన్ పుచ్చుకుంటూన్న మరో సభ్య మహాశయుడు చర్చ ప్రారంభించాడు. ప్రపంచంలోని ఉష్ణ శీతలాలన్నిటినీ అనుభవించి, అనుభవాలతో తల బొప్పి కట్టి, ప్రపంచ సంఘర్షణల తాకిడికి అలసిపోయి శేష జీవితాన్ని కుటుంబ సమక్షంలో ప్రశాంతంగా వెళ్ళదీయాలన్న వాంఛ తప్ప ఆయనకు మరో వాంఛ వున్నట్టు లేదు....ఆయన కంఠస్వరం కొంచెం వణుకుతూంది. ఆరోపణా పూర్వకంగా ఉపన్యాసం మొదలెట్టాడు.

గౌరవనీయులైన సోదరులారా ! యీ వీధిలో రాత్రి రాత్రి అంతా వినపిస్తూండే తబలా మోతలూ, ప్రేమ పరిహాసాలూ, ప్రణయ సంగీతాలూ, అల్లరి చిల్లర కూతలూ, అర్థంలేని ధ్వనులూ, వికవికలూ, పకపకలతో చుట్టుపట్ల నివసించే మర్యాదస్తుల చెవులు చిల్లులు పడిపోయాయి. తల ప్రాణం తోకకు వచ్చింది...రాత్రి వేళల్లో 'నిద్ర' అనేది కళ్ళకు దూరం అయింది. పగటిపూట విశ్రాంతి కరువైంది...ఇదేగాక ఈ కొంపల మూలంగా, మర్యాదస్తులైన మా కుటుంబాలలోని, కోడళ్ళూ, కూతుళ్ళ మీద పడే దుష్ప్రభావం అంచనా వేయడానికి యెంతవరకు సాధ్యమో, ప్రతి మహాశయుడూ స్వయంగా ఆలోచించుకోవచ్చు. "యీ మాటలంటూ వున్నప్పుడు, పాపం ఆయన గొంతు పూడిపోయినట్టుంది...ఇక తరవాత మాట్లాడలేకపోయాడు...యీ పెద్దమనిషి నివాస గృహం దురదృష్ట వశాత్తూ, యీ సౌందర్య వ్యాపార వీధికి మధ్యలోనే వుండటంవల్ల సభ్యు లందరికీ, యీ సమస్యలో ఆయనపట్ల అధికమైన సానుభూతి వుంది——

మరి, ఆయన తరవాత మరో సభ్యుడు మొదలెట్టాడు...పురాతన సంస్కృతీ విజ్ఞానం క్షుణ్ణంగావుంది. పురాతన సాంప్రదాయమన్నా, పురాతన వైభవ చిహ్నాలన్నా, స్వీయ సంతానంకన్నా అధికమైన ప్రేమ. ఆయనకు.

ఆయన ప్రసంగిస్తూ "గౌరవనీయులైన సభ్యులారా! విదేశాలనుండి వచ్చే యాత్రికులూ, మన ఆప్తులూ, అతి ప్రాచీనమైన మన యీ నగరాన్ని సందర్శించడానికి వస్తే, వారు యీ వీధిగుండా వెళుతున్నప్పుడు, వారికి కలిగిన అనుభవాలను, వారు ప్రకటించే మాటైతే, నిజంగా మన నాగరికత మీద కుండెడు పేడ నీళ్ళు చల్లినట్టే అవుతుంది'' అన్నాడు.

పురపాలక సంఘం అధ్యక్షులు చర్చను పరిసమాప్తం చేయడానికి లేచారు...పొట్టి ఆకారం, చేతులూ కాళ్లూ అతి కురచ—తలకాయ మాత్రం గుండిగంతలా వుంది...మనిషి చూడగానే మహా యోచనా పరుడల్లే కని పిస్తాడు. తూచి తూచి ఉన్నతంగా మాట్లాడుతాడు.

"సోదర మహాశయులారా! యీ శృంగార స్త్రీల వర్గం అనేది ఒకటి వుండటం, మన జాతీయ సంస్కృతికీ, ఆచార సంప్రదాయాలకూ, మన నాగరికతకూ నగరానికీ కూడా లజ్జాకరమైన విషయమని నేను మీ అందరి అభిప్రాయాలతోనూ ఏకీభవిస్తున్నాను. కాని, దీన్ని యే విధంగా పరిష్కరించడమన్నదే చిక్కైన ఘట్టం...ఈ వృత్తి స్త్రీలమీద చర్య తీసు కోవటం ఎలా సాధ్యమో అర్థం కాదు. వారిని యీ నీచ వృత్తినుండి వైదొలగమని నచ్చజెప్పడం, వత్తిడిని ఉపయోగించడం జరుపవచ్చును కుంటే, మరో జటిల ప్రశ్న యెదురవుతుంది...వృత్తిని విసర్జించిన తరు వాత వీరి భుక్తికి సదుపాయం యేముంది?'' అన్నారు అధ్యక్షులవారు—

తక్షణం ఒక మహాశయుడు తన అభిప్రాయం వెలిబుచ్చాడు. "వీళ్లు వివాహాలెందుకు చేసుకోలేరు?'' అని.

సమావేశపు హాలంతా ఒక్కసారి పకపక నవ్వింది...ఆ నవ్వుల అట్టహాసంతో, శవ ప్రాయంగా వున్న వాతావరణం కొంచెంసేపు ఉత్సా హంతో కలకలలాడింది...నవ్వీ నవ్వీ ఎవరంతట వారు నెమ్మదిపడ్డ తరు వాత మళ్ళీ అధ్యక్షులవారు మాట్లాడ్డం ప్రారంభించారు.

"ఈ సూచనలు ఇదివర కెన్నో పర్యాయాలు చేయటం జరిగింది. మర్యాదస్తులైనవారు వివాహం చేసుకుంటే తమకు అభ్యంతరం లేదని వాళ్ళు జవాబిచ్చారు...కాని, మంచి సంప్రదాయం కల కుటుంబీకులు, వీళ్ళని వివాహమాడేందుక్కాదు కనీసం యింట్లో ప్రవేశించడానికైనా అనుమతించరు...ఇకపోతే, ఈ స్త్రీలవద్ద వున్న ధన ద్రవ్యాలకోసం మాత్రమే ఆశపడి, అలగా జాతి మనుష్యులు ఇందుకు సిద్ధం అవుతారు... కాని, అలాంటి జనాన్ని వీళ్ళు కన్నెత్తి కూడా చూడరు."—

దీనిమీద మరో సభ్యుడు లేచాడు. పురపాలక సంఘం ముందున్న చర్చనీయాంశం, వీళ్ళ పోషణ, వివాహాలకు సంబంధించింది కాదనీ, యీ విషయాలలో పురపాలక సంఘాని కేమీ సంబంధం లేదనీ గౌరవ సభ్యులు జ్ఞప్తిలో వుంచుకోవాలని అర్థిస్తున్నాను...వీళ్ళు పట్నంలో వుండరాదన్నదే ప్రస్తుతాంశం...అనంతరం వాళ్ళు ఆ నరకానికి పోనివ్వండి, మరెక్కడి కన్నా పోనీండి మనకు సంబంధం లేదు...ముందు వాళ్ళు నగరాన్ని వదిలి పెట్టాలి." అని ఖండితంగా అన్నాడు.

"అదైనా అంత సులభసాధ్యం కాదని గౌరవ సభ్యుడు గమనించాలి. వీళ్ళ సంఖ్య పదీ, యిరవై కాదు...వందలవరకూ పెరిగి పోయింది. చాలామందికి స్వంత ఆస్తులూ, పక్కా యిండ్లూ కూడా వున్నాయి," అన్నారు అధ్యక్షులవారు.

పురపాలక సంఘంలో యీ చర్చ దాదాపు నెలరోజులు కొనసాగింది. యెన్నో తర్జన భర్జనలూ, పూర్వాపరాలూ, వాదోపవాదాలు కొనసాగినమీదట చిట్టచివరికి, సభ్యులందరి ఏకగ్రీవాభిప్రాయంతో ఒక తీర్మానం జరిగింది. "వేశ్యావాటికని ఖాళీ చేయించాలి...స్వంత ఆస్తులూ, యిండ్లూ వగైరాలలాంటి వాటిని పురపాలక సంఘమే కొని, వాళ్ళ పునరావాసం నిమిత్తం నగరానికి దూరంగా వుండే ప్రదేశాన్ని కేటాయించి యివ్వాలి...." అన్నది ఆ తీర్మాన సారాంశం.

పురపాలకసంఘ తీర్మానంపట్ల యీ వృత్తిలోని స్త్రీలంతా తీవ్రమైన నిరసన ప్రకటించి ఆందోళన కొనసాగించారు. తీర్మానం అమలు నిమిత్తం తీసుకునే చర్యలను ప్రతిఘటించి, చట్టవిరుద్ధంగా ప్రవర్తించిన నేరానికి కొందరు స్వల్పకాలిక శిక్షలూ, కొద్దికొద్ది జరిమానాలు కూడా అనుభవించారు. . .కాని, ఏకగ్రీవ తీర్మానం ముందు వీళ్ళ ఆటలేమీ సాగిరాకపోగా, గత్యంతరంలేని పరిస్థితిలో సహించివుండక తప్పలేదు—

తరవాత కొంతకాలంవరకూ వేశ్యావాటికలోని ఇండ్లూ ఆస్తుల వివరాలు సేకరించి పట్టికలు తయారుచేయటం, ఆ వీధి ప్లానులు తయారుచేయటం కొనసాగింది. ఈ యిండ్లను కొనడానికి పురపాలక సంఘం చాలా మంది క్రయదార్లను మాట్లాడి సిద్ధపరచవలసివచ్చింది. క్రయదార్లు ప్రత్యేకంగా కుదరని ఇండ్లని వేలాం పెట్టి విక్రయించాలన్న నిశ్చయం జరిగింది. ఇంకా మరో ఆరునెలలవరకూ పడుపుకత్తెలంతా తమతమ స్వగృహాలలోనే వుండటానికి అవకాశం యిస్తూ, యీలోగా పురపాలకసంఘం, వారి నిమిత్తం కేటాయించిన స్థలంలో నివాసవసతులు యేర్పాటు చేసుకోవాలని ఉత్తరువులు జారీ చేయబడ్డాయి.

ఈ స్త్రీల నివాసంకోసం ప్రత్యేకించిన స్థలం, నగరానికి దాదాపు ఆరుకోసుల దూరం వుంది. ఐదుకోసుల వరకూ కంకరతో వేసిన పక్కా-రోడ్డు, ఆ తరువాత మరో కోసుదూరం మట్టిరోడ్డుమాత్రం ఆ ప్రదేశం వరకూ ఉంది . .పురాతనకాలంలో, ఒకటి రెండు శతాబ్దాలక్రితం ఈ ప్రదేశంలో యేదో ఒక మహానగరం విలసిల్లివున్నట్టు, వస్తుచిహ్నాలతోనూ, దట్టమైనపొదలూ, సర్పాలూ, నక్కలూ, తోడేళ్ళకు నిలయంగానూ మాత్రం వుంది. పట్టపగలే గుడ్లగూబలు గీ పెడుతూంటాయి—ఈ ప్రదేశానికి చుట్టుపట్ల నాలుగైదు చిన్నచిన్న పల్లెలున్నాయికాని, యే పల్లె కూడా రెండు, రెండున్నర మైళ్ళకి తక్కువదూరంలోలేదు. . .ఈ పల్లెల్లో నివసించే వారైనా అస్తమానం వ్యవసాయం చేసుకుని బ్రతికేవాండ్లుకాబట్టి, అటూయిటూ పనిమీద తిరుగుతూ అప్పుడప్పుడు ఈ ప్రదేశంగుండా వెళ

తోఁడటం మినహాగా, సాధారణంగా మానవ సంచారంకానీ, నరుడిముఖం కానీ ఇక్కడ కనిపించదు...నక్కలుమాత్రం పట్టపగలయినా యధేచ్ఛగా ఇక్కడ విహరిస్తోంటం చాలామందికి తెలుసు——

సంఖ్యలో దాదాపు అయిదువందలమంది వరకూ వున్న ఈ పడుపు కత్తెలలో కేవలం పద్నాలుగుమంది స్త్రీలకుమాత్రం, నగరంతో సంబంధాలు తెంచుకోవటం కుదరదనిపించింది...వాళ్ళ ఖాతాదార్లకోసమైనా, లేక నాగరికానుభవం కోసమైనా, యెందుకైనా ఈ ప్రాంతంలోనే ఉండటం మంచిదనిపించి, పురపాలకసంఘం ప్రత్యేకించినస్థలంలో గృహాలు నిర్మించుకోవటానికి నిశ్చయించుకున్నారు. మిగతా స్త్రీలలో చాలామంది ఈ నగరాన్ని వదిలి మరో నగరానికి వెళ్లాలనో, లేకపోతే, నివాసాలులేకుండా, యే హోటళ్ళలోనో మకాం వేసి వృత్తి సాగించుకోవాలనో నిర్ణయించుకుని, ఆ ప్రయత్నాలలో పడిపోయారు. గొప్పగొప్ప మర్యాదస్తులు నివసించే వీధులలోనే కొంతమంది ఆశ్రయం సంపాదించి, రహస్యంగా తలదాచుకున్నారు.

ఈ పధ్నాలుగుమంది యువతులు మాత్రం మంచి ఆర్థిక వసతులు ఉన్నవాండ్లేకాక, యిండ్లూ వగైరాలు విక్రయించిన బాపతు డబ్బు పుష్కలంగా పైసా పోకుండా చేతికందింది. ఇంకా, వీండ్లు నగరంనుంచి లేచి పోతే బ్రతకలేమనుకునే ధనవంతుల వత్తాసి, అండదండలూ, ద్రవ్యసహాయం వీళ్ళకు ఉండబట్టి, పురపాలకసంఘం నిర్ణయించిన స్థలంలోనే బ్రహ్మాండమైన ఇళ్ళను, దర్జాగా నిర్మించుకోవాలని వీళ్లు నిర్ణయించుకున్నారు. ఈ కొత్తస్థలంలో స్థలం ఖరీదు నామమాత్రమే కాబట్టి ఒక్కొక్కళ్లూ తమ అవసరానికి మించిన స్థలాలను కొనివేశారు.

ఇక, ఆ నూతనస్థలంలో శిథిలమైన గోరీలూ, దిబ్బలూ, వదిలి, వాటికి కొద్దిదూరంగా వున్న చదునైన స్థలం అనువుగా వుందనీ, అక్కడే గృహనిర్మాణాలు జరగాలనీ నిర్ణయించారు...ఒకటి రెండు రోజులలోనే

భూమి మట్టం సరిచేయబడింది .... తరవాత మరికొన్ని రోజులకే ఇండ్ల ప్లానులూ, వీధులప్లానులూ నిపుణులయిన వాళ్ళు సిద్ధపరిచారు. తక్షణం బునాదుల త్రవ్వకం జరిగి, గృహనిర్మాణ కార్యక్రమం ప్రారంభం అయింది.

పని మొదలైన దగ్గరనుంచీ, పగలూ రాత్రీ భేదంలేకుండా, పట్నం నుంచి బండ్లమీదా లారీలమీదా, ఇటుకలూ, సున్నం, ఇసుక, కలప, ఇనప కమ్మీలూ, విధీ విరామం లేకుండా యీ స్థలంలో వచ్చిపడుతూన్నాయి. వచ్చిన సామానులను గుమాస్తాలు. చంకల్లో వున్న కాపీ పుస్తకాల్లో నమోదు చేసుకుంటూంటే, అంతకన్నా పైవాళ్ళు, తాపీపనివాళ్ళను క్షణక్షణం హెచ్చరిస్తూ పని జరిపిస్తుండేవారు ... తాపీపనివాళ్ళు కూలీలను దబా యిస్తుంటే కూలీలు అటూ యిటూ హడావిడీగా పరుగులుపెడుతూ, ఆడ కూలీలమీద ఆగ్రహం వెల్లడించి కేకలు వేస్తూండేవాళ్ళు...మొత్తంమీద పగలల్లా అక్కడ తీవ్రమైన కోలాహలం...సంరంభంయేర్పడ్డవి. ఇక్కడ బండలు పగిలించే ధ్వనులూ - ఇతరత్రా శబ్దాలూ - చుట్టుపట్ల పల్లెల్లో వున్న జనానికి అవలీలగా వినిపిస్తుంటాయి —!

ఈ నిర్మాణాలకు సమీపంలోగల పాడుబడ్డ దిబ్బల్లో, ఒకచోట ప్రాచీనకాలానికి సంబంధించిన ఒక మసీదు శిథిలావశేషాలు కనిపించాయి. అక్కడే ఒక బావికూడా ఉంది. కాని, ఉపయోగంలేక శిథిలమై పాడుపడి అయోగ్యంగా ఉంది. ముస్లిం మతానికిచెందిన రోజుకూలీలూ, పనిచేయించే వారూ, కాసిన్ని మంచినీళ్ళు త్రాగడానికీ, తీరికవేళల్లో కబుర్లు చెప్పుకుంటూ కూచోడానికీ, అన్నాలు విప్పుకుని తినడానికీ, ఇంకా నమాజ్ కార్యక్రమాలు జరుపుకోవడానికీ, అన్నిటికన్నా ముందుగా యీ మసీదునూ, పాడుబావినీ మరమ్మత్తుచేసి, ఉపయోగంలోకి తెచ్చారు...ఈ బావి మరమ్మత్తు అంద రికీ అత్యవసరంగానే కనిపించటంవల్ల మిగతావాళ్లెవళ్లూ దీన్ని అభ్యంతర పరచలేదు—మసీదు మరమ్మత్తు రెండుమూడు రోజులలోనే పూర్తి అయి, మసీదు అనిపించుకునే పద్ధతికి దిగింది...మధ్యాహ్నం పన్నెండుగంటలు కావటంతోటే కూలీలూ, తాపీపనివాళ్లూ, మేస్త్రీలూ, గుమాస్తాలూ, ఇంకా

పనిని పర్యవేక్షించటానికి వచ్చే వేశ్యల బంధువులూ, ఈ ప్రదేశంలో చేరు కుని కబుర్లు చెప్పుకోవటం అలవాటైంది. చూచేవాళ్ళ కంటికి ఏదో పెద్ద తిరునాళ్ళ ఉత్సవంలా కన్పించేది...

సమీపంలో గల పల్లెలో నివసిస్తున్న ఒక ముసలమ్మ, ఒకనాడు ఈ ప్రదేశంలో ఏదో వింత జరుగుతున్నదని విని చూద్దామని వచ్చింది. ఆవిడ వెంట మరో పసిపిల్లవాడు కూడా వున్నాడు...మసీదుకూ, బావికీ, దగ్గరలోనే ఉన్న ఒక చెట్టుక్రింద నీడలో పిల్లవాణ్ణి తోడుచేసుకుని నెత్తి మీద 'జంగిడి' దింపి కూచుంది. అందులో సిగరెట్లూ, బీడీలూ, కారపు శనగలూ, మిఠాయీలూ, మొదలైన వస్తువులు అమ్మకానికి వున్నాయి. పనివాళ్ళు చిరుతిండి అమ్మకాన్ని ప్రోత్సహించటం ప్రారంభించారు... ముసలమ్మ వచ్చి రెండు మూడురోజులైందో లేదో, ఈ వర్తమానం తెలిసి, ఒక వృద్ధుడు కూడా అక్కడికి చేరుకున్నాడు. మసిలిదానికి దగ్గర లోనే వున్న బావి ప్రక్కన నీడలో, పాత ఇటుకల్ని పేర్చి ఒక అరుగులా తయారుచేసుకుని, దానిమీద బైఠాయించి, పాలు, పంచదార కలిపిన షర్బత్, మజ్జిగ అమ్మకం ప్రారంభించాడు...ఇందు నిమిత్తం అవసరమైన కుండ, గ్లాసు మాత్రం అతని ఆస్తి. ఉదయం రావటం, సాయంత్రం వెళ్ళి పోవటం ఇదీ వాళ్ళ కార్యక్రమం...ఇంకో రోజు, మరో పళ్ళ గంపవాడు, ఆ దారిన్నే వెళుతో ఇదంతా చూసి, మర్నాటినుంచీ, ఖర్బూజా, వగైరా పండ్లని తట్టలో నింపుకుని అమ్మకానికి పెట్టాడు. రకరకాల నినాదాలతో ఖర్బూజాల ప్రచారం ఆకర్షణీయంగా ప్రారంభించాడు...ఇంకో వ్యక్తి, ఆ దగ్గరున్న మరో గ్రామస్తుడే, ఇదంతా గమనించి, రకరకాల మసాలా వంటకాలు ఇంటిదగ్గరే సిద్ధపరిపించుకొని దేగిశాల్లో వేసుకుని, జంగిడి దుకాణం పెట్టాడు. వాటికి తోడు రొట్టెలూ, రెండు మూడు మట్టిగిన్నెలూ, ఒక రాతివెండి గ్లాసు కూడా సాధించి పెట్టుకుంటూ, ఇండ్ల పని వాండ్లకు అడివిలో కూడా రొట్టెముక్కలూ, మసాలా కూరల రుచిని చూపించాడు !——

మధ్యాహ్నం, సాయంత్రం వేళల్లో జరుపుకునే నమాజ్ ప్రార్థనలు సమయంలో కూలీలు, మేస్త్రీలూ, గుమాస్తా ఉద్యోగులూ, అంతా బావిలో నీళ్ళన్నీ అయిపోయేలా, కాళ్లూ చేతులు కడుక్కుని శరీరాన్ని శుభ్రపరచు కుంటూండేవారు...ఒక వ్యక్తి మసీదులోకి వెళ్ళి 'అల్లాహో అక్బర్' అనే నినాదం ఇవ్వగానే, 'ఇమాం' గా పనిచేయవలసిన మరో వ్యక్తి ముందు పేటీలో నమాజ్ పఠనానికి వెళ్ళడం, అతని వెంటనే మిగతా వారంతా వరుసలో నిలబడి ప్రార్థనలు చేయటం జరుగుతూండేది.. ఒక వూళ్ళో వున్న ఒక 'ముల్లా' గారికి ఫలానా మసీదులో (పూజారి) ఇమాం అవసరం వుందని కర్ణా కర్ణిగా వార్త తెలిసింది. ఆ మర్నాడే, వేకువజామున్నే లేచి, ఆకుపచ్చని సిల్కు దస్తీలో 'కురాన్' గ్రంథాన్ని చుట్టి, మత విషయాలకు సంబంధించిన రెండు మూడు గ్రంథాలూ, చిల్లర మల్లర పత్రికలూ పట్టుకుని, ఇక్కడికి చేరుకున్నాడు...మసీదు కార్యక్రమాలను మత నియమాలకు అనుగుణంగా క్రమ పద్ధతిలో నిర్వర్తిస్తూ, ఇమాం విధులను పూర్తిచేసే బాధ్యత అతనికి అప్పజెప్పి వాళ్ళంతా నిశ్చింతంగా ఉండిపోయారు.

ప్రతిరోజూ సాయంత్రం పల్లెనుంచి ఒక మాంస విక్రేత, సామాను తట్ట నెత్తికెత్తుకుని, ఇక్కడికి వచ్చి చెట్టు క్రింద ముసలమ్మ పక్కనే తిష్ఠ వేసేవాడు...నేలమీద ఒక పొయ్యి పెట్టి, కబాబులూ, గుండెకాయలూ ఇతర మాంస పదార్థాలు కమ్మగా వండి, చీకులకు తగిలించి, బస్తీవాళ్ళందరికి అమ్ముతూండేవాడు...ఒకావిడ మొక్క జొన్న కంకులు కాల్చి అందించే వ్యాపారానికి పూనుకుని, తన భర్త సహాయంతో పూరి గడ్డితో చిన్న పందిరిని కూడా యేర్పాటు చేసుకుంది...అప్పుడప్పుడు, ఒక పల్లెటూరి మంగలి కుర్రాడు కూడా, పాత పొది నొకదాన్ని మెడకు తగిలించుకుని, అటూ యిటూ తిరుగుతోంటం కనిపిస్తుండేది. వాడి, బూట్లూ, ధోతీ ధాకకు రోడ్డంతా నలిగి దుమ్ము రేగుతూండేది!...

వేశ్యావాటిక నిర్మాణం పర్యవేక్షణను యెక్కువగా వాళ్ళ సన్నిహిత బంధువులూ, ఇందుకోసం యేర్పాటు చేసుకున్న పెద్ద గుమాస్తాలూ చేస్తుంటారు....ఒక్కోసారి మధ్యాహ్న భోజనాలైన తర్వాత, వాళ్లే పట్నంనుంచి స్వంతంగా బయలుదేరి, తమ ముఖ్య విటులను వెంటవేసుకుని, నిర్మించబడే ఇండ్లను చూట్టానికి విహారార్థంగా వచ్చేవాళ్ళు. పొద్దుకూకుతూ కూకుతూ వున్న సమయానికి తిరిగి పట్నానికి వెళ్ళిపోవటం జరుగుతుంది . వీళ్ళు నగరంనుంచి బయలుదేరి యీ ప్రదేశానికి చేరుతున్నారని తెలిసిన రోజు నల్లా యెక్కడెక్కడినుంచో వందలాది పకీర్లూ, బిచ్చగాళ్లూ, ఆడా మగా అడుక్కునే రకాలు బిలబిలలాడుతూ ఇక్కడికి చేరుకుని, అణాలూ పైసలూ దానం ధర్మం పుచ్చుకునేదాకా, వాళ్ళకి ఊపిరి సలపనంత స్తోత్ర పాఠాలూ- మాటలూ - ప్రారంభించి మరొకళ్ళతో మాట్లాడే అవకాశం లేకుండా చేస్తుండేవాళ్ళు—!

నగరంలో ఏమీ పనిలేకుండా తిరిగే ఆవారా యువకులూ, నిరుద్యోగ రౌడీలూ కూడా అప్పుడప్పుడూ పొద్దుబుచ్చుకునేందుకు ఇక్కడికి రావటం అలవాటైంది. వీళ్ళంతా కాలినడకనే చేరుకుని, ఇక్కడ జరిగే కార్యక్రమాలని అనాహుతంగానే పర్యవేక్షించి వెళుతోండేవాళ్ళు...వీళ్ళు వున్నప్పుడు, ఆ విలాసవతులు కూడా రావటం తటస్థిస్తే వీళ్ళకి పెద్దపండుగ వలెనే వుండేది...అందగత్తెలు ఎటు తిరుగుతూంటే అటే వాళ్ళ వెనక వెనకనే తిరుగుతూ, ఒయ్యారాన్ని అభివర్ణించి అభినందిస్తూ, వెకిలి మాటలూ, నవ్వులతో చిత్ర విచిత్రంగా ఈ రౌడీ రసిక బృందం సభ్యులు ప్రవర్తిస్తోంటారు...ఈ సంఘటనల రోజున కబాబులమ్మే మాంసవ్యాపారి పంట పండినట్టే వుంటుంది.

కొద్దిరోజుల క్రితం వరకూ దయ్యాలు కాట్లాడుతూన్నంత భయంకర నిశ్శబ్దంగా వున్న ఈ ప్రదేశంలో ఇప్పుడు యెటుచూసినా అంతులేని కోలాహలం. సంరంభమే...ఇలాంటి పాడు పడ్డ ప్రదేశంలో యెలా

వుండటమా అన్న భయం మొదట మొదట రోజుల్లో బాగా పట్టుకున్న ఒయ్యారిభామలకు క్రమ క్రమంగా భయం అదృశ్యం కాజొచ్చింది—

ఇప్పుడు ప్రతిరోజూ వచ్చి, కట్టుబడి పనులను తిలకిస్తూ, ఇండ్లను వీలైనంత అందాల మేడలుగా తయారుచేసుకోవటానికి ప్రయత్నిస్తూ, అవసరమైన సలహాలను పనివాళ్ళకి ఇస్తుండేవాళ్ళు—

ఈ ప్రాంతంలో ఒకచోట శిధిలమైన ఒక గోరీకి సంబంధించిన దిబ్బ, చుట్టూతా గోడల చిహ్నాలూ వున్నాయి. సాంప్రదాయం ప్రకారం పరిశీలిస్తే, ఇది వెనకటికాలంలోని యెవరో పుణ్యాత్ముడి గోరీ అనీ దీనికో ప్రత్యేకత వుందనీ చప్పున తెలుసుకోవచ్చు...వేశ్యా వాటిక నిర్మాణం సగంపైగా కొనసాగిన సమయంలో, గోరీ దిబ్బ దగ్గర పొగ లేస్తున్న జాడ కనిపించింది బ్రస్త్రీ పనివాళ్ళకు...కొంచెం చిత్రం అనిపించి చూశారు. అక్కడ అరుణ నేత్రాలతో అలక్ష్యంగా తిరుగుతున్న ఒక పొగడరి మనిషి. లంగోటీని కట్టుకుని వున్న పిచ్చి పకీరు ఒకడు ఆ జాగానంతా శుభ్రంచేసి, రాళ్లూ పెల్లలనూ యేరివేస్తూండటం కనిపించింది...సరిగ్గా రెండు జాముల వేళకు ఈ వస్తు పకీరు బడుగు గుర్రాన్ని వేసుకుని మంచినీళ్ళ బావి వద్దకు వచ్చి కుండతో నీళ్ళను మోసుకెళుతూ, పరిశుభ్రంగా అక్కడ నీళ్ళు చల్లి కడుగుతూంటం చూసి, ఒకనాడు బావి దగ్గరున్న కూలీలు ప్రశ్నిస్తే, అతడు సగం పిచ్చిగా తనలో తనే మాట్లాడుకుంటున్నట్టుగా ప్రత్యుత్తరం ఇస్తూంటాడు. "ఇదెవరి గోరీయో తెలుసా ?...పవిత్రమైన "కడక్ షాహా పీర్ బాద్షా" గారిది...యేమనుకుంటున్నారో...హుం. మా తాతలూ తండ్రులే వెనక ఇక్కడి ముజావర్లు (పూజారులు)" అనుకుంటూ పిచ్చిగా నవ్వేవాడు...నవ్వుతోంటే అతని కండ్లల్లో నీళ్ళు గిర్రున తిరుగుతోండేవి. 'ఫీర్ కడక్షా' మహాత్ముని గురించి కూడా అప్పుడప్పుడు ఇతను కూలీలకు బోధిస్తుండేవాడు.

రాత్రిపూట పకీరు యెక్కడనుంచో యెవర్నో అడుక్కుని రెండు మట్టి ప్రమిదలనూ, కొంచెం ఆముదం నూనెనూ తెచ్చి 'పీర్ కడక్షా'

సమాధికి తలాపునా, కాళ్ళకట్టనా వెలిగించిపెట్టాడు. సగంరాత్రి గడిచాక స్థలంనుంచి, "అల్లాహో అక్బర్" అనే నినాదం కేక పెట్టినట్టుగా విన వచ్చింది.

ఆరుమాసాలు పూర్తి అయినావో లేదో, పద్నాలుగు ఇండ్లూ పూర్తిగా సిద్ధమైనయ్. అన్నీ రెండంతస్థులతోనే తయారై, ఒకదానికొకటి దగ్గరగా విశాలమైన ఆవరణల్తో వున్నాయి. అన్నీ ఒకేతీరుగానూవున్నాయి. వీటిలో ఒక వరుసలో యేడు ఇండ్లూ, ఎదురుగా మరో వరుసలో మరో యేడు ఇండ్లూ...మధ్యన చాలా వెడల్పుగా వదలిన వీధీ, ఒక్కొక్క ఇంటికి అనుబంధంగా అటుప్రక్క రెండు, ఇటుప్రక్క రెండు చిన్నచిన్నకొట్లూ... కొట్లన్నీ చిల్లర దుకాణాలు పెట్టుకోవడానికి అనువుగా వున్నాయి...తల వాకిండ్లు ఉన్నతమైన గేట్లతో విశాలంగా రోడ్డువైపు ఆకర్షణీయంగా వున్నాయి...ఈ వాకిళ్ళలో విశ్రాంతిగా కూచోడానికి పడవలలాంటి అందమైన అరుగులు వున్నాయి. వీటి కొనల్లో పాలరాతితో తయారుచేసిననెమళ్ళు పురివిప్పి నాట్యం చేస్తున్నట్టుంటాయి. కొన్నికొన్నిటికి పాలరాతితో జల దేవతల విగ్రహాలు అమర్చబడ్డాయి. విగ్రహాల అడుగుభాగం అంతా చేప ఆకారంగానూ, ఉపరిభాగం తల, వగైరాలన్నీ అప్సరాంగనారూపంలోనూ మలచబడినవి...

వాకిలి వెనుక, ఇంటిముందు వసారాలో కూర్చోవడానికి అనుకూలంగా పెద్ద గది ఒకటి ప్రతి ఇంటికీ నిర్మితమై వుంది... ఈ గదుల్లోనూ, వసారాలోనూ, నిలబెట్టిన పాలరాతి స్థంభాల నీడ నున్నగా మెరిసే పాల గచ్చుమీద పడి అద్దంలోవలె ప్రతిఫలిస్తుంటే, నీలాల సరస్సులో ఈదులాడుతున్న రాజహంసలు పొడుగాటి మెడలను నీటిలో ముంచిఉన్నట్టు కనిపిస్తుంది !...

ఒకనాటి బుధవారం శుభ సమయంలో, గృహప్రవేశాలకి సుముహూర్తం నిశ్చయమైంది. గృహ ప్రవేశోత్సవ సందర్భంగా, ఈ వేశ్యా స్త్రీలు,

పెద్దయెత్తున ఉత్సవ కార్యక్రమాలూ విందులూ యేర్పాట్లుచేశారు. కొత్త ఇండ్ల ప్రక్కనున్న విశాలమైన మైదానాన్ని చదునుచేయించి, విశాలమైన చాందినీ తెరల పందిళ్ళు వేయించారు. ఇండ్ల వంటశాలల్లో పక్వం అవుతూన్న వంటకాలూ, మాంసాహారం వాసనలూ, కోసులదూరం వరకూ వ్యాపించి, ఇరవై ముప్పై కోసుల దూరంలోవున్న పకీర్లూ, ముష్టివాళ్లూ, కుక్కలనూ, అక్కడికి చేర్పించాయి.

సరిగ్గా రెండుజాములయ్యేవరకు, పూజా ప్రసాదం పంచిపెట్టబడవలసిన పీర్‌కడక్‌సాహెబ్ గోరీవద్ద పోగైన పకీర్లూ తదితరుల సంఖ్య చూస్తే, ఏ మహానగరంలోనూ, ఏ మసీదువద్దా ఏ పెద్దపండగనాడైనా అంత మంది జనం చేరరనిపిస్తుంది. పీర్‌కడక్‌సాహెబ్ గోరీ ఆవరణ నీళ్ళతో కడిగి, తుడిచి పరిశుభ్రంచేయబడింది...గోరీమీద 'పూలదుప్పటి' నిండుగా పరచబడ్డది...ఇక్కడ సేవచేస్తున్న "మస్త్‌పకీరు"కు భక్తులంతా కలిసి కొత్త షేర్వానీ దుస్తులు తగిలించారు. కాని, దుస్తులు వేసుకున్న కాస్సేపటికే అతను చించి పోగులుపెట్టాడు !—

సాయంత్రింపూట మఖమల్‌చాందినీ పందిళ్ళక్రింద, పాలమీగడలాంటి తెల్లని పరుపులూ మెత్తని బాలీసులూ ఉన్నతాసనాలూ అమర్చబడ్డాయి...పాన్‌దాన్‌లూ, పీక్‌దాన్‌లూ, గులాబ్‌పాష్‌లూ, యెక్కడికక్కడే అనువుగా పెట్టివున్నాయి. నవరాగరంజితమైన సమావేశం ఏర్పాటైంది. ఇండ్ల యజమానురాండ్ల బంధువులూ, స్నేహితురాళ్లూ, వాళ్ళ సహివృత్తిపరులూ దూరదూరాలనుండి ఈ ప్రవేశోత్సవానికి విచ్చేసి పాల్గొన్నారు...వాళ్ళ వెటువాళ్ళ పరివారం, సిబ్బందీ అధికసంఖ్యలో వున్నారు. మరి, వీళ్ళందరికోసం వేరే ప్రత్యేకంగా మరో పందిరి వేయించబడ్డది. అసంఖ్యాకమైన గ్యాస్‌లైట్ల వెలుతుర్లో పందిళ్ళూ, ఇళ్ళూ ధగధగ మెరిసిపోతున్నాయి. గృహయజమానురాండ్ర సన్నిహిత బంధువులూ, వారి ప్రియమూర్తులూ, ఆడామగాఅంతా, అత్తరుపన్నరుల్లో మునిగితేలుతూ, అత్తర్లూ తడిపిన దూది పింజలను చెవుల్లో ధరించుకుని, కళ్ళు మెరిసే వస్త్రాలతో,

సీతాకోక చిలుక రెక్కలకన్నా పల్చని చీరలతో ఆభరణాలతో అలంకరించుకుని, అటూ యిటూ తిరుగుతూంటే దేవేంద్ర సభలావుంది. ఆ రాత్రి రాత్రి అంతా నృత్య గాన వినోదాలతో వాతావరణం లావణ్యమయమై పోయింది. అందాల బొమ్మలు అప్సరసల్లా నాట్యాలుచేస్తూంటే అరణ్యంలో కూడా ఆవేశోత్సాహాలు పెల్లుబికినయ్ !—

ప్రవేశోత్సవాలైన రెండుమూడురోజులకు అందరికీ అలసటతగ్గాక, స్త్రీలు తమతమ గృహాలని అలంకరించుకోవడంలో నిమగ్నులై పోయారు. పరిశుభ్రం చేయించడం, అద్దాలు బిగించడం, అలంకరణ వస్తువులు ఆయా స్థానాల్లో అమర్చటం, పడకగదుల్లో నిలువుటద్దాలు పెట్టడంలాంటివి పూర్తి చేసుకున్నారు. చక్కని నవారు పట్టెమంచాలూ, అందమైన చిత్రాలూ మంచం కోళ్ళకి బంగారు మలమూరేకుల తాపడాలూ, గదుల్లో స్థాపించారు- మొత్తంమీద ఒక్క వారంరోజుల్లో ఇండ్లన్నీ భూతల స్వర్గంల్లా మారి పోయాయి !—

పగలంతా అధికభాగం వీళ్ళు నృత్య సంగీత పాఠాలు గురువులవద్ద సాధన చేయటం, పాపలు వర్ణించటం, చదువు పాఠాలు నెమరువేయటం, అలంకరించుకోవటం, కుట్టుపనులు నేర్చుకోవటం, విశ్రాంతిలో గ్రామఫోను రికార్డులు వినటం, మనోరంజిత కార్యక్రమాలలో పాల్గొనటం జరుగుతుంది. సాయంత్రం కాగానే స్నానాల గదికి వెళ్ళగానే, నౌకర్లు చేతి పంపులతో తోడిన నీరు బక్కెట్లలో నింపి వుంచితే స్నానం చేసి, శరీరాలంకరణంలో శృంగార రీతుల్ని ప్రదర్శించటం ప్రారంభం అవుతుంది.

అటు చీకటి పడుతూవుంటే ఇటు ఇండ్లలో గ్యాస్‌లైట్లు దేదీప్యమానంగా వెలగటం ప్రారంభిస్తాయి. ఈ లైట్లు పాలరాతితో తయారైన అందమైన తామరపూవుల్లా అతి కుదురుగా అమర్చబడివున్నాయి. దరవాజాలకూ, కిటికీలకూ, అమర్చబడిన లతలూ పూలూ చెక్కబడిన అద్దాలు, గ్యాస్‌లైట్ల కాంతికి కళ్ళు మిలమిలలాడేలా వెలిగిపోతుంటాయి. పూర్ణంగా

అలంకరించుకున్న పడుపుక త్తెలు, ఇండ్ల వాకిళ్ళలో, వరండాలలో నిలబడి, పొరుగిండ్లవాండ్లతో మాటామంతీ కబుర్లు చెప్పుకోవటం, కిలకిలనవ్వటం, నిలబడి నిలబడి అలసిపోయినప్పుడు, డ్రాయింగ్‌రూమ్‌లోకి వెళ్ళి, మెత్తని పట్టుదిండ్లను ఆనుకుని చేరగిలబడి, విలాసంగా అరమోడ్పుకండ్లతో ప్రియుల రాకకోసం నిరీక్షించడం సాధారణ కార్యక్రమం ...వాళ్ళ విటులూ, పరిచారకులూ, వాళ్ళకి స్వాగతోపచారాలు చేస్తూంటే, తట్టలలో నింపుకొచ్చిన సారాయిబుడ్లూ, ఫలాలూ, ఉపాహారాలూ స్వీకరిస్తూ సుఖం అనుభవించటం తరవాత కార్యక్రమం—నగరంనుంచి, జట్కాబండ్లమీదా మోటార్లమీదా వీళ్ళకోసం ప్రతిరోజూ ఖాతాదార్లు వస్తుంటం పరిపాటి. ఈ పద్నాలుగు ఇండ్ల జనవాసానికి, నగరంనుండి విలాసపురుషులు చేరుకోగానే, యెక్కడ లేని సందడీ సంరంభం తీవ్రతరం అవుతూంటాయి...ప్రతి ఇంట్లోనూ, ప్రియుల వినోదంకోసం సంగీత గానాలూ, నృత్య వినోదాలూ, నిర్వహింపబడుతూ, తీయని కంఠస్వరాలూ, వాటికి లయవేస్తూన్న అందగత్తెలపాదాల గజ్జెలందెలూ, మువ్వల రవళలూ, దూరదూరాలవరకూ వాతావరణంలో వ్యాపించి, మాదకత్వాన్ని కల్పిస్తోంటాయి. మధురోన్మత్తమైన, కామప్రేరణాత్మకమైన ఈ ఆనందానుభవకాలంలో ఎంత రాత్రి గడిచేదో ఎవరికీ అర్థం కాకుండానే గడిచేది.

ఒక్కొయింటికి అనుబంధంగా అద్దెల కివ్వడానికి నిర్మింపబడిన కొట్లలోకి కిరాయాదార్లు కూడా చేరటం కొద్దిరోజులలోనే ప్రారంభమైంది. నలుగురు జనాన్ని ఇక్కడికి ఆకర్షించి, పోగుచేయడానికి, ఇండ్ల అద్దెలు నామమాత్రంగానే వుంచబడ్డాయి...అందరికన్నా ముందు ఒక కొట్టును అద్దెకు పుచ్చుకున్న ఒక వర్తకురాలు, మొట్టమొదట్లో ఇక్కడ జంగిడి దింపుకున్న ఒక ముసలమ్మ. దుకాణం నిండా అమ్మకం వస్తువులున్నట్టు చూసేవాండ్లకు కనిపించడానికి, చుట్టూతా, తంతెలు పేర్చి, కాళీ సిగరెట్టు డబ్బాలు రకరకాలవి తెచ్చి నింపారు. దుకాణం ముందు రంగురంగుల నీళ్ళతో నింపిన సీసాలు, షర్బత్ సీసాలవలె కనిపించడానికి ఉంచారు...

తన స్థితికి తగ్గ ఫాయాలో ముసలమ్మ తన చిన్న సిగరెట్ల దుకాణాన్ని వీలైనంతవరకు సిగరెట్టు బుట్టలూ, రంగురంగుల కాగితాలలో అలంక రించుకుంది. పాత సినిమా పత్రికల్లోంచి చింపిన సినిమాతారలూ, యాక్టర్ల బొమ్మలని జిగురు రాచి గోడలకి అంటించి వుంచారు.... దుకాణంలో అమ్మ కానికివున్న అసలు సరుకు రెండు మూడు రకాల సిగరెట్లు, ఒక్కో రకానికి నాలుగైదు ప్యాకెట్లున్నూ, ఏడెనిమిది బీడిలదిండ్లున్నూ... రెండుమూడు అగ్గిపెట్టెల డజన్లూ, తమలపాకులూ, వక్కలూ, సున్నం వగైరాలు మాత్రమే. నాలుగైదుకట్టల పొగాకు, వెలిగించుకోవటానికి అరకట్టకు మించని కొవ్వొత్తులు కూడా వున్నాయి—

రెండో దుకాణంలో ఒక షావుకారూ, మూడోదాంట్లో ఒక మిఠాయి వర్తకుడూ, నాలుగవ దాంట్లో ఒక కసాయి మనిషీ, ఐదవ దాంట్లో కబా బుల వ్యాపారీ, ఆరవ దాంట్లో పండ్ల వ్యాపారి వచ్చి చేరారు - పండ్ల వ్యాపారి చౌక ధరలకు పల్లెటూళ్ళనుంచి ఏవో నాలుగు పండ్లు తెచ్చి, ఇక్కడ రెట్టింపు లాభానికి అమ్ముకునేవాడు—ఎప్పుడూ హాజరుగా మరో అర తట్టెడు పండ్లు అధికంగా ఉంచేవాడు. ఇంకో పూలమ్మే వ్యక్తి కూడా ఇతనికి స్నేహితుడైనాడు. పగలల్లా రకరకాల పూలను వివిధాలంకర ణాలతో దండలుగా అల్లి, చెండ్లు చుట్టి, సాయంత్రంపూట వాటిని బుట్టలో వేసుకుని ఒక్కో యింటికి ప్రత్యేకంగా వెళుతూ వాటిని అమ్ముకోవటం, వాళ్ళతో ఆ ఇండ్లల్లోని పనివాండ్లతో గంటల తరబడి గప్పాలు వేస్తూ, హుక్కా పీలుస్తూ కూచోటం, ఈ పూల వర్తకుడికి అలవాటు. వీళ్ళని చూడటానికి వచ్చే విలాసపురుషులు, ఈ పూలమనిషి వుండగా వచ్చే మాటైతే, ఇక ఆ పూటల్లా ఇతను అక్కడినుంచి కదలకుండా తిష్ఠ వేసు క్కూర్చుని, ఆ విలాసవంతుల అందాలను అభివర్ణిస్తూ, అక్కడ జరిగే నృత్య గానాది వేడుకలలో తను కూడా మునిగి తేలుతూ అమ్మకం మాటే మరిచిపోతాడు.... పెద్ద సంగీతాభిరుచి కలవాడివలె, గానానికి తన్మయుడై తల వూపుకుంటూ, గుడ్లగూబలా కళ్ళు వెళ్ళబెట్టుకుని అందరినీ రెండు

కండ్లతో చూస్తూ కూర్చోవటం అతనికి సరదాగా వుండేది...ఈ కార్యక్రమంలో ఎప్పుడన్నా రాత్రి పొద్దుపోయి, పూల మాలలు అమ్మకం కాకుండా ఒకటీ అరా మిగిలితే, వాటిని తన మెడలోనే వేసుకుని ఊరి బయటి మైదానంలోకి వెళ్ళి, ఇష్టం వచ్చినంతసేపు గొంతు చించుకుని పాటలు పాడుకుంటూ తిరుగుతూంటాడు.

ఒక ఇంటి ప్రక్క దుకాణంలో, ఆ ఇంటి యజమానురాలి తండ్రీ, తమ్ముడూ, ఇద్దరూ కుట్టుపని తెలిసినవాండ్లవటంవల్ల కుట్టు మిషను పెట్టేశారు...వీళ్ళంతా అవసరం అని భావిస్తూన్న తరుణంలో, అది గుర్తించి వచ్చినవాడివలె, ఎవరూ పిలవకుండానే ఒక మంగలి, ఇక్కడ స్థిరపడదామని వచ్చాడు. వాడు మరో రంగుల అద్దకం వ్యాపారిని కూడా తన వెంట పెట్టుకుని మరీ వచ్చాడు—రావటం తడవుగా చిన్నకొట్టు ఒకటి పుచ్చుకుని 'క్షౌరశాల' యేర్పాటు చేశాడు...రంగుల అద్దకం వ్యాపారి దుకాణం ముందు, రకరకాల రంగులూ, అద్దకం నైపుణ్యాన్ని ప్రదర్శించే మచ్చుతునకల వస్త్రాలూ, గాలిలో రెపరెపలాడుతూ ఆకర్షణీయంగా ఉండేవి...

కొన్నాళ్ళ తరవాత, నెత్తి మూటలూ, తట్టలతో, బస్తీలో పేవ్‌మెంట్ల మీద సుగంధ ద్రవ్యాలూ, విలాస వస్తువులూ అమ్ముకునే వ్యక్తి ఒకరు బస్తీలో వ్యాపారం సాగక, ఇంటి అద్దె కూడా పూడక అవస్థపడి, విసుగెత్తి, నగరానికో సలాం కొట్టి, తిన్నగా ఈ కొత్త బస్తీకి చేరుకుని, అనేక రకాల లవెండర్లూ, సెంట్లూ, రకరకాల పౌడర్లూ, సబ్బులూ, దువ్వెనలూ, గుండీలూ, సూదులూ, దారాలూ, పిన్నీసులూ, హేరాయిల్సూ, చేతి రుమాళ్లూ, పండ్లపొడి పొట్లాలూ వగైరాలతో దుకాణం ప్రారంభించగా, నగరంలోకన్నా అమ్మకం అనుకోని పద్ధతిలో ఆశ్చర్యకరంగా పెరిగిపోయింది !

ఈ కొత్త బస్తీలో నివసించే వాళ్ళ ఔదార్యం, కలుపుగోలుతనం, అద్దె తక్కువ సౌకర్యం మూలంగా, ఇలాగే రకరకాల వ్యాపారస్థులు

నగరం వదిలి, తమ దుకాణాలను ఇక్కడ యేర్పాటు చేసుకోవటం మొదలైంది...ఇక్కడ ఫలానా వస్తువుకు కొరతగా ఉందని తెలిస్తే, ఆ వస్తువులమ్మే దుకాణాన్ని ఒకదాన్ని యెవడో ఒకడు ప్రారంభించి తీరేవాడు—

దేశీయ వైద్య పద్ధతిలో బలవర్ధకమైన ఔషధాలనూ చలవ పదార్థాలనూ తయారుచేయటం తెలిసిన అనుభవజ్ఞుడైన ఒక వైద్య శిఖామణి, నగరంలోని డాక్టర్లూ, ఆధునిక ఆస్పత్రుల పోటీకి తట్టుకోలేక, రోజురోజూ దిగజారిపోయే వృత్తిని నిలబెట్టుకోవడానికి, నగరం వదిలి తన శిష్యులతో సహా ఈ కొత్త బస్తీకి చేరుకుని ఒక కొట్టును అద్దెకు పుచ్చుకున్నాడు.

ఈ పెద్దమనిషీ, ఆయన శిష్యులూ, రోజల్లా మందులు తయారు చేయడం, డబ్బీలల్లో నింపటం, లేహ్యాలూ, ఆసవారిష్టాలూ, చల్లదనం కూర్చే షర్బత్తులూ, ఊరగాయలతో సహా సిద్ధం చేస్తూండటం, వాటిని ఆకర్షణీయమైన పద్ధతిలో దుకాణం బీరువాల్లో తంతెలవారీగా అమర్చి పెట్టడం పనిగా ఉండేది. ఇంకో బీరువాలో రాజ వైద్య గ్రంథాలూ, దేశీయ వైద్యానికి సంబంధించిన పురాతన పుస్తకాలూ, ఔషధ యోగాలూ, వరసగా గ్రంథాలయంలోవలె అమర్చారు. దుకాణం తలుపులు తెరిచి వున్నప్పుడు, మూసి వున్నప్పుడు కూడా కనిపించే విధంగా తలుపులకూ, ఇంకా లోపల గోడలకూ, ఎక్కడ కాస్తంత ఖాళీ జాగా వుంటే అక్కడల్లా, తమ మందుల ప్రశస్తికి సంబంధించిన పోస్టర్లనూ, దేశీయ వైద్యావసరం గుర్తింపజేసే సమాచార సామగ్రినీ నింపి వదిలారు. చేతి రాతలతో రాసి కూడా పెట్టారు...ప్రతిరోజూ ఉదయం, వేశ్యామణుల నౌకర్లు, వీళ్ళ దుకాణానికి గ్లాసులూ, సీసాలతో హాజరై రకరకాల షర్బత్తులూ, బలవర్ధక ఔషధ పానీయాలూ కొనుక్కొని వెళుతూంటారు—అద్దెకాక, ఖాళీగా మిగిలిన కొట్లల్లో, ఆ స్త్రీల తాలూకు బంధువులూ, సన్నిహితులూ తీరిగ్గా విశ్రాంతి తీసుకోవడానికీ, వినోదాలకు ఉపయోగించుకునేందుకూ కుర్చీలూ, బెంచీలూ వేసుకుని కూర్చునేవారు. ఎప్పుడూ చదరంగం, చీట్ల పేకలూ,

జూదాలూ ఆటల్లో మునిగితేలుతూంటారు. అదీ విసుగె_త్తితే, నూనెను వంటికి మాలిష్ చేయించుకోవటం, రకరకాల పక్షులని పంజరాల్లో ఉంచి ఆడకుంటూ ఉండటం, ఏదీ తోచనప్పుడు ఉల్లాసంగా పాటలు పాడుకోవటం వీళ్ళ కార్యక్రమంగా ఉంటుంది—

ఒక స్త్రీ తాలూకు బంధువు డొకడు ఒక దుకాణం ఖాళీగా ఉంటం చూసి, అందులో తన సోదరుణ్ణి దింపాడు. సంగీతవాద్యాల మరమ్మత్తులూ, తయారీల్లో ఇతనికి అనుభవం ఉంది...దుకాణంలో గోడలకి మేకులుకొట్టి, మరమ్మ_త్తును కోరుతూన్న సారంగీలూ, సితార్లూ, తంబూరాలూ, దిలుర్బాలూ, వాటికి తగిలించివేశారు. ఇతనికి సితారు వాయించటంలో కూడా మంచి నై_పుణ్యం ఉంది...సాయంత్రంపూట తీరికవేళల్లో, ఇతను తన దుకాణంలో కూచుని సితారు వాయిస్తుంటే చుట్టుపట్ల దుకాణాల్లోనివాళ్లూ, దారే పోయే మనుషులూ, ఇక్క_డికి చేరి, తన్మయులై_ శిలా విగ్రహాల్లా కూచుని సితారు వాద్యం వింటూంటారు. నగరంలో వున్న ఒక రై_ల్వే ఉద్యోగి, ఇతనివద్ద సితారు నేర్చుకోవడానికి, ఆఫీస్ పని కావటంతోటే ప్రతిరోజూ, సై_కిల్ తీసుకుని ఇక్క_డికి వస్తూంటాడు. గంట గంటన్నర సేపు విద్యాభ్యాసం చేసి వెళుతోంటాడు. ఈ సితారు వాద్య ప్రవీణుడి కార్యక్రమంవల్ల, కొ_త్త బ_స్తీకి జీవకళ వచ్చినట్టుంటుంది !—

ఇక్క_డ ఇండ్లు నిర్మాణం కాకపూర్వం, మసీదులో 'ఇమాం'గా పనిచేస్తున్న ముల్లా సాహెబ్‌గారు, రాజూ పొద్దుకూకే వరకల్లా ఇంటికి చేరుతోండేవాడు. ఇప్పుడిక తన మకాంను పూ_ర్తిగా ఇక్క_డికే మార్చాడు. క్రమ క్రమంగా మసీదులోకి జనం రాకపోకలు అధికమవుతోన్న కొద్దీ, ఆదాయం కూడా అధికం అవుతూనే వుంది.

వూరూరూ తిరిగి నాటకప్రదర్శనలిచ్చే ఒక సంచార నాటక సమాజం, నగరంలో మునిసిపాలిటీ పన్నులూ, అద్దె భరించలేకనూ, అనువై_న స్థలం లభించకనూ, తిన్నగా ఈ కొ_త్త బ_స్తీకి చేరుకుని ఈ స్త్రీల గృహా

లకు కొంచెం దూరంగా మెరక జాగాలో డేరాలు వేశారు—ఈ నాటక సమాజంలో పనిచేసే కళాకారులు ఉన్నత స్థాయికి చెందినవాళ్ళు కారు. వీళ్ళ దుస్తులు చినిగి జీర్ణమైనవి...దుస్తుల్లో ఉన్న మెరుగులూ, వజ్రాల తళతళలూ రాలి మాసిపోయినయ్....వీళ్ళ నాటక ప్రదర్శనం ఫక్కీ, హాస్య వినోదాలూ, అంతా పాతకాలపు పద్ధతిలో ఉంటుంటాయి. అయినా వీళ్లు కూడా దేశదేశాలూ తిరిగి ప్రదర్శనాలిస్తూనే ఉన్నారు... వందలాది జనం వీళ్ళ నాటకాన్ని చూట్టానికి రావటంలోగల విశేషం, టిక్కెట్ డబ్బులు అతి స్వల్పం కావటమే...నగరాల్లో నివసించే రోజు కూలీలూ, ఫ్యాక్టరీల్లో పనిచేసే శ్రామికులూ, పెద్దపెద్ద టిక్కెట్లు కొని, సినిమాలూ, నాటకాలూ చూడలేని పేదవాళ్లూ, తృతీయశ్రేణి కళాభిరుచులతోనే తృప్తిపొందజాలే రసికులూ, అంతా ఐదారుమంది కలిసి ఒక్కో జట్టుగా, పూలమాలల్తో అలంకరించుకుని, నవ్వుతూ, పేలుతో, పిల్లనగ్రోవులు ఊదుకుంటూ, త్రోవలో నడిచిపోయే వాళ్ళమీద వ్యంగ్యంగా విసుర్లు విసురుతూ, తిట్టు కుంటూ, నగరంనుంచి కాలి నడకన బయలుదేరి, నాటకాలు చూడటానికి వచ్చేవాళ్ళు....పనిలో పనిగా అందినంతవరకూ అందాన్నికూడా ఎవరిశక్తికి తగ్గట్టు వాళ్ళు ఆరాధించుకుని, సౌందర్యవీధుల్లో పచార్లుచేసి వెళ్ళిపోతోం టారు...నాటకం ప్రారంభం కావటానికి కొంచెం ఆలస్యం ఉండేమాటైతే, నాటక కంపెనీ తాలూకు హాస్యగా డొకడు హాలు బయట ఒక స్టూలుమీద నిలబడి, అనేక వికృత చేష్టల్తో అందరినీ వినోదంగా నవ్విస్తూంటాడు— వాడి కళ్ళు తిప్పడం, మూతి విరవడం లాంటి వికృతహాస్యాన్ని ఈ ప్రేక్షకు లంతా తమ అభిరుచులకు సరిపోయినట్టుగా హర్షిస్తూ ఉల్లాసంగా పకపక నవ్వుతూ, మెచ్చుకునే తిట్లతో హాస్యాన్ని ప్రోత్సహిస్తుంటారు.

క్రమక్రమంగా ఇతరులుకూడా నివాసం నిమిత్తం ఈ కొత్త బస్తీకి రావటం ప్రారంభించారు....నగరంలో చౌరాస్తాల్లో టాంగావాళ్ళు నిలబడి "కొత్తబస్తీకి వచ్చేవాళ్ళున్నారా?" "కొత్తబస్తీ" అని అరవటం మామూలైంది. నగరానికి ఐదుకోసులవరకూ దూరం ఉన్నా యీ పక్కా

రోడ్డుమీద టాంగావాలాలు గుర్రాల్ని త్వరగా పరిగెత్తించి, బండీ ఎక్కిన వాళ్ళవద్ద ఇనాంలు పొందాలన్న ఆశతో, బడుగు గుర్రాలని నానాయాతనా పెడుతూంటారు. ఒకబండిని దాటి పోటీగా మరోబండి ముందుకు పరుగెత్తితే, ముందుబండిలోవాళ్ళు వెనకబండివాణ్ణి, వాడి గుర్రాన్ని పరిహసిస్తున్నట్టుగా చెవులు చిల్లులుపడేట్టు నవ్వుతారు. ఈ పరుగుపందేలలో పాపం, ఆ గుర్రాల అవస్థ వర్ణనాతీతం...అలంకార నిమిత్తం వాటి మెడలల్లో వేసిన పూలదండల వాసనలు కాక, వాటి శరీరంనుంచి వచ్చే చెమటవాసన మాత్రమే అందరి నాసారంధ్రాలనూ తాకుతుంటుంది . ఇక రిక్షావాలాలు, టాంగావాలాలకన్నా తీసిపోవటం ఎల్లా జరుగుతుంది ? టాంగావాలాలకన్నా కొంచెం తగ్గింపురేటుకే వాళ్ళు రిక్షాలు లాగుతూ, ఆపసోపాలు పడుతూ, చేతి మువ్వలు వాయించుకుంటూ కొత్తబస్తీకి ప్రయాణాలు సాగించారు. ఇవన్నీ కాక, ప్రతి శనివారంసాయంత్రం, ఆదివారాలల్లోనూ, హైస్కూళ్లూ కాలేజీల్లోని విద్యార్థులు, ఒక్కో సైకిల్‌మీద ఇద్దరిద్దరూ, ముగ్గురుకూడా కూర్చుని, ఛలోక్తులు విసురుకుంటూ, ఉల్లాస భంగిమలతో, ఆకర్షణీయమైన ఈ స్థలానికి వాహ్యాళిగా బయలుదేరటం మామూలైంది. నగరంలో ఈ వేశ్యావీధి ఉన్నందువల్ల ఎవళ్ళయితే జీవితాలు చెడగొట్టుకుంటారని భయపడి పెద్దవాళ్ళు ఈ వేశ్యలని ఇక్కడికి తరిమారో, వాళ్ళే, ఆ భావి పౌర సంతానమే పనిగట్టుకుని, నెలవురోజుల్లో వందల సంఖ్యలో ఈ రస జగతీ విహారానికి బయలుదేరి వస్తూండడం జరుగుతున్నది—

రానురాను కొత్తబస్తీ ప్రాముఖ్యం నలుదిశలా వ్యాపిస్తూ, అంతా ఇక్కడికి చేరుకుంటూ వుంటంవల్ల ఇక్కడ దుకాణాలకూ ఖాళీ స్థలాలకూ గిరాకీ అధికమైంది. ప్రథమంలో ఇక్కడికి రావటానికి అంగీకరించక నగరంలోనే తలదాచుకొని ఉన్న పడుపుకత్తెలూ, పరస్థలానికి వెళ్ళిపోయినవారూ, ఇప్పుడీ కొత్తపట్నం ప్రశస్తి మూడుపూలూ ఆరు కాయలుగా వుండటంతో, తమ దురదృష్ట నిర్ణయానికి విచారపడటం ప్రారంభించారు. ఇప్పటికీ త్వరగా మేల్కొన్న పడుపుకత్తెలు, ఈ గిరాకీని కనిపెట్టి,

తక్షణం వీలైనచోటల్లా, అవసరమైనంత రేటుకు అవసరమైన స్థలాలు కొనుక్కొని, వెనకటి వాళ్ళ ఫక్కీలోనే ఇండ్లు నిర్మించుకోవటానికి సిద్ధమయ్యారు. పనులు మొదలుపెట్టారు. భవిష్యత్తులో ఇక్కడ స్థలం గిరాకీ ఇంకా తారస్థాయిని అందుకుని తీరుతుందన్న అంచనాతో నగరంలో అంతో యింతో డబ్బూ దస్కం వున్న ప్రతి పెద్దమనిషీ, కొంచెం చౌకగా ఉన్నప్పుడే ఇక్కడ స్థలాలు కొనివేశారు. ఆ స్థలాల్లో చిన్నచిన్న ఇండ్లు నిర్మించి, దుకాణాలకూ, నివాసాలకూ అద్దెల కివ్వటం ప్రారంభించారు.

ఈ అవకాశంవల్ల నగరంలో హోటళ్ళలోనూ, పెద్దపెద్ద మర్యాదస్తుల ఇండ్లలోనూ తలదాచుకుంటున్న ఇంకా చాలామంది పడుపువృత్తి స్త్రీలు, బయటికి వచ్చి, బాహాటంగా కొత్తబస్తీలో కొంపలు అద్దెకు పుచ్చుకుని జీవించడానికి అలవాటైనారు. దుకాణాలకోసం అద్దెకు పుచ్చుకున్న వ్యాపారులు, అటూయిటూ తిరిగి అవస్థపడలేక, తమతమ కుటుంబాలను కూడా ఇక్కడికి తెచ్చుకుని, పిల్లాజెల్లాతో సంపూర్ణంగా నివాసం ఉండటం మొదలైంది. వాళ్ళంతా తమతమ దుకాణాలు చిన్నవి కావటం వల్ల, ప్రత్యేకంగా నివాసగృహాలుకూడా కట్టించుకున్నారు. దినక్రమంగా కొత్తబస్తీ, వేశ్యావీథిగా గాక, సంసార జీవితాలకే అధిక ప్రధానమైపోయింది. ఇక్కడ కుటుంబాల నివాసం ఎవడికీ ఆక్షేపణీయం అనిపించలేదు.

ఇలా బస్తీ పెరిగిపోతున్నదికాని, ఎలెక్ట్రిసిటీ యేర్పాట్లుమాత్రం లేకుండాపోయినై ...వేశ్యలూ - సంసారులూ-బస్తీలో నివసించేవాళ్ళంతా ఎలెక్ట్రిసిటీ సౌకర్యంకోసం, ప్రభుత్వానికి విజ్ఞప్తులు అందజేసిన ఫలితంగా ఆ కాస్తాసౌకర్యం మంజూరైంది...దానితోపాటు ఒక పోస్టాఫీసుకూడా తెరవటం జరిగింది. ప్రతిఫలం తీసుకుని ఉత్తరాలు వ్రాసిపెట్టడానికి పోస్టాఫీసులోనే ఒక చదువుకున్న మనిషికి నిరంతరం పని దొరికిందికూడా !...

ఒక పర్యాయం బస్తీలో రెండు త్రాగుబోతు ముఠాలమధ్య కొట్లాట ప్రారంభమై, ముదిరి, చివరకు, రాళ్లూ, రప్పలూ, కత్తులూ, సోడాబుడ్లూ,

ఇటుకలూ ఉపయోగించటంవరకూ వచ్చింది. ఈ తుముల యుద్ధంలో చాలా మంది తీవ్రంగా గాయపడ్డారు...తగాదా జరిగిన దగ్గరనుంచీ, కొద్దిపాటి పోలీసు ఠాణా ఇక్కడ శాంతి భద్రతల పరిరక్షణ నిమిత్తం ఏర్పాటైంది.

ఇక : సంచార నాటక సమాజం రెండు నెలలు ఇక్కడ మకాంవేసి, దాని స్థితికన్నా మెరుగ్గానే ధనం సంపాదించుకుని వెళ్ళింది—నగరంలో శాశ్వతంగా ఒక సినిమాహాలును నడుపుతున్న ధనవంతు డొకాయనకి, ఇక్కడ ఒక సినిమాహాలెందుకు నిర్వహించకూడదు అన్న అభిప్రాయం కలిగింది. అభిప్రాయం రావటమే ఆలస్యం...తక్షణం సినిమా నిమిత్తం అనువైన స్థలాన్ని అందిపుచ్చుకున్నట్టుగా కొనివేసేశాడు...సినిమాహాలు నిర్మాణానికి ఉపక్రమించాడు—కొద్దినెలల్లోనే సినిమాహాలు తయారై కూర్చుంది. హాలుబయట ప్రేక్షకులు కొద్దిగా ఆట ఆలస్యమైతే విశ్రాంతిగా కూర్చునేందుకుని చిన్న పూలతోటకూడా వేయించాడు యజమాని... పార్కులో ఉన్న ఈ తోటలో ప్రేక్షకులేగాక, పొద్దుపోనివాళ్ళకూడా సాయంత్రంపూట కూచోటానికి వచ్చి, కూచున్నాం కదా అని తోచక సినిమా చూసి మరీ పోతుండేవాళ్ళు. ఈతోట నిజంగానే ఈ బస్తీకి ఒక పార్కే అయింది...సోడా వ్యాపారస్తులూ, తలకు తైలమర్దనం చేసే వాళ్లూ, ఈ పార్కులోకి ప్రజల సౌకర్యార్థం రావటం మొదలుపెట్టారు. నల్లగా మురికి ఓడుతున్న బెల్టులు బుజాన వేసుకుని, వాస్కోటు వేసుకుని మంచిమంచి సువాసనలు గల అత్తరు నూనెలు సీసాలు పెట్టెల్లో బిగించు కుని మాలిష్ పనివాళ్ళు అందరినీ ఇందుకు అనుకూలురుగా క్షణంలో మార్చుకుంటూండేవాళ్ళు—

సినిమాహాలు ఆవరణ బయట, హాలు యజమానే తన స్వంతడబ్బు తోనే రెండుమూడు కొద్దిపాటి ఇండ్లనూ, దుకాణాలకు అనువైన చిన్నచిన్న కొట్లనూ చాలావాటినీ కట్టించాడు—ఇండ్లల్లో హోటళ్ళు యేర్పాటైనై. రాత్రిపూట ప్రయాణీకులు విశ్రమించటానికి వీటిల్లో అద్దెగదులు కూడా

లభిస్తాయి. ఇక చిన్నచిన్న కొట్లల్లో ఒక దాంట్లో సోడామిషన్‌వాడూ, ఇంకోదాంట్లో ఫోటోగ్రాఫరూ, ఇంకోగదిలో సైకిల్ రిపేరింగ్‌షాపూ, మరోకొట్లో బట్టల ఇస్త్రీలాండ్రీ, ఇలాగే బూట్లషాపూ, అన్ని యేర్పాటైనాయి. ఒక డాక్టరుకూడా తన వైద్యశాలను ఇక్కడే తెరిచాడు. ఇవన్నీ అలావుంచి, ఒక మద్య విక్రయశాల నిమిత్తం కూడా లైసెన్సుదొరికింది. ఫోటోగ్రాఫర్ దుకాణానికి బయట ఒక చిన్నమూలలో గడియారాలు మరమ్మత్తు చేసే ప్రవీణు డొకడు చేరాడు ఇతను ఎప్పుడుచూచినా అద్దాన్నొకదాన్ని కంట్లో ఇరికించుకుని, గడియారాలలోని మరమ్మత్తు పనులను చూస్తూనే ఉంటాడు——

కొన్నాళ్ళ అనంతరం ఈ బస్తీతో మంచినీటి పంపులూ, పారిశుధ్య శాఖ సిబ్బందీ ఏర్పాటైంది. పంపులూ, వీధుల శుభ్రతా ఎలెక్ట్రిసిటీ అన్నీ క్రమపద్ధతిలో నిర్వహణ కొనసాగించే నిమిత్తం ప్రభుత్వోద్యోగులూ, ఇంజనీర్లు ప్రత్యేక శ్రద్ధ తీసుకుని, నగరం మట్టాన్నీ వీధులనూ కొలిచి, అన్ని వీధుల్లోనూ, కంకరతోనూ, మట్టితోనూ రోడ్లు వేయించి, రోలింగ్ ఇంజన్లని నడిపించారు.

ఈ వ్యవహార సంఘటనలన్నీ జరిగి ఇరవై సంవత్సరాలుదాటింది. కొత్తబస్తీ జనంతో కిటకిటలాడే సంకులమైన మహాపట్టణంగా మారింది. ఇప్పుడు దానికో ప్రత్యేక రైల్వేస్టేషన్‌కూడా వుంది. టౌన్‌హాలూ, కోర్టులూ, ప్రభుత్వ కచ్చేరీలూ, సబ్‌జైలూ కూడా వున్నాయి. జన సంఖ్య సుమారు లక్షన్నర వరకూవుంది. ఒక కళాశాల, రెండు హైస్కూళ్ళు, ఒకటి మగపిల్లలకూ, ఇంకోటి ఆడపిల్లలకూ, ఎనిమిది ప్రాథమిక పాఠశాలలూ వున్నాయి. ప్రాథమిక పాఠశాలల్లో, పురపాలకసంఘం పక్షాన ఉచితవిద్యాబోధన జరుగుతుంటుంది. ఆరు సినిమాహాళ్ళున్నాయి. నాలుగు బ్యాంకులు ఇక్కడ కార్యాలయశాఖల్ని ఏర్పాటుచేసుకున్నాయి. ఇందులో రెండు బ్యాంకులు అంతర్జాతీయ విఖ్యాతి గలవికూడాను——

ఈ నగరంనుండి, రెండు దినపత్రికలూ, మూడు వారపత్రికలూ, పది మాసపత్రికలూ ప్రచురించబడుతుంటాయి. మాసపత్రికలు పదింట్లోను నాలుగు సాహిత్య పత్రికలు...రెండు ఆర్థిక సాంఘిక పత్రికలూ, ఒక పారిశ్రామిక పత్రిక, ఒకటి ఆరోగ్య సంబంధమైనదీ... ఒకటి మహిళలదీ, మరొకటి బాలబాలికలదీను. పట్నంలో వివిధ ప్రదేశాల్లో దాదాపు ఇరవై మసీదులూ, పదిహేను దేవాలయాలూ, సత్రాలూ, ఐదు అనాధాశ్రమాలూ, ఆరు దిక్కులేని పిల్లల వసతి గృహాలూ, ప్రభుత్వానికి సంబంధించిన మూడు పెద్దపెద్ద ఆస్పత్రులూ వున్నాయి. ఒక ఆస్పత్రి స్త్రీలకోసరం ప్రత్యేకంగా యేర్పాటైంది.

ఆరంభంలో కొన్ని సంవత్సరాలవరకూ ఈ పట్నం పేరు, నిర్మాతల అభీష్టం ప్రకారం 'హసన్' ఆబాద్' (సౌందర్య నగరం) అని పిలవబడుతూండేది. కాని తరవాత కొన్నాళ్ళకి, ఈ పేరు అశ్లీలంగా వుందని దీన్ని కొద్దిగా సంస్కరించి 'హసన్ ఆబాద్' అని పిలవటం ప్రారంభించారు. కాని, ఆచరణలో ఇది అంతగా రాణించలేదు. ఎందుకంటే : జనం 'హుసన్' అనే పదానికీ, 'హసన్' అనే పదానికిగల అర్థం తారతమ్యాన్ని విచక్షణగా అవగతం చేసుకోకుండా ఇష్టం వున్నట్టు అంటూండేవాళ్ళు. ప్రభుత్వానికీ, పురపాలకసంఘానికీ ఇదొక సమస్యఅయి కూర్చుంది. చాలా రోజులు దీనికి సంబంధించిన చరిత్రాధ్యయనంలో గడిచిపోయినయ్... ఎన్నో చారిత్రక గ్రంథాలూ, లావుపాటి పురాణేతిహాస గ్రంథాలూ, పేజీలు తిప్పితిప్పి, లోగడ పూర్వకాలంలో ఇక్కడ ఒక పట్నం ఉండేదనీ, దాని శిథిలాలమీదనే ఇది నిర్మితమైంది గాబట్టి, కొన్ని వందలయేళ్ళక్రితం ఇక్కడ ఒక వెలుగు వెలిగిన ఆ మహానగరం పేరునే దీనికి పెట్టాలనీ, స్థిరమైన ఒక నిశ్చయానికి అందరూ వచ్చారు...నాటి మహాపట్నం పేరు "ఆనంది" ఈనాటి ఈ మహాపట్నం పేరుగూడా అదే "ఆనందీ" అయింది—

పట్నం పెద్ద నగరంగా మారింది—పాత నగరంకన్నా అందంగా, పరిశుభ్రంగా అభివృద్ధి అయింది...కళాకాంతులతో తేజరిల్లిపోతోంది...

కాని, నగరం అంతటికీ అత్యంత సౌందర్యవంతమూ, కళాత్మకవిలసితమూ, వ్యాపారకేంద్రమూ, అయిన ప్రాంతంమాత్రం తిరిగి అదే పడుపుగత్తెల వీథిలోనే స్థిరంగా ఉండిపోయింది...అదిన్నీ నగర మధ్యభాగంలోనే పడిపోయింది !...

*    *    *    *

'ఆనందీ' నగర పాలక సంఘ కార్యాలయం విపరీతమైన సందడిగా ఉంది—హాలంతా జనంతో కిటకిటలాడిపోతున్నది. ఎందుకంటే, సాధారణంగా గైర్ హాజరుకాని సభ్యుడంటూ వుండనిదల్లా, పురపాలక సంఘం చరిత్రలోనే అసాధారణంగా ఒక్క సభ్యుడుకూడా హాజరుగాకుండాలేడు!—

పురపాలకసంఘ సమావేశంలో చర్చనీయాంశంగా ఉన్న ప్రధాన సమస్య పడుపుగత్తెల 'శృంగారవీధి'ని నగరంలోనించీ తీసేయించటం అన్నది...నగరంలో ఈ వీధి ఉనికి, మానవత్వం - అభిమానం - ఆభిజాత్యం - సంస్కృతీ సాంప్రదాయాచారాలకి ఘోరమైన కళంకంగా ఉన్నదని సభ్యులంతా ఏకగ్రీవంగా అభిప్రాయపడటమే ఇంతకూ కీలకం !—సమావేశంలో గౌరవసభ్య డాకాయన ఇలా ఉపన్యసించడానికి లేచాడు గదాంటే, "—అత్యంత చారిత్రక ప్రశస్తిగల ఈ మహాపురాతన నగర మధ్యభాగంలో—అపవిత్రమూ, నీచమూ, అయిన ఈ వ్యభిచార స్త్రీల నివాసానికి అనుమతి లభించడానికి గల మరీమరీ ప్రభావవంతమైన ఏ అజ్ఞాత కారణాలేర్పడ్డాయో మనకు అర్థం గావడంలేదు..." అంటూ తల గోక్కుంటూ మధ్యనే ఆగాడు !...

పురపాలకసంఘం ఏకగ్రీవంగా తీర్మానించిన ప్రకారం, ఈ వేశ్యావీధి నిమిత్తం 'ఆనందీ' నగరానికి సుమారు పన్నెండుకోసులదూరంగా ఒక ప్రదేశం కేటాయించబడింది !...

---

రచయిత:
"అహమ్మద్ అలీ"
మూల కథ పేరు:
"హమారా గల్లీ"

# మా వీధి

నా యిల్లు 'పండిత్ కూచే'లో వుంది.

నా గది 'మొత్త' (గుమ్మం) లకి అడ్డంగా ఒక తెర వుంది. దిగువ భాగం పూర్తిగా మూసేస్తే, పై భాగం ఖాళీగా ఒక కిటికీలా తెరిచి వుండేట్టుగా ఉంటుంది...ఇలాంటి కిటికీయే ఒకటి 'తేలీరోడ్డు' వేపు తెరిచి ఉంటుంది. అందులోంచీ చూస్తే పాల వ్యాపారస్తుడు 'మీర్జా' దుకాణం కనిపిస్తోంటుంది—సరిగ్గా నా కిటికీకి ఎదురుగ్గా కిరాణా దుకాణం 'సిద్దీఖ్', ఆ పక్కనే అజీజ్ కొట్టూ, ఇంకా చుట్టు పట్టు దుకాణాలు కన్పిస్తాయి-అత్తరు వాలా, కిళ్ళీ కొట్టూ, కసాయి కొట్టూ, మిఠాయి దుకాణం వగైరాలన్నీ అక్కడ ఉన్నాయి—

మా వీధిగుండానే జనం మరో వీధికి వెడుతూంటారు—కనుక ఈ వీధి రోడ్డెప్పుడూ సమ్మర్దంగానే వుంటుంది. అందులోనూ మా వీధి మొత్తం తిరక్కుండా నా గది పక్కగా వున్న చిన్న సందులోంచీ దూరం తగ్గేందుకని 'షార్ట్‌కట్'లో జనం వెళుతూంటారు—ఈ సందు ప్రయాణీకులంతా నా కిటికీ పక్కనుంచే వెళ్లాలి...మిట్ట మధ్యాహ్నం. కణకణలాడే ఎండలో నెత్తిన గొడుగేసుకుని ఒకోడు వెళుతోంటాడు...సాయంత్రం పూట విదేశీ 'ఈవెనింగ్ క్యాప్' ధరించి పొయ్యే వాడింకొకడు...హ్యాట్ పెట్టుకుని, బురదలోంచీ నడుస్తూ తొడుక్కున్న ప్యాంట్లూ, పైజామాలని రెండు చేతులతోనూ పైకి లాక్కుంటూ జాగ్రత్తగా మరి కొంతమంది పోతూంటారు...పిల్లా జెల్లల్ని తప్పించుకుంటూ, వాళ్ళని కళ్ళెర్రజేసి,

చూస్తూ, అడ్డంవస్తే గద్దించుకుంటూ ఒకడు సాగిపోతాడు. ఎవరి వెంటన్నా పిల్లలు అల్లరిగా వెంటబడుతూంటే విసుగెత్తి వాళ్ళ కర్రనో, బెత్తాన్నో ఎత్తగానే, పిల్లలు దూరంగా పరుగెత్తి అక్కడ నిలబడి, గవ్వకోలుగా వెక్కిరింతలు మొదలెడతారు. ఇలాంటి గందరగోళం వినబడ్డ మరుక్షణం లోనే, పాల వ్యాపారి మీర్జా కంఠస్వరం బొంగురుగా వినబడుతోంటుంది ఇలా.

"ఒరేయ్! లఫ్డి వెధవలూ, ఏమిట్రా చేస్తుంది మీరు?...కొంపల్లో పనేమీ లేదట్రా మీకు ?" అని—సమయానికి దగ్గరెవరన్నా వుంటే మీర్జా వాళ్ళవేపు తిరిగి "వీళ్ళ తల్లులెటువంటివాళ్ళో చూడండి ! వెధవల్ని పనీ పాటా లేకండా గాడెద్దుల్లా తిరగటానికి ఊళ్ళోకి వదిత్తే వీళ్ళు చూడండి, వీధుల్లో సందుల్లో ఒకటే అల్లరి...బడుద్ధాయి వెధవలికి అల్లరి చెయ్యటం, బూతులు తిట్టుకోవడం తప్ప మరో పనేదీ లేదు." అంటూంటాడు—

మాట లంటూంటే మీర్జా ఎర్రని చిన్న కళ్ళు మెరుస్తూంటాయి—చిక్కని తెల్ల గడ్డంమీద చెయ్యివేసి దువ్వకుంటూ, కొనుగోలుదార్ల అవస రాలు అడగటంలో నిమగ్నుడౌతాడు....కుండలోనించీ గిన్నె గరిటెతో వేడి వేడి పాలను తీసి, మరోదాంట్లోనించీ ఇంత మీగడ దీసి అందులో వేసి కొనేవాళ్ళకు అందిస్తూ ఉంటాడు—

మీర్జా శరీరంలో అనన్యసామాన్యమైన మర్యాదా, సాంప్రదాయ కమూ అయిన రక్తం ప్రవహిస్తో ఉంటుందని జనం అంటారు...చిన్నప్పుడు పాఠాలు గుర్తుంచుకోక, సరీగ్గా చదువుకోనందువల్ల తండ్రి యింట్లోంచీ వెళ్ళగొట్టాడనీ, తరవాత తిరిగీ తిరిగీ చివరకి ఈ పాల వ్యాపారం ప్రారం భించాడనీ, ఈ వ్యాపారంలో మీర్జా బాగా కుదురుకుని పొయ్యాక తండ్రి ఎన్నోసార్లు క్షమాపణ చెప్పకుని, ఇంటికి రమ్మని ఆహ్వానించి నప్పటికీ వెళ్ళకుండా స్వార్జనతోనే వివాహమున్నూ చేసుకున్నాడనీ ఇతని జీవిత కథలు చెప్పకుంటారు...మీర్జా పాల దుకాణంలోని మీగడ తరకలు నగరం అంతటా ప్రసిద్ధి జెందినై !—ఇతని అమ్మే పాలు గూడా చాలా

రుచికరంగా ఉంటాయని ప్రతీతి—రాత్రిపూట కూడా ఎవరైనా పాలకోసం వస్తే, పాలను చిక్కగా చేసి, దానిమీద కట్టే మీగడను పాలు కదలకండా కోసి ఇచ్చేవాడు...అప్పుడప్పుడూ అతని భార్య గూడా దుకాణం వ్యాపారంలో కూర్చుంటూంటుంది...ఆవిడ చాలా వృద్ధురాలైంది. ముఖంమీద ముడతలు స్పష్టంగా కనిపిస్తూంటాయి. నడుం వంగిపోయింది...నోట్లో ఒక్క పన్ను ఉన్నట్టున్నా లేదు—ఎత్తైన నుదురూ, ఎర్రగా గుమ్మడి కాయలాంటి శరీరం ఇలాంటి లక్షణాలవల్ల ఆవిడ కొంచెం ఉత్తమ సాంప్రదాయ వంశంలో పుట్టిందని తెలుస్తోంది—

మీర్జా వ్యాపారం ఇప్పుడు కొద్దిగా మందగించిపోయింది. వృద్ధాప్యం వల్ల అధికంగా శ్రమపడలేకపోవటమే దీనికి కారణం—అతని ఏకైక పుత్రుడు మరణించాడు. ముసలితనంలో చేతికీ కాలికీ కాస్త అడ్డంగా వుండే వాళ్లెవరూ లేరు...విదేశీ వస్తు బహిష్కారోద్యమం కాలంలో, దేశంలో ఆ మూలనించీ ఈ మూలదాకా స్వాతంత్ర్య వాంఛతో ఆందోళనా తీవ్ర తరంగా కొనసాగుతోన్నప్పుడు, మీర్జా ఏకైక పుత్రుడు తన స్నేహ బృందంతో ఒక ఊరేగింపులో పాల్గొన్నాడు. 'గాంధీజీకి జై' 'వందే మాతరం' నినాదాలతో ఆకాశం మారుమోగిపోతున్నది...క్లాక్‌టవర్ మీద తెల్లసైనికులు మోహరించి సిద్ధంగా ఉన్నారు. పోలీస్ కెప్టెన్, డిప్టీ కమీషనర్ కూడా నిలబడి వున్నారు. వాళ్ళంతా ఈ మహాసాగరంలాంటి ప్రజలనూ, వాళ్ళ ఈ జాతీయాగ్రహాన్నీ ఆందోళనతో పరిశీలించారు—

జనం ఊరేగింపుతో ముందుకు సాగాలని కోరుతున్నారు. కాని మోహరించి నిలబడ్డ తెల్ల సైనికులు వాళ్ళని అటకాయించారు. ప్రజల ఆగ్రహం పరవళ్ళు తొక్కి, సైనికుల ఉత్తరువులని ఉల్లంఘించి సముద్ర తరంగాల్లా విరుచుకుపడ్డారు...డిప్టీ కమీషనర్ వెంటనే కాల్పులకు ఆజ్ఞ యిచ్చాడు. ధణధణమంటూ గుండ్ల వర్షం కురిసింది. చాలామంది ఊపిరులు తుపాకి గుండ్లకు ఎగిరిపోయాయి...మీర్జా ఒక్కగాని ఒక్కకొడుకు గూడా ఆ స్వర్గారోహకులలోకే చేరుకున్నాడు—చాలా సేపటికి ఎవరికి సంబంధించిన

శవాలను వారు తీసుకుపోవచ్చని అధికార్ల అనుమతి దొరికాక మీర్జా కొడుకు శవం అతని యింటికి చేర్చబడింది—

పట్నంలో దుకాణాలూ, షాపులూ అన్నీ మూసేశారు. వీధులన్నిటిలోనూ మౌనమే దట్టంగా పట్టిపోయింది. చలికాలపు ఎండ, శవంలా చల్లగా ఉంది...మురికి కాలవలు శుభ్రంచేసే నాధుడు లేక కుళ్ళు కంపు కొడుతోంది పట్నమంతా గూడా !....శవం యింటికి చేరగానే మీర్జా, అతని భార్యా ఇద్దరూ అచేతనావస్థలో పడ్డారు...ఉదయంనుంచీ బ్రతికి ఉండి చిరునవ్వులు చిందిస్తూ, ఇప్పటిదాకా పాల వ్యాపారంలోనూ, మీగడ తయారు చెయ్యటంలోనూ ఒళ్ళు వంచి పనిజేసి, తరువాత మంచిబట్టలు వేసుకుని స్నేహితులు పిలవగానే బజారుకు వెళ్ళిన తన కొడుకు ఇంతలోనే మరణించాడంటే వాళ్ళకి నమ్మశక్యంగాకుండాపోయింది...రక్తసిక్తమైన కుమారుడి దేహాన్ని క్షణంక్షణం చూసుకుంటూ, గుండెలు గుండెలు బాదుకుని ఏడుస్తూ, మీర్జా భార్య కొడుకు శవంమీద బడి రోదిస్తోంటే ఆమెను ఒక్క నిమిషంగూడా దూరంగా ఉంచలేకపోయారు జనం ! 'ఓయి నాచిన్నారి కొడకా !' అంటూ ఏడుస్తూ, చంపినద్రోహులను దుంపనాశనంగా గొంతెత్తి శాపనార్థాలు పెట్టింది. "ఈ తెల్ల పరంగీలను అట్లా నాశనం చెయ్యాలి... వీళ్లు నా బంగారాన్ని చంపారు...వీళ్ళ బ్రతుకులు బగ్గంపాడై పోవాలి !" అంది—

మీర్జా పిచ్చివాడిలా ఇంట్లోకి కాసేపూ, బయటికి కాసేపూ తిరుగుతోంటే, సిద్దీఖ్ తన దుకాణాన్ని తెరిచి కూచున్నాడు. జుట్టు బాగా రేగి శుద్ధవెర్రివాడిలా తయారైన మీర్జా అటునుంచీ శూన్యంగా వెళుతోంటే ఎవరో పిలిచి అడిగారు. "చాలా విచారకరమైన విషయం భాయీ ! అసలు జరిగిందేఁవిటి ?" అని—మీర్జా కళ్ళల్లో అశ్రువులు ఇంకిపోయినై. కాని, అతని శరీరం అంతటా ఏదో కత్తుల్లాంటి ఆవేశం నిండిపోయివుంది— "అదృష్టం అగ్గిబుగ్గై పోయింది. చేతికందినకొడుకు చెల్లుకున్నాడు" అంటూ మీర్జా మళ్లీ ఇంటిముఖం పట్టాడు—

ఇదేమీ తెలియక, పాలకోసం వచ్చిన కొనుగోలుదార్లు ఏం జరిగిందంటే ఏం జరిగిందని విస్తుపోయారు. తన దుకాణంలో కూర్చుని సిద్దీఖ్ కొంచెం వంగి పరకాయించి చూశాడు. అప్పుడే ఒక చిన్న గాలితెర రావటంతో రోడ్డుమీది దుమ్మంతా ఒక్కసారి పైకి లేచింది... రోడ్డుమీది చిత్తు కాగితం ముక్క ఒకటి గాలికి పై కెగిరి, రెపరెపకొట్టుకుంటూ కొంత దూరం వెళ్ళి కిందికి దిగజారింది...మీర్జా చెదిరిన వెంట్రుకలు గాలికి రెపరెపలాడినై అతను మళ్ళీ వీధిలోబడి అదృశ్యుడైనాడు—

"ఏమైందేఁవిటి ? విదేశీవస్తువులను బహిష్కరించటానికి వెళ్లాడు—గుండుదెబ్బ తగిలింది. ఊపిరి విడిచాడు...చేసుకుంటున్న పనిలో శ్రద్ధవదిలిపెట్టి, ప్రభుత్వాన్ని ఎదిరించబోతే ఫలితం యిదే ! నవయువకుడు ...నరకంలోని గండు చీమల్లాంటి, ఇనపముక్కు కాకుల్లాంటి వాళ్ళ చేతులో బలిపశువైనాడు" అంటూ సిద్దీఖ్ తనపని తాను చూసుకుంటూ దుకాణం ముందున్న కొనుగోలుదారుతో అంటోంటే అతను పరధ్యానంగా ఈ మాటలన్నీ వింటూ, సిద్దీఖ్ అందించిన కందిపప్పును తువ్వాల్లో పోసుకుని మూట కట్టుకుంటున్నాడు. అతని చూపు ఒక్కసారే పప్పుమీదబడి తేరిపార చూసుకుని, ''ఆరే ! ఇదేఁవిటీ పప్పు యిస్తున్నావ్ ! నేను అలచందపప్పు గాదూ అడిగాను ! భలేవాడివిలే ! నేను త్వరగా వెళ్లాలి...ఆలస్యం అవుతోంది. కొంచెం జాగర్తగా అమ్ము !!'' అన్నాడు.

మీర్జా యింట్లో అతని భార్య తలబాదుకుని ఏడుస్తూ అటు ఇంగ్లీషవాళ్ళనీ, ఇటు గాంధీజీనీ ఇష్టం వచ్చినట్టు తిట్టటంమొదలెట్టింది! 'యామీన్-' తల్లికి ఈ కబురు తెలియగానే మీర్జాభార్యని ఓదార్చటానికి వచ్చింది. ఈవిడి పెద్దకొడుగ్గూడా ఇటీవలే గోడకూలి దానికిందబడి చచ్చిపోయాడు—కుట్టుపని జేస్తూ ఆతని పెళ్లాం పిల్లల్ని పోషిస్తున్న దీమె...ఇద్దరూ కౌగిలించుకుని ఎంతసేపో ఎంతసేపో ఏడ్చారు...ఈ యేడ్పుతో మీర్జాభార్య గుండెల్లో వేదనంతా కన్నీళ్ళ రూపంలోకారిపోయింది...చిట్టచివరకి ఖౌతిక

కాయాన్ని అంత్యక్రియల నిమిత్తం తీసుకెళ్ళారు...రాత్రి. కారు చీకటి మయం...వీధంతటా నిర్మానుష్యం అంధకారం లాగానే వ్యాపించింది...చలి గాలి రివ్వున కొడుతూ వణుకు పుట్టిస్తోంది...కిర్సనాయిలుతో వెలిగే వీధి లైట్ల గుడ్డి వెలుతురులో బజారంతా భయానకంగా కనిపిస్తోంది...ప్రాణం వున్న ప్రాణి అంటూ రోడ్డుమీద తిరగటంలేదు...మీర్జా పాల దుకాణంలో మాత్రం గండుపిల్లులు కొట్లాడుతూ గుర్రుపెడుతోన్న ధ్వని వినవస్తోంది. ఈ సంఘటన జరిగిన కొన్నాళ్ళవరకూ రాత్రిపూట మీర్జా భార్య కంఠం నుంచీ పాట వినబడుతోండేది.

''క్షణంలో గాలి మారి, మనశ్శాంతి నశించేది'' అని ఆ పాట ప్రారంభం పాదం—కొన్నాళ్ళ పిదప ఆ పాట మానేసి, మౌనంగా ఆమె పని ఆమె చేసుకోసాగింది.

నేనుండే ఇంటి ఆవరణలో ఒక పురాతన ఖర్జూరవృక్షం ఒకటుంది. వెనక ఎప్పుడో దీనికి పండ్లు కాసేవిట. దీనిమీదుండే తేనెటీగలు ఆహారం కోసం దిగుతూండేవి...పొడుగాటి దీనిమట్టలమీద పెద్దపెద్ద పక్షులు వచ్చి వాలి కూచుంటూండేవి. అమాయికమైన పావురాలుకూడా కొన్ని కూచుండేవి. రాత్రిళ్లు ఉండేవి కూడా అప్పుడప్పుడూ. ఇప్పుడీ ఖర్జూరపు చెట్టు ఆకులు పూర్తిగా రాలిపోయి మట్టలుపడిపోయాయి. రాత్రిపూట అది పొడుగాటి మోడుదయ్యంలా, చేలల్లో బెదురుకోసం బెట్టిన బెదురు బొమ్మ గడలాగానూ కనిపిస్తోంది. ఇప్పుడిక దీనిమీద వెనకటి పక్షులూ కూచోటంలేదు. తేనెటీగలు తెట్టెలూ పెట్టుకోవడం లేదు...అప్పుడప్పుడు ఏదన్నా ఒక కాకి కూచుని కఠోరంగా అరుస్తూంటుంది—తప్పితే గద్ద యేదన్నా గొణుగులా గొణుగుతూ వాలి క్షణంసేపుండి లేచి మరిట్టే పోతూంటుంది... అంతే...ఉదయంపూట సూర్యకిరణాల మూలంగా అభివృద్ధి అవుతోన్న ఆకాశకాంతిలో ఇది మెరుస్తూ కనిపించి, సాయం సంధ్యా సమయానికి పెరిగిపోతూవుండే చీకటిలో కలిసి క్రమంగా దృష్టిపథంనుంచీ దూరం అయితూంటుంది...రాత్రిపూట ఇంట్లో ప్రవేశించేముందు, నా దృష్టి

ఎప్పుడూ దీని అసాధారణమైన మోడుమీదనే పడుతోంది...అది పైకి పోయినంతమట్టుకూ చూస్తూపోతే దృష్టి ఆకాశం అంచులదాకా పోయి ఆగుతుంది...ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తోంటాయి...సరీగ్గా దీని చిట్టచివర, తలమీద, అందమైన ఆకారంకల నక్షత్రం ఒకటి కనిపిస్తోంటుంది. కాని, ఆకాశానికీ నా దృష్టికీ మధ్యన ఖర్జూరపు మోడు అడ్డంగా నిలబడుతుంది. నేనిక ఆకాశంలోని నక్షత్రాల వ్యాప్తిని చూడలేకపోతోంటాను—

మా వీధిలోకి తరుచుగా ఒక పిచ్చిది వస్తూంటుంది. ఎవరో తుంటరి ఆ పిచ్చిదాని తలమీది వెంట్రుకలు గొరిగివెయ్యడంవల్ల ఆవిడ భారీ శరీరం మీద ఆ తలకాయ అక్రోట్ పండులా అవుపిస్తోంటుంది—పాపభీతీ, దైవ చింతనా గల ధర్మాత్ములు ఆ పిచ్చిదానికి అప్పుడప్పుడూ వస్త్రదానం జేసి కట్టబెట్టినప్పటికీ, ఆమె మళ్ళీ ఒక్క గంటలోనే వివస్త్రగా తయారయ్యేది. ఎవరన్నా ఆమె వంటిమీద వస్త్రాలిలా అపహరించేవాళ్ళో, లేక, ఆవిడే స్వయంగా చించి విప్పి పారేసేదో యెవరికీ తెలియదు! ఆమె నోట్లోనుంచీ అహర్నిశలూ చొంగకారుతోండేది. చేతులెప్పుడూ కట్టివేసినట్టే ఉంటూండేవి. ఎప్పుడూ రోడ్డుమీద కప్పగంతులేస్తూ నృత్యంచెయ్యటం తనలో తాను గొణుక్కోటం చేస్తూండేది. పిచ్చిది అలా వీధిలోకి వచ్చిందంటే పిల్లలంతా బిలబిలలాడుతూ గుంపులుగా వెంటబడి 'పిచ్చిది పిచ్చిది' అని కేకలేస్తూ, వెక్కిరించడం, రాళ్ళు రువ్వటం మొదలెడ్తారు. పిచ్చిది 'కుయ్యో మొర్రో' మనుకుంటూ యేదో సందుగొందుల మలుపుల్లో దాక్కుంటుంది...యెప్పుడన్నా మీర్జా దుకాణం ముందే ఇలాంటి సంఘటన జరిగిందంటే అతను పిల్లలమీద అరుస్తాడు. "ఒరేయ్ చావగొట్టేస్తాను... వెళ్ళిపోండి దూరంగా—"అని తిడతాడు. మీర్జా గర్జించినప్పుడు పారిపోయి కాస్సేపటికి మళ్ళీ గుమిగూడుతూంటారు పిల్లకాయలంతా...

పెద్దవాళ్లు కూడా పిచ్చిదానితో పరాచికాలాడుతోనే వుంటారు... పిచ్చిది అంత వికారిదైనా వయస్సులో వుంది...ఆవిడ పొట్టిగా, లావుగా కుదించిన గుమ్మడికాయలాగా ఉంటుంది. తినాకుడవా ఇంత ఉన్నవాళ్ళింట్లో

పుట్టి పెరిగినా, 'మున్నా' అనేవాడు ఇప్పుడొక రౌడీగా తయారయ్యాడు. వాడీ పిచ్చిదాని బొజ్జమీద చెయ్యేసి నిమురుతూ, "నీకు పిల్లాడెప్పుడు పుడతాడు?" అంటూంటాడు—

పిచ్చిది బాధాకరంగా చూస్తూ, బాధాపూరిత స్వరంతో చీత్కారంగా వెలువరించి, తన చేత్తో ఆ సమయంలో దోవన వెళుతున్నవారినో, దుకాణం యజమానినో, సైగచేసి మున్నా ఏమంటున్నాడో చూడండి అన్నట్టు చూస్తుంది...ఆవిడ గళం దయాళుత్వాన్ని అర్థిస్తోన్నట్టుంటుంది...బలహీనుడూ, నిరాశ్రయుడూ అయిన వ్యక్తి, తనకన్నా బలవంతుడైన యజమానిని శరణువేడి రక్షించమన్నట్టుగా ఉంటుంది—కాని, అది అర్థం చేసుకోకుండానే జనం పిచ్చిదాన్ని మరీ పరిహాసం చేస్తూ పొట్టచెక్కలయ్యేట్టు నవ్వుకుంటూంటారు పెద్దగా!...

కేవలం తినటం-తాగటం-చావటం తప్ప మరే సంగతి గురించిన్నీ పరిజ్ఞానంలేని వ్యక్తుల సంఖ్య భారతదేశంలో అధికాధికంగా ఉన్నట్టుంది. వాళ్ళు పుడతారు - పెరుగుతారు - సంపాయించటం ప్రారంభిస్తారు! తిండి తింటారు!...చనిపోతారు. అంతేకాని ప్రపంచానికి సంబంధించిన ఏ విషయంతోనూ వీళ్ళకి పరిచయం ఉండదు...కనీసం, మానవత్వపు వాసనగూడా వీళ్ళల్లో కనిపించదాయె! పాపం! జీవితపు ఔన్నత్యం వీళ్ళకి అసలే తెలియదు...పని చెయ్యటం—ప్రాణాలు వదలటం మాత్రమే తెల్సిన బానిసల వలెనే జీవితంలోని ఇతరార్థాలేమీ పట్టించుకోకండా—అసలు గుర్తించకుండానే బ్రతుకుతోంటారు. జీవన ప్రభాతోదయం—మృత్యు సంధ్యాకాలం—రెంటి తేడా కూడా వీళ్ళకి తెలియదంటానికి జాలి వేస్తుంది...పగళ్ళు పని చెయ్యటానికీ, రాత్రిళ్ళు నిద్రించటానికీ మాత్రమే ఉన్నాయనీ ఈ సత్యం తామే గ్రహించామనీ వీరి గర్వం? ఇదే వాళ్ళ జీవిత పరమార్థ సత్యం!... ఈ జీవితంనుంచీ వాళ్ళకు మృత్యువు మాత్రమే విముక్తి కలిగించగలుగుతుంది.

మా వీధిలో మరో ముఖ్య విశేషం; కుక్కలు...యెక్కడచూసినా యివే కన్పిస్తూంటాయి... డొక్కలెండి చావుకు సిద్ధంగా ఉన్నవీ, బక్క చిక్కినవీ, కూడు లేనివీ, రకరకాల కుక్కలున్నాయి...వీటిలో దాదాపు అన్నిటికీ గజ్జిరోగం ఉందనేచెప్పొచ్చు...వీటిచర్మంలోంచీ, లోపలిమాంసం కన్పిస్తూంటూంది...పొడుగాటి పండ్లను ప్రదర్శిస్తూ, కోపంతో నురుగులు కక్కుతోంటాయి. కసాయి దుకాణం ముందర పారేసిన యెముకముక్క కోసరం ఒకదాన్నొకటి గోళ్ళతో పండ్లతో రక్కుకుంటూ, కొరుక్కుంటూ నెత్తురుముద్దలై పోతోంటాయి...తోకలను వెనకకాళ్ళమధ్యకు ముడుచుకుని వాసనలు పడుతూ, నిశ్శబ్దంగా వచ్చి, కసాయిదుకాణం ముందున్న కళ్మలం మీద విరుచుకుపడ్తాయి! యెప్పుడన్నా ఒకటీ అరా మాంసం ముక్కో, ఎముక తుంపో వీటి కళ్ళబడ్డ క్షణంలోనే, ఆకాశంలో ఉండి అన్నిటినీ కని పెడుతూ అక్కడే విహరించే గద్దలు రివ్వున వచ్చి కుక్కలనెత్తినోతన్ను తన్ని వాటికి దొరక్కుండా ఆ మాంసం ముక్కల్నికాస్తా ఎగరేసుకు పోతాయి...పాపం! ఇక కుక్కలేం జేస్తాయి? దిక్కులేని దీనుల్లాగా తోకలు ముడుచుకుని రోడ్డుని మురకజూస్తూ తిరగటమో, లేక, కడుపులో వున్నమంటను కాట్లాడుకుని ఒకదాని రక్తం మరొకటి కండ్ల జూసుకుని చల్లార్చుకోటమో జరుగుతోంటుంది!...

మా వీధిలో పొద్దున్నే, సెనగలమ్మే, 'షీరా' గొంతు వినబడు తోంటుంది. వేయించిన వేడివేడి తాజాతాజా సెనగలు పట్నంలోని వీధివీధికీ సంచీలో పోసుకుని అమ్ముతోంటాడు. షీరా వయస్సు దాదాపు నలభై సంవత్సరాలుంటుంది...కాని బక్కగా ఎండిపోయిన మనిషివలె ఉంటాడు. ముఖంమీద అప్పుడే ముడతలు పుడుతూ...బిరుసైన గడ్డంలో తెల్లవెంట్రుక లున్నూ అక్కడక్కడా ఉన్నాయి. అతని కండ్లకింద నల్లటి పొరలు ఏర్పడి ఇలా ఉంటాయిగదాంటే వ్యాధిగ్రస్తుడి కళ్ళలా వెలిసిపోయి!...ఈకళ్ళలో ఆకలీ, శోకం, బాధా, గాథా అన్నీ కొట్టవచ్చినట్టు కన్పిస్తూంటాయి... శరీరం, చేతిదండలూ, వాట్లలో సన్నని నరాలు తేలి దూరానికూడా కని

పిస్తాయి...వత్తి తాగుబోతు నిషాలో ఉన్నప్పుడూ, ఎన్నోరోజులుగా తిండి లేకండా ఉన్నప్పుడూ జ్వరపీడితుడైనప్పుడూ మాత్రమే మనుషులకు ఇలా నరాలు తేల్తుంటాయి—ఇతని నెత్తిమీద మలినంగా మురికిపట్టిన టోపీ ఒకటి సర్వదా ఉంటుంది. చిరిగిన నిండు చేతుల చొక్కా....ధోతీ... ధోతీలోనించీ వెదురుగడల్లాగా సన్నని కాళ్లూ కనిపిస్తోంటాయి...

సమీపంలోనే వున్న పక్కజిల్లాలోనుంచీ చాలాకాలం క్రితం షీరా మా పట్నానికి పొట్టచేత బట్టుకుని వచ్చాడు. వచ్చిన కొత్తరోజుల్లో రాత్రంతా మసీదులోనూ, పగలల్లా రోడ్లమీద తిరుగుతూనూ కాలక్షేపం చేసేవాడట....ఉద్యోగాలు దొరకటంలో, పల్లెలూ చిన్నచిన్న బస్తీలకన్నా, పట్నాల్లో ఎక్కువ అవకాశాలనేవి వుంటాయనుకోవటం అబద్ధమే... షీరాకు ఉద్యోగ మేదీ దొరికిందిగాదు...మీర్ అమాదుల్లా అనే పెద్దమనిషి రోజూ మసీదులో నమాజు జేస్తుంటాడు. షీరా ఆయనకు తన సొదా కథా సవిస్తారంగా చెప్పుకున్నాడు. మీర్‌సాహెబ్‌కు అతనిమీద జాలిబుట్టి తన యింటికి తీసుకెళ్లాడు. కొన్నాళ్ళలోనే అతని మంచిబుద్ధినీ, విశ్వాసబుద్ధినీ గమనించి, ఐదు రూపాయలు చేతులో బెట్టి ఇలా అన్నాడు :—

"వీటితో యేదన్నా చిల్లరవృత్తి యేర్పాటు చేసుకుంటావనే అభిప్రాయంతో నీకీ అయిదు రూపాయలూ ఇస్తున్నాను...నీ కెప్పుడు వీటిని తీర్చగల శక్తి వస్తే అప్పుడే తీర్చుకుందువుగాని.,. కాకపోయినా బాధేమీ లేదు !''

షీరా తక్షణం ఆలోచించి సెనగపప్పు, వేపుడు సెనగల జంగిడీ చేబట్టాడు. స్వల్పకాలానికే సెనగల రుచీ, మాధుర్యం, షీరాని అన్ని వీధులకూ పరిచయం చేసింది. సరుకు అమ్మకం గూడా జాస్తీ అయింది. ఒక్క సంవత్సరంలోపుగానే మీరాసాహెబ్ డబ్బును తీర్చుకోగలిగాడు షీరా; నాల్గు రాళ్ళు వెనకబడగానే స్వగ్రామంలో ఉన్న భార్యా బిడ్డల్ని పిలిపించుకుని, చిన్న ఇల్లొకటి తీసుకుని సంతోషంగా జీవిస్తున్నాడు—

సరీగ్గా ఈ సమయంలోనే, స్వామీ శ్రద్ధానంద్ హత్యానేరం ఆరోపించబడి, అబ్దుల్ రషీద్‌కి మరణ శిక్ష విధించబడ్డది. పట్నంలోని ముస్లిం వర్గాలలో తీవ్రమైన ఆందోళన చెలరేగింది గదాంటే రషీద్‌ని ఉరితీస్తూన్న జైలు ముందు వేలాది జనం గుంపు గూడింది. జైలు తలుపులు పగలగొట్టి అంతా లోపల జొరబడాలని చూశారు...పోలీసులు అబ్దుల్‌రషీద్ శవాన్ని ఇవ్వటానిక్కూడా నిరాకరించటంవల్ల జనంలో క్రోధోద్రేకం మరీ ఎక్కువైంది. కాని, చేసేదేమీ లేకపోయింది...ఎలాగైనా ఖైదుఖానాను బద్దలు గొట్టి, శవాన్ని చేజిక్కించుకుని, అమరవీరుడికి జరిపే విధంగా అంత్య కర్మలు జరపాలని జన మతం...

ఆరోజు షీరా ఏదో పని వుండి జామా మసీదుకేసి వెళ్ళాడు. ఆకాశ మంతా ధూళిధూసరమై ఉంది. పట్నమంతా క్రూరమృగాలు తిరుగుతూన్నట్టు శూన్యంగా అవుపిస్తోంది...అతని కళ్ళకు కొంచెం దూరంలో ఆకలితో నక నకలాడుతోన్న రెండు కుక్కలు వేటినో నాకుతోండటం కనిపించింది. ఒక మురికి కాలవలో చచ్చిన పావురం కళేబరం ఒకటి పడి వుంది. దాని మెడ పక్కకు మెలిదిరిగి వుంది. దాని సన్నని నీలపు కాళ్ళు పైకి జాపబడి ఉన్నాయి. దాని రెక్కలు తడిసి వున్నై. ఒక కన్ను లొట్టబోయినట్టుంది. షీరా అక్కడే నిలబడి తదేకంగా దాన్నే చూస్తోండగా ఎదురుగా వున్న రోడ్డు మలుపులోంచీ 'కల్మా' (మహమ్మదీయులు చదివే మంత్రం) పఠనం పెద్దగా వినవచ్చింది. జనం అంతా ఒక శవాన్ని మోసుకుని మసీదుకు వస్తున్నారు. శవం వెనక చూసినకొద్దీ చూపు అందినంతవరకూ జనం సముద్రంలా కనిపిస్తోందేగాని మరేమీ అవుపించటంలేదు. అబ్దుల్ రషీద్ శవాన్ని జనం ఎలా తేగలిగారో గాని ఎత్తుకుని అయితే వచ్చారు. షీరా కూడా శవపేటిక వేపు నడిచాడు. మత సాంప్రదాయానుగుణంగా బుజంగల పటానికి గుంపులో గలిశాడు. ఇంతలో వీళ్ళకెదురుగా పోలీసు పటాలం ప్రత్యక్షం అయింది—జనాన్ని ముందుకు అడుగెత్తనీయకుండా ఆపి, గుంపులో చాలామందిని అరెస్టు చేశారు

పోలీసులు !...అరెస్టయిన వాళ్ళల్లో షీరా కూడా ఒకడు...దౌర్జన్యకారుల క్రింద జమకట్టబడి రెండు సంవత్సరాల కఠిన శిక్ష ఇతనికి విధించబడ్డది—

షీరా ఖైదు శిక్ష పూర్తిగా అనుభవించి బైటికి వచ్చాడు...కాని, పాత ఖాతాదార్లంతా అతన్ని దాదాపు విస్మరించారు....వెనకటి మాదిరిగా పెద్ద యెత్తున సెనగల వ్యాపారం ప్రారంభించటానికి అతని చేతిలో గుడ్డి గవ్వన్నా లేదు...పాత స్నేహితులు కొందరు జాలిపడి, తలా ఒక పావలా చందా వేసుకుని, అంతా రెండు రూపాయలదాకా చేసి యివ్వగలిగారు... దాంతో మళ్ళీ కొద్ది స్థితిలో కొత్త రోజులలో మాదిరే సెనగలు పట్నంలో అమ్మకోసాగించాడు. కాని, వెనకటిలాగా ఆ కేకలో చురుకుదనమూ, జీవశక్తీ లేవు...ఇప్పటి గొంతులో ప్రతి అరుపులోనూ, కష్టం—దుఃఖం జంటగా కలిసి వినిపిస్తాయి—ఇప్పటికీ పిల్లలు ఇతని కేక విని సెనగలకోసం మూగుతోంటారు. ఇతను పిడికెళ్ళతో కొలిచి వాళ్ళకు అమ్ముతూంటాడు—

మా వీధికి ప్రతిరోజు రాత్రీ తప్పకుండా వస్తూండే మరొక వ్యక్తి గుడ్డి పకీరు. ఇతను చాలా పొట్టిగా, కుదిమట్టంగా వుంటాడు...బాగా ఎదిగిన అతని గడ్డం యెప్పుడూ దుమ్ముగొట్టుకున్నట్టుగానే వుంటుంది—చేతులో వున్న విరుగు చూపిన వెదురులొట్టని భూమిమీద టకటకమని అనిపించుకుంటూ కర్రను ఆనుకుని అతను ముందుకు నడుస్తోంటాడు—పెంటపోగుమీద వాలిన ఈగల్లాగా, చచ్చిపోతే దిబ్బమీద పారేసిన పిల్లి అస్థిపంజరం లాగానూ అతను నిరుపయోగీ, నికృష్టంగా బతికే జీవీ !... అతని కంఠస్వరం మాత్రం ప్రపంచంయొక్క క్రూర స్వభావం నిర్దాక్షిణ్యాత్వాల చిత్రకళా ప్రదర్శనం మోస్తరుగా ఉంటుంది—శీతాకాలంలో అతని కంఠధ్వని దూరతీరాలనుంచీ వినిపిస్తూ వీధంతటా నిశ్శబ్దాన్ని వ్యాపించ జేస్తుంది...ఇప్పటికీ నా చెవుల్లో ప్రతిభవిస్తోండే యీ స్వరంకన్నా అధిక ప్రభావ శక్తి గల స్వరాన్ని నేనింతమటుకూ వినలేదు...గుడ్డి పకీరు యెప్పుడూ బహదూర్ షా పాటనే పాడుతోంటాడు అతని ముఖతా ప్రాచీన కాలాల స్మృతులు చిగిరిస్తూంటాయి...హిందూ స్థానం నూతన

శృంఖలాలలో ఇంకా బందీ కానప్పటి చరిత్ర. ఒక్క బహదూర్‌షా చక్ర వర్తి ఆవేదనే గాక, పకీరు పాటల్లో ఆనాటి హిందూస్థానం భవితవ్య స్వరాలు వినిపించినట్టుంటాయి...ఎక్కడో దూరంగా, ఎంతో దూరంగా అతని పాట వినిపిస్తుంది....

"ఎవరి కనుల కాంతిగాను...
ఎవరి మనశ్శాంతిగాను...
నిరుపయోగమైన ధూళి...
పరమాణువు నగుదు నేను...!"

ఇంతైనా, మా వీధిలో వుండే పెద్దమనుషులు మాత్రం గుడ్డి పకీరుకు ఒక్కపైసా అన్నా ఇచ్చేవాళ్ళుగారు. ఎందుకంటే అతను గంజాయి దమ్ము అలవాటుకుదప్ప మరోదానికి డబ్బులు వినియోగించడు...

ఎండాకాలంలో ఒకానొకటి రాత్రి నేను నా గదిలో కూచుని ఉన్నాను. రాత్రి పదిగంటలై ఉంటుంది. చాలా దుకాణాలు మూసేశారు. కాని, కబాబు (ఒకానొకరకమైన మాంసపు వంటకం)ల వ్యాపారికొట్టూ, మీర్జా దుకాణమూ, ఈ రెండూ ఇంకా తెరిచే ఉన్నాయి. రోడ్డుకు రెండుపక్కలా ఇండ్లలో మనుషులు మంచాలువేసుకుని వరసాగా పడుక్కున్నారు. కొంతమంది నిద్రలుకూడా పోయారు. ఇంకా కొంతమంది ఏదో మాట్లాడుతూనే ఉన్నారు. గాలి వేడిగా పొడిగా వస్తోంది. మురికి కాలవల్లోంచీ కుళ్లుకంపు వాసన కొడుతున్నది. మీర్జా దుకాణంలో బల్లకింద ఒక నల్లపిల్లి పొంచుకుని కూచుంది. ఆహారంకోసం ...ఒక మనిషి వచ్చి అణాపాలు దాగి, తాగిన పాత్రను కిందబెట్టాడు... పిల్లి చప్పుడుగాకుండా బల్లకిందనుంచీ కదిలి వచ్చి దాన్ని నాకటం మొదలెట్టింది ...ఇదే సమయంలో, నా కిటికీ పక్కగా వున్న సందులోంచీ "కల్లూ" నడిచిపోతున్నది...ఆవిడ నల్లగా వుంటుందిగాని, శరీరంలో యేర్పడ్డ యౌవనపటుత్వం, "కల్లూ" ముఖాన్నీ, శరీరాన్నీ, అందంగా— ఆకర్షణీయంగా తీర్చిదిద్దింది...కల్లూ నడకలో వేటినీ లెక్కచేయని నిర్ల

క్ష్యత్వం కనిపిస్తుంది. జీవితం సహజమైన పొంగుతో, శరీరం పుష్టికరంగా ఆరోగ్యకరంగా ఉంది... కల్లూ మున్సిఫ్ గారింట్లో పనిమనిషిగా ఉంటుంది. ఆయన భార్య దాదాపు కల్లూకు ఆరోయేటినించీ ఆశ్రయం యిచ్చి పోషిస్తున్నదట ! కల్లూ భర్త మరణించి మూడు సంవత్సరాలు దాటింది. మా వీధిలోని యువకులందరికళ్ళూ కల్లూమీద వాలి తిరిగి రాకుండా నిల్చిపోతోంటాయి !

కల్లూ వీధి మొగిలోకి వెళ్ళేప్పటికే యెక్కడినుంచీ వచ్చాడోమరి, మున్నూ వచ్చి హఠాత్తుగా ఆమె చెయ్యిబట్టుకున్నాడు—

కల్లూ మండిపడ్డది. "రౌడీ వెధవా ! ఆడదాన్ని ఒంటరిగా చూసి పట్టుకుంటావురా ! నిన్ను దేవుడెత్తుకుపోనూ !!" అని మెటికలువిరుస్తూ తిట్టిపోసింది—

"నీయౌవనం అనుభవానికి వచ్చేదెప్పుడూ మరి ??" అన్నాడు మున్నూ—

'ఛో ! చెయ్యి వదులు ముందు. దుర్మార్గుడా ?" అంటోంది కల్లూ-

పక్కనేవున్న ఇంటికప్పుమీద రెండుపిల్లులు పోట్లాడుకుంటున్నాయి. అదే సమయంలో కల్లూ తనచేతిని బలంగా ఝాడించి పెనగులాడి, పట్టు విడిపించుకుంది.

"ఛీపిరితో కొడతాను చచ్చువెధవా !...నేనేం చాతగానిదాన్ననుకున్నావేమో !...బతికున్నన్నాళ్ళూ జ్ఞాపకం ఉండేట్టు తన్నిస్తాను" అంది కల్లూ—

మీర్జా ఒక ఖాతాదారుకు పాలందించి కాసేపు లోపలికి వెళ్ళాడు. కల్లూ చివరిమాట అనేప్పుడు తిరిగి బయటికివస్తూ విన్నాడు.

"ఏమిటి కల్లూ ! ఏమైంది ?" అన్నాడు మీర్జా—కల్లూ మాట్లాడకుండా గిరుక్కున వెనక్కు తిరిగి సందులో ప్రవేశించింది. తన దుకాణం

ముందర మంచంమీద నిద్రిస్తోన్న 'అజీజ్' యీ అల్లరి విని గభాలున లేచాడు...మున్నా మంచందగ్గర నిలబడి ఉంటం జూసి అడిగాడు :—

"ఏమిట్రా మున్నా ! ఏమైందిరా ?" అన్నాడు—

మున్నా కోపంతో, నిరాశతో నిలబడ్డాడు...ముఖం అంతా కంద గడ్డలా ఎర్రబడి యెండినట్టు అయింది...వాడి కండ్లు పాముకండ్ల మాదిరి విషపూరితాలై చురుకుగా చూస్తూన్నాయి. దగ్గరలోనే ఉన్న పెంటదిబ్బమీద నిలబడివున్న ఒక పిల్లికండ్లు ఇటు చూసినప్పుడు చీకట్లో పచ్చగా మెరిసి మాయమైనై...అణిగివున్న నిరాశ గొంతులో ప్రస్ఫుటింపజేస్తూ "ఏం లేదురా ! అదే. కల్లూ !!-" అన్నాడు మున్నా—

అజీజ్ ఆత్రంగా "ఫలితం దక్కిందా ?" అన్నాడు.

"లేదురా ! పట్టుకుంటే విదిలించుకుని పారిపోయింది....పోనీలే... ఎక్కడికి పోతుందో చూస్తాను !!" అన్నాడు మున్నా—

ఇంటిమీద పిల్లుల పోట్లాట ఇంకా సాగుతోనే ఉంది. మొదలు భయంకరంగా గురగురలాడటం, తర్వాత పెద్దగా అరవటం అంతా గందర గోళంగా ఉంది....ఒకదా న్నొకటి నమిలి మింగేట్టుగా ఉన్నాయి—కానే పటికి "మ్యావ్‌మ్యావ్" అంటూ ఒకటి పరుగెత్తింది...మగపిల్లి గుర్రు మంటూ దాని వెంటనే బడి తరిమితరిమి కొట్టింది !

అజీజ్ మున్నాను తన మంచంమీద కూచోబెట్టుకున్నాడు. తలగడ దిండు కిందనుంచీ బీడీదీసి అతనికి అందించాడు. మున్నా దాన్ని పుచ్చుకో కుండా, తన కమీజు జేబులోనించీ ఒక వెండి సిగరెట్ కేసును బైటికి దీశాడు..."వెధవ బీడీలేమిట్రా యిక్కడ ! ఇదుగో ! పెద్దరకం సిగిరెట్టు కాల్చుకో !" అంటూ ఒక సిగరెట్టు దీసి అజీజ్‌కు యిచ్చాడు—

"ఎక్కడ కొట్టుకున్నావ్‌రా !?" అన్నాడు అజీజ్.

"మనకేం తక్కువరా! 'మౌలా ఇవ్వనివాడికి ఆసపుద్దోలా ఇస్తాడు' అన్న సామెతగా అల్లాని నమ్ముకుంటే చాలు. అన్నీ అవే వస్తాయిరా!"...

"అబే! మున్నా. జాగ్రత్త! పాపానికి భయపడాలి. నరకానికి బోతావ్...లెంపలు వేసుకో!!"

"ఫోరా! నీవన్నీ గాడిద గత్తర కబుర్లు చెబుతూంటావు. తినటం తాగటం ఆనందాన్ననుభవించటం...అంతే నాకు తెలిసేది. ఇంతకన్నా ఎక్కువ పంతులుగాడు నేర్పలేదు నాకు!...మీసాలు పెంచి మెలేస్తాను ఇక....ఎక్కడుందిరా నరకం?...ఉంటే, ఆరుచేఁవిటో అనుభవింతాంలే! ఇప్పటినుంచే గొడవెందుకు? చచ్చిం తరువాతగా అది!!"...

"ఆగవోయ్! అన్నీ పాడు మాటలు...కాని ఇలా ముందుకు పోయేప్పుడు అన్నీ ఆలోచించుకోవాలని నా అభిప్రాయం!"

"అరే అజీజ్! ఇంకా నీ విట్లానే అంటూంటే నేను లేచి వెళ్ళి పోతా!" అన్నాడు మున్నా.

"అరే వినవోయ్!...ఒకమాట...నాకు చాలారోజులబట్టీ ఎందుకో ఆశ్చర్యంగా ఉంటోంది....అడుగుతాను గాని, చెబుతానని ఒట్టేసుకో!"

"చెబుతాలే!...అసలేమిటది?...దేవుడితోడు అన్నగా చెప్పా!"

"సరేగాని మున్నా, నీవు దొంగతనాలు ఎందుకు జేస్తావురా?"

"అదా!! తప్పలేదు గాబట్టి జేస్తాను!"

"అదుగో! ఒట్టేసుకుని మళ్ళీ చెప్పకండా తప్పించుకుంటున్నావ్!"

"సరే లేరా! నీవు గెల్చావు—నేను ఓడిపోయాను...నిజం మాట్టాడితే, నిజంగా నేను జేసేది దొంగతనంగానే గాదు...మా బంధువు లంతా పెద్ద పెద్ద ధనవంతులన్న సంగతి నీకు తెలుసుగా!"

"అందుకే నాకు మరీ ఆశ్చర్యం!..."

నాకు అన్న వరస వాడొకడు...కాస్త పచ్చిగా వుందిలే వాడి పని. ఇదంతా పదేళ్ళనాటి కథలే...మేమిద్దరం గలిసి బళ్లో చదివేప్పుడు ఈ జడ్జి వెధవ నా మీద చాడీలు చెప్పి పంతులుతో బెత్తం దెబ్బలు కొట్టిం

చాడు...అప్పట్నించీ నాకు దయ్యం బట్టింది. వాడిమీద పగ తీర్చుకోకపోతే మీసాలు గొరిగించుకుంటానని ప్రతిజ్ఞ పట్టాను. మాంచి సమయం కనిపెట్టి వాడి బిస్తర్ కొట్టేశాను. దాంట్లో చాలా విలువగల వస్తువులున్నాయిలే!... దీంతో ప్రారంభమైంది. మన పని...ఒకసారేమో మా మామ తాలూకు సిగరెట్ కేసు అందంగా వుండి బాగా నచ్చింది...అది కావాలని ఆయన్ని అడగటం ఎలా! అడిగినా ఇవ్వడని తెలుసు...అడగటం యెందుకని, దాన్ని దాటించేశాను చెప్పొద్దూ!...ఈ చిలుం వెధవలందరి దగ్గరా డబ్బు కూడా ఉందన్న సంగతీ, మంచి మంచి వస్తువులున్న సంగతీ క్రమంగా నాకు తెలిసింది...అవసరమైన వాటిని ఎందుకు పుచ్చుకోకూడదూ అని పించింది...క్రమక్రమంగా మనకు హస్త లాఘవం అబ్బుతూ వచ్చింది. ఆరితేరాము...అరే! అజీజ్! నిజంగా వీళ్ళు ఏ పేదవాడికన్నా ఒక పైసా ఇస్తార్రా! చచ్చినా ఇయ్యరు...వాళ్ళ దగ్గర ఈ పద్ధతిలో చెవులు మెలేసి వసూలు చెయ్యాల్సిందే తప్ప మార్గాంతరం లేదురా!...''

''మరెక్కడన్నా పట్టుబడితేనో?'' అన్నాడు అజీజ్.

''ఛా! పో! మళ్లీ అవే వెధవ కూతలు...సరేగాని నేను వెడు తున్నా. పొద్దుబోతే ఇంట్లో అంతా విరుచుకుపడతారు'' అంటూ మున్నా అజీజ్ వీపుమీద హుషారుగా అరిచేత్తో చరిచి లేచి బైల్దేరాడు...

మా వీధిలో వున్న మసీదులో 'నిసార్ అహ్మద్ ఖాన్' అనే అతను ప్రార్థనకు ముందుగా "అజాం" యిస్తోంటాడు. ఇతను చాలా బలిష్ఠుడు. పుష్టికరమైన, ఆరోగ్యవంతమైన శరీరం. నల్లని నలుపూ... పెరిగిన గడ్డం ఎప్పుడూ గోరింటాకు రంగుతో ఎర్రగా ఉంటుంది. తలమీది భాగం అంతా బట్టతలా...కాని పక్కభాగాలూ, చెంపలమీదా వెంట్రుకలు గుబురుగా పెరిగి ఉంటాయి. ఇతని నొసటన సరీగ్గా నడిమి భాగాన గుంట లాంటి ఒక మచ్చ. బూడిద రంగుతో దూరానికి మెరుస్తూ కనిపిస్తుంది... తరుచుగా ఇతను నా కిటికీ పక్కగానే నడిచి వెళుతూంతేవాడు సంరంభంగా

వదులు వదులుగా వుండే ఢీలా పైజామా, షర్టూ ధరించి ఉంటాడు. బుజం మీద ఎర్రరంగు రుమాల పెద్దది ఎల్లప్పుడూ ఉంటుంది—

సర్వసాధారణంగా మానవ కంఠ స్వరాలకు అబ్బని మృదు కాఠిన్యం ఇతని కంఠంలో తొణికిసలాడుతోంటుంది...ఎంత మెత్తనో, అంత ఖంగు మంటుంది నిసార్ అహమ్మద్ ఖాన్ మసీదులో అజాఁ (సామూహిక ప్రార్థనకు భగవన్నుతితో పిలిచే పిలుపు) యివ్వటం మంచి ప్రశస్తి సంపాయించుకుంది. అతని గొంతు చాలా దూరం కంచు గంట వలెనూ, శంఖంలాగా వినవస్తుంది. అజాఁ ప్రారంభించినప్పుడు కంఠ స్వరంలో దాని ఔన్నత్యం, విలువా, కళ్ళకు కట్టినట్టుంటూ, ముస్లిం జాతి నంతనీ నమాజ్‌కు ఆహ్వానిస్తూన్నట్టుండేది...అది అంతం అయ్యేప్పుడు ఆ ఝుంకారం క్రమంగా తగ్గిపోతూ, మాటలు మెలి దిరుగుతూ, క్రమ క్రమంగా నిశ్శబ్ద వాతావరణాన్ని సృష్టిస్తూ ఆకాశానికంటి అక్కడ ఆగి పోతుంది. ప్రజలంతా నిసార్ అహమ్మద్‌ని గౌరవ భావంతో ఆశ్చర్యం గానూ, ఆచార్యుడుగానూ తిలకిస్తోంటారు. అజాఁ యివ్వటం మాట వస్తే నిసార్ ప్రత్యేకతనే ముందు గుర్తించేవాళ్ళు. ఇతని మధుర గళం, నల్లని దేహం, ఉనికీ, ప్రత్యేకత నాపాదించుకున్నాయి.

ఒకసారి మా యింటి పై భాగంలో నేనొక్కడినే కూచుని ఆలో చిస్తున్నాను. ఆకాశంమీద పల్చపల్చగా మబ్బులు పరుచుకుని ఉన్నాయి. మబ్బుల వెనకనించీ సూర్యరశ్మి వచ్చి వాలుతూ మసక వెలుతురు మనో జ్ఞంగా ఉంది...పట్నం మీదికి దృష్టి సారించి చూస్తే...దృశ్యాలు దృశ్యా మానంగానే గోచరిస్తున్నాయి. కాని స్ఫుటంగా కనిపించటం లేదు. పట్నం లోని పగలల్లా రేగిన ధూళీ కశ్మలం, దూరంగా మిల్లుల చిమ్నీలనుంచీ ధారాళంగా బైలువెడలే పొగ, వాతావరణం నిండా వ్యాపించి ఉంది. పట్నంలో వినవచ్చే రొద, తేనెటీగల రొదగా రోదసిలోకి చేరుతోంది. పై వాయుమండలమంతా నిరాశామయంగా వున్నట్టుంది. మన పట్టణాలలో తరుచుగా సాక్షాత్కరించే, నిర్భాగ్యత్వం, కశ్మలత్వం, జీవితంమీది విరక్తీ,

నిరాశ్రయత్వ లక్షణాలతో నిండిన తత్వం మూర్తీభవించి వాతావరణంలో గడ్డ కట్టుకుపోయినట్టుగా వుంది.

దుమ్ముతో మురికిపట్టిన పీచు మబ్బులలోనించీ, ఒక అడివి పావురం రెక్కలు రెపరెపలాడిస్తూ బయలుదేరి పై రంగులో కలిసిపోయి అదృశ్యం అయింది——దూరంగా మిల్లుల కూతలూ, రైలు ఇంజన్లధ్వనీ, బాగా విని పిస్తున్నాయి——పెద్దపెద్ద ఎత్తైన ఇండ్లూ, బురుజులమీదినుంచీ పావురాలు రెక్కలాడిస్తూ లేచి కాసేపు తపతపలాడించి మళ్లీ అక్కడే వాలి కూచుం టున్నాయి...చూపుకు అందినంత మేరా ఎక్కడ చూసినా మురికి ఓడుతూ వర్షానికి పాచిబట్టి నల్లరంగుకు తిరిగిన ఇండ్లగోడలూ, ప్రాకారాలూ, సౌధాలూ, కప్పులే అవుపిస్తున్నాయి...మానవుడు దృష్టి సారించగలిగినంత వరకూ సారించి చూసినా, ఎక్కడా, చప్పబడ్డ జీవితానురక్తి, నిరుద్యోగస్థితీ తప్ప అన్యం అవుపించటమే లేదు!....అక్కడక్కడా రెండూ, మూడూ అంత స్థులమేడలు నిర్మాణంలో ఉన్నాయి. వీటి ఉనికి గగనానికీ—మానవ దృష్టికీ మధ్య అవాంతరం కల్పిస్తో ఉంది! వెదురు బొంగులూ, గడలూ, ఇలాంటి వస్తువులన్నీ ఆకాశంలోని మబ్బులరంగుతో కలిసి మసకమసగ్గా కన్పిస్తాయి!

ఇదే సమయంలో మసీదులోనుంచి నిసార్ అహమ్మద్; నమాజ్ వేళ అయిందని తెలుపుతోన్న అజాంధ్వని ఖంగున వినవచ్చింది. క్రమంగా తారస్థాయినందుకుంటోన్న సువర్ణ కంఠ నినాదం ఆకాశపు అంతరాళంలోకి ఎగిసిపోతున్నది...ఈధ్వని నిరాశలోనే ఆశను మొలకెత్తించి చిగిరింప జేస్తున్నది. నా మనస్సు నిశ్చల విషాదస్థితికి మారిపోయింది...ఈ ధ్వనిలో గొప్ప చారిత్ర కౌన్నత్యం, గొప్పదనం గాకపోయినా జీవితపు నిర్మమత్వం గోచరమవుతోంది...ఈ ప్రపంచం నిర్జీవమైనట్టిదనీ, దీన్ని కామించే వాళ్ళంతా అలగాజాతి కుక్కల్లాంటి వాళ్ళనీ వ్యంగ్యంగా జ్ఞాతమౌతుంది. జీవితం నిరుపయోగమైన చెత్తలాంటిదనీ, మేఘాలమీద కప్పిన దుమ్మూ ధూళీ లాంటిదనీ ప్రబోధిస్తున్నట్టుండేది...ఆలోచనా భూయిష్ఠమైన మన స్సుతో అజాం పిలుపు వింటున్నాను...పిలుపు దాదాపు పూర్తికావచ్చింది.

"—అలీఅలుల్వా" అనే పదంతో నిశ్శబ్దాన్ని సృష్టిస్తోన్న కంఠం చెవుల్లో ప్రతిరవం ఇస్తోంది! క్రమంగా నిశ్శబ్దశూన్య స్థితికి జేరుతూ ప్రపంచస్థితి యొక్క అస్థిరత్వంపట్ల విశ్వాసం గలిగిస్తూ, మంద్రస్థాయిలోకిచేరిన సుదీర్ఘమైన తానస్వరం యొక్క ముగింపుదశగా, నెమ్మదిగా, హృదయ ప్రశాంతాన్ని కల్పిస్తూ సంపూర్ణంగా అంతమైన; యీ నినాదం అంతమైందా లేక విశ్వచలనమే అంతమైందా అనిపించింది చెప్పొద్దూ!!...అగాధమైన నిశ్శబ్దం,...మౌనం...ఈ సంచలనాత్మక జగత్తుకు అవతల, దూరంగా మరో జగత్తు ఉన్నట్టు, అక్కడ జీవితం - మృత్యువూ రెండూ ఒకే స్థితిలో సమంగా దర్శించబడుతోన్నట్టూ హృదయానికి అనుభూతి కలుగు తుంది—ఈ నాదం దూరదూరతీరాలలో మిన్నూ మన్నూ ఒక్కటైనట్టుగా అంతమైంది! ఇక అక్కడినుంచీ ఆకాశం ఆది అయినట్టుగా వుంది!.... మరి అక్కడ ఆకాశాన్ని తాకి నేల పూర్తిగా అంతమైందో! లేదా, అంతటా ఆకాశమే ఆవరించి వుందో, కాని, రెంటికీ తారతమ్యం అర్థం గావటంలేదు!— అదేరకంగా ఈ ధ్వని నిశ్శబ్దంలో సంలీనం కావటంతో, ధ్వనికీ - నీరవానికీ మధ్యగల సరిహద్దు తేడా సమసిపోయినట్టుంది!... ధ్వని చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే వుంది. కాని, అనంతమైన నిశ్శబ్దంలోనే పుట్టి అందులోనే కలిసిపోతున్న అనుమానం కల్గింది. ఈ 'అజా౹' మన జీవితంలోని యథార్థాన్ని ఎంత చక్కగా వెల్లడిచేస్తున్నదీ ఆలోచిస్తున్నాను. మన నరాల్లో జీర్ణించిపోయిన నిస్పృహా, నిరాశ్రయతా ఇల్లా వున్నాయి గదాంటే, ఆముష్మికత్వానికి సంబంధించిన యథార్థంయొక్క భయంవల్ల, గత్యంతరంలేని పరిస్థితిలో గడుపుతోన్న నిరాశామయ జీవితం దీంట్లో వుంది!!...మనం ఈ జగత్తును మరచిపోయి ఐహికాముష్మిక తత్వ విచా రంలో పడిపోతాం — జీవన్మరణ స్వప్నాలనుకంటూ, మనుష్యుణ్ణి విస్మ రించి. దేవుణ్ణి కనిపెట్టే యత్నంలో నిమగ్నులమౌతాం!...మన జీవితం లోని ప్రతి సంఘటనా ఈ విషయాన్నే నిరూపిస్తూంటుంది...మనంపాడే ప్రతిపాటా దీన్నే మదురావబోధకం చేస్తుంది...మన కాళ్ళకు సంకెళ్ళు

ఉన్నప్పటికీ, వాటి రాపిడికి మనం ఎంతగా అలవాటుపడిపోయామంటే, అవి అలౌకిక సత్యాన్నిగా వాటిని తెలుసుకో జాలకపోతున్నాం !...మన చేతులకు బేడీలు తగులుకుని ఉన్నాయి. మెడలకు తాళ్లున్నాయి...మననోళ్ళకు తాళాలు వేయబడి ఉన్నాయి. కాని, మన కివేవీ తెలియవ్ !...శరీరం హీనమై - ఆత్మ నిద్రాణమై ఉన్నప్పటికీ మనం ఈ దుస్థికే ఆనందపడుతున్నాం...ఇవేవీ లక్ష్యం లేకుండానే జీవితాలు గడుపుతోంటాం !...మృత్యుదేవి తన హస్తాన్ని జాపి తన అంధతమో పరిష్వంగంలోకి మనల్ని లాక్కుంటుంది !...మన మంచీ చెడూ అంతా దానిముందు ఒకటే !... మనకు జీవితమూ - మృత్యువూ రెండూ ఒకటే !...ఆజాఁ ధ్వని లాగానే జీవితంలోంచీ మృత్యుస్థితికి జారిపోతాం తెలీకుండానే - మనం ఎప్పుడన్నా బతికీ ఉన్నామా, లేక బతికి ఉన్నామన్న భ్రాంతిలో ఉన్నామా అన్న అనుమానం మృత్యువుకు ముద్దుబిడ్డలమైన మనం సర్వదా దాని ఉనికిని గుర్తించకుండానే భ్రమానిద్రలో గడిపామా అన్న ఆలోచనా కలిగి రెంటి తారతమ్యం అర్థంగాకుండా పోతుంది.

ఒకనాటి రాత్రి మీర్జా దుకాణంవద్ద ముగ్గురు నలుగురు మనుషులు కూచుని మాట్లాడుతోన్నారు—వాళ్ళలో అజీజ్ గూడా ఉన్నాడు. ఇంకోడు కబాబీ, ఇంకా యిద్దరెవరో పోగైనారు. వాళ్ళ ముందు హుక్కాగొట్టం వుంది. వంతులవారీగా దాన్ని పీలుస్తున్నారు. వాళ్ళల్లో ఒకడు ఇలా అన్నాడు :—

"ప్రతి సంఘటనలోనూ ఆయన మహాత్మ్యాన్ని నేను చూస్తుంటాను-"

నా చెవులు వాళ్ళ మాటలవేపు మొగ్గినై ...శ్రద్ధగా వింటున్నాను— ఇంతలోకే ఒక కొనుగోలుదారు వచ్చి ఐదు పైసల పాలు యివ్వమని మీర్జాను అడిగి పక్కగా నిల్చున్నాడు...పాలు పొయ్యటానికి కొండిచెంబు నెత్తి, లోటాను దగ్గరసా పెట్టాడు మీర్జా....ఇదివరకటి మనిషి మాటలు ఆగకుండా వినబడుతూనే వున్నాయి. "ఒక సంఘటన వినండి. నేనోసారి

చాందినీ చౌకులోంచీ వెళుతూండగా ఎదురుగుండా ఒక ఆవు పరుగెత్తు కుంటూ వస్తున్నది....అక్కడే ఒక పసిపిల్లాడు పడివున్నాడు. ఆవు ఆ పిల్లాడి దగ్గరకు రావటంతోటే ఒక్కసారిగా తూలి ఆగింది. ఇంకో క్షణంలో పిల్లాడి గతి ఏమైతుందో నేను అనుకుంటూండగానే, ఏం జరిగిందో తెలుసా? అది తన నాలుగుకాళ్ళనూ కలిపి, ఒక్కటే గంతేసి, పిల్లాడి మీదిగా దాటిపోయింది...ఆ నోరులేని పశువు బుద్ధిలో నాకు 'అల్లా' మహాత్యమే కనిపించింది :—

మీర్జా పాలుబోయటం ఆపి, ఒక చేతిలో చెంబూ, అదీ అలాగే ఉంచుకుని ఆ మాట్లాడే వ్యక్తికేసి కళ్ళప్పగించి చూస్తున్నాడు—"ఓహో ఏమి దైవచిత్రం!" అని అజీజ్ ఆశ్చర్యం ప్రకటించాడు—

మీర్జా లోటాలో పాలుబోసి వాటిని తిరగబోస్తున్నాడు. ఇంకో మనిషి మరోమాట మొదలెట్టాడు :—

"ఆయన మహత్తునుగురించి మన మేం ఊహించగలం? వినండి! ఒకసారి హజరత్ సులేమాన్‌గారికి, ఒక సౌధం కట్టించవలసిందిగా ఆదేశం అయింది-వేంటనే పని ప్రారంభించాడు!....అయ్యలారా! ఇక చూడండి సంగతి...'జిన్నాదులు' (దయ్యాలు) పెద్దపెద్ద బండలూ, గుండ్లూ, రాతి పలకలూ, అవీ మోసుకొచ్చి పడేస్తునాయి!...బహుకొద్దిదినాలలోనే సామాను లన్నీ పోగైనాయి—జిన్నాదుల పనులు ఎంతో చురుకుగా, కన్నుమూసి తెరిచేలోగా పూర్తి అవుతాయి గదాంటే : మీకు తెలుసుగా! ఇవ్వాళ ఇంత ఉంటే, రేపు అంతై, బహు కొంచెం కాలంలోనే మహలు ఆకాశం ఎత్తుకు పెరిగిందంటే నమ్మండి!!...పని జరుగుతోందా లేదా అని హజ్రత్ సులేమాన్‌గారు రోజూ తనిఖీ చేస్తూండేవారు....మొత్తంమీద పూర్తయింది... ఇక లోపల నేల చదునుజేసి, బండలు పరిచి శుభ్రం చెయ్యటంమాత్రమే మిగిలి ఉంది...ఆ మర్నాడు సులేమాన్‌సాహెబ్ గారు తమ కర్రను ఆసరాగా పెట్టుకుని నిలబడిఉన్నారు—ఇటు పని టకటకా జరిగిపోతోనేవుంది-అటు కర్రనానుకుని నిలబడ్డ ఆయన పని అంత్యానికి వచ్చింది! ఆయన చరిత్రే

క్షణంలో సమాప్తమైంది !...తీరా, జిన్నాదులు తిరిగి చూస్తే అక్కడ ఆ మహాత్ముడే లేకుండాపొయ్యాడు!...వాటి దోవన అవీ అయిపూ ఆనవాలూ లేకుండా పోయాయి !...ఇప్పుడా పనిని ఎవరు చేస్తారా అన్న ఆశ్చర్యమే కలుగుతోంటుంది !——"

అజీజ్ చేతిలోని హుక్కా గొట్టం అతని నోటికి అందుబాటుగా ఉంది....అతను అలానే ఆ వ్యక్తివైపు చూస్తున్నాడు...మీర్జా చేతిలో లోటా అలాగే ఉంది...కింద 'ఆబ్కారా' (కూజా మూతి చెంబు) పడి వుంది...గుడ్లప్పగించి కథ వినటంలో కూరుకుపొయ్యాడు...

నాకు పెద్దగా నవ్వు వచ్చింది-కాని వెంటనే ఆలోచనలో పడ్డాను- "నిజంగా ఈ పని చెయ్యాల్సిందెవరు ?" అని——

రివ్వున గాలి విసిరి కొట్టింది. ఆ విసురుకు రోడ్డుమీద వెలిగే కిర్సనాయిల్ దీపం గప్పున మలిగిపోయింది...రోడ్డంతా అంధకార బంధురమైంది అప్పుడు మీర్జా దుకాణంలోనుంచీ మనుషులు లేచి దారి బట్టారు- నేను కూడా ఇంట్లోకి వెళ్ళాను——

మూల కథ :
"కఫన్"

# "పాడె బట్ట"

రచయిత :
"ప్రేమ్‌చంద్"

## 1

గుడిసె గుమ్మంలో తండ్రీ కొడుకూ ఇద్దరూ ఒంటిగంటప్పుడు గుండాని కెదురుగా నిశ్శబ్దంగా కూచుని ఉన్నారు. లోపల కుమారుని నవ యౌవనవతియైన భార్య ఒళ్ళు తెలియని బాధతో కుక్కిమంచంమీద బడి దొర్లుతూ ఉంది. ఆమె అలా ఏడ్చి ఏడ్చి ఆవేశమైన నోటినించీ హృదయ విదారకమైన కేకలొస్తున్నాయి. అవి శీతాకాలపు రాత్రులు - విశాలమైన ఆ అల్లకల్లోలంలో మునిగి ఊరు ఊరంతా గాఢాంధకారమైపోయింది——

కేశవు డిలా అన్నాడు: "బ్రతుకుతుందనే ఆశ కన్పించటంలా! రోజల్లా అట్లా కొట్టుకుంటూనే వుంది. వెళ్ళు. చూసైనా రా!"

మాధవ్ పెద్ద బరువెక్కిన గుండెలతో దీనంగా అన్నాడు. "చచ్చి పోవటమే ఖాయమైతే, తొందరగా చచ్చేందుకుబోదు—చూసి ఏం వచ్చేది?"

"నీవు బొత్తిగా బాధ ఎరగని వాడివిరా దరిద్రుడా! సంవత్సర మంతా జీవితాన్ని ఎవరితో సుఖ దుఃఖాలతో అనుభవించావో, ఆమెతోనా ఇంత అవిశ్వాసంగా...?"

"అయితే ఆమె అట్లా కాళ్ళూ చేతులూ కొట్టుకోటం, గిలగిలా తన్నుకుంటూ కేకలు పెట్టటాన్ని చూడటం నా చాతగాదు!"

అది మాదుగుల కుటుంబం, అదీగాక ఊరంతా బద్‌నాం: కేశవుడు ఒకనాడు పనిజేస్తే మూడురోజులు ఆరామ్—ఇక మాధవ్ ఇంత పని దొంగ

గదాంటే ఒక గంటనిండా పనిజేస్తే ఒక గంట పూర్తిగా చిలుం తాగుతాడు. అంచేత వాళ్ళని ఆ వూళ్ళో ఎవరు చూసేవాళ్ళేగారు—ఇంట్లో పిడికెడు గింజలు ఉన్నట్లయితే ఇక వారు పని జేస్తే ఒట్టు! అలా ఒకటి రెండు ఉపోషాలు అయితే అప్పుడు కేశవుడు ఏ చెట్లో ఎక్కి పుల్లలు కొట్టుకొచ్చే వాడు. వాటిని మాధవ్ బజారులో అమ్ముకొచ్చేవాడు. ఎప్పుడు రెండు పైసలు చేతులో పడతాయో ఇక వారిద్దరూ అటూ ఇటూ చచ్చిందాకా తిరిగే వారు—ఎప్పుడైనా ఉపోషంజేసే పరిస్థితివస్తే అప్పుడు కట్టెలు కొట్టటమో, ఏదైనా కూలీకోసం వెదుక్కోటమో చేసేవాళ్ళు. ఊళ్లో పనికి తక్కువేమీ లేదు. అది వ్యవసాయకుల గ్రామం-పనిచేసే వాళ్ళంటే యాభై పన్నెన్క. కాని, వారిద్దర్నీ లోకులు ఎప్పుడు పిలుస్తారూ, యెప్పుడు ఇద్దరు మనుషుల్తో ఒక్కరు చేసేంత పని చేయించుకోని, సంతృప్తిపరుచుకోటం తప్ప మరేమీ గత్యంతరం లేనప్పుడు;—వీరిద్దరూ సన్యాసులై ఉన్నట్టయితే రేపటి దిన భత్యం కోసం వెదుక్కోవాల్సిన అవసరం ఉండేది గాదు. వారి ప్రకృతి అలా వుండేది. బహు విచిత్రమైన జీవితం వారిది! ఇంట్లో రెండు మూడు మట్టి పాత్రలు తప్ప ఏమీ లేవు. ఒళ్ళు దాచుకోటానికి ఏవో చింపిరిగుడ్డలను ఆధారం చేసుకుని ప్రపంచ చింతలకు దూరంగా ఉండేవారు. తల వెంట్రుకలన్ని అప్పులు—తిట్లూ తినేవారు. కాని ఎంతమాత్రమూ చీకూ చింతా లేకుండేది! లోకులను వీరినుంచీ తిరిగి రాబట్టుకునే ఆశ లేక పోయినా కొద్దో గొప్పో అప్పు ఇస్తూనే వుండేవారు. ఆలుగడ్డల పంట కాలంలో చేలనుంచీ ఆలుగడ్డలు పీకి తెచ్చుకుని కాల్చి కాల్చి తినేవారు. లేదా పదినైన్దు ముక్కలు పీక్కోవచ్చి రాత్రిపూట పీలుస్తారు-కేశవుడు ఇదేరకమైన ఆశాభావంతో సుమారు అరవై యేళ్ళకు తక్కువగాని జీవితాన్ని కత్తిరించుకుంటూ వచ్చాడు. మాధవ్ కుటుంబపు గారాబు బిడ్డడిలాగా తండ్రి అడుగులో అడుగుగా వస్తూన్నాడు. అంతేగాదు ముమ్మూర్తులా తండ్రి పేరును ఇనుమడింప జేస్తున్నాడు. అప్పుడు గూడా వారిద్దరూ నిప్పు గుండం ముందు కూచునే ఉన్నారు. ఎవరి చేలోనుంచో తెచ్చిన ఆలుగడ్డలు

కాల్చుకుంటున్నారు-కేశవుడిభార్యకు కాలం ముద్దతు (గడవు) అయిపోయింది. ఆమె మరణదేవత కౌగిట్లోకి వెళ్ళిపోయింది-మాధవ్ పెళ్ళి గడచిన సంవత్సరమే అయింది. ఈ అమ్మాయి వచ్చినప్పటినుంచీ ఆ వంశంలో మర్యాదకు పునాదులు వేసింది—పిండి విసిరీ, గడ్డి చెక్కీ, రోజూ ఆమె ఒక శేరు పిండీ గూడా సంపాయించుకుండేది. మరి వారిద్దరూ ఈమె ఇంట్లో అడుగు బెట్టినప్పట్నించీ ఇంకా సోమరిపోతులై—బాగా ఆరామ్‌కు అలవాటు పడటమే గాక ఒక్కొక్కప్పుడు ఆ అమ్మాయిని తిట్టేవాళ్లు గూడానూ ! ఎవరైనా కూలికి పిల్చారా రాజదర్పంగా మాట్లాడుతూ రెట్టింపు కూలీ అడిగేవారు. పాపం ! ఆ అమ్మాయి ఈ ఉదయంనుంచీ అమితమైన నొప్పితో బాధపడుతోంటే, ఈ తండ్రీ కొడుకు లిద్దరూ ఆమె ఎప్పుడు చచ్చిపోతుందా, ఎప్పుడు తాము సుఖంగా నిద్ర బోతామా అని ఎదురు చూస్తున్నారు !—

కేశవుడు ఆలుగడ్డ దీసి పొట్టు వలుస్తూ అన్నాడు. "వెళ్ళి చూడూ, అయితే ఆమె సంగతి ఎట్లా వుందో, ఆమె చచ్చేపోతుందో ఏమో !.... కాటికాపరిగూడా ఒక రూపాయి అడుగుతాడు. ఎవడింట్లోనించీ వస్తుందీ, ఎవడిస్తాడు !!" అని!—

మాధవ్‌కు నమ్మకం ఉందిగదా, ఆ ఆలూకొటార్లలోకి పోతే కేశవుడు ఆలుగడ్డలలో ఎక్కువబాగం సాఫ్ చేస్తాడు. అని, అన్నాడు. "నాకు అక్కడ భయం వేస్తుంది"

"భయం ఎందుకోసం నేనిక్కడ ఉండగనే !!"

"అయితే నీవే వెళ్ళి చూడరాదూ !"

"నాభార్య చచ్చిపోయినప్పుడు, నే నామెదగ్గర్నించీ మూడురోజులు అట్లా కదలకుండానే వున్నా - అదీగాక నాతో ఏమన్నా అయితుందాఅంటే లేదు—ఇక ఈమె ముఖమే నే నెప్పుడూ చూల్లేదు. ఇవ్వాళ ఆమె ఉబ్బిపోయి ఉన్న దేహాన్నిచూసినా, ఆమె తనువు శుద్ధీగూడా కాజాలదు. నన్ను చూసుకున్నట్టయితే, కాళ్లూ చేతులూ గూడా విడిపోయి కదిలించనేజాలదు-"

"ఏమన్నా పిల్లాజెల్లా గలిగితే ఏమయ్యేదో అని నేనాలోచిస్తున్నా. శొంఠీ, బెల్లమూ, నూనే ఏవీగూడా లేవు ఇంట్లో !''

"అన్నీ వస్తయ్ భగవంతుడు సంతానాన్నే ఇస్తే—ఎవరుగానీ ఇప్పుడు పైసా ఇయ్యటానికైనా వెనకాడుతున్నారో, వారే అప్పుడు పిల్చి ఇస్తారు - నాకు తొమ్మిదిమంది సంతానం కలిగారు. ఎప్పుడూ ఇంట్లో ఏమీ ఉండేవిగావు. కాని, ఇట్లాగే ప్రతిసారీ పని వెళ్ళిపొయ్యేది !''

ఈ సమాజంలో రాత్రింబవళ్ళూ కష్టపడి పనిజేసేవారి స్థితిగతులు, వీరి స్థితిగతులకన్నా ఏమాత్రం ఎక్కువ బాగా లేవు. మరిన్నీ రైతులకు వ్యతిరేకంగా వారు ఆ రైతుల బలహీనతలనుంచీ మిక్కిలి లాభం తీయ టం తెలుసుకున్నారు. ఎక్కడైతే ఎక్కువ యధేచ్ఛాచారిత్వం ఉంటుందో, అక్కడ ఈ విధమైన ఆలోచనలు పుట్టటం ఏమీ ఆశ్చర్యమైన మాటగాదు- మనమైతే అంటాం కేశవుడికి రైతుల సంగతులు బాగా తెలుసునని ; మరి నిజానికి రైతుల బుద్ధి, ప్రకృతీ - సమాజ విషయాలమీద తగుల్కొనే బదులు, శాస్త్రాల - నమ్మకాల విషయంలో ఎక్కువగా అతుక్కొని ఉండేది. అవును ! వాటిలో ఈ సలహా లేకుండేదిగదాంటే శాస్త్ర సంబంధ మైన మంచి విషయాలను నడచుకొందామనిన్నీ వారి కుండేదిగాదు - అంచేత ఎక్కడ అతని తరగతికి చెందిన ఇంకా ఇతరులా, గ్రామాలా నాయకుడూ, ముఖ్యుడూ అయినాడు. అతనిమీది నమ్మకంతో వారు ఎక్కడ అంగుష్ఠం గుర్తుపెట్టమంటే అక్కడ పెట్టేవారు ! అతనికో గట్టి విశ్వాసం ఉండేది : తనకు రైతులు కనీసం గుండెకాయలవంటివారనిన్నీ, అంచేత తానే పనీ చెయ్యాల్సిన అగత్యం లేదనిన్నీ - కారణం : తనకు గాకుండా ఇతరులెవ్వరూ ఎలాంటి లాభాల్నీ పొందలేరు—

ఇద్దరూ ఆలుగడ్డల పై పొట్టు తీసితీసి, కాలేకాలేవి తినటం మొద లెట్టారు. నిన్నటినించీ తిండేలేదు. అవి చల్లారాక తిందామన్నంత ఓపికా లేదు. ఎన్నోసార్లు నోరూ నాలికా తెగగాలాయి—పొట్టుతీశాక ఆలుగడ్డ

పై భాగంమాత్రం మిక్కిలి ఎక్కువ వేడి అనిపించదు. కాని, దంతాలు దాటి లోపలికి పోయిందా, నాలికనూ, అంగిటినీ, రక్తనాళాలనూ కాల్చేస్తుంది. మరి ఆ వేడిని నోట్లో పెట్టుకోటంలో ఎంతో క్షేమం అందులోనే వుంది, ఏమిటది ? అక్కడ లోపల చల్లారిపోతుందని, అక్కడ దాన్ని చల్లార్చే సామర్థ్యంగల వస్తువు లున్నాయి;—అందుకని వారిద్దరూ గబగబా మింగేస్తున్నారు—సాధారణంగా వారి యీ ప్రయత్నంలో వాళ్ళ కళ్ళ వెంట నీళ్ళచుక్కలు గిర్రున తిరిగిపడేవి !—

కేశవుడికి అప్పుడు 'ఠాకూర్ ఉత్సవం' జ్ఞాపకం వచ్చింది. దాని కతను ఇరవై యేళ్ళక్రితం ఒకసారి వెళ్లాడు. ఆ విందులో అతనికి దొరికిన భోజనం అవీ జీవితంలో మరచిపోనటువంటివి. అది ఆ జ్ఞాపకం ఈనాడు గూడా ఎంతో తాజాగా అనిపిస్తుందతనికి. అన్నాడు - "ఆ భోజనాన్ని మరచిపోను. అప్పటినుంచీ మళ్లా అటువంటి అన్నం-కడుపునిండా ఇంత వరకూ దొరకలేదు. పిల్లవేపు వారంధరికీ పూరీలు పెట్టారు—అంధరికీ—చిన్నా పెద్దా అందరూ పూరీలు తిన్నారు-అసలు నేతితో తయారైన 'చట్నీ' మూడు రకాల వరుగుల వేపుళ్ళూ - ఇంకా ఇలాంటివే పచ్చికూరా—'పెరుగుపచ్చడీ - ఇంకా మిఠాయీలూ, ఇంకేం జెప్పను ! ఆ భోజనంలో ఎంత మాధుర్యం దొరికిందో !!—ఏమీ ఆటంకం లేదు - ఏ వస్తువు కోరుకుంటావో, ఎంత కోరుకుంటావో, అడుగూ, తినూ ;—జనం అయితే ఇల్లా తిన్నారు ఇల్లా తిన్నారు గదాంటే, నీళ్ళన్నమాట ముట్టలేదు ! ఇక వడ్డించే వారున్నారే. ముందుగా వేడివేడివీ, గుండ్రగుండ్రవీ, కారపుచుట్టలూ—జిలేబీచుట్టలూ వేస్తూపోతోంటే, వద్దు అన్నమా టొకటే నిషేధించారు. మంచి పప్పునూనెకు చేతులు అడ్డంపెట్టినా, కారేట్టు పోసి పోతూనేవున్నారు. అదంతా అయ్యాక అందరూ మూతులూ చేతులూ కడుక్కున్నాక, అందరికీ తలా ఒక "పాన్‌బీడా" కూడా ఇచ్చారు. కాని, నాకు "పాన్" తీసుకోటానికి సందేదీ ? ! నుంచునేలేకపొయ్యాను - చట్‌పట్‌మనివెళ్ళి నా కంబళీ మీద ఒరిగిపొయ్యా !—ఆ ఠాకూర్ ఎంత విశాల భావం గలవాడో !!!—

మాధవ్ తన కష్టాల రుచులన్నీ దృష్టిలోకి తెచ్చుకుంటూ అన్నాడు.

"సరేలే. ఇప్పుడు మాకేమన్నా అట్లాంటి భోజనం తినిపిస్తావా ?—"

"ఇప్పుడు ఎవరు ఏం పెట్టగలరూ ! ఆ జమానా వేరు ! ఇప్పుడైతే అందరూ మిత వ్యయం చేయాలనుకుండేవారే ! వివాహాది శుభకార్యాల్లో ఎక్కువ ఖర్చుచెయ్యకండి-క్రియా కర్మల (శ్రాద్ధాదులు)లో ఎక్కువ ఖర్మలు చెయ్యకండి, అంటారు ;— పేదసాదల దగ్గర్నించీ గుంజిన ధన ద్రవ్యాలన్నీ ఎక్కడ దాస్తారో, అడగండి—కాని, అక్కడా ఇక్కడా లాక్కుని దాచి పెట్టటానికి ఎక్కడా ఏమీ లేదు. అవును ! ఖర్చు పెట్టే సమయంలోనే లాభాలు ఆలోచిస్తారు !"

"నీవు ఒక ఇరవై పూరీలు తినుంటావా"

"ఓహ్ ! ఇరవైకి ఎక్కువే తిన్నాను !"

"నేనైతే యాభై తినేవాడిని—"

"యాభై కంటే తక్కువ నేనుగూడా తినుండను"

"మంచి బలమైనవాడివి ! నీవు అందులో సగంగూడా లేవు —"

ఆలుగడ్డలు తిని, ఇద్దరూ చెరికాసిని నీళ్ళు తాగి, అక్కడేన్నే, ఆ గుండాని కెదురుగానే, తమ ధోతుల్నే కప్పుకుని, కడుపులోకి కాళ్ళు పెట్టుకుని పడుకున్నారు. రెండు పెద్ద మృగాలు గుండు దెబ్బ తిని పడి వున్నాయా అన్నట్టు !!...

## 2

ఉదయం అయ్యాక మాధవ్ గుడిసెలోకివెళ్ళి చూసేసరికి అతని భార్య చలికట్టెబడి ఉంది. ఆమె ముఖంమీద ఈగలు ముసురుతోన్నాయి. గుంటలు పడిపోయిన కళ్ళు పైకి ఉబ్బి వచ్చాయి. ఒళ్ళంతా బూడిద కొట్టు

కుని ఉంది. ఆమె కడుపులో ఉన్న శిశువున్నూ చనిపోయింది—మాధవ్ ఉరుక్కుంటూ కేశవుడి దగ్గరికి వచ్చాడు—తరువాత : ఇద్దరూ జోర్ జోరుగా అయ్యోఅయ్యో అంటూ, గుండెలు గుండెలు బాదుకోటం మొదలెట్టారు—ఈ యేడుపులూ పెడబొబ్బలూ విని ఇరుగు పొరుగు వారు ఉరుక్కుంటూ వచ్చి, వారిని ఓదార్చసాగారు.

కాని, ఎక్కువగా ఏడవటానికీ వీలులేకపోయింది - శవంమీదకప్పే గుడ్డకోసం, కట్టెలకోసం బెంగపడాల్సి వచ్చింది - గద్ద గూటిలో ఎలా మాంసం నిగ్గించబడి ఉంటుందో అలాగే వీరింట్లో కూడా డబ్బున్నూ...!!

తండ్రీ కొడుకూ ఏడ్చుకుంటూ ఆ గ్రామపు జమీందారుగారి దగ్గరికి పోయినారు. ఆయన వీరిద్దరిముఖాలు చూట్టానికే అసహ్యించుకునేవాడు. ఎన్నోసార్లు ఆయన తమ చేతులు బద్దలుకొట్టినవాడు. దొంగతనమూ, ఒప్పుకుని పనికి సకాలానికి రాకపోవటమూ నేరాలలో;—

"ఏంరా. ఏమిటి బుద్ధిలేని కేశవా ? యేడుస్తావెందుకు ?...ఈమధ్య ఎక్కడా నీ మొహమే అవుపట్టంలేదు—ఇహ మీరు ఈ వూళ్లో ఉండదలచనట్టు తెలుస్తోందే ??"—

కేశవుడు నేలకు తల వాల్చుకుని, కండ్లనిండా నీళ్లు నింపుకుని, అన్నాడు.

"అయ్యా. దొరా, చాలా కష్టంలో ఉన్నాను. మాధవాయ్ ఇల్లాలు రాత్రి గతించింది—రోజల్లా నొప్పితో బాధపడ్డది దొరగారూ! అర్ధరాత్రి దాకా మే మిద్దరమూ ఆమెకు ఉపచారం చేస్తూనే ఉన్నాం. మందూమాకూ ఏవో మా ఓపాన శక్తి ప్రకారం అన్నీ చేశాం. కాని, ఆమె మమ్మల్ని దగా (మోసం) జేసిపోయింది. ఇప్పుడెవ్వరూ ఒక్కరొట్టెముక్క యిచ్చేవారు లేరు ప్రభూ! మేంచితికిపోయ్యాం, మాకొంపకూలింది, మీ 'గులాం' (బానిస)ను! ఇప్పుడు మీరుగాక దాన్ని ఊరి బయటికి పంపించే దిక్కెవ్వరు—మా చేతిలో ఏదన్నా ఒకనయాపైసా ఉన్నదీ అంటే అది దానిమందూ మాకులకే

ఖర్చయిపోయింది—దొరవారు అనుగ్రహిస్తేనే దాని మట్టి లేస్తుంది... మిమ్మల్నిదప్ప నే నే దివాణం ముందుకు వెళ్ళి అడుక్కోనూ !?—"

జమీందారుగారికి జాలిగుండె సగం ఉండేది. కాని, కేశవుడిమీద దయచూపటం నల్ల కంబళీమీద రంగెయ్యటం లాటిది-మనసులో అనిపించింది అందామని, "ఫో, ఇక్కణ్ణించీ తొలుగు ! శవాన్ని ఇంట్లో మురగబెట్టి, పిలవని పేరంటంగా ఇక్కడి కెందువచ్చావ్!-ఇవ్వాళ గరుజు (అవసరం) బట్టేప్పటికే వచ్చి నక్క వినయాలు చూపిస్తున్నావా ! హరామ్, దొంగ వెధవా, స్వార్థపు బడ్డూ,"—అని కోపంతో నాలుగూ దులిపేశాడు— కాని, ఇది కోపాన్నిగ్గానీ, ఏర్పాట్లగ్గానీ తగిన సమయం గాదు. అనుకుని తమాయించుకుని, దయతల్చి గబగబా రెండురూపాయలు దీసి విసిరి వాడి మీద పారేశాడు—అంతేకాని, అయ్యో పాపం ఇట్లా జరిగిందా అని ఒక్క ఓదార్పుమాటనైనా నోట అనలేదు— అతనివేపు చూడనుగూడా చూళ్లేదు. ఏదో తన్నెత్తిన బరువు దింపేసుకున్నా ననుకున్నాడు, అంతే !...

జమీందారుగారే అలా రెండురూపాయలిచ్చారో, ఇక గ్రామంలోని పెద్దలూ, వైశ్యులూ మొదలైనవారు 'కాద'నే మాటెలా అనగల్రు ! కేశవుడికి జమీందారుగారికి దండోరా కొట్టటం బాగా తెల్సు !...ఒకరు బేడా ఇస్తేనేం, ఒకరు పావలా ఇస్తేనేం, ఒక్క గంటలో కేశవుడిచేతిలోకి ఐదు రూపాయలు పోగైనయ్ !—ఎవరో గింజలిచ్చారు, ఇంకెవరో కట్టెలిచ్చారు. మధ్యాహ్నమైంది. కేశవుడూ, మాధవ్ కలిసి బజారుకువెళ్లారు శవాచ్ఛాదనపు వస్త్రం తేవటానికి; వాళ్ళింటివేపువాళ్లు కొయ్యాకొడపం నరికి తేవటానికి పోయారు.

ఊరిలోని ముసిలీ, బీదా స్త్రీ జనం మాటిమాటికీ వచ్చి ఆ శవాన్ని చూస్తున్నారు—ఆ దరిద్ర శవంమీద ఒకటి రెండు కన్నీటిచుక్కలు విడిచి మరీ వెళ్తున్నారు !

# 3

బజారులోకి పోయి, ''దీన్ని దహనం చెయ్యటానికి తగినన్ని కట్టె లైతే దొరికాయి. ఏం మాధవ్ !'' అన్నాడు కేశవుడు—

''అవును కట్టెలయితే చాలా వున్నై—ఇప్పుడు కావాల్సింది పీనుగ మీద కప్పే బట్ట—'' అన్నాడు మాధవ్.

''పోనీ, ఏదన్నా తేలికపారు శవం గుడ్డన్నా తీసుకుందాం.''

''అవును. ఇంకెందుకు—శవాన్ని లేవదీసేప్పటికే రాత్రి అయి పోతుంది. రాత్రి పూట శవ వస్త్రం ఎవరు చూస్తారు ?''

''ఎంత దిక్కుమాలిన రివాజు. బ్రతికుండగా ఒక్క దేహం కప్పు కోటానికి ఒక్క గుడ్డపేలికన్నా దొరక్కపోయినా, చచ్చాక కప్పటానికి కొత్త గుడ్డ కావాలి—''

''శవంమీద గుడ్డ దానితోపాటు కాలిపోయేదిగదా !''

''ఇంకేం అట్టిపెట్టావ్ ! ఇవే అయిదు రూపాయలూ ఇదివరకే దొరికి వుంటే, దానికి ఏదన్నా మందూ మాకూ ఇప్పించుకుండేవారం.''

ఇల్లా వారిద్దరూ ఒకరి హృదయం ఒకరికి చెప్పుకుని, అసలు సంగతి యొక్క ప్రాధాన్యాన్ని ఏమీ అనుకోకుండా, బజార్లో ఇటూ అటూ తిరగ టం మొదలెట్టారు. ఎప్పటిదాకా ? ప్రొద్దుగూకేదాకా !...అటూ ఇటూ తిరిగి తిరిగీ తలవని తలంపుగానే ఒక సారా దుకాణం దగ్గరకు వచ్చి చేరారు—ఏదో తెగని వ్యవహారం పరిష్కారం చెయ్యటానికా అన్నట్టు లోపలికి వెళ్ళారు. అక్కడ కాస్సేపుదాకా ఇద్దరూ మాట్టాడకుండా నుంచుని ఉన్నారు—అంతట : కేశవుడు ఒక గిన్నెడు సారా పుచ్చుకున్నాడు— ఏదో 'గజక్' (సారా తాగేప్పుడు తినే ఒక మాంసపు వస్తువు)—తర్వాత ఇద్దరూ ఆ వాకిట్లో కూచుని త్రాగటం మొదలెట్టారు—

ఇల్లా చాలాసేపు తాగుబోతులతో కలిసి తాగితాగి ఇద్దరూ సర్దాగా వచ్చేశారు.

కేశవుడన్నాడు. "శవంమీద గుడ్డ కప్పితే ఏం వస్తుంది ?—ఆఖరుకు అదీ కాలిపోతుంది—కోడలితో ఏమీ పోదు."—

మాధవ్ ఆకాశంకేసి చూస్తూ అన్నాడు. "దేవతలకు మన అమాయకపు సంగతులు బాగా తెలిసే ఉంటాయేమో ! లోకం పోకడ ఇదేనేమో ! ప్రజలు బ్రాహ్మలకు వేలకు వేల రూపాయలు ఎందుకు ఇచ్చేస్తున్నారో !! పరలోకంలోకి పోతారో పోరో ఎవరు చూస్తారు !"

"ఊదేసెయ్యటానికి పెద్దమనుషుల దగ్గర కావలసినంత ధనముంది-అట్లా ఊదేసెయ్యడానికి మన దగ్గర ఏముంది ?"

"కాని లోకులకు ఏం జవాబిస్తావు రేపు ?—లోకులు అడగరూ శవం గుడ్డ ఏదని ?"

కేశవుడు అదో రకంగా నవ్వుతూ "అందాం రూపాయలు రొండి నుంచీ జారిపోయినై అనీ; చాలా వెదికాం దొరకలేదనీ;"—

మాధవ్ కూడా నవ్వాడు. తన అదృష్టం మీద భగవంతుడు చూపిన నిర్దాక్షిణ్యానికి ఇలా అన్నాడు. "పాపం ! చాలా మంచిది. చచ్చినా కూడా బాగా తినిపించీ త్రాగించీ పోయింది !"

సగం గిన్నెకంటే ఎక్కువ ఖతమ్ (ఆఖరు) అయిపోయింది. కేశవుడు రెండు శేర్లు పూరీలు తెప్పించాడు. మాంసమూ, కూరా, చిట్‌పటీలూ, కార్జమూ, వేయించిన చేపలూ-సారాదుకాణం ఎదటనే కొట్టు ఉన్నది-మాధవ్ రెండాకుల్లో చుట్టుకుని, వస్తువులన్నీ తీసుకొచ్చాడు. రూపాయలన్నీ ఖర్చైపోయినయ్—అచ్చం ఇక కొద్ది డబ్బులే మిగిలాయి. అప్పుడిద్దరూ ఇల్లా దర్జాతో కూచుని పూరీలు తింటున్నారు. అడివిలో ఏదో పెద్దపులి తన షికారు నిగ్గించేస్తోందో అలాగా !—ఏం జవాబు చెప్పాలన్న భయంగానీ, అపఖ్యాతి పాలవుతామేమో అన్న విచారంగానీ, లేదు వారికి—ముందుగానే ఇలాటి సమస్యను వారు తీర్చేసుకున్నారు—

కేశవుడు వేదాంత ధోరణిలో అన్నాడు. "మన ఆత్మ ప్రసన్నమైతే అదే ఆమెకు పుణ్యంగాదా ?"—

మాధవ్ కూడా ఏమీ భేదం లేనట్టుగా ఒప్పుదల చూపాడు :—

"వీరాధివీరుడు గావచ్చు ! భగవాన్ ! నీవెంత ఇంద్రజాలివి !! ఆమెను వైకుంఠానికి తీసుకుపోవాలి. మేమిద్దరమూ హార్దికంగా ఆమెను ప్రార్తిస్తున్నాము—ఇవ్వాళ ఏదైతే భోజనం దొరికిందో మాకు. అట్లాంటిది మా జన్మ మొత్తంలో ఎప్పుడూ దొరకలేదు !"

ఒక్కక్షణం పిదప మాధవ్ మనస్సుకు ఏదో ఆలోచన తట్టింది.

"ఏం నాయనా మనమంతా గూడా ఏదో ఒకనాడు అక్కడికి వెళ్లే పోతాం !"

కేశవుడు ఈ తాత్త్విక ప్రశ్నకు జవాబేమీ ఇయ్యలేదు. మాధవ్ వేపు బాగా కలిసిన ఉజ్జాయింపుతో చూశాడు—"అక్కడ ఆమె మనల్ని అడిగిందే అనుకో మీరు నాకు శవ వస్త్రం ఎందుకు తేలేదని ! అప్పుదేమైతుంది ?"

"ఏమంటాం ! నీ తలకాయ అంటాం !"

"తప్పక అడుగుతుందా ?"

"నీవెట్లా తెలుసుకున్నావ్ ఆమెకు శవ వస్త్రం దొరకదని ! అయితే నీవు నన్ను వట్టి గాడిదగా భావించి ఉంటావు ! నేను అరవై యేండ్లు ప్రపంచంలో ఏం, గడ్డి పీకుతున్నాననుకున్నావా ! దానికి శవ వస్త్రం దొరుకుతుంది మరి ఆమెకు మనమిచ్చేదానికన్నా చాలా మంచిదే దొరుకుతుంది-"

మాధవ్‌కు నమ్మకం వెయ్యలా, అన్నాడు: "ఎవరిస్తారు? రూపాయలన్నీ మనం ఖర్చు చేసుకుంటిమి !!"

కేశవుడు ఉద్రిక్తుడయ్యాడు : "నేనంటాను, ఆమెకు శవ వస్త్రం దొరికితుందని, ఎందుకు ఒప్పుకోవు !?"

"ఎవరిస్తారో ఎందుకు చెప్పవు ?"

''ఇప్పుడెవరిచ్చారో వారే ఇస్తారు! అవును ఆ రూపాయలు మన చేతికి అందవు. మరి ఏదోరకంగా ఒకవేళ వచ్చినా, మళ్లా మనం ఇట్లాగే ఇక్కడ కూచునే తాగుదాం. ఇక మూడోసారి శవ వస్త్రం అదే వస్తుంది-''

అలా అలా చీకటిపడుతోంది. చుక్కల వెలుగు చిక్కపోతోంది. ఆ కాంతిలో పానశాల అందము ఇంకా పెరిగిపోతోంది. ఎవరో పాడుతున్నారు. ఎవరో ఏదో అంటున్నారు. ఎవరో తన స్నేహితుడి మెడను కౌగిలించుకుంటున్నాడు. ఎవరో తమ స్నేహితుడి నోట్లో లగాయించి సారా పోసేస్తున్నాడు. అక్కడి గొడవలో వీరత్వం ఉట్టిపడుతోంది!—గాలి కబుర్లలో చెవులు కోసుకొంటోన్న జనం 'అల్లిమీద మల్లి బడ్డది' అన్న కథలు చెప్పుకుంటూ వింటూ ఉన్నారు. పళ్ళు మరిచిపోయే ఉల్లాసం కోసం ఇక్కడికి వచ్చేవారు. సారాకంటే ఎక్కువగా ఇక్కడి వాతావరణం కోసమే మూగుతోంటారు. అనుకోకపోయినా ఇక్కడికి లాగుకుని వస్తుంది! కొంతసేపు మరచేపోతారు మనం బ్రతికున్నామా! లేక చచ్చిపోయామా! లేదా చచ్చిపోబోతున్నామా!! అని;—

ఇక ఈ యిద్దరు తండ్రీ కొడుకులూ ఇప్పుడూ గూడా మాంసం ముక్కల రుచినే తలుచుకుని లొట్టలు వేస్తున్నారు. అందరి చూపులూ వీరి మీద కేంద్రీకరింపబడ్డాయి అక్కడ;-ఎంత సంతోషపు 'నసీబు' (అదృష్టం) గలవారు వారిద్దరూ! నింపిన పానపాత్ర వారిద్దరి మధ్యా బుసబుసలాడుతూ ఉంది.

భోజనం అయ్యాక మాధవ్ మిగిలి ఉన్న పూరీల ఆకును ఎత్తి అక్కడున్న ఒక ముష్టివాడి చేతిలో పారేశాడు. వాడు ఇంతసేపూ వారివేపే చూస్తూ నించున్నాడు. వాడి జీవితంలో ఇలాటి త్రాగటం, తందనాలాడటం ఇదే మొదటిసారి అనుభవం—

కేశవుడన్నాడు. ''తీసుకుపో. బాఘా తినూ. మాకు దీవెనలియ్యి. ఎవరు సంపాయించేవారో ఆమె కాస్తా చచ్చేపోయింది—కాని నీ దీవెనలు

ఆమెను తప్పక చేరుకుంటాయి. నిండు నిండు మనసుతో దీవించు. ఎంతో కష్టపడి సంపాయించిన డబ్బు అది !''

మాధవ్ మళ్ళా ఆకాశంకేసి చూస్తూ అన్నాడు. "వైకుంఠానికి పోతుందా నాయనా. వైకుంఠానికి రాణీ అయితుందా ?"

కేశవుడు నిలబడి ఉద్రేకపుటలలో ఈదుతూ అన్నాడు:—

''అవును కొడకా ! వైకుంఠానికి పోతుంది. అది ఎవరినీ కష్టాపెట్ట లేదు—ఎవరినీ దబాయించలేదు-చనిపోయేటప్పుడు మన జన్మకు మిక్కిలి పెద్దదైన కోరికను తీర్చి మరీట్టేపోయింది. అదే వైకుంఠానికి పోకపోతే, ఈ పెద్ద పెద్ద బొర్రా పిర్రా గలవాళ్ళు పోతారా బీదలని ఎడమచేతా కుడి చేతా దోచేసుకుండేవాళ్ళు !?—అట్లాంటి వాళ్ళంతా వాళ్ళ పాపాలు కడిగేసు కోటానికి దేవుడి గుళ్ళోకి పోతారు—పూజలూ అభిషేకాలూ చేయిస్తారు— గంగా స్నానాలు చేస్తారు.

ఈ ఉత్సాహపు రంగు మారిపోయింది. సారా స్వభావమే 'నిషా' (మైకం) గదా ! నిరాశా, దుఃఖాలు యాత్ర చేసినై ! మాధవ్ అన్నాడు. "కాని, నాయనా, పాపం ! అది బ్రతికినన్నాళ్లూ దుఃఖాలే అనుభవించింది. ఆఖరుకు పొయ్యేప్పుడు గూడా ఎంత కొట్టుకొని కొట్టుకొని కళ్ళు మూసింది !" అతని కళ్ళకు అడ్డంగా చేతులు పెట్టుకుని భోరున ఏడ్చాడు.

కేశవుడు ఎంతో సముదాయించాడు. ''ఎందుకేడుస్తావ్ కొడకా. సంతోషపడు—ఎందుకంటే, అది మాయాజాలంనుంచీ విముక్తి అయింది. ఈ జంఝాటంనుంచీ బైటపడ్డది. ఎంతో భాగ్యవంతురాలది. ఇంత తొందరగా మాయాదేవి కరాళబంధం తెంచేసుకున్నది—''

అప్పుడు వారిద్దరూ అక్కడే నుంచుని పాడటం మొదలెట్టారు.

"తెరవాటు గత్తియా, అకాలపు వర్షాలు మెరిపిస్తావెందుకే! తెర వాటు గత్తియా !!"

సారా దుకాణం బలే తమాషాగా ఉంది. వారిద్దరూ ఏవో లోకాలలో వినవచ్చే భావాలను సుందరంగా గొంతెత్తి తన్మయంగా పాడుతోన్నారు. ఇక : ఇద్దరూ ఆడటానికి లంకించుకున్నారు. గంతులూ వేశారు—దూకులూ దూకారు—పడ్డారు—లేచారు—భావమంతా వెలార్చారు—ఇక చివరకి ఒళ్ళు తెలియకుండా అక్కడే పడిపోయారు !!!...

---

రచయిత:
"ఖాజేంద్రసింగ్ బేదీ"
మూలకథ పేరు:
"అప్నాదుఖ్ ముఝేదేదో"

# "..........నాకు వదలండి"

ఇదివరకు మదన్ అనుకున్నట్టుగా పెళ్ళినాటి రాత్రి జరగలేదు—

బల్లిలాంటి నల్లవదినె - ఎన్నో మాటలు జెప్పి బులిపించి, తిన్నగా మధ్యగదిలోకి నెట్టింది మదన్‌ను;— లోపల ఇందూ శాలువా మేలి ముసుగులో కప్పబడి, చీకటిలో చీకటిగా అయిపోతున్నది...బయట బల్లివదినే, దర్యాబాద్ అత్తయ్యా, ఇంకా కొంతమంది ఆడాళ్లూ నవ్వుతూవుంటే నిశ్శబ్దంగా ఉన్న రాత్రి అనే సరస్సులో ఘన పదార్థం కొద్దికొద్దిగా ద్రవం అయి కరుగుతూవున్నట్టుంది!...చూట్టానికి ఇంత పెద్దవాడైనాడన్నమాటే గాని, నిజంగా మదన్‌కు యేమీ తెలియదని అంతా అనుకుంటున్నారు— అర్థరాత్రి గావస్తోన్నా నిద్రబోతూనే వున్నాడు. అంతా గలిసి బలవంతాన లేపి, తీసుకొస్తూంటే, "ఎక్కడికు తీసుకుపోతున్నారు నన్ను ?" అంటూ అరవటం మొదలెట్టాడు—

బయటవున్న ఆడాళ్ళ అనుభవకాలం గతించిపోయింది—మొట్టమొదటి రాత్రి తమ భర్తల చిలిపిచేష్టలా-చిలిపిమాటలా ఛాయలూ, ప్రతిధ్వనులూ, ఇప్పటికీ లీలామాత్రంగానైనా జ్ఞప్తిలో లేవు వీళ్ళకు !...వాళ్ళు తమ జీవితంలో పూర్తిగా స్థిరపడిపోయారు - ఇప్పుడు తమకుతోడుగా మరోజీవితం గూడా స్థిరపడడానికి సహాయపడుతున్నారు - భూమ్మీదపుట్టిన ఈ యువతు లంతా, మగవాళ్ళని "మబ్బు తునక" అని అనుకుంటారు!...ఎలాగైనా వర్షంకోసం మబ్బులవేపు అర్రులు చాస్తూ చూడక తప్పదు. వర్షించకపోతే వరాలుకోరటం, దేవుణ్ణి ప్రార్థించటం, బాగోగులు చేయించుకోటం, పూజలు

చెయ్యటం లాంటివి కూడా తప్పవు—కొత్తగాకట్టిన ఈ వూళ్ళో ఇంటి ముందున్న విశాలమైన ఆవరణంలో నిలబడి మదన్ అనే మబ్బుకోసం అతని బాపతువాళ్ళు నిరీక్షిస్తూ, ఈ రాత్రికోసం ఎదురుచూస్తున్నారు—మదన్ బయట పడుకుని కళ్ళు మూసుకున్నాడేగాని, నిద్రపోలేదు. పొరుగింటివాళ్ళ గేదెను ఇతని మంచం పక్కనేకట్టేయటంవల్ల అది తడవ తడవకూ అరుస్తూ, బుసలుకొడుతూ, మదన్‌ను మురకచూట్టం మొదలెట్టింది!... ఎంతసేపూ చేయెత్తి దాన్ని అవతలికి అదిలించడంలోనే గడిచిపోయింది గాని, నిద్ర పట్టనే లేదు!...

సముద్రతరంగాలకూ, స్త్రీల రక్తానికీ, ఆవేశం కల్పించి మార్గం చూపించే చందమామ కిటికీలోంచీ గదిలోకి వచ్చి చూస్తున్నాడు...తలుపులు వేసిఉన్నాయి...మొత్తదగ్గరే నిల్చి వున్న మదన్ రెండో అడుగు వేయటంలో ఆలోచిస్తున్నాడు...మదన్‌కు తన శరీరంలోనించీ, ఎలక్ట్రిక్ స్తంభానికి చెవి ఆనించి నిలబడితే వినబడే గొణగొణగా చప్పుడు లాంటిది వినబడుతోంది...కొంచెంసేపు అలాగే నిలబడ్డ మదన్, ముందుకే అడుగేసి, మంచాన్ని వెన్నెల వెలుగుల్లోకి, కిటికీ చాయగా లాగాడు...పెళ్ళికూతురి ముఖం కనబడుతుందేమోనని అతని ఆశ!...మళ్ళీ అంతలోనే జంకాడు—మళ్ళీమళ్ళీ ఆలోచించాడు—'ఇందు' తన భార్యేగాని...అంటుకోకూడదని చిన్నప్పట్నించీ అనుకునే పరాయి స్త్రీ మటుకు కాదు—పూర్తిగా శాలువా ముసుగులో మునిగిపోయిన ఆవిడకేసి చూస్తూ - ముఖం ఇక్కడే ఉంటుందని అంచనా వేసుకుని ముసుగుకిందకు మృదువుగా చెయ్యిబోనిచ్చి చూస్తే, సరీగ్గా అక్కడే ఆమె ముఖం ఉంది...అంత తేలికగా ఇందు తన ముఖం చూపదని మదన్ అనుకున్నాడు - కాని - వాస్తవంగా అలా జరగలేదు...సంవత్సరాల తరబడిగా ఈ సుముహూర్తం కొసమే నిరీక్షిస్తోన్న దానిలాగా, పొరుగింటి గేదె మదన్‌కు నిద్రబట్టనీయనట్టుగా, మనస్సులోని ఊహాత్మక చిత్రపు గేదె అనుక్షణం వాసన చూస్తోంటే నిద్రబట్టనిదానిలా ఉంది ఇందూ....నిద్ర అదృశ్యమై, నిమీలిత నేత్రాలతో మధుర పరవశమై

కటికి చీకటైనా కంటిముందున్న వ్యక్తికి కనిపించే దశలో ఉంది — ఇందు ముఖం—నుదుటినించీ గడ్డం కొసకు వచ్చేవరకు సాధారణంగా ముఖాలు కొంచెమన్నా కోలగా ఉంటం కద్దు ! కాని, ఇక్కడ ఈ ముఖం ఉందే, చంద్రబింబంలా గుండ్రంగా ఉంది ! వెన్నెలవేపు తిరిగి వున్నప్పుడు నున్నని చెంపలూ, పెదిమెలకూ మధ్య సన్నని నీడలాంటి రేఖ ఒకటి వసంత శోభాకాంతితో అలరారే రెండు పూదోటల తిన్నెల మధ్యభాగం ఉన్నట్టుంది—నుదురు కొంచెం సంకుచితంగా ఉన్నప్పటికీ, గాలికి రెప రెపలాడుతూ కిందామీదా పడుతోన్న ముంగురులు నొసటికి చక్కదనాన్ని కల్పిస్తున్నై !!

“రవ్వంత సేపు దర్శించటానికేగాని, ఇంత సేపు కళ్లారా గాంచటానికి ముఖంచూపించలేదోయ్ !” అన్నట్టుగా ఇందు తడాలున తన ముఖాన్ని కిందికి దించుకుంది. లజ్జాభినయానికైనా ఒక హద్దుంటుంది...మదన్ ఆత్రంగా కొంచెం కఠినమైన తన చేతులతో, ఆవిడను బుజ్జగించుతూ, ముఖాన్ని తిన్నగా తన వైపుకు తిప్పుకున్నాడు !...తాగి స్పృహలేకుండా ఉన్నవాడిలాగా మత్తులో ఉండి, ‘ఇందూ’ అన్నాడు.

ఇందు కొద్దిగా భయపడ్డది...ఎవరో అంతు తెలియని నూతన వ్యక్తి, ఊహకు అందని ఏదో మధురస్వరంతో, తనను ఈ విధంగా పేరు పెట్టి పిలవటం జీవితంలో ఇదే ప్రప్రథమం గాబట్టి ఆవిడకు యెలాగో అనిపించింది...అదే ఆగంతుక అపరిచిత వ్యక్తి, కారు చీకటిలో, మెల్ల మెల్లగా దగ్గరకు వస్తూ, దైవ ప్రసాదితమైన హక్కుతో, ఏకాంతంగా, నిస్సహాయస్థితిలో ఉన్న స్త్రీకి పరమాప్తుడై పోతున్నాడు...ఇందు ప్రథమ పర్యాయం కన్నెత్తి చూసి, మళ్ళీ కండ్లు మూసుకుంటూ, “ఏమండీ !” అని మాత్రం అనగలిగింది...ఆవిడ స్వరం ఆవిడకే ఆశ్చర్యంగా వుంది. పాతాళంలోంచి పైకుబికినట్లు వినవచ్చింది.

చాలా సేపు ఈ స్థితిలో గడిచింది...క్రమంగా ఉభయులూ ఆత్మీయంగా మాట్లాడుకోవటం ప్రారంభించారు...ప్రారంభమే కాని, ఆ సంభా

షణలు అంతం అంటూ లేకుండా సాగిపోతున్నాయి. ఇందు తల్లిదండ్రులూ, అక్క చెల్లెండ్రు తమ్ముళ్ళను గురించీ, మదన్ తోబుట్టువులూ, రైల్వే మెయిన్ సర్వీసులో ఉద్యోగం చేస్తున్న తండ్రీ, ఆయన ఆరోగ్యం వగైరాలను గురించీ, అభిరుచులూ, అలవాట్లను గురించీ వివరంగా మాటలు సాగినవి...మాట్లాడుతూ, మాట్లాడుతూ, మధ్యలోనే మదన్ ఏదో చేయాలని అనుకునేవాడు కాని, ఇందు పడనీయకపోయేది...గత్యంతరం లేని పరిస్థితిలో, మదన్ తన తల్లిని గురించిన ప్రసక్తి కూడా తెచ్చాడు .. తను ఏడేళ్ళ వయస్సులో వున్నప్పుడే తనను వదిలిపెట్టి క్షయవ్యాధితో పరలోకానికి చేరింది.

"ఆవిడ జబ్బుతో ఎన్నాళ్ళు జీవించి ఉందో, పాపం, అన్నాళ్ళూ నాన్నగారి చేతుల్లో మందు సీసాలూ, మందులే కనిపిస్తుండేవి...ఇక మేమంతా ఆస్పత్రి వరండా మెట్లమీదా, ఆస్పత్రి ఔట్‌హౌస్‌లో చీమల పుట్టల్లోనూ పడుకుంటూ వుండేవాళ్ళం. చివరికి 28 మార్చి సాయంత్రం..." ఆంజూ మదన్ గద్గదస్వరంతో పై మాటలు అనలేకపోయాడు...కొద్ది క్షణాలలోనే అతడు కుమిలి కుమిలి యేడుస్తున్నట్టుగా వెక్కిళ్ళ చప్పుడు వినవచ్చింది...ఇందు హృదయం సంక్షోభించిపోయింది. భయపడ్డది. ఆమె జాలిగా అతని శిరస్సుని తనవైపు తిప్పుకుని హృదయానికి ఆనించుకొంది. ఈ చర్య ఇందుని ఒకేసారి రెండు అవస్థలకు గురిచేసింది...ఇందును గురించి ఇంకా యేదో తెలుసుకోవాలని మదన్ అనుకుంటుండగానే ఆవిడ, అతని చేతిని పట్టుకుంది. "నేను చదువుకున్నదాన్ని కాకున్నా, తల్లిదండ్రులున్నందువల్ల కలిగే సంతోషం నాకు తెలుసు. అన్నదమ్ములూ, అక్క చెల్లెండ్లతో కూడా గడిపాను. కాబట్టి ఆ సుఖాలన్నీ నాకు అనుభవమే... ఇప్పుడు నేను మీదాన్ని...మిమ్మల్ని ఒక్కటి కోరుతున్నాను" అంది ఇందు.

ఇందు హృదయంమీద తల ఆనించి ఉండి యేడుస్తున్నప్పుడూ, తరవాతా కూడా మదన్ యేదో మత్తులో వున్నట్టున్నాడు....విశాల బుద్ధినీ,

ఆత్రాన్నీ ఒకేసారి ప్రదర్శించే విధంగా "ఏం కావాలో అడుగు...ఏది అడిగితే అది యిచ్చేస్తాను" అన్నాడు.

"నిజంగానా ?" అంది ఇందు.

"అవును...అన్న మాటకి తిరుగుండదు" అన్నాడు మదన్ లోపల కొంచెం ఆందోళనపడుతూ.

అతని మనస్సు కొంచెం భయపడ్డది. తన వ్యాపారం చాలా మంద కొడిగా వుంది ...ఇందు యేదన్నా శక్తికి మించింది కోరితే తెచ్చి యివ్వ టం ఎలాగా అన్నదే ప్రశ్న...అదే ఆలోచనతో సుడి తిరిగాడు మదన్.

ఇందు తన మృదువైన పట్టుకుచ్చుల్లాంటి చేతులతో, విశాలమైన మదన్ బాహువుల్ని స్పృశిస్తూ, అతని చెంపలకి తన చెంపలని ఆనిస్తూ "మీ దుఃఖాన్ని నాకిచ్చెయ్యండి !" అంది.

"మదన్‌కు ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది...దాంతోపాటు మనస్సులో ఉన్న పెద్ద బరువు తొలిగిపోయినట్టయింది...వెన్నెల వెలు తురులో మళ్ళీ ఒక్కసారి ఇందు ముఖం దర్శించ ప్రయత్నించాడు కాని ఏదీ గోచరం కాలేదు. పుస్తకాల్లో చూసి నేర్చుకున్నట్టు మాట్లాడే ఇందు మాటలు బహుశా తల్లో, మరెవరన్నా స్నేహితురాలు బోధిస్తే వల్లెవేస్తున్న బాబతేమో ననుకున్నాడు...మదన్ ముంజేతి భాగంమీద ఒక్క వేడి కన్నీటిబొట్టు రాలిపడ్డది...మదన్ ఆశ్చర్యంగా, ఇందును మరింత దగ్గరకు లాక్కుని "అలాగా ?" అన్నాడు...మాట్లాడుతున్న మాటల్లోనే, మదన్ తన వ్యక్తిత్వాన్ని విడిచి, కౌగిలిలో కరగిపోతున్నాడు.

బంధువులు ఒక్కొక్కళ్లే సెలవు తీసుకుని వెళ్ళిపోయారు...బల్లి లాంటి వదినెమ్మ, తన యిద్దరు పిల్లలకీ రెండు చేతుల వ్రేళ్లో ఆసరాయిచ్చి, నడిపిస్తూ, తయారైన మూడో గర్భాన్ని జాగ్రత్తగా మోస్తూ, మెట్లు దిగి పోయింది...కోస్తా పట్నపు అత్తయ్య, మెళ్లో హారం పోయిందని గోల పెట్టీ పెట్టీ, చివరకది స్నానాల గదిలో దొరకడంతో మూర్ఛ తేరుకుని,

అంతా అయ్యాక తనకు రావలసిన ఆడబిడ్డ కట్నాలను తీసుకుని వెళ్ళి పోయింది. ప్రమోషన్ వచ్చిందన్న వార్త టెలిగ్రాం ద్వారా అందిన 'బాబాయి' ఆ ఆనంద పరవశత్వంలో, పెళ్ళికొడుకు అనుకుని, పెళ్ళికూతురి ముఖాన్ని ముద్దెట్టుకుంటానికి వెళ్ళాడు...బాబాయి కూడా బయలుదేరి వెళ్ళాడు. మదన్ ఇంట్లో, ఇక మిగిలింది...ముసలి తండ్రీ—తమ్ముడు—చెల్లెలూ మాత్రం...చెల్లెలు పసిపాప, 'దులారీ'...ఆ పిల్ల అహర్నిశలూ వదిన చంకలోనే వుంటుందిగాని దిగిరాదు. అప్పుడే అంతగా అలవాటైంది. ఇరుగు పొరుగు స్త్రీలూ, వీధిలోని అమ్మలక్కలూ, కొత్త కోడల్ని చూట్టానికి రావటాలూ, చూడటాలూ, అవన్నీ అయిపోయినై...క్రమంగా ఇందు పాత బడ్డది. పాతబడుతూన్నప్పటికి ఢిల్లీలోని కాల్కాజీ కొత్త వీధిలో అటూ యిటూ వస్తూ పోతూ, చాలామంది మదన్ నివాస్ ముందు ఆగి, యేదో ఒక నెపంతో లోపలికి వచ్చిపోతూండేవాళ్ళు...ఎవరన్నా లోపలికి రాగానే, ఇందు మేలిముసుగుని సరిచేసుకునే యీ లోపల చూసిందే చూడటం కాని, తరవాత కన్పించేదేమీ లేకపోయేది.

మదన్ వృత్తి మురికితోళ్ళ వ్యాపారం...ఇవి పుష్కలంగా సరఫరా రెండు మూడు అరణ్య ప్రాంతాలలో వున్న దేవదారు మొదలైన చెట్లు, హఠాత్తుగా అడివికి నిప్పంటుకుని బూడిద అయిపోయినై. అస్సాం, మైసూరు ప్రాంతాలనుండి దీన్ని దిగుమతి చేసుకోవలసి రావటంతో, చాలా మూల్యం చెల్లించవలసి వస్తుండేది...ఇన్ని ఖర్చులను కలుపుకొని, అమ్మకానికి వేస్తున్న రేటు కూడా అధికం కాక తప్పనందువల్ల, విపరీతమైన గిరాకీకి భయపడి జనం కొనటం తగ్గించారు...ఇందువల్ల మదన్ ఆదాయం తగ్గిపోయింది. దుకాణంలో పనేమీ లేనందువల్ల, దస్తరాన్ని కట్టి, పెందలాడే ఇంటి ముఖం పట్టేవాడు మదన్...ఇంటికి చేరిన దగ్గరనుంచీ, వీలైనంత పెందలాడే భోజన భోజనాలు ముగించుకొని పక్కవేసుకు పడుకోవడానికే మదన్ ఆరాటపడుతూంటాడు...తనతో పాటు, తండ్రికీ, చిట్టికీ కూడా స్వయంగా తినే పళ్ళాలు పరిచి, భోజనాలు కాగానే, తనే స్వయంగా

వాటిని తీసి, పంపు క్రింద పడవేసి వస్తూండేవాడు మదన్. ఇదంతా కోడలే చేయిస్తున్నదనీ, మదన్ చెవిలో యేదో ఊదటంవల్లనే, యెన్నడూ ఇంటి పనులు అంటించుకోనివాడు, ఇప్పుడు శ్రద్ధగా చిల్లర పనులు కూడా చూసు కుంటున్నాడనీ అంతా అనుకుంటారు——

మదన్ ఆ యింటి యజమానికి పెద్ద కొడుకు...అతని తరువాత కుందన్...తరవాత చిన్న మరిదీ...అందరికంటే చిన్నది చిట్టి...కుందన్ కుత్రతనంతో కొత్తరోజుల్లో వదిన కూడా తమతోపాటే కలిసి భోంచేయా లని పట్టుబడుతూంటే తండ్రి ధనీరామ్ గద్దిస్తూండేవాడు..."ఆవిడ తింటుందిలే...నీవు కానీ" అంటూండేవాడు. వంటశాలమీద ఒక కన్నుంచి చూస్తూండేవాడు ధనీరాం...ఇందు తన భోజనం ముగించుకుని, అంట్లూ, వగైరా శుభ్రం చేయడానికి ఆయత్తం అవుతున్నది కనిపెట్టి ధనీరాం ఆవిడని ఆపుచేస్తూ "వాటిని అలా వుండనీయవమ్మా! అర్ధరాత్రి యేమొచ్చింది. ప్రొద్దున్నే శుభ్రం చేసుకోవచ్చులే...వెళ్ళి పడుకో!" అంటూంటాడు.

"ఎందుకండీ! క్షణంలో అయిపోతాయిగా "అనేది ఇందు. బాబూ ధనీరాంకు తక్షణం యేదో స్మృతిపథంలో మెరిసి, వణుకుతూ వున్న కంఠంతో ఇలా అనేవాడు——

"మదన్ తల్లే గనక వుంటే నిన్నింత చాకిరి చేయనిచ్చేదటమ్మా!" ఆ మాట అనగానే ఇందు తన పని కట్టిపెట్టివేసేది.

చిన్న మరిది పాషీకి వదినంటే తగని సిగ్గు...పెళ్ళికూతురి ఒడి పచ్చబడాలన్న సాంప్రదాయం ప్రకారం, వదినా, దర్యాబాదు అత్తియా ఇద్దరూ కలిసి, ఇందు ఒడిలో పాషీనే వుంచారు...అప్పటినుంచీ ఇందు అతన్ని మరిది అనుకోకుండా తన కొడుకుగా భావిస్తోంది" ఇందు ముద్దుగా అతన్ని ఎత్తుకోవటానికి ప్రయత్నిస్తే వాడు, సిగ్గుతో భయంతో గింజులాడి వదిలించుకుని, దులుపుకుని దూరంగా వెళ్ళి నిలబడి ఊరికే చూస్తూ

నవ్వుతూ నిలబడేవాడు. బాబూ ధనీరాం అక్కడే వుండి చూస్తూ కొడుకుని గద్దించేవాడు. ''వదిన ముద్దుగా పిలుస్తూంటే వెళ్ళరాదూ! మంకువెధవా!... అప్పుడే పెద్ద మగవాడిని అయాననుకుంటున్నావేం! సిగ్గెందుకూ ! వెళ్ళు!'' అంటూండేవాడు.

ఇక 'చిట్టి' వదినని వదిలే పెట్టదు...."నేను వదినదగ్గరే పడుకుని నిద్రపోతాను" అని చిట్టి మారాం చేస్తున్నప్పుడల్లా ధనీరాం హృదయంలో అజ్ఞాత జనార్దనుడు జాగృత మవుతూవుంటాడు...ఒకరాత్రి చిట్టి మొండి తనం అధికం అయింది. కోపంతో వేసినదెబ్బకు దగ్గరేవున్న నీటి కాలువలో పడిపోయింది చిట్టి. 'ఇందు' గభాల్న చిట్టిని పట్టుకోవడానికి వంగటంతో ఆవిడ తలమీదినుంచి శాలువా జారిపోయింది...తలలో అలంకరించుకున్న పూలూ, పాపిటలోని సిందూరం, చెవులకున్న కర్ణపూలూ, అన్నీ నగ్నంగా కనిపించినయ్. "బాబూజీ !" అంది ఇందు ఒక్క విశ్వాసం వదులుతూ... ఒకవైపు చిట్టిని పడిపోకుండా పట్టుకోవటం, రెండోవైపు జారిన ముసుగును సరిచేసుకోవటం, ఒక్కసారిగా జరపవలసి వచ్చేవరకు ఇందు శరీరం చెమటలు కక్కింది. తల్లిలేని పిల్లని తన గుండెలకు అదుముకుని ఇందు, తన హృదయాన్నే శయ్యగా చిట్టికి యేర్పాటుచేసి పడుకోబెట్టుకుంది... ఈ శయ్యమీద అంతటా తలాపే, మొత్తం మెత్తటి దిండే...కాని, కాళ్ళ కట్ట అనీ, పట్టెలనీ యేవీలేవు...పెద్దదెబ్బ యేమీ తగలకపోయినా, తల కొక వైపున కొద్దిపాటి గాయం అయింది...ఇందు సన్నని తన వేళ్ళతో చిట్టి తలమీది గాయాన్ని నిమురుతూంటే, చిట్టికి కొంచెం బాధగా ఉన్నప్పటికీ, బాధకన్నా అధికమైన తీయని అనుభూతికూడా లభించింది...చిట్టి బుగ్గలు అందంగా చిన్నచిన్న సొట్టలుపడి ముద్దుగా కనిపిస్తుంటే, ప్రేమగా బుగ్గలు నిమురుతూ ''అబ్బ ! చిట్టీ ! నీ అత్తపేరు మాసిపోనూ ! నీ బుగ్గల మీద ఎంత అందంగా గుంటలు పడతాయేమే ?'' అని ముద్దెట్టుకుంది !...

చిట్టి, చిట్టిపాపలానే మూతిపెట్టి ''నీ బుగ్గలమీద మాత్రం గుంటలు పడవేమిటీ ?'' అంది.

"అవును అని ఇందు ఒక్క చల్లని నిట్టూర్పు వదిలింది.

దగ్గరే నిలబడి అంతా చూస్తూ వింటున్న మదన్‌కు ఒకమాటమీద కోపం వచ్చిందిగదాంటే, "యిదీ ఒకరకంగా మంచిదే అయింది" అన్నాడు వ్యంగ్యంగా...

"యేమిటి మంచిదైంది ?" ఇందు అడిగింది...

"ఇదే...అత్తల పేర్లు మాసిపోవాలని కోడండ్లు కోరుతుంటారు... నీకు అత్త లేకపోవటం ఒకందుకు మంచిదే...అత్తలు లేకపోతే, తగాదాలే ఉండవు...వెదురు పుట్టకపోతే వేణునాదమే వుండదుగా..." అన్నాడు—

ఇందుక్కూడా కొంచెం కోపం వచ్చింది. "మీరు వెళ్ళి పడుకోరాదూ ! వంటింట్లో మీకేం పని ?....మనుషులంటూవుంటే తగాదాలు లేకుండా ఎలా వుంటాయి ? శ్మశానంలో ఉన్నట్టు నిర్జీవంగా ఉండే ప్రశాంతతకన్నా, అశాంతేనయం...మీరు వెళ్ళండి !" అంది.

మదన్ ముఖం గాటుపెట్టుకుని మౌనం అవలంబించాడు. బాబూజీ గద్దింపులకు మిగతాపిల్లలు ముందరే ఎవరిపక్కమీదికి వాళ్ళు సార్టు చేస్తున్నప్పుడు ఉత్తరాలు దేనిగదికి అది వెళ్ళి పడ్డట్లు చప్పున వెళ్ళిపడ్డారు... కదలకుండా అక్కడే నిలబడ్డ మదన్ ఇందు గద్దింపుతో మానసికంగా బాధపడుతూ లోపలికి వెళ్ళిపోయాడు.

చాలా సేపు మదన్ పక్కమీద పొర్లాడుతూ నిద్రపట్టక అవస్థపడుతూన్నాడు...తండ్రి వింటూ వుండగా 'ఇందు'ని రమ్మని పిలవడానికి ధైర్యం చాలదు...చిన్నగా పిలిస్తే వంటగదిలోకి వినపడదు...ఓపిక హద్దుమీరిపోతున్నది...చిట్టిని నిద్రపుచ్చటానికి లోపలనుండి ఇందు పాడుతున్న జోలపాట వినవస్తోంది. చిట్టికి నిద్రపట్టడానికి పాడే జోలపాట, మదన్‌కు నిద్రను దూరం చేస్తోంది...తనమీద తనకే చిరాకువేసి, దుప్పటిని నిండా ముసుగుపెట్టుకున్నాడు...తెల్లని దుప్పటి తలమీంచి కాళ్ళదాకా మునిగి, ముసుగు తన్నిపట్టుకుని, శ్వాసను బంధించి వుంచితే, అచ్చంగా శవంలాగే

ఆకారం వుంది...ఈ భావం రావటంతోటే తను చచ్చిపోయినట్టనిపించింది మదన్‌కు.

తను చచ్చిపోతే, తన శవంమీద పడి, ఇందు శోకాలుపెట్టి తలబాదు కుంటూ ఏడుస్తున్నట్టు ఊహాచిత్రంలో కనిపించింది. ఇందు ముంజేతులని గోడకు వేసి కొట్టుకుంటూ గాజులు బ్రద్దలు చేసుకుంటున్నట్టూ, నేల మీద దొర్లాడుతూ, వంటింట్లోకీ బయటికీ తిరుగుతూ వంటింటి పొయ్యిలో బూడిద నెత్తిన పోసుకుని విలపిస్తూన్నట్టూ మనో నేత్రాలముందు కనిపిస్తోంది. "నా కొంప నిలువునా కూలిపోయింది" అంటూ గొంతెత్తి యేడుస్తున్నది. మేలిముసుగు తలమీంచి జారిపోతున్నా, వక్షస్థలం బయటపడేట్టుగా చొక్కా వున్నా, ఆవిడకి వాటి ధ్యాస వున్నట్టు లేదు...అలంకృత పుష్పాలూ, పాపిట్లో కుంకుమ, అన్నీ దాపరికం లేకుండా పోతున్నాయన్న సంగతి మరిచేపోయింది...చివరకు ఆవిడ భావాలూ, హృదయ స్పందనమే చిలకల్లా గాలికి యెగిరిపోతున్నట్టు నిర్జీవమై పోతుంది...దుప్పటి ముసుగులోవున్న మదన్ కండ్లలోంచి అశ్రువులు అప్రయత్నంగా ధారలు కట్టుతున్నాయి... వంటింట్లో వున్న ఇందుకు మదన్ ఊహా చిత్రం కనిపించక, చిట్టితో కిలకిల నవ్వుతూన్నది...క్షణకాలంలో తన సౌభాగ్యం హరించుకపోవడం, మళ్ళీ క్షణంలోనే అది యధా స్థితికి రావటం ఇదంతా ఇందుకు తెలియనే తెలియదు. మదన్ వాస్తవ జగత్తు ఇదంతా ఇందుకు తెలియనే తెలియదు. మదన్ వాస్తవ జగత్తులో ప్రవేశించి, కండ్లల్లోంచి కారుతున్న నీళ్ళని తుడుచుకుంటూ తనలో తనే సిగ్గుపడ్డాడు. తన యేడ్పును గురించి నవ్వు కున్నాడు. ఇందు మొదటినుంచీ నవ్వుతూనే వుంది. ఆ నవ్వు అణిగి అణిగి వస్తున్నది...బాబూజీ ఇంట్లో వుండగా ఇందు ఎన్నడూ పెద్దగా నవ్వలేదు. అలా పకపక నవ్వటం లజ్జలేని వ్యవహార మనిపిస్తూందామెకు...మేలి ముసుగు క్రింద, మౌనంగా చిరునవ్వుకోవటం అలవాటైంది—

ఇందుయొక్క స్వరూపాన్ని ఊహాపథంలో యెదట నిలుపుకుని, ఆ మూర్తితో యెంతో సంభాషణ చేశాడు మదన్. ఆవిడని, లోగడ

ప్రేమించనంత ప్రేమతో ఉక్కిరి బిక్కిరి చేశాడు...తీరా కళ్ళు తెరిచి చూస్తే, మళ్ళీ ఖాళీ పక్క మాత్రమే ఉంది....మదన్ మనస్సు తెలియకుండానే ఆరాటపడుతున్నది....తండ్రికి వినపడకుండా, ఇందుకే వినపడాలన్న భావంతో, ''ఇందూ'' అని పిల్చాడు. మళ్ళీ పిల్లివలె ముడుచుక పడుకున్నాడు...ఇలా కొట్టుమిట్టాడటంలోనే, ఎప్పుడు పట్టిందో నిద్రపట్టేసింది. కానేపటికి, కలత నిద్దట్లో యేదో అలికిడి తగిలినట్టనిపించింది. పెళ్ళినాటి రాత్రి పొరుగింటివాళ్ళ గేదె పక్కనే జేరి అరిచినట్టుగా ఉండి అదే దృశ్యం జ్ఞప్తికి వచ్చింది. నిరామయంగా లేచాడు. అటు వంటింట్లోకి చూశాడు. బయటికి చూశాడు. తల గోక్కున్నాడు. రెండు మూడుసార్లు ఆవలించి, దగ్గి, మళ్ళీ పక్కమీద పడుకున్నాడు....మళ్ళీ నిద్ర కౌగిలించుకుంది.

నిద్దట్లోవున్నా మదన్ చెవులు జాగ్రత్తగానే పనిచేస్తున్నాయి. ముడుతలు పడిన పక్కమీది వస్త్రాన్ని సరిచేస్తూన్నప్పుడు ఇందు చేతి గాజులు చేసినచప్పుడు విని, అమాంతం లేచి కూర్చున్నాడు మదన్...హఠాత్తుగా లేవటంతో, ప్రేమభావం కూడా తీవ్రతరమై పెల్లుబికింది...ప్రేమ వాంఛ సఫలం కాకుండా నిద్రించిన మనిషి, హఠాత్తుగా మేల్కొవటం తటస్థిస్తే ప్రేమ ఊపిరి సలపని స్థితిలో ఉంటుంది...మదన్ శరీరం యావత్తూ లోపల్లోపల అగ్ని రగుల్కొని నాలుకలు చాస్తున్నట్టుంది...ఉద్దీపనాత్మకమైన అగ్ని పెట్టి పోయి, ప్రజ్వలనాత్మకమై క్రోధంగా పరిణతిచెందింది... భార్యనుచూసి కోపాన్ని వ్యంగ్యధోరణిలో ప్రదర్శిస్తూ అన్నాడు గదాంటే-

"ఓహో తమరు దయచేశారే ...?

"అవును." అంది ఇందు—

"చిట్టిది చచ్చిందా !" అన్నాడు కటువుగా.

వంగి, పక్కను సవరిస్తున్న ఇందు ఒక్కసారి చువ్వలా నిలబడింది. ముక్కుమీదకు వ్రేలెక్కింది తెలియకుండానే.

"రామరామ ! ఏమిటా మాటలు ?...ఆ పసిపిల్ల చావటమెందుకూ! తల్లికీ తండ్రికీ ఒక్కతే కూతురు...'' అంది.

"అవును... వదినెగారికికూడా ఒక్కతే మరదలు'' మదన్ ఆజ్ఞాపిత స్వరంతో కఠోరంగా, "ఆ పోరిని అతిగా నెత్తికెక్కించుకోకు !''అన్నాడు.

''ఇందులో తప్పేముందని మీరంటున్నారు ?''

''ఇదే తప్పు...అది నీ వెంటబడి వదలనే వదలదు...ఎప్పుడు చూసినా జారకుండా జిగటలా అతుక్కుపోయివుంటుంది'' అన్నాడు మదన్ మరింత విసుగుతో.

"హుఁ'' అనుకుంటూ ఇందు భర్త మంచంమీద కూర్చుంది.

"తోబుట్టువుల్ని, అందులో ఆడపిల్లల్ని, కన్నపిల్లల్ని ఇలా చీదరించుకోరాదు...పాపం ...చిట్టిదేముంది చెప్పండి. రెండు రోజులుంటే, ఇవాళకాకుంటేరేపైనా, యెల్లుండైనా, ఆమెయింటికి ఆమె వెళ్ళిపోతుంది''. ఇందు ఇంకా యేదో చెప్పాలనుకుంది కాని, ఆగిపోయింది...ఆవిడ కండ్ల ముందు, ఆవిడ తల్లీ, తండ్రీ, తోబుట్టువులూ...పినతండ్రీ. పెద్దతల్లీ, అంతా ప్రత్యక్షమై తిరుగుతున్నారు...ఒకానొకకాలంలో తనుకూడా వాళ్ళందరికీ చిట్టి లాంటిదే...చూస్తుండగానే తను యువతిగా మారింది... అక్కడినుంచీ అహోరాత్రాలూ తనను ఏవిధంగా ఇంటినుండి వదల్చుకోవాలనే అంతా మాట్లాడుకుంటుండేవాళ్ళు...యింట్లో పుట్టలో పెద్ద పామును చూసినట్టుగానే తనను చూస్తూ, యీ పామును అవతలికి వెళ్ళగొట్టించిందాకా ఇంటివాళ్ళు ప్రశాంతంగా నిద్రపోలేనట్లుగా అయిపోయింది...దూరదూరాల నుంచీ మంత్రగాండ్లలాంటి మనుషులను పిలిపించారు...పెద్దపెద్ద ధన్వంతరుల్లాంటివారుకూడా వచ్చారు....చివరికి ఒకనాడు పశ్చిమోత్తర కోణం నుంచి పెద్ద గాలి దుమారం ఒకటివచ్చింది...ఆ రవధూళి అణిగింతర్వాత చూస్తే ఇంటిముందు లారీ ఒకటి నిలబడివుంది. దాంట్లో పట్టుదుశ్శాలువల్లో మునిగిపోయిన పెళ్ళికూతురు కూచునివుంది...ఇంట్లో సన్నాయి మీద

మంగళ గీతం మ్రోగుతూ వుంది...ఒక్క పెద్ద కుదుపుతో 'లారీ' కదిలింది....

ఆవిడ కళ్ళముందు ఆడే దృశ్యాలని చెరిపివేస్తున్నట్టుగా, కొంచెం అనునయస్వరంతో "ఎట్లాగైనా ఆడవాళ్ళు తెలివైన వాళ్ళు...నిన్న ఈయింట్లోకి వచ్చావో లేదో, ఇక్కడివాళ్ళంతా మాకంటే నీకే ఎక్కువగా ముద్దొస్తున్నారు..." అన్నాడు మదన్.

"ఆఁ...అవును." అంది ఇందు పరధ్యానంగా.

మదన్ నిక్కచ్చిగా "ఇదంతా నాటకం....వట్టి అబద్ధం—అసంభవం !" అన్నాడు.

"ఐతే మీ అభిప్రాయంలో నేనేదో—..."

"అవును...ఇదంతా నటన....ప్రదర్శన"

ఇందు కండ్లల్లో గిర్రున నీళ్ళు తిరిగినయ్. "సరే ! మంచిది.... నాదంతా నాటకం కదూ !" అంటూ గబాల్న లేచి, వేరే మంచం వాల్చుకుని పక్క వేసుకుపడుకుంది...తలగడమీద ముఖం దాచుకుని వెక్కిళ్ళు పడుతూంది...ఆవిడని కొంచెం బ్రతిమాలుదామనీ మదన్ అనుకుంటుండగానే, ఇందే స్వయంగా లేచి, అతని దగ్గరకు వచ్చింది. గట్టిగా అతని చేతిని పట్టుకుని వూపుతూ "మీరెప్పుడూ కట్టె విరిచినట్టుమాట్లాడుతుంటారు... సంగతేమిటి చెప్పండి !" అంది. బ్రతిమిలాడాలనుకున్న మదన్‌లో మళ్ళీ భర్త నన్న అహంకారం కలిగి బిర్ర బిగుసుకుపోయాడు.

"వెళ్ళు ! వెళ్ళు...వెళ్ళి పండుకో ! నీతో నాకేం వ్యవహారంలేదు" అన్నాడు కసిరింపుగా.

"మీకు లేకపోయినా నాకు మీతో వ్యవహారం వుంది....జీవితం సఫలం చేసుకోవలసిన వ్యవహారం" అంటూ ఇందు అతన్ని ఇగ్గా మగ్గా తీయ ప్రారంభించింది—

మదన్ కసురుకున్నకొద్దీ ఇందు ప్రతిమిలాట జాస్తి అయింది. అతన్ని కౌగిలించుకుని వదల్లేదు...నీటి ప్రవాహానికి ఎదురుగా వెళ్ళిన చేప, ప్రవాహానికి కొట్టుకపోకుండా, ప్రవాహ తీవ్రతను కోసుకుంటూ పైపైకి వెళ్ళిపోతున్నట్టుగా ఉంది ఇందు. బుగ్గలమీద చిటికెలు వేసి నిమురటం, చేతులు పట్టుకోవటం, నవ్వటం, యేడవటం, ఇలా యెన్నో చేసింది.

"ఇదంతా కూడా నాటకమే నంటారుకదూ!" అంది ఇందు దీనంగా.

"నీవొక్కదానివే నేమిటి ? ఏ స్త్రీ అయినా అంతే చేస్తుంది" అన్నాడు మదన్.

"ఆగండి ! మీరేమో...——" అని తీక్షణంగా అంది ఇందు... ఆవిడ నోటినుండి యేదో కటువైన తిట్టు వచ్చేట్టుగా వుంది. కాని, రాలేదు. ఇక ఆపైన మాట్లాడకుండా నోటిలోనే యేదో గొణుక్కుంది. మదన్ ఇటు పొర్లుతూ "ఏదో అంటున్నావూ ?" అన్నాడు. ఇందు బయటికే అనేసిందామాట....మదన్ ఒక్కసారిగా పకపక నవ్వాడు. మరుక్షణంలో ఇందు అతని కౌగిలిలో కరిగిపోతున్నది.

"మీ మగవాళ్ళ కేం తెలుసు ?...తను ప్రేమించిన పురుషుడి తాలూకు సన్నిహిత బంధువులంతా స్త్రీకి ప్రియంగానే కనిపిస్తారు...తన భర్త తండ్రీ, తమ్ముడూ...చెల్లెలూ, ఒకళ్లేమిటి ?" అంటూ హఠాత్తుగా తన చూపును దూర తీరాలకు మళ్ళించి "నేను చిట్టికి పెళ్ళి చేస్తాను" అంది ఇందు.

"అబ్బో! చాలాదూరం వెళ్ళిందే వ్యవహారం? అప్పుడే చిట్టి పెండ్లి సంగతిని ఆలోచిస్తున్నావ్" అన్నాడు మదన్.

ఇందు తన రెండు చేతులతో భర్త కళ్ళను మూస్తూ కొంచెం కళ్ళు మూసుకోండి ! మళ్లీ వెంటనే తెరవండి !" అంది. మదన్ నిజంగానే కళ్ళు మూసుకున్నాడు కాని చాలాసేపు తెరవలేదు.

"ఇంతసేపా? ఇక తెరవవచ్చు...మీరు కళ్ళు తెరిచేవరకే నేను ముసలిదాన్నయిపోతాను." అంది ఇందు. అప్పుడు కళ్ళు తెరిచాడు. ఒక్క క్షణ కాలం వరకూ, అక్కడ ఇందుకు బదులుగా చిట్టి కూచుని వున్నట్టు అనిపించింది. అతను ఊహాలోకంలో పడిపోయాడు.

"నేనప్పుడే చిట్టికోసం నాలుగు దుస్తులూ, పాత్ర సామానులూ వేరే దాచిపెట్టి వుంచాను." అంది ఇందు. మదన్ ప్రత్యుత్తరం ఇవ్వలేదు. ఆవిడ అతన్ని బలంగా కుదిపి ఊపుతూ "ఎందుకు మీరు విషాదంగా వున్నారు?...మీరు చేసిన వాగ్దానం జ్ఞాపకం లేదూ! మీరు మీ దుఃఖాన్ని నా కిచ్చెయ్యలేదూ?" అంది.

మదన్ ఉలిక్కిపడుతూ ఒకసారి "ఆఁ!" అని చూసి తిరిగి నిశ్చింతగా కనిపించాడు...ఈ పర్యాయం మదన్ ఇందును కౌగిలించు కున్నప్పుడు అతనికి ఒక శరీరమేగాక ఆవిడ ఆత్మకూడా కనిపించింది.

మదన్‌కు ఇందు ఆత్మవలె ఐపోయింది. ఇందుకు ప్రత్యేక శరీరం వుంది కాని, అది యే కారణంవల్లనైతేం మదన్ దృష్టికి గోచరం కాకుండా తెరమరుగున ఉంటూన్నది...స్వప్నతారలచే అందంగా నేయబడి, నిట్టూర్పుల ఉచ్ఛ్వాస నిశ్వాసాల ఆవిరి పొగలతో వర్ణశోభితమై, చిరునవ్వుల జలతారుల్తో మిలమిల మెరుస్తూన్న ఒక తెర సర్వదా ఆవిడని కప్పుకునే ఉంటున్నది. మదన్ ఆకలి చూపులు, ఆవేశిత బాహువులు దుశ్శాసన మూర్తులై, శతాబ్దాలనుండీ యీ ద్రౌపది వస్త్రాలను లాగుతోనే ఉన్నాయి. సాధారణ శబ్దకోశలలో ఈవిడకు "భార్య" అనే అర్థం వ్రాసిపెట్టారు. ఈ వస్త్రాపకర్షణం ద్వారా నగ్నం కావలసి వున్న ఈ స్త్రీకి, ఎల్లప్పుడూ ఆకాశంలోంచి వేలాది గజాల వస్త్రం తానులకు తానులు అందుతూ, సంరక్షించబడుతోంది. మగ దుశ్శాసనుడు, అలసి సొలసి, అక్కడో ఇక్కడో పడిపోయాడు. కాని, ద్రౌపది స్త్రీ అక్కడే నిలబడి వుంది... పవిత్రత, అభిమానం, అనే స్వచ్ఛమైన ధవళ దుకూలాలు ధరించి దేవీ మూర్తిలా నిలబడి వుంది.

ఆవిడను దోచుకుంటూన్న మదన్ చేతులు అలసటతో చెమట పట్టి తడిసినవి. వాటిని ఆర్పుకోవడానికి చేతులను గాలిలోకి ఎత్తిపట్టి, అర చేతులను పూర్తిగా తెరిచి వుంచాడు. వాటిని కాసేపు దూరంగా వుంచి, మరి కాసేపు కళ్ళ ముందుంచుకుని, వ్రేళ్ళ మధ్య సందుల్లోంచి చూస్తు కుంటున్నాడు. అతి సున్నితమైన ఇందు శరీరం, నిగనిగ మెరిసే కాంతితో సమక్షంలో పడి వుంది. ఉపయోగానికి సన్నిహితంగానూ, వీల్లేనంత దూరంగానూ ఉంది. ఇందు మీద యెప్పుడన్నా అధికంగా చేయిచేసుకుంటే ఆవిడ ముక్కుమీద వేలు వేసుకుని ''ఇంట్లో చిన్నా పెద్దా అంతా ఉన్నారు వాళ్లేమనుకుంటారు ?'' అంటుంది.

"పిల్లలు చిన్నవాళ్ళు చూసి గ్రహించుకోలేరు. పెద్ద వాళ్ళు చూస్తే, చూడనట్టుగానే వెళ్ళిపోతారు'' అంటాడు మదన్.

కాలం ఇలా సాగుతూండగానే బాబూ ధనీరాం ఉద్యోగం సహారన్ పూర్‌కు ట్రాన్స్‌ఫర్ అయింది. ఆయన ప్రమోషన్‌మీద అక్కడికి వెళ్ళవలసి వచ్చింది. రైల్వే మెయిల్ సర్వీసులో సెక్షన్ గ్రేడ్‌లో హెడ్ క్లర్కుగా మార్చారు...సహారన్ పూర్‌లో ధనీరాంకు ఉచితంగా లభించిన క్వార్టర్‌లో దాదాపు యెనిమిది కుటుంబాలు నివసించవచ్చు....కాని, ఆయ నొక్కడే యీ లంకంత ఇంట్లో కాళ్ళు స్వేచ్ఛగా జాపుకొని పడి ఉంటున్నాడు. జీవితంలో ఎన్నడూ ఇంటినీ, పిల్లల్నీ వదిలి ఆయన ఒంట రిగా ఉండలేదు. వట్టి సంసార పక్షం మనిషి. జీవితం చివరి భాగంలో ఇలా ఒంటరిగా ఉండవలసి వచ్చినందుకు ఆయనకు భయం వేస్తున్నది. కాని, చేసేదేముంది ? గత్యంతరంలేని స్థితి...పిల్లా జెల్లా అంతా ఢిల్లీలోనే ఇంటి వద్ద మదన్‌తో ఉన్నారు. అక్కడే చదువుకుంటున్నారు. సంవత్సరం మధ్యలో పిల్లల్నిక్కడికి తీసుకవస్తే చదువు ఆగం అయిపోతుంది. బాబూజీ మనస్సు ఆందోళనామయం అయింది.

వేసవికాలం సెలవులు వచ్చిం తరవాత, మూడు నాలుగు ఉత్తరాలు నిష్ఠూరంగా రాసినమీదట, మదన్ ఇందూతో కుందన్, పాషీ, చిట్టి పిల్లల్ని

సహారన్ పూర్ పంపించాడు. పరమైకాంత జీవిగా ఉన్న ధనీరాం ప్రపంచం సందడితో మెరిసింది. అదివరకు ఆఫీసు పని అయి, ఇంటికి వస్తే చేసే పనేమీ లేక, అంత విశ్రాంతిని అనుభవించే మార్గంలేక పిచ్చెత్తినట్లుండేది. ఇప్పుడు విశ్రాంతే లేకుండా పోయేంత చేతినిండా పని...పిల్లలు పిల్లలే ననిపించుకునేట్టుగా, ఎక్కడ విడిచిన బట్టలు అక్కడే పారేసి వదిలి పోతుంటారు....వాటిని కనుక్కొని తీసి ఒకచోట పెట్టడం ధనీరాం మొదటి పని....మదన్‌కు దూరంగా ఉండి, ఎప్పుడూ అతన్ని గురించి ఏదో అనుకుంటూండే ఇందుకు కూడా తన ఉడుపులమీద జాగ్రత్త సన్నగిల్లింది. బందెల దొడ్లో అవు తిరిగినట్టుగా, వంట గదిలోనే తిరుగుతుంటుంది. అప్పుడప్పుడు తన యజమాని కనిపిస్తాడేమోనని మోరసాచి బయటికి చూస్తున్నట్టుగా ఎప్పుడో ఒకసారి బయటికి కనిపిస్తుంది....ఇంట్లో పనిపాటలు పూర్తి అయిం తరువాత, మూలన వరసాగా ఉంచిన పెట్టెలమీద పడుకునో, లేక, అందరి నోరూ ఊరిస్తూ ఆవరణంలో ఉన్న మామిడి చెట్టు క్రింద నిలబడో కాలక్షేపం చేస్తూండేది—

శ్రావణ మాసం, భాద్రపద మాసంలోకి దిగజారుతున్నది. వాకిట్లోంచి బయటికి వెళ్లే గేటు తీసి ఉంటే, వీధిలోంచి అటూ ఇటూ తిరిగే వాళ్ళంతా కనిపిస్తుంటారు. గోరింటాకుతో చేతులు ఎర్రబరుచుకున్న పడుచులూ, కన్నెలూ, కొత్తగా పెళ్ళయిన అమ్మాయిలూ, పేరంటాలకి తిరుగుతూ ఉన్నారు....పాటలు పాడుతూ ఉయ్యాలలు ఊగటానికి వెళుతోంటారు. యెక్కడ నలుగురు కలుసుకుంటే అక్కడల్లా మల్లెలు పూచినట్లే ఉంటున్నది. ఏవో సంభాషణలు చిరునవ్వులూ సాగిపోతుంటాయి. వయస్సు మళ్ళిన వృద్ధ వనితలు కూడా ఉత్సాహంతో వుండే రోజులు...తను కూడా వాళ్ళతో కలిసి తిరుగుతూ ఉన్నట్టుగానే అనిపించేది 'ఇందు'కు....పగలు చూచిన వాటిని స్మృతికి తెచ్చుకుని, ఒక చల్లని సుదీర్ఘమైన నిట్టూర్పు వదిలి, పక్కకు తిరిగి పడుకుని నిద్రపోయేది. బాబూ ధనీరాం, ఆవిడ నిద్దరలో ఉన్నప్పుడు ఎప్పుడన్నా అటునుంచి వెళ్ళటం తటస్థిస్తే ఆవిడ

పట్టపగలు నిద్రపోతున్నా లేపడానికి ప్రయత్నించడు. ఆవిడ నిద్రించే సమయంలోనే, ఆవిడ అల్లరి చిల్లరిగా ఇంట్లో ఆ మూలా పడవేసిన వస్త్రాలను జాగ్రత్తపెడుతోంటాడు. ఇందు ముసుగు శాలువగా ఉపయోగించే వస్త్రం ఒక్కోసారి అజాగ్రత్తగా తన అత్తగారి కాలం నాటినుంచీ వున్న దేవదారు చెక్క పెట్టెమీద విసిరివేస్తుండేది....దాన్ని తీసి జాగ్రత్తగా, గోడనున్న కొయ్యకు తగిలిస్తాడు....ఈ పని చేస్తున్నప్పుడు ఆయన ఒకరి కంటబడకుండా తప్పించుకు తిరుగుతోండేవాడు....ఇదంతా చేసి, తిన్నగా వెనక్కి తిరిగేవాడో లేదో, ఆ మూలనుండో, ఈ మూలనుండో, కోడలు చూపులు ఆయన పనిని పసిగట్టినట్టు అనుమానం తగిలిన తక్షణమే, తువ్వాలు దులుపుకుంటూ, కన్నంలోంచి పాము పిల్ల బయటికి వచ్చినట్టు గదిలోంచి బయట పడతాడు....బయట వరండాలో ఆయన గొంతు వినిపిస్తోంటుంది ''ఓం నమో భగవతే వాసుదేవాయ'' అంటూ—

బాబూ ధనీరాం కోడలి అందచందాల అభివర్ణన సౌందర్య చరిత్ర, ఇరుగు పొరుగు అమ్మలక్కలు దూరదూరాలకు వ్యాపింపచేయడానికి అట్టే కాలం పట్టలేదు. ఎవరన్నా ఒకమ్మ, బాబూజీ ముందు ఆయన కోడలి అందమూ, ఆకారం గురించి అభినందిస్తుంటే ఆయన పొంగిపోయి "మేము నిజంగా అదృష్టవంతులమమ్మా! మా ఇంట్లో కూడా ఆరోగ్యవంతులైన వాళ్ళున్నందుకు భగవంతుడికి కృతజ్ఞతలు'' అంటూండేవాడు. ఈ మాటలు అనే సమయంలో ఆయన దృష్టి ఎక్కడో దూరస్థిత చిత్రాన్ని చూస్తుండేది. అక్కడ ఒక క్షయవ్యాధి పీడితురాలూ, మందుల సీసాలూ, ఆస్పత్రి మెట్లూ, చీమల పుట్టలూ అన్నీ కనిపించేవి....దృష్టి దూరంనుండి, క్రమంగా సన్నిహిత స్థితికి రాగానే చూసుకుంటే ఆయన మెడమీదా, చంకలలో, ఎక్కుతూ దిగుతూ వున్న అనేకమంది పిల్లలు కనిపించేవాళ్ళు—వాళ్ళంతా అప్పుడే ఈ లోకంలోకి వచ్చినట్టుండేది. గదిలో మంచంమీద పడుకున్న కోడలి నడుము భూమిమీదా, శిరస్సుపై కప్పుకు తగులుతూ ఉన్నట్టనిపించేది. ఆవిడ శరీరంలోంచి అసంఖ్యాకంగా యంత్రంలోంచి ఉద్భవించి

నట్టు శిశువులు ఉద్భవిస్తున్నారు. ఈ శిశువుల వయస్సులో యేమాత్రం తేడాలున్నట్టు లేవు. ఒకడు పెద్దగా గానీ, మరొకడు చిన్నగా గానీ లేక అంత సమానంగానే ఉన్నారు...అంతా వజ్రాలు...

"ఓం నమో భగవతే——"

ఇందు; బాబూజీకి అత్యంత ప్రియమైన కోడలని చుట్టుపట్ల వాళ్ళంతా ఇట్టే తెలుసుకున్నారు. పాలూ, పెరుగు, మజ్జిగ అన్నీ కడవలాదిగా రావటం ప్రారంభించాయి. సలామ్‌దీన్ అనే వ్యక్తినుండి అప్పుడే ఇందుకి ఒక విజ్ఞాపన చేరింది. "అయ్యగారితో చెప్పి మా అబ్బాయికి ఆర్. ఎం. ఎస్‌లో యేదన్నా ఉద్యోగం ఇప్పించండి. భగవంతుడు మిమ్మల్ని ఆశీర్వదిస్తాడు" అని...ఇందు ఈ విషయం మామగారితో అలా అన్నదో లేదో, తక్షణం సలాందీన్ కొడుక్కి సార్టర్ ఉద్యోగం లభించింది. అదృష్టవశాత్తూ అతనికి పోటీ అభ్యర్థులు అధికంగా లేరు——

కోడలి ఆహార పానీయాలూ, ఆరోగ్య విషయాలను గురించి, బాబూ ధనీరాం ప్రత్యేక శ్రద్ధ గైకొనేవాడు. పాలు త్రాగటం అంటే ఇందు కెప్పుడూ సరిపడదు. ఆవిడచేత త్రాగించాలనీ, ఆరోగ్యానికి మంచిదనీ ఆయన ఉద్దేశ్యం. రాత్రిపూట స్వయంగా పాలు గ్లాసులో పోసి, కోడలిని పిలవడానికి మంచం వద్దకు వచ్చేవాడు. ఇందు తనను తను సవరించుకుంటూ "నేను పాలు త్రాగనండీ!" అనేది.

"మీ అత్తగారు కూడా త్రాగుతుంది" అంటాడు.

"అయితే మీరు త్రాగరేం?" అంటూ ఇందు ప్రత్యుత్తరం ఇచ్చేది నవ్వుతూ. దాంతో ఆయన కోపాన్ని అభినయిస్తూ "మీ అత్తగారి పని లాగానే నీదీ కావాలని అనుకుంటున్నట్టుంది" అనేవాడు.

"ఊఁ!" అంటూ ఇందు కొంచెం అలిగినట్లు కనిపించేది. ఓదార్చేవాళ్లో బ్రతిమాలేవాళ్లో ఉన్నప్పుడు యెవరైనా కొంచెం బిగుసుకపోతూనే ఉంటారు. ఇక్కడ అలిగే వాళ్ళ సంఖ్య ఒకే ఒకటి. కాని, బ్రతిమాలేవాళ్ళ

సంఖ్య అధికం అయిపోయింది. ఎంతసేపు చూసినా ఇందు ఆయన చేతిలోని గ్లాసులో పాలు త్రాగకపోతే, ఆయన ఆ గ్లాసుని ఆవిడ మంచం తలాపున వుంచి "ఇదుగో! ఇక్కడ పెడుతున్నాను. ఇష్టం వుంటే త్రాగు. లేకపోతే త్రాగబోకు" అని వెళ్ళిపోయేవాడు.

తన పక్కమీద పడుకుని చిట్టితో ఆడుకుంటూండేవాడు ధనీరాం. తండ్రికి ఆనుకుని, పొట్టమీద ముఖం వుంచి పడుకోవటం చిట్టికి అలవాటు. బాబూజీ ఆమెతో ఇదే ఆటలాగా ఆడుతూ, చిట్టిని కవ్విస్తూ తను నవ్వుతూ ఉన్నప్పుడు చిట్టి వదిన వైపు చూసింది.

"వదిన పాలు త్రాగటం లేదు నాన్నా! పాలు పాడైపోవూ?" అంది.

బాబూజీ రెండో చెత్తో పక్కనే వున్న 'పాషీ'కి నిద్రా భంగం కాకుండా నిమురుతూ, "త్రాగుతుందమ్మా! యెందుకు త్రాగదూ!...తెలిసిన ఆడవాళ్ళు ఇంట్లో దేన్నీ వృధాగా పాడైపోవటం సహించరు" అన్నాడు. ఇంతలోనే, లోపలనుంచి "హుష్! నీ దుంపతెగ" అన్న మాటలు విన వచ్చినై...పాలు త్రాగటానికి వచ్చిన పిల్లిని వెళ్ళగొడుతున్నట్టు అందరికీ తెలుసు...తరవాత వెంటనే గట గట గట త్రాగిన శబ్దం వినవచ్చింది. ఆవిడ పాలు త్రాగేసిందని అంతా చెప్పకుండానే తెలుసుకున్నారు.

కాస్సేపు కాగానే కుందన్ తండ్రి దగ్గరకు వచ్చి "వదినె యేడుస్తోంది నాన్నా!" అన్నాడు.

"ఆఁ!" అంటూ గదిలో ఇందు పడుకున్న మంచంవైపు చూశాడు బాబూజీ...అలా చూస్తూనే కాస్సేపు అయోమయంగా కూచుని మళ్ళీ పడుకున్నాడు. "వెళ్ళు! నీవు వెళ్ళి పడుకో!" వదినె ఆమే పడుకుంటుందిలే" అని కుందన్‌తో అన్నాడు.

పక్కమీద పడుకుని ప్రతి రోజూ కాసేపు ఆకాశంలోకి చూస్తూ పరమాత్ముడి పూలతోటలో విరిసిన పూవుల్లా వుండే చుక్కల్ని తన్మయత్వంతో

పరీక్షించడం ధనీరాంకు అలవాటయింది. అలా చూస్తూ తన ఆత్మని తనే ప్రశ్నించుకుంటాడు.

"వెలుగుతూ, ఆరుతూ వెలుగుతూ వుండే ఈ వెండి పూలల్లోనా పూవు యెక్కడుంది ?...ఈ ప్రశ్న వెంటనే, ఆయనను ఆకాశం అంతా ఒక విశాలమైన బాధా సముద్రంవలె కనిపించి చెవులలో యేదో ధ్వని విని పించేది. దాన్ని వినగానే "ఈ ప్రపంచం పుట్టిన దగ్గరనుంచీ మానవుడు ఎంత బాధ ననుభవించాడో, ఎంత యేడుపు యేడ్చాడో ?" అనుకునేవాడు. అలాగే దుఃఖంతో వివశుడై నిద్రపోయేవాడు——

*　　*　　*　　*

ఇందు వెళ్ళి ఇరవై రోజులైందో లేదో, మదన్‌కు అప్పుడే చిరాకు ప్రారంభమైంది. "నేను బజారు రొట్టెలు తినలేక అవస్థపడుతున్నాను. జలుబూ, దగ్గూ, జ్వరం, వేడీ, అన్నీ పట్టుకుని పీడిస్తున్నాయి ...శరీరంలో నడుము దిగువ భాగంలో నొప్పి పెడుతూంది." అని వుత్తరం వ్రాస్తూ, ఆఫీసులో సెలవు దరఖాస్తుకి డాక్టర్ సర్టిఫికెట్ జతపరిచినట్టుగా, తన తండ్రి స్నేహితుడైన ఒక వైద్యుడి సర్టిఫికెట్టు కూడా ఉత్తరంతో జతపరిచి పంపాడు...ఈ వుత్తరం యేమీ పనిచేయకపోయేసరికి, రిప్లయి పెయిడ్ ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం ఇచ్చాడు.

టెలిగ్రాం రిప్లయ్ చార్జి డబ్బులు హరించుకపోయినై. రిప్లయ్ ఇవ్వ కుండానే ఇందూ పిల్లలూ తిరిగి ఇంటికి వచ్చేశారు. ఇందు వచ్చిన తరవాత రెండు రోజులవరకూ మదన్ సరిగా ఆవిడతో మాట్లాడలేదు. ఈ బాధ కూడా ఇందే అనుభవించవలసి వచ్చింది. ఒకనాడు మదన్ ఒంటరిగా ఉండగా, అతని చేయి పట్టుకుని ఆపి అడిగింది.

"ఎందుకు మీ కంత కోపం ? నేనేం చేశానని ?" అంది.

మదన్ చికాకుతో చేయి విదిలించుకుంటూ "వదులు...నా కండ్లకు కనిపించకు...దూరంగా పో ! నీచురాలా !" అన్నాడు.

"ఈ మాటలు అనటానికేనా ఇంతదూరంనుంచి పిలిపించింది ?" ఇందు వ్యగ్ర హృదయంతో అంది.

"అవును"

"ఐతే మరి ఇప్పుడు వెళ్ళగొట్టండి !"

ఇదంతా నీ యిష్ట ప్రకారం కాకపోతే, నీవు బయలుదేరి రాదల్చుకుంటే నాన్నగారు నిన్ను ఆపుచేశారేం ?"

ఇందు ఆందోళనపడుతూ "అబ్బ! మీరు మరీ పిల్లలవలె మాట్లాడతారేమిటి ?...నేను వెళతానని ఆయనగారిని చూస్తూ ఎట్లా అడగమంటారు? నిజం మాట్లాడితే మీరు నన్నిలా రప్పించుకుని మీ నాన్నగారికి చాలా బాధ కలిగించారు"

"అంటే అర్థం ?"

అర్థం యేముంది ? పిల్లల్ని క్షణంసేపు విడిచివుండలేదు ఆయన మనస్సు"

"మరి నా మనసో ?"

"మీ మనసా ? ఎక్కడైనా వుంచుకోగలరు. సమర్థులు" అంటూ ఇందు నిస్సహాయరాలివలె మదన్ వైపు చూసింది...ప్రతిఘటనాశక్తి నశించిన తరవాత చివరి ప్రయత్నాన్ని చేసింది...అ చూపుతో మదన్ కరిగిపోయాడు. ఇందుని రెండు చేతులతో పొదివి పట్టుకుని, హృదయానికి హత్తుకున్నాడు. "ఐతే నాన్నగారు నీవంటే సంతోషంగా వుండేవారన్న మాట." అన్నాడు.

"అవును...ఒకనాడు ఈతాత్తుగా నిద్ర మెలకువ వచ్చి చూస్తే ఆయన నా తలాపిక నిలబడి వున్నారు. నన్ను గురించే యెప్పుడూ ఆలోచిస్తుంటారు" అంది ఇందు అమాయకంగా.

"నిజంగా అలా నిలబడ్డారా ఆయన ?" తర్కించి అడిగాడు. "నా తోడు నిజం !" ఇందు మరింత అమాయకంగా అంది.

"నీ తోడు కాదు...నా మీద ఒట్టేసి చెప్పు. నమ్ముతాను."

"మీ మీద ఒట్టేసి చెప్పటం నా కిష్టం లేదు."

మదన్ ముఖం వివర్ణమైపోయింది. "హుఁ" అని తల అడ్డంగా నిలువుగా తిప్పుతూ, ఆలోచిస్తూ "పుస్తకాల్లో దీన్నే "సెక్స్" అని అంటూంటారు" అన్నాడు.

ఇందు కొంచెం విచిత్రంగా చూస్తూ "సెక్సా ? అదేమిటి ? ఎలా వుంటుంది ?" అంది.

"అదా...అది అదే...ఆడవాండ్లూ—మగవాండ్ల మధ్య నడిచే గ్రంధం" అన్నాడు మదన్ తీక్షణంగా.

హఠాత్తుగా పామును చూసినట్టుగా వెనక్కి తగ్గింది ఇందు. చెవులు మూసుకుంటూ "రామ ! రామ !" అంది...ఆవిడ ముఖం కందగడ్డవలె అయి విపరీతమైన కోపంతో "వట్టి నీచత్వం ఇది...మీ నాన్నగారిని గురించి ఈ అభిప్రాయం మీకు వచ్చినందుకు సిగ్గెందుకు కలగదా అని ఆలోచిస్తున్నాను" అంది.

"నిద్రపోతున్నదాని మంచం దగ్గర నిలబడి చూడటానికి ఆయనకు మాత్రం సిగ్గెందుకు లేదూ ?"

ఇందు మామగారి పక్షం వహిస్తూ "ఎందుకుండాలి ? ఆయన తన కోడలిని చూసి ఆనందం, తృప్తీ అనుభవిస్తున్నారని యెందుకనుకోలేరు?" అంది.

"అవును...యెందుకు అనుకోకూడదూ ? కోడలివి నీ విలాంటి దానివైతే...!"

ఇందు అసహ్యంగా చూస్తూ ఇలా అన్నది గదాంటే, "మీ మనస్సే నీచమైంది...అల్పబుద్ధి ఇది...అందుకే మీ వ్యాపారం కూడా కళ్ళు సరుకుతోటే జరుగుతుంది...మీరు చదివే పుస్తకాలు కూడా కుళ్ళిపోయి

అసహ్యమైనవే. ఇంతకన్నా వేరొకటి కనిపించదు మీ గ్రంథాల్లో...నేను చిన్నప్పుడుకన్నా, పెద్దదాన్నయి, ఇక్కడికి వచ్చాకనే మా నాన్న నన్ను అధికంగా ప్రేమిస్తున్నాడు...ఐతే అదికూడా మీ గ్రంథంలో...దాని పేరేమిటో అన్నారు...వెధవది...అదేనా ?'' ఇందు కొంచెంసేపాగి దుఃఖస్వరంతో అంది మళ్లీ...మీ నాన్నగారిని పిలిపించుకోండి...రమ్మనండి, ఆయన పిల్లలు కనపడంది ఉండలేరు...ఆయన మనస్సు కష్టపడితే మీ మనస్సు మాత్రం కష్టపడ్డట్టు కాదూ ?''—

తండ్రి అంటే మదన్ అంతరాంతరాలలో అమితమైన ప్రేమ ఉంది. ఇంటికి పెద్ద సంతానం తనే కావటంతో, తల్లి చావు మదన్‌కు బాగా జ్ఞప్తిలో ఉండి, యెంతో దుఃఖం అనుభవించాడు...రోగ గ్రస్తురాలైన తల్లి రూపమూ, ఆమె మృతీ మొదలైన చరిత్ర కళ్ళముందుకు వచ్చినప్పుడు మదన్ రెండు కళ్లూ గట్టిగా మూసుకుని ప్రార్థన కొనసాగిస్తాడు. ''ఓం నమో భగవతే వాసుదేవాయ...ఓం...''అని...తల్లి యెలాగో దాటిపోయింది. పితృమూర్తి ఛత్రచ్ఛాయ కూడా తన శిరస్సుమీదినుంచి తొలగిపోవటం అంటేనే అతనికి తగని భయం వేస్తుంది...తన పని తను సరిగా చూసుకునే సమర్థత కూడా లేని ఇలాంటి సమయంలో ఇది అసలే జరగరాదని ఊహ....అయినప్పటికీ, ఇందు మాటలు నమ్మశక్యం కాని స్థితిలో పడి ఇలా అన్నాడు :—

''నాన్నగారేం చిన్న పిల్లవాడనుకున్నావా ? ఆయనకేం బెంగలేదు. అక్కడే వుండనీ కొన్నాళ్ళు...కొత్తగా పెళ్ళయిన తరువాత, మనం స్వేచ్ఛగా ఒంటరిగా గడపడం ఇదే కదా ?''—

మూడో రోజునో నాలుగో రోజో, అశ్రువులతో నిండిన ఉత్తరం బాబూ ధనీరాం దగ్గరనుంచి వచ్చింది. నా ప్రియమైన మదన్ అనే సంబోధనతో ప్రారంభించాడు. 'నా ప్రియమైన' అనే పదంలో ఆయన గుండెల్లోని ప్రేమ వాత్సల్యం అంతా ఇమిడి ఉన్నట్టుంది. అందులో కొంత యీ విధంగా ఉంది—

"కోడలు ఇక్కడ ఉన్నప్పుడు, నాకు మీ అమ్మ కాలంనాటి పాత రోజులు జ్ఞాపకం వచ్చినై...మా వివాహం అయిన కొత్త రోజుల్లో మీ అమ్మ కూడా అచ్చం ఇలాగే అశ్రద్ధగా ఉంటూండేది...ఎక్కడ విడిచిన వస్త్రాలు అక్కడేవదిలి కూచుంటుంటే, మానాన్నగారు అవన్నీ జాగ్రత్తగా వుంచుతుండేవారు...అదే చెక్కపెట్టె అదే తత్వం...

"నేను రోజూ బజారుకువెడుతున్నాను. వస్తున్నాను...మరేమీ పని లేదు...ఇంట్లో ఎవరూ లేరు...చెక్కపెట్టె పెట్టిన చోటు ఖాళీగా వుంది."

తరవాత ఒక అర పంక్తి చెదిరిపోయి వుంది. తడిసినట్టుంది. చివరి పంక్తి ఇలా వుంది. "ఈ యింట్లో విశాలంగా దీపం లేకుండా చీకటిగా వున్న పెద్ద పెద్ద గదులు చూస్తుంటే నాకు భయంగా ఉంటుంది—

"కోడలి ఆరోగ్యం గురించి తగిన జాగ్రత్త తీసుకుంటావని చెబుతున్నాను. ఆమెను చేతగాని నాటు మంత్రసానులకు అప్పజెప్పవద్దు..."

ఇందు ఉత్తరం రెండు చేతుల్తో గట్టిగా పట్టుకుంది. గట్టిగా శ్వాస పీలుస్తూ, కళ్ళు పెద్దవి చేసుకుంటూ, సిగ్గుతో చెమటపట్టిపోయింది—

"నాకు చచ్చినంత సిగ్గవుతున్నది...ఈ సంగతి బాబూజీ యెట్లా కనిపెట్టగలిగారో...?" అంది.

మదన్ ఉత్తరాన్ని లాక్కుంటూ "నాన్నగారు పసివాడనుకున్నావు. ఆయన ఎంతో ప్రపంచం చూశాడు...మమ్మల్నందర్నీ కనిపెంచాడు." అన్నాడు.

"కావచ్చు...కాని, ఇంకా నెలలైనా దాటందే?" అంది ఇందు. ఒక్కసారి తక్షణంగా తన గర్భాన్ని చూసుకుంది...ఇంకా పెరుగుదల కూడా ప్రారంభం కాలేదు....ఆవిడ చీర చెరగును పొట్టమీదుగా గుంజి నడుముకు దోపి యేదో ఆలోచిస్తోంది...ఒకసారి మెరుపు తట్టినట్టయింది ముఖంలో...

''మీ అత్తవారింటినుంచి చలిమిడి పాకం ముద్దలు వస్తాయి మీకు'' అంది ఉత్సాహంగా...

"మా అత్తవారింటినుంచా ?...ఆ....అవును...చెపుతున్నావింకా... సిగ్గవటంలేదూ ? కాపరానికి వచ్చి ఆరేడు నెలలైందో కాలేదో...అప్పుడే వచ్చి పడ్డది'' అన్నాడు మదన్. భార్య కడుపువంక చూస్తూ....

"వచ్చిపడ్డదా...మీరు తెచ్చిపెట్టారా ?''

"నీవే...ఇదంతా నీ తప్పే....కొంతమంది ఆడవాండ్లింతే—''

"మీకు గిట్టదా ?''

"యేమాత్రం గిట్టదు..."

''ఎందువల్ల ?

"నాలుగు రోజులైనా జీవిత మాధుర్యం అనుభవించకపోతే ఎలా?''

ఇందు కొంచెం వ్యధిత స్వరంతో ప్రశ్నించింది. ''ఇది జీవిత మాధుర్యం కాదా ?....ఆడా మగా పెళ్ళిండ్లెందుకు చేసుకుంటారు...? అడక్కుండానే భగవంతుడు ఫలితం ప్రసాదించాడు...ఈ ఫలితం లేని వాళ్ళు ఎంత కటకటపడి, ఎంతమంది దేవుళ్ళకు మొక్కుంటారో, ఎందరు పకీర్లకూ, భిక్షగాండ్లకీ దానాలూ ధర్మాలూ చేస్తారో, ఎక్కడ యోగి కన పడితే అక్కడికల్లా ఎన్నెన్నిసార్లు వెళుతుంటారో, స్త్రీలు సహజమైన లజ్జను కూడా వదిలి, తడి బట్టల్తో ఎన్ని దేవాలయాల ముందట ప్రాణా చారాలు పడుతుంటారో, ఎన్ని పుణ్య నదుల్లో మునిగి, ఎన్ని దీపారాధనలు చేయిస్తుంటారో, ఇది లేని వాళ్ళ నడిగితే తెలుస్తుంది. మీకు ఎలా తెలుస్తుంది ?—''

"బాగుంది...నీవు తెంపులేకుండా మాట్లాడ్డం కూడా నేర్చావు. పిల్లలు పుట్టరనుకోవడానికి అప్పుడే యేమి కాలం గడిచిందని ?'' అన్నాడు మదన్.

"కావచ్చు...పుట్టిం తరవాత మీరు గనక చేయివేసి ముట్టుకున్నా రంటే నేను ఒప్పుకోను...మీకు అవసరం లేకపోతే, వాళ్ళ తాతగారికి చాలా అవసరం ఉంటుంది. నాకు తెలుసు...అంది తర్జని ఆడిస్తూ.

కొంచెం తర్కం ముదిరేవరకు ఇందు మనస్సు కష్టపడ్డది. రెండు చేతులతో ముఖాన్ని కప్పుకుంది...తన గర్భంలో వున్న శిశువును గురించి ఆవిడ అలా ఆలోచిస్తోంది. అంతో యింతో సానుభూతి చూపించక తప్ప దని మదన్ నిశ్చలంగా కూర్చున్నాడు. ఒక్క మాట కూడా మాట్లాడలేదు. ఇందు ముఖంమీద చేతులు తీసి మదన్‌ను చూసింది. భవిష్యత్తు తెలుసు కున్న దానిలా అంది "ఈ గొడవంతా తరవాత జరుగుతుంది కాని, ముందు నేను బ్రతుకుతానా అని నా అనుమానం.. మొదటి కానుపు వాళ్లెవరూ తేలిగ్గా బయట పడరని అంటుంటారు."

మదన్ త్రుళ్ళిపడ్డాడు...భయపడ్డాడు...ఇంత సౌందర్యమూర్తి, గర్భవతి అయిం తరవాత మరీ సౌందర్యవతిగా కనిపిస్తోంది...."చని పోతుందా ?" అనుకున్నాడు. అతను ఇందు వీపుకు అసరాగా చేతిని వుంచి తిరిగి చప్పున లాక్కుని, ఆవిడని రెండు చేతులతో కౌగిలించుకుని "నీకేమీ భయం లేదు ఇందూ ! మృత్యుదేవత నోట్లోనుంచైనా నిన్ను లాక్కుని వస్తాను. వెనక సావిత్రి తన భర్తను తెచ్చుకుంది కదూ ! ఇప్పుడు సత్య వంతుడి వంతు వచ్చింది" అన్నాడు—

మదన్ కౌగిలింతలో, ఇందు తన దుఃఖాన్ని కూడా మరిచిపోయింది—

*  *  *  *

బాబూ ధనీరాం దగ్గరనుంచి మళ్ళీ వుత్తరాలేమీ రాలేదు. సహారన్ పూర్ నుంచి వచ్చిన ఒక సార్టర్ కబురు తెచ్చాడు. "బాబుగారికి మళ్ళీ వెనకటిలా కమ్మేళ్ళు వస్తున్నాయనీ, ఒకసారి కమ్మేడు వచ్చి దాదాపు అయిపోయినంత పనైందనీ చెప్పాడు...ఇది విని మదన్ చాలా భయ

పడ్డాడు...ఇందు యేడవటం మొదలెట్టింది...సార్టర్ వెళ్ళిపోయాక, ఎప్పటివలెనే రెండు కళ్లూ మూసుకున్నాడు మదన్. తన మనస్సులోనే "ఓం...నమో భగవతే వాసుదేవాయ" అనుకున్నాడు.

మర్నాడే మదన్ తండ్రికి ఉత్తరం వ్రాస్తూ, అర్జంటుగా బయలుదేరి రమ్మనీ, పిల్లలూ, కోడలూ, మనాదిగా తలుచుకుంటున్నారనీ వ్రాశాడు. కాని, ఎంతైనా చేసేదీ నౌకరీయే కాబట్టి, అక్కడ మనం అనుకున్నట్టుగా జరగదు కాబట్టీన్నీ ధనీరాం తక్షణం రాలేకపోయాడు. సెలవు కోసం దరఖాస్తు పెట్టుకున్నాడు. కాని, అప్పుడప్పుడే అది తెమిలి మంజూరయ్యేట్టు లేదు—

తండ్రి రాకడ ఆలస్యమైనకొద్దీ మదన్ తను ఘోరమైన నేరం చేసినట్టు బాధపడుతున్నాడు. ఇందును ఇంకొన్నాళ్ళు అక్కడ వుంచక బుద్ధి తక్కువ పని చేశాడు కాని, అక్కడే వుంచితే తనకేం మునిగిపోయేదని రప్పించుకున్నాడు" ఇదీ అతని ఆలోచన—

* * * *

విజయదశమికి ఒకరోజు క్రితం రాత్రి...మదన్, ఇంటి మధ్య గదికి చాయగా వరండాలో అటూ ఇటూ పచార్లు చేస్తూ శూన్యాందోళనా ప్రపంచంలో విహరిస్తున్నాడు. లోపలనుంచి, పిల్లవాడి యేడుపు 'క్యారు' మంటూ వినవచ్చింది. మదన్ త్రుళ్ళిపడి మొత్తలవైపు మళ్ళాడు..,మంత్రసాని పని చేస్తూన్న నర్సు బయటికి వచ్చింది..."శుభం ! మగపిల్లవాడు" అంది.

"మగ పిల్లాడా ?..." అని నోరు తెరిచి అడుగుతూ, వెంటనే తొందరగా ప్రశ్నించాడు. "ఆవిడ యెట్లా ఉంది?"

"మంచిగానే వుంది. ఆవిడతో, మగపిల్లవాడని చెప్పలేదు. ఆడ శిశువని చెప్పాను....అపరిమిత సంతోషంతో బాలెంత గుండెలు వేగంతో

కొట్టుకుంటుంటే, రావలసిన మలినం అంతా బయటికి రాక ఆరోగ్యం చెడి, తీవ్ర స్థితి యేర్పడుతుంది... అందుకని చెప్పలేదు" అంది నర్సు.

"ఓ...అలాగా ?" అంటూ మదన్ అవివేకుడిలా కళ్లార్పుతూ గదిలోకి వెళ్ళటానికి ముందుకు అడుగేశాడు...నర్సు అతన్ని పోనీకుండా అక్కడే ఆపి, "మీకు లోపల పనేముంది ?" అంటూ లోపలికి వెళ్ళి తలుపులు దగ్గిరికి వేసుకుంది—

మదన్ కాళ్లు ఇంకా నిస్సత్తువగా తేలిపోతూ కంపిస్తూనే వున్నాయి. భయంవల్ల కాక, మానసిక తృప్తీ, హృదయావేగంవల్ల కాళ్ళు నిలదొక్కుకోవటంలేదు. ఒక ప్రాణి కొత్తగా ప్రపంచంలో ఉదయించేటప్పుడు, చుట్టుపట్ల వున్న సంబంధిత జనానికి ఈ స్థితి తప్పకుండా యేర్పడుతుంది... మదన్‌కు తను కాక, గోడలు కూడా కంపిస్తున్నట్లనిపించింది. పురుడు వెళ్ళబుచ్చడానికి బల్లి వదినె రాలేదు కాని, దర్యాబాద్ అత్తయ్య వచ్చి వాలింది...శిశువు జన్మిస్తున్నప్పుడు, "రామ రామ రామ రామ" అంటూ జపించింది...ఇప్పుడు కూడా జపిస్తూనే వుంది కాని, స్వరం కొంచెం మందగించి మంద్రస్థాయికి దిగింది—

జీవితంలో యెప్పుడూ, ఇలా తోచకుండా వృథాగా గడిచిపోయిన సమయం లేదు మదన్‌కు...ఇంతలో మళ్ళీ తలుపు తెరువబడి, అత్తయ్య బయటికి వచ్చింది. వరండాలో మందంగా వెలుగుతున్న ఎలెక్ట్రిక్ దీపం కాంతిలో, ఆమె తెల్లని ముఖం భూతం ముఖంలా కనిపించింది...మదన్ ఆవిడ త్రోవకు అడ్డంగా నిలబడి "ఇందు కుశలంగా వుందా అత్తా !" అన్నాడు.

"బాగుంది...బాగుంది...బాగా వుంది" అని మూడు నాలుగుసార్లు వల్లిస్తూ వణకుతున్న వృద్ధ హస్తాన్ని మదన్ నెత్తిమీదకి పోనిచ్చి, వాత్సల్యంగా నిమిరింది. దృష్టి తీసినట్టుగా నటిస్తూ బయటికి వెళ్ళిపోయింది. వరండా మొత్తల్లోంచి బయటికి పోయి, వాకిలి గదిలో మంచాలమీద పడు

కున్న మిగతా పిల్లల దగ్గరకు వెళ్ళి, అందర్నీ వరసాగా తల నిమురుతూ! ఇంటి కప్పుకేసి చూసి లోలోపల యేవో స్తోత్రాలు పఠించుకుంటూ తిన్నగా చిట్టి మంచంమీద "హా..." అని ఆవులించి చిటికెలు వేస్తూ చేరగిల బడింది. ఆవిడ వెక్కటం, ముక్కు చీదుతూ ఉంటంవల్ల యేడుస్తున్నట్టుగా తేలింది. మదన్‌కు ఆశ్చర్యం అనిపించింది అత్తయ్య ఇలాంటి పురుళ్ళూ పుణ్యాలను ఎన్నిటినో తన చేతిమీదుగా గడిపింది. కాని, ఎన్నడూ యేడవ లేదు. ఇప్పుడు ఆవిడ ఆత్మ కూడా ఎందుకిలా వణికిపోతున్నదో అను కున్నాడు !...

పురిటి గదిలోంచి అగరువత్తులూ, సాంబ్రాణి ధూపం వాసన గప్పున వస్తోంది. వాసనతోపాటు పొగ కూడా వచ్చి, మదన్‌ను కప్పి వేసింది. అప్పుడే మంత్రసాని నర్సు, బయటికి వచ్చింది. వస్త్రంలో యేదో చుట్టుగా చుట్టబడి వుంది ఆవిడ చేతుల్లో...ఆ వస్త్రం నిండా నెత్తుటి మరకలు...నెత్తుటి చిందులు కొన్ని జారి, క్రింద గచ్చుమీద కూడా పడ్డాయి...మదన్ ప్రాణాలు పైని పైన్నే లేచిపోయినై...ఇందు యెక్క డుందో అతనికి తెలియక ఆరాటం అధికం అయింది. అతని కండ్లు పూర్తిగా తెరుచుకునే వున్నాయి కాని, యేమీ కనిపించే స్థితి లేదు. ఇంతలో గదిలోంచి ఇందు బాధాపూరితంగా మూలిగింది...అయ్యో ! అంటూ; వెంటనే పసివాడి యేడుపు...

మూడు నాలుగు రోజుల్లో అంతా అయిపోయింది. ఇంటి ఆవరణలో ఒక మూలగా గోయి త్రవ్వించి, కశ్మలం అంతా అందులోవేసి పూడ్చారు. కుక్కల్ని లోపలికి రానీయకుండా తగిన కట్టుదిట్టాలు చేశారు. ఇదంతా జరుగుతున్నా మదన్‌కు స్పృహ ఉన్నట్టు లేదు...అవాళ గదిలోంచి ధూపం కమ్ముకుని ఉక్కిరి బిక్కిరి చేసింతర్వాత, అంతా యాంత్రికంగానే జరుగుతుంది కాని, ఇప్పుడిప్పుడే వాస్తవంగా బాహ్యస్మృతి కలిగింది మదన్‌కు-ఇవాళే కొంచెం ఆలోచించగలుగుతున్నాడు. గదిలో ఇందూ, తనూ తప్ప మరొకరెవ్వరూ లేరు...నంద యశోదలు...మరో వ్యక్తి

బాల గోపాలుడు...ఇందు పిల్లవాడిని పరీక్షగా చూసింది....పోలికలు చూసుకోటానికి భర్తను చూస్తూ "అచ్చంగా మీరే....మీ పోలికే" అంది.

మదన్ నిర్లిప్త దృష్టితో శిశువును చూస్తూ "కావచ్చు కాని, నీవు సురక్షితంగా బయట పడ్డందుకు భగవంతుడికి కృతజ్ఞత అర్పిస్తున్నాను." అన్నాడు—

ఇందు తల వూపుతూ "అవును....నేను అనుకొనేదాన్ని... అంటూండగా మదన్ అడ్డం వచ్చి, "శుభం పలుకు...ఇక్కడ అంతా శుభంగానే వుంది...పిచ్చిగా మాట్లాడకు ఇక నేనీ గదిలోకూడా ఉండను. ఈ చాయలకే రాను. నాకు సంబంధం కాదు...అంటూ నాలుకను మూని పండ్లతో నొక్కుకున్నాడు—

"ఐతే ముందు మీరు చెంపలు వేసుకోండి!" అంది ఇందు. మదన్ వెంటనే తన రెండు చేతులతో రెండు చెవులనూ పట్టుకున్నాడు. ఇందు చిన్నపిల్లవలె విజయసూచకంగా నవ్వుతూంది.

పిల్లవాడు పుట్టిం తరవాత చాలా రోజులకి గాని, ఇందు శరీరం యధాస్థితికి రాలేదు...తనలోంచి బయటపడి, బయటి ప్రపంచంలోకి వెళ్ళాక తల్లినే గుర్తు పట్టడం చేతగాకుండా పోయిన పిల్లవాడి చుట్టూ తానే తిరుగు తోంది ఇందు....కొన్నాళ్ళకు ఆవిడ మనస్సు కూడా స్వస్థ పడ్డది....ఇందు ప్రశాంతంగా ప్రపంచంలోకి దృష్టి సారించింది....ఒక్క మదన్‌నే కాక, ప్రపంచంలో జరిగిన తప్పులన్నిటినీ క్షణంలో క్షమించి వేయగల మన స్తత్వం అబ్బింది ఇందుకు....దేవీ మూర్తిగా అవతరించి, ప్రపంచంలో కరుణా ప్రసాదం పంచిపెడుతున్నట్టుగా ఉంది. మదన్ ఇందు వైపు చూస్తూ ఆలోచిస్తూంటాడు....శరీరంలో రక్తం అంతా పోయి, తెల్లగా వున్నా, ఇందు మునుపటికన్నా అందంగా కనిపించిందతనికి....ఇందు హఠాత్తుగా తన రెండు చేతులతోనూ వక్షాన్ని కప్పుకుంది.

"ఏమైంది?" ఆత్రంగా అడిగాడు మదన్.

ఇందు లేవడానికి యత్నిస్తూ ''యేం లేదు....! పిల్లవాడికి ఆకలి వేస్తున్నది'' అంటూ అటు చూపింది—

''వాడికా ?...ఆకలా ?.. నీ కెలా తెలిసింది ;'' అంటూ మదన్ పిల్లవాడివైపూ ఇందువైపూ వెర్రిగా చూశాడు !....

ఇందు పిల్లవాడివైపు చూస్తూ ''చూట్టం లేదూ ?'' అంది... మదన్ శ్రద్ధగా ఇందు హృదయంవైపు చూశాడు...పాలు నదిలా ప్రవహిస్తున్నాయి ...వింతవాసన ఒకటి ఉద్భవిస్తోంది...ఇందు పిల్లవాడివైపు చేతులు జాపుతూ "వాణ్ణి ఇటు అందించండి !'' అంది.

మదన్ ఉయ్యాలవైపు చేతులు జాపి, మళ్ళీ యెందుకో వెనక్కు లాక్కున్నాడు...మళ్ళీ కాస్త ధైర్యం చేసి, వెళ్ళి పిల్లవాణ్ణి రెండు చేతుల్లోకి తీసుకున్నాడు...చచ్చిపోయిన యెలుకను తీసి ఆవల పారవేయడానికి పట్టుకున్నట్లుగా, శరీరానికి తాకకుండా, జాగ్రత్తగా చేతుల్లోనే ఉంచుకుని, ఇందు ఒడిలోకి అందించాడు...

''ఇక మీరు బయటికి వెళ్ళండి !'' అంది ఇందు అతనితో.

''నేను బయటి కెందుకు వెళ్లాలి ?'' అన్నా డతను.

ఇందు కాస్త తటాపటాయిస్తూ, సిగ్గుతో ''అబ్బ ! వెళుదురూ ! మీ ముందు పాలివ్వడానికి నాకు సిగ్గు వేస్తుంది'' అంది—

మదన్ అర్థం కాని ధోరణిలో తల పంకిస్తూ, "అరే ? నాముందు పాలివ్వలేవా ;'' అంటూ బయటికి నడిచాడు...బయటి మొత్తల్లోకి వెళ్ళి వెనక్కి తిరిగి ఒకసారి ఇందువైపు చూశాడు...ఇప్పుడు కనిపించినంత అందంగా అతనికంటికి ఆమె యెన్నడూ కనపడలేదు.

* * * *

అర్జంటుగా రమ్మని కొడుకు రాసిన ఉత్తరం చూసుకుని సెలవు మీద, బాబూ ధనీరాం ఇంటికి వచ్చేవరకు, చూసేవాళ్ళకు సగం అయినట్టు

కనిపించాడు...ఇందు తన చేతులతో మనమడిని ఆయనకు అందించింది... ఆయన సంతోషంతో విప్పారిపోయాడు.

ధనీరాం కడుపులో యేదో పుండు పుట్టిందని డాక్టర్లు చెప్పారు... ఇరవై నాలుగుగంటలూ తగని బాధతో ఉంటున్నాడు...మనుమడు దగ్గర లేకుండా ఉన్నట్లయితే ఆయన పరిస్థితి మరింత దిగజారి ఉండేదే. ఇంటికి వచ్చాక మనమడిని చూస్తూ కొంచెం తేలిక పడుతున్నాడు. చాలా వైద్యాలు చేయించారు.,.డాక్టర్లు తమ యావచ్ఛక్తినీ వినియోగిస్తూ, చిట్టచివరి ప్రయత్నంగా, రోజూ పదిహేను ఇరవై మందులు వాడుతున్నారు.

వచ్చిన నాటినుంచే ఆయన శరీరంకు చెమట అతిగా పడుతున్నది... ఒక్కోసారి వంటిమీద బట్టలు తడిసిపోతుంటే రోజూ నాలుగైదుసార్లు బట్టలు మార్చడం జరుగుతుండేది...బట్టలు విడిపించటంతోనే మదన్ స్వయంగా వాటిని బకెట్‌లోవేసి పిండి, శుభ్రం చేస్తుండేవాడు. పిండిన చెమటతో బకెట్ నిండిపోయేది...రాత్రిపూట వాంతి అవుతూండేది... ''జిహ్వా రుచి చెడిపోయింది... కొంచెం వాము తెచ్చిపెట్టమ్మ'' అన్నాడు కోడలితో...ఇందు చప్పున వెళ్ళి పట్టుకొచ్చింది...లేచి, దా న్నందుకుని నమలుతూన్నాడో లేదో, వాంతితో దగ్గు తెరవచ్చిపడ్డది. దాంతోపాటు రక్తం పడిపోయింది...మదన్ తిన్నగా, ఆయన్ని తలాపుకు చేర్చి అలా పడుకోబెడుతూ ఉండగానే, ఆయన ప్రాణం ఆకాశంలోకియెగిరిపోయింది... అక్కడ ఆయన తన వజ్రపుష్పాన్ని గుర్తు పట్టగలిగాడు.

పసివాడు పుట్టి పాతిక రోజులై వుంటుందేమో...ఇందు పచ్చిబాలెంత అయివుండికూడా, గుండెలు బాదుకొని యేడ్చింది...మదన్‌కు, తను చని పోయినట్టు ఊహించుకున్న ఆనాటి దృశ్యమే అచ్చం గుర్తు వచ్చింది.... యీ దృశ్యంలో ఉన్నతేడా అల్లా ఇందు గాజులు పగుల గొట్టుకోకుండా గాజులు తీసివేసుకుంది. నెత్తిమీద పొయ్యిలో బూడిదతీసి చల్లుకోలేదుకాని, నేలమీద మట్టిని చల్లుకుంటూన్నది....ఇందు ముఖం వికృతమైపోయింది.

వెంట్రుకలు ముఖం నిండా చెదిరి భీభత్సంగా వున్నాయి. "నా కొంప ఆరింది" అనటానికి బదులు "మా కొంప మునిగింది" అంటున్నది విషాద కర స్వరంతో.

వ్యవహారం అంతా ఇలాంటి సంగతు లిదివరకేమీ తెలియని మదన్ బుజాలమీదనే పడ్డది....పొద్దుపొడిచి, నలుగురు చేరుతున్నాకొద్దీ, మదన్ హృదయం సుళ్ళు తిరగసాగింది...హృదయం పగిలినట్టనిపించి. ఇంట్లోంచి బయటికి వెళ్ళి, నదీతీరానికి చేరి, అక్కడి మెత్తనిమట్టిమీద పడుకున్నాడు. భూమాత అతన్ని ఆ కాసేపూ హృదయపూర్వకంగా తన ఒళ్లోకి తీసుకుని లాలించింది...చిన్నవాళ్ళు కుందన్, పాషీ, చిట్టి తల్లిలేని సమయంలో గూటిమీద 'రాబందులు దాడిచేస్తే పిచ్చుకపిల్లలు ముక్కులు పైకెత్తి చూఁ చూఁ అని గోలపెట్టినట్టు యేడుస్తున్నారు...ఈ పసిపాపలను తన రెక్కలక్రిందవుంచి ఆశ్రయం ఇవ్వగలిగింది ఇందు ఒక్కతే. నది గట్టున పడుకుని మదన్ ఆలోచిస్తూ "యీ ప్రపంచం ఇక తనకు లేదనీ, తను బ్రతకటం, బ్రతుకులో మళ్ళీ యెప్పుడన్నా చిరునవ్వటం జరుగుతుందా అనీ" తనలో తనే ప్రశ్నించుకున్నాడు. అక్కడినుంచి లేచి ఇంటికి వచ్చాడు.

మెట్లక్రింద వున్న స్నానాలగదిలో చొరబడి తలుపులు బిగించుకుంటూ, మదన్ మళ్ళీ ఒకసారి ప్రశ్నించుకున్నాడు...నే నెప్పుడన్నా నవ్వగలనా ?" అని...ఒక్కసారి తనలోతనే కిలకిల నవ్వుకున్నాడు వికటంగా...తండ్రి శవం పక్కనే వరండాలో పడి, వుంది.

తండ్రికి అగ్ని సంస్కారం జరిపేటప్పుడు, చితిమీది శవం ముందు సాష్టాంగంగా పడి నమస్కరించాడు మదన్. తన జన్మదాతకు తుది నమస్కారం అర్పించాడు....అతనికి యేడుపు కరుడుగట్టుకునిపోయింది. ఇతని స్థితికి శ్మశానం దాకా వెంటవచ్చిన బంధువులూ, వీధివాళ్లూ అంతా నిర్విణ్ణులైనారు....పెద్దకొడుకు కావటంవల్ల హిందూ సాంప్రదాయం ప్రకారం మదన్ చితికి నిప్పంటించి, కపాల మోక్షక్రియ జరిపాడు. వెంటవచ్చిన

స్త్రీలు శ్మశానంలోకి రాకుండా బయటనే ఉండి, అక్కడున్న బావివద్ద స్నానాలు పూర్తి చేసుకుని ఇండ్లకు మళ్లారు.

ఇంటికి వెళ్లాకకూడా మదన్, కంపం తగ్గలేదు. తీవ్రంగా వణికి పోతున్నాడు...భూమాత తాత్కాలిక పద్ధతిలో దత్తం చేసిన తనశక్తిని అతనివద్దనుంచి తిరిగి లాక్కున్నది....మృత్యువుకన్నా బలంగా పొదివి పట్టుకునే బలీయమైన ఆశ్రయం ఊత అతనికి కావలసివచ్చింది...భూమాత పుత్రిక జనకరాజ దుహితలా, ఇందు ఉద్భవించి, తన బాహువులమీద ఈ పితృవిహీనుడికి ఆశ్రయం యిచ్చింది....ఆ రాత్రి, ఇందు తన సహన శక్తితో, తన యావత్తూ మదన్‌మీద పణంగా పెట్టడంవల్ల అతను తేరుకో గలిగాడు కాని, లేకుంటే, యీ మహాదుఃఖప్రవాహంలో, అతను రేణువై, అణువై, పరమాణువై మునిగి ప్రవహించి శూన్యం అయేవాడు——

అనంతరం, పదినెలలకి సరిగ్గా మళ్ళీ ఇందుకి మరొక మగపిల్ల వాడు జన్మించాడు...భార్యను ఈ నరకాగ్నికి గురిచేస్తూ మదన్ తన తీవ్ర దుఃఖాన్ని విస్మరించగలిగాడు....పెళ్ళి తరవాత, ఇందు సహారాన్‌పూర్ వెళ్ళినప్పుడు మరికొన్నాళ్ళు ఆమెను అక్కడే ఉంచినట్టుంటే, తండ్రి ఇంత త్వరగా మరణించేవాడు కాదేమోనని అప్పుడప్పుడూ అనుకుంటుంటాడు మదన్ తండ్రి దుఃఖంవల్ల యేర్పడ్డమనస్తాపం, ఉపశమింపచేసుకోవడానికి ఇందుని సాధనంగా ఉపయోగించుకునేవాడు....లోగడ అనివార్య కారణాల వల్ల మూసివేయబడ్డ వ్యాపారం, గత్యంతరంలేని స్థితిలో తిరిగి ప్రారంభించ వలసి వచ్చింది. కాలం గడిచిపోతున్నది....

ఈ రోజుల్లో, కొన్నాళ్ళపాటు ఇందు పుట్టింటికి వెళుతూ పెద్దపిల్ల వాణ్ణి తండ్రిదగ్గరే వుంచి, చిన్నవాణ్ణి గుండెలకు హత్తుకుని వెంట తీసు కుని పోయింది....ఏమీ తెలియని పెద్ద పసివాడు చేసే గోల అంతింతకాదు. ఒక్కొక్కప్పుడు తండ్రి సహించేవాడు, మరొక్కప్పుడు తీవ్రచర్య తీసుకునే వాడు.

"ఇక్కడికి కూడా నా పిల్లవాడి యేడుపు వినవస్తున్నది...అతన్ని మీరుగానీ, మరెవరూగానీ కొట్టటం లేదుగద?" అంటూ ఇందు పుట్టింట్లో వుండి భర్తకు వుత్తరం రాసింది. మదన్‌కు తీవ్రమైన ఆశ్చర్యం కలిగింది. నిరక్షరాస్యురాలైన ఒక సంస్కారవిహీన స్త్రీకి....ఇలాంటి హృదయం..., ? ఇంతటి ప్రేమ ప్రదర్శనాపూరితాభిప్రాయాలు...ఎలా సంభవం?'' అనుకున్నాడు. ''ఇవికూడా ఎవరన్నా నేర్పితే వల్లించే మాటలేనా!'' అని మదన్ తనలో తనే ప్రశ్నించుకున్నాడు.

సంవత్సరాలు దొర్లిపోతున్నాయి. ఇల్లు వెళ్ళగా విలాసజీవనం, కోరికలూ, సుఖాలూ తృప్తిగా కొనసాగటానికి తగినంత డబ్బు మదన్‌కు ఎన్నడూ చేతికి రావటంలేదు. ఇల్లు గడవడానికి సరిపోను లోటులేకుండా మాత్రం ఉంటున్నది...అనుకోకుండా తటస్థపడే తప్పనిసరి అత్యవసర వ్యయాలకుమాత్రం త్రొక్కులాటగానే ఉంటున్నది.

కుందన్‌కు కళాశాలాప్రవేశం నిమిత్తం రుసుము కట్టవలసివచ్చినా, చిట్టి పెళ్ళికి లగ్నం పెట్టుకోవలసివచ్చినా,...మదన్ ముఖం వేళ్లాడేసుకుని కూచునేవాడు...ఇందు చిరునవ్వుతూ "యెందుకండీ మీరు చింతపడుతున్నట్టుంది?'' అనేది.

మదన్ ఆశాదృష్టులతో ఆమెను చూస్తూ "చింత యెందుకుండదూ? కుందన్ బి. ఏ. ప్రవేశ రుసుం కట్టాలి...చిట్టికి..." అంటూండగానే ఇందు నవ్వుతూ "ఇలారండి!" అంటే మదన్ గొర్రెపిల్లలా ఆవిణ్ణి అనుసరించాడు...మదన్‌కూడా స్పృశించడానికి అధికారంలేని, అత్తగారినాటి చెక్కపెట్టె దగ్గరకు చేరతారు....అప్పుడప్పుడు కోపం వచ్చినప్పుడు మదన్ అంటూండేవాడు గదాంకే, "నీవు చనిపోతూ కూడా యీ పెట్టెను గుండెలపైన పెట్టుకునే పోయేట్టుందే?'' అని.

"ఆ...తీసుకునే పోతాను'' అంటూండేది ఇందు. చెక్కపెట్టెలోంచి, అవసరమైనంత డబ్బు తీసి యిచ్చేది ఇందు.

"ఇదెక్కడిది ?" మదన్ ప్రశ్న....

"ఎక్కడినుంచో వచ్చినవి. "మీ కెందుకు ప్రశ్నా ?" ఇందు జవాబు.

"అహఁ !....అయినా అడుగుతున్నాను !"

"ప్రశ్న వద్దు....మీరు వెళ్ళి పని జరుపుకోండి !" ఇందు సమాధానం....మదన్ చెప్పక తప్పదని పట్టుబట్టిన మీదట—

—"నేనో మంచి ధనవంతుడితో నేస్తం కట్టాను. "అనేది ఇందు....ఇందు నవ్వుతూ, అబద్ధాల పరిహాసం ఆడుతున్నదని మదన్‌కు తెలిసినప్పటికీ, ఈ పరిహాసం అతనికి నచ్చకపోయేది.

ఇందు మళ్ళీ అనేది. "నేను గజదొంగను. మీకు తెలియదేమో...? దాన ధర్మాలు చేసే దొంగను....ఒక వైపు సొమ్ము దోచుకోవటం, మరొక వైపు దాన్ని బీదా బిక్కీ దాన ధర్మాలకు వ్యయం చేయటం...."

ఇదే విధంగా చిట్టి పెళ్ళి కూడా అయింది. ఇందు దోచుకున్న నగలు చాలా అమ్ముడుపోయినై....అప్పు పెరగనూ పెరిగింది....తీరనూ తీరింది—

కుందన్ పెండ్లి కూడా ఇలాగే జరిగింది....ఈ పెండ్లిండ్లకు ఇందే పీటలమీద కూచుని తల్లి బాధ్యత వహించింది....ఎవ్వరికీ కనిపించకుండా అదృశ్యంగా ఆకాశంమీద వున్న ధనీరాం, ఆయన భార్య మాట్లాడుకుంటుండేవారు....ఇద్దరూ ఒక్కోసారి తగాదా కూడా పడుతోండేవాళ్ళు....

"మీరు కోడలి చేతిమీదుగా చాలా అనుభవించారు... వాళ్ళ సుఖం కూడా చూశారు....దురదృష్ట జాతకురాలిని నేనే. యేమీ చూడకుండా వచ్చేశాను" అనేది ధనీరాం భార్య....వీళ్ళ తగాదా బ్రహ్మ విష్ణు మహేశ్వర మూర్తుల వద్దకు కూడా వెళ్ళింది....వీరు తల్లి వైపే తీర్పు నిచ్చారు.... ఫలితంగా ఆవిడకి మళ్ళీ భూలోక యాత్ర....ఆ యింట్లోనే జన్మ....ఇందుకు స్త్రీ శిశువు జననం....

ఇందు చాలా నిక్కచ్చి మనిషి కూడా...సిద్ధాంతం మీద గనక పోట్లాట వస్తే మరిదినీ, ఆడబిడ్డను మాత్రమే కాక, భర్తను కూడా ఎదిరించి నిలబడుతుంది...మదన్‌కు అమితంగా కోపం వచ్చి, తన మాట నెగ్గనప్పుడల్లా ఇందుని హేళనచేస్తూ "అబ్బ! దిగింది భూలోకంలో సత్య హరిశ్చంద్రుడి పుత్రిక" అంటూంటాడు....ఇందు మాటలు అప్రీతికరంగా ఉన్నా అందులో సత్యం ఉంటుందన్నది మాత్రం మదన్ విశ్వాసం——

ఆవిడ ధర్మాతిరిక్తురాలు కాదని ఇంట్లో అందరి ధృఢమైన అభిప్రాయం. అందుకనే మదన్‌తో సహా ఇంట్లో అంతా ఇందుకు నైతికంగా భయపడుతుంటారు. జగడం ఎంతగా పెరిగినా, మదన్, తన భర్త అధికారంతో తాత్కాలికంగా ఇందు నోరు కట్టించినా, చిట్టచివరికి అంతా ఇందు అభిప్రాయాన్ని మన్నించి, దానినే ఆచరణలో పెట్టడం, ఆవిడని క్షమాపణ అడగడం పరిపాటి అయింది.

మళ్ళీ ఒక కొత్త పెళ్ళికూతురు ఇంట్లో ప్రవేశించింది....కుందన్ భార్య...భార్యా స్థానంలోనే వచ్చింది...ఇందు భార్యా స్థానం అలంకరించిన స్త్రీ మూర్తి...ఆవిడ తోడి కోడలు, రాణి కేవలం స్త్రీ రూపంగల భార్య మాత్రమే...రాణి మూలంగా అన్నదమ్ము లిద్దరిలో కలతలు యేర్పడ్డాయి. పిన తండ్రి మధ్యవర్తిత్వంలో, ఆస్తి విభాగాలు జరుపుకున్నారిద్దరూ.... పిత్రార్జితమే గాక, ఇందు పుట్టింటినుంచి వచ్చిన స్వంత ఆస్తి కూడా భాగాలలోకి చేరాలని తమ్ముడు పట్టు పట్టాడు....ఇందు మౌనంగా ఉండి పోయింది.

ఆస్తి అంతటిలో సగ భాగం పొందీ, ప్రత్యేకంగా ఉంటూ కూడా, కుందన్ రాణీ సరిగా దాంపత్య జీవితం ఏకాభిప్రాయంతో నిర్వహించలేక పోతున్నారు....ఇందు స్వంత యిల్లు కొద్దిరోజులలోనే, సంసారానందంతో మెరిసిపోయింది.

ఆడపిల్ల పుట్టిం తరవాత ఇందు ఆరోగ్యం సరిగా వుండకపోయింది. అహర్నిశలూ, పిల్ల ఆవిడ రొమ్ములకు అంటుకునే వుంటుంది. కాని

వదలదు... మాంసం ముద్దగా భావిస్తూ, అంతా అసహ్యించుకునే స్థలంలో, ఇందు మాత్రం హృదయం ప్రత్యక్షమై దగ్గిర చేర్చుకొనేది....ఒక్కోసారి ఆవిడకూడా పూర్తిగా విసుగెత్తి పిల్లను ఉయ్యాల్లో విసిరి వేస్తూ "నీవు నన్ను బతకనిస్తావా లేదా నే? అంటూండేది. పిల్ల మరింత హోరు పెట్టి యేడుస్తుంటుంది.

ఇందుతో సంసారం సాగించడం మదన్‌కు చికాకు అనిపిస్తూ, క్రమంగా దూరం కాజొచ్చాడు....ప్రపంచంలో ఆడవాండ్లంతా ఒకేతీరుగా కనిపిస్తున్నారే కాని, ఇలా కాకుండా, నిత్య యౌవనంతో తులతూగే స్త్రీ నిమిత్తం మదన్ చేసే ప్రయత్నాలు ఫలించటం కానీ, అలాంటి స్త్రీ లభించడం కానీ, పెళ్ళయిన దగ్గరనుంచీ ఇంతవరకు జరగనేలేదు. మదన్‌లో దాంపత్య జీవిత సంబంధమైన అసంతృప్తి తెలియకుండానే పెరిగిపోతున్నది....వ్యాపారం కూడా వెనకటికన్నా బాగానే పెరిగింది. తండ్రి దాటిపోయాక అతన్ని అడిగే వారెవరూ లేనంత స్వాతంత్ర్యం లభించటంతో, ఇందు దగ్గరనుండి డబ్బులు వ్యయం చేయటం అమితంగా జరుగుతోంది.

పొరుగింటాయన గేదె మళ్ళీ మదన్‌ని మురకచూస్తూ అరవటం మొదలెట్టింది....యీ పర్యాయం నిర్విరామంగా అరుస్తోంది. మదన్ పెళ్ళి నాటి రాత్రి వున్న గేదె అమ్ముడుపోయింది. ఇది మరో కొత్తది వచ్చింది. కాని ఇంటి యజమాని మాత్రం బ్రతికే వున్నాడు. పొరుగింటాయనతో కలిసి, మదన్, వెలుగునీడలు, విచిత్రమైన పద్ధతిలో క్రమం లేని స్వరూపాలను తాల్చే స్థలాలకు వెళుతూ వుండేవాడు....గమ్యస్థలం అంధకార సంయుతమైనా, పైన యెక్కడినుంచో వెలుగురేక వచ్చి అమాంతం ఆ అంధకారాన్ని చీలుస్తోంటుంది...దేన్నిగురించీ సరియైన నిర్దిష్ట స్వరూపం గోచరించదు...చంకలోంచి షరాయిలేచి, ఆకాశానికి అమాంతం యెగిరి పోయినట్టూ, తొడుక్కునేకోటు హఠాత్తుగా ముఖంమీద కప్పుగా పడి ఉక్కిరిబిక్కిరి చేస్తున్నట్టూ చిత్రంగా అనిపిస్తుంది. కొన్నాళ్ళకు అచ్చంగా,

కాంతి పటలమే కనిపిస్తూ, అందులో స్పష్టమైన ఒక స్వరూపం నిలబడి, చేతితో అందుకోబోతే అందకుండా మాయమవుతూ, వుండీ లేనట్టుగా భావనకు వస్తుంది. ఈ భావం వచ్చినప్పుడు, వెనక కుక్క అరుపు వినవస్తూ, పైనుంచి వినవచ్చే రాబందుల రెక్కల చప్పుడుక్రింద అదృశ్యమై పోతుంటుంది.

ఈ స్వరూపాల ఆకార వికారాలూ, ఒడ్డు పొడుగులూ, అవగతం అవుతున్నాయి. కాని, ప్రతిచోటా, కళాకారుడు పొరపాటుగా గీసిన గీత ప్రతి చిత్రంలోనూ కనిపిస్తూనే వుండేది...అదీ కాకుంటే, హాసమన్నా వికృత స్థాయిలో అగుపిస్తుండేది...అలాంటిది లేని స్థలం, మచ్చలేని మహా లోకం, చిరునవ్వుల శృంగారం నిమిత్తం మదన్ నిర్విరామంగా ప్రయత్నిస్తూ పరిశోధనలు సాగిస్తూనే ఉన్నాడు.

పొరుగింటాయన భార్యతో వివాదపడుతూ మాటామాటా అనుకుంటూంటే ఆవిడ మదన్‌ను ఆదర్శభర్తగా తన భర్తకు చూపిస్తూ, అలా నీ వెందుకు ఉండలేవని ముఖానకొట్టి మాట్లాడింది...మళ్లీ తిప్పి ముఖాన విసిరికొట్టాడు ఆమె భర్త...ఏదో రక్తరంజిత యుద్ధరంగంలా తయారైంది ఇల్లు. దీని ఫలితం, ఆ యింటావిడ చెవులూ, కండ్లూ, ముక్కుమీద ప్రత్యక్ష చిహ్నాలతో కనిపిస్తోంది...ఆవిడ అనంతమైన శాపనార్ధాలు పెడుతూ తట్ట లోని ధాన్యం విత్తనాలను గిరవాటు వేసింది...ఇందు నున్నని వాకిట్లో అవన్నీ వెదబెట్టినట్లు పడ్డాయి...

లోగడ ఒకటిగా వున్న ఇందు ఇప్పు డిద్దరై కూచుంది. ఒకటి ఆమె బాహ్యస్వరూపం...మరొకటి, కనిపించకుండా ఆవిడ స్వరూపం చుట్టూ గీసిన కంపించే రేఖ...

మదన్‌కు ఇల్లు వదిలి బయట తిరగటం అధికం అయింది... శుభ్రంగా స్నానం చేసి, మంచి దుస్తులు వేసుకుని, సుగంధ ద్రవ్యాలతో నింపిన తాంబూలం పుక్కిట్లో వుంచుకుని, మరీ బయటకు వెళుతుంటాడు.

ఒకనాడు మదన్ బజారునుంచి ఇంటికి వచ్చేవరకు ఇందు పరిస్థితి అదో రకంగా వుంది...ఆవిడ ముఖంమీద చక్కగా పౌడర్ అద్దుకుని, చెక్కిళ్ళపై కాంతులు నిండే విధంగా అగరుచుక్క ధరించి వుంది. లిప్‌స్టిక్ వేసుకోకున్నా, స్వయంగా ఎర్రని అధరాలు కావటంతో అందం మరింత శోభించింది...కురులు మడిచి, జడవేసుకున్న పద్ధతిచూస్తే, మదన్ చూపులు అక్కడే చిక్కని బయటికి రాకుండా నిలబడ్డాయి.

''ఏమిటివాళ విశేషం?'' అన్నాడు మదన్ ఆశ్చర్యంగా. ఇందు మదన్ దృష్టినుండి తప్పుకోవాలని యత్నిస్తూ ''యేమీ లేదు...ఇవ్వాళ కొంచెం విశ్రాంతి లభించింది'' అంది.

వివాహం అయి, పదిహేను సంవత్సరాల సుదీర్ఘకాలం గడిచాక, ఇవాళనే విశ్రాంతి చిక్కింది ఇందుకు. అదైనా ముఖంమీద సన్నని ముడతలు పడడం ఆరంభమైన తరుణంలో, ముక్కుమీద నల్లని మచ్చ పడి, జాకెట్టుక్రింద, పొత్తికడుపు పై భాగంలో నడుము చాయగా కొవ్వు తేలి, రెండు మూడు దిండ్లలాంటి స్థానాలు యేర్పడిన వయస్సులో విశ్రాంతి చిక్కింది. వయోస్థితికి సంబంధించిన యీ లోపాలు ఒక్కటికూడా రవ్వంత బయటికి కనిపించకుండా కట్టుదిట్టంగా అలంకరించుకుంది ఇందు. జగదేక సౌందర్యవతిగా వెలిగిపోతున్నది.

మదన్ ఆలోచించాడు. "అది అలా అయే వీలేలేదు'' అని గొణుకున్నాడు తనలో తనే. అతన్ని యెవరో ఢీకొని, తగిలినట్టనిపించింది. మళ్లీ ఒక్కసారి వెనక్కితిరిగి ఇందువైపు చూశాడు.

వ్యాపారస్థులు గుర్రాలను బేరం చేసేప్పుడు, మంచి పుటకగల గుర్రాన్ని చూసినట్టు సావకాశంగా చూశాడు....గుర్రంతోపాటు యెర్రని కళ్లెం కూడా ఉంది....చిత్రకారుడు గీసిన తప్పుడు గీత ఉన్నప్పటికీ, త్రాగుబోతు కండ్లకు అది కనిపించినట్టుంది....ఇందు సహజంగా సౌందర్యవతి.... పదిహేను సంవత్సరాలు సాంసారిక గృహస్థ జీవితం గడిచినా, ఇవాళ

కూడా, ఆవిడ అందరికన్నా అందంగా వుండి అందర్నీ తుడిచివేసేట్టుగానే వుంది.

మదన్‌కు ఒక విధంగా జాలి కలుగుతూ మనస్సు కరగుతున్నది.... కాని మరో వైపు తీవ్రమైన భయం ఉబుకుతున్నది.

బయట ఆకాశంమీద యెటు దృష్టి సారించినా మేఘాలు కనిపించటం లేదు కాని, వర్షం మాత్రం ప్రారంభమైంది....ఇటు ఇంట్లో గంగ మహోద్ధృతమైన వరద పొంగులా వుంది....ఈ వరద గట్లను ముంచెత్తి, తెంచేసుకుని, చుట్టుపట్ల పల్లెలనూ పట్నాలనూ కౌగిలిలోకి చేర్చుకుంటున్నది....ఇదే తీవ్ర స్థితిలో ఈ గంగ ఉద్ధృతంగా ప్రవహిస్తుంటే చివరకు కైలాస పర్వతం కూడా దీని వరదలో మునిగిపోయేట్టుంది.... అంతా అనిర్వచనీయమైన మహోద్రిక్త దశ...

ఇటువైపు పసిపిల్ల అదే పనిగా యేడుస్తున్నది. ఇంతవరకూ యెన్నడు కనివినీ యెరగనంత యేడుపు....ప్రవాహంలో కొట్టుకపోతున్న మదన్ యేడుపు ధ్వని విని రెండు కండ్లు మూసుకున్నాడు....కండ్లు తెరచి చూసేవరకు పసిపిల్ల యువతిగా మారి ఎదట కనిపించింది....అది ఇందు స్వరూపం....అచ్చంగా తల్లికి కూతురు....కూతురికి మాత....కనుకొలకుల లోంచి, కరుణాదృష్టినీ, అధరకోణాల్లోంచి ఆప్యాయమైన చిరునవ్వునూ చిందిస్తోంది....ఎవరు ?

ఇదే గది....ఒకానొకనాడు ఇక్కడే, సుగంధ ధూపం మదన్‌ను సుడి త్రిప్పింది....ఇప్పుడు ఇక్కడే సౌందర్య పరిమళం ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది.....తుంపరజల్లు, పెద్ద వర్షంకన్నా ప్రమాదకరం....ఇందువల్ల పైన కురిసే నీరు, ఇంటి తొర్రలోంచి జారి, ఇందు—మదన్‌ల మధ్య వెలుస్తోంది. కాని, మదన్ మధుపాయి అవుతున్నాడు....ఆ మాదక స్థితిలో అతని కండ్లు మూసుకపోతున్నాయి....నరాలలో వాంఛాశక్తి తీవ్రమై, మానవ శక్తిని త్రోసి పారవేస్తున్నది మరి!...

"ఇందూ!" అన్నాడు మదన్...ఈ పిలుపు, పెళ్ళి రాత్రి ప్రథమంగా పిల్చిన స్వరంకన్నా రెండు రెట్లు ఉద్విగ్నంగా వుంది.

ఇందు అతన్ని చూస్తూ "ఏమండీ!" అంది...ఈ స్వరం నాటికన్నా రెండు రెట్లు ఉద్విగ్నత లోపించి వుంది.

ఆనాటి రాత్రి పండు వెన్నెల...ఇవాళ రాత్రి అమావాస్య చీకటి.

మదన్ ఇందువైపు చేతులు జాపాలనుకుంటూ ఉండగానే, ఇందు స్వయంగా అతని చేతుల్లో వాలిపోయింది. మదన్ తన చేత్తో ఇందు గడ్డాన్ని పుచ్చుకుని, ముఖాన్ని తనవైపుకు పైకి తిప్పుకున్నాడు. తదేకంగా చూశాడు...ఇందులో, తను పొందింది యెంత? పోగొట్టుకున్నది యెంత? అని ఆలోచిస్తున్నాడు...నల్లపడుతూ, మ్లానం అవుతూవున్న మదన్ ముఖాన్ని ఒక్కసారి చూసింది ఇందు...కండ్లు మూసుకుంది.

మదన్ ఉలిక్కిపడి చూస్తూ, "అదేమిటి యిందూ: నీ కళ్ళు ఎర్రపడి వాచిపోయి వున్నాయేం?" అన్నాడు.

ఇందు పసిపిల్లవైపు సైగ చేసి చూపిస్తూ "యీ అల్లరి పిల్ల రాత్రంతా నిద్ర లేకుండా చేసింది." అంది.

మరో క్షణంలో యేమవుతుందో చూతామని జాగ్రత్తగా నిరీక్షిస్తున్నట్టుగా పసిపిల్ల యేమాత్రం యేడవకుండా, కిమ్మనకుండా చూస్తున్నది... బయట వర్షం వెలిసింది...నిజంగానే చినుకులు పడటం అయిపోయింది. మదన్ శ్రద్ధగా ఇందు నేత్రాలను పరిశీలిస్తూ "సరే కాని,—యీ కన్నీళ్లేమిటి?" అన్నాడు.

"ఇవి ఆనంద భాష్పాలు...యీ రాత్రి సర్వస్వం...నాదే..." అంటూ ఇందు సమాధానం చెప్పింది...చిత్రంగా నవ్వుతూ మదన్ శరీరం మీద వాలి అంటుకపోయింది....మదన్ మధురానుభూతి వహిస్తూ "ఎన్నో సంవత్సరాల అనంతరం నా వాంఛ నేను అనుకున్నట్లుగా ఫలించి, ఆశలు పండినవి...ఇందూ! నేను మొదటినుంచీ కోరుకునేదేమిటంటే—"

ఇందు అతన్ని మాట్లాడనీకుండా తను మాట్లాడుతూ "మీరు కోరుకునేదేమిటో నాతో యెన్నడు చెప్పనే లేదు...అది గాక, మొదటి రాత్రి నేను మిమ్మల్ని ఒకటి ప్రసాదించమని అడిగాను. జ్ఞప్తిలో వుందా?" అన్నది.

"అవును. జ్ఞప్తిలో ఉంది. "మీ దుఃఖాన్ని నా కిచ్చెయ్యండి" అన్నావు. అంతేనా!" అన్నాడు మదన్—

"అవును. మీరు మాత్రం నన్నేమీ అడగలేదు." అన్నది ఇందు—మదన్ విభ్రాంతితో "నేనా? నేను నిన్నేం అడగనూ? నేను అడగవలసిందీ, నా గ్గావలసిందీ అంతా, అడక్కుండానే నీ విచ్చావ్. నా వాళ్ళందర్నీ ప్రేమించావ్! తల్లిలా పోషించావ్! వాళ్ళకు విద్యాబుద్ధులు చెప్పించావ్. వాళ్ళ పెళ్ళీ పేరంటాలూ చేశావ్! ముద్దులు మూటగట్టే రత్నాల్లాంటి ఈ పాపలను కన్నావు! ఇదంతా నీవు నాకు ప్రసాదించిందేకాదూ?" అన్నాడు.

ఇందు వ్యగ్రభావంతో ఇలా అన్నదిగదాంటే, "నేనుగూడా ఇట్లాగే అనుకుండేదాన్ని. కాని కొన్నాళ్ళబట్టే నేను మీ కియ్యలేకపోయిందిగూడా ఒకటి ఉన్నదని అనిపించింది!"

"నా కర్థం గావటం లేదు ఇందూ!" అన్నాడు మదన్—

"ఏమీ లేదు లేండి!" అని ఒక్క క్షణం ఆగి మళ్ళీ ఇలాఅన్నది. "నేను మీకు యివ్వకుండా మరొకటి అట్టిపెట్టి ఉంచుకున్నాను!"

"ఏమిటది?"—

ఇందు కాసేపు మౌనంగా ఉండి, ముఖాన్ని తిప్పుకుంటూ "మీరు కోరుకున్నట్టుగా సుఖాన్ని ఇవ్వలేదు! నా అభిమానం, నా సంతోషం, వీటిని ఇయ్యలేదు! నేను అవ్వాళ అడిగినట్టుగానే మీరుగూడా 'నీ సుఖాన్ని నా కియ్యాలి' అని నన్నడిగిఉంటే నేను..." అంటూ ఇకపైన మాట్లాడజాలకపోయింది—ఆమె కంఠం రుద్ధమైంది.

మళ్ళీ రెండు నిమిషాల పిమ్మట కళ్ళు తెరిచి భర్తను చూసింది—
"మీ కియ్యటానికి ఇప్పు డిక నా దగ్గర ఏమీలేదు!" అంటూ నిట్టూరుస్తూ మళ్ళీ కళ్ళు మూసుకుంది ఇందు.

కౌగిలించిన మదన్‌చేతులు క్రమంగా సడలి పట్టు తప్పిపోయినై అతను నిలువునా భూగర్భంలోకి, అగాధంలోకి కుదించుకుపోయాడు!— విద్యా సంస్కారంలేని స్త్రీ! ఈ మాటలు చిలకపలుకుల్లా ఎవరిదగ్గరన్నా నేర్చుకుందా!... కాకపోతే....

ఇప్పుడే, ప్రత్యక్షంగా, ఎదురుగానే, జీవితపుబట్టీలోంచీ ఈ లోహం బహిర్గతమైంది. అప్పుడే దీని మీద సమ్మెట పోట్లు పడుతున్నాయి! కొలిమి నిప్పులో కాగిపోతున్నది. నిప్పు రవ్వలు నలుదిశలా జిర్రున ఎగురుతూ సమ్మెట దెబ్బలు ఖంగుఖంగున వినవస్తున్నాయి!...రోదనా భూయిష్టమైన వాతావరణంలో ఉభయులూ ఒకరి కౌగిలిలో ఒకరు ఇమిడి పొయ్యారు...ఇందు మదన్ చేయి బుచ్చుకుని, లోకాంతరాలలోనికి వెంట లాక్కుని పోయింది...మానవుడు మృతిచెందాకమాత్రమే ప్రవేశించగలిగే లోకాలు అవి!!...

---

రచయిత:
"ముంతాజ్ ముఫ్తీ"
మూలకథ పేరు:
"ఆపా"

# అప్ప

అప్పుడప్పుడూ నాకు కూచుని కూచోబెట్టుకున్న అప్ప జ్ఞాపకం వస్తోంటుంది - అప్పుడు నాకెలా అనిపిస్తుందంటే, నా కండ్ల ఎదటనే, ఏదో ఒక మధ్యలో వెలుగుతూన్న చిన్న బిళ్లోరీ అద్దాన్ని ఇవ్వవస్తోందా! అన్నట్టుగా——

నాకు జ్ఞాపకం ఉంది. ఒకనాటిరాత్రి మేమందరమూ వంట ఇంట్లో మెదలకండా కూచుని ఉన్నాం. నేనూ, అప్పా;——అప్పుడు అమ్మీజాన్ గారి చిన్ని బుద్ధూ పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఈ రోజుల్లో ఇక్కడనే బుద్ధూ ఐదారు ఏళ్ళవాడిగా అయ్యుంటాడు——అనటానికి లంకించుకున్నాడు, "అమ్మీజాన్ నేను గూడా పెళ్ళి చేసుకుంటా!"

"ఓహో! ఇప్పట్నించేనా?" అమ్మీ ముసిముసి నవ్వులు నవ్వుతూ అన్నది——కొంచెం ఆగి మళ్ళా అన్నది. "మంచిది బుద్ధూ నీ పెండ్లి అప్పతో చేసెయ్యనా?"

"ఉహూఁ!"——బుద్ధూ తలూపుతూ అన్నాడు.

అమ్మ అనబొచ్చింది——'ఏం అప్పకేమైంది?"

"నేనైతే 'ఛాజూబాజీ'ని పెళ్ళి చేసుకుంటా!" బుద్ధూ కళ్ళు చమ్కాయిస్తూ అన్నాడు.

అమ్మీజాన్ అప్పకేసి ముసి నవ్వుతో చూసింది——మళ్లా అనటం మొదలెట్టింది. "ఏం చూడవోయ్. అప్ప ఎంత బావుందో?"——

''నేను చూపించనా ఎలా వుందో!'' వాడు బిగ్గరగా అరిచి నట్టన్నాడు—

''భలే! చూపిస్తే మరీ మంచిది'' అన్నది అమ్మీజాణ్—బుద్ధూ కళ్ళెత్తి నాలుగేపులా చూశాడు. ఏదో వెదుకుతూన్నట్టుగా, మళ్ళీ అతని దృష్టి పొయ్యిమీద వచ్చి నిల్చింది. పొయ్యిలో ఒక పిడక ముక్క కాల్తూ పడి ఉంది. బుద్ధూ దానివేపు సైగగా చూపిస్తూ, అన్నాడు ''ఇలాంటిది''- వెంటనే, వెలిగే ఎలెక్ట్రిక్ బల్బుకేసి వేలెత్తి చూపుతూ ఎలుగెత్తి ఏడవటం మొదలుజేశాడు!—''చూడూ. ఛాజూబాజీ ఇలాగే వుంటుంది!!!''— ఈ మాటమీద మేమందరం చాలాసేపు నవ్వుకున్నాం—ఇంతలోకే 'తసద్దఖ్ భాయీ' వచ్చాడు. అమ్మీ అన్నది ''తసద్దఖ్, బుద్ధూని నీ వడగాలి అప్ప ఎలా వుంటుందో!?''—తసద్దఖ్ వస్తూండగానే అప్ప చూసింది. చూసి మూతి ముడుచుకుని ఇలా కూచుంది. అంట్లు తోమేదానిలాగా!—

''అయితే, బుద్ధూ అప్ప ఎట్లా ఉందంటావ్?'' అన్నాడు తసద్దఖ్.

''చూపించనా, చూపించనా?'' అని అరుస్తూ పోయి బుద్ధూ, ఆ పొయ్యిలో కాలుతోన్న పిడక ముక్క తియ్యటానికి చెయ్యి జాపాడు. అయితే, అతని దాన్ని చేత్తో దీసీ మాకు చూపించాలనుకుంటున్నాడు. కాని, అప్ప గభుక్కున ఆతని చెయ్యి బట్టుకుంది. వేలు చూపి ఆడిస్తూ ఇల్లా అన్నది. ''ఊఁహ్'' అని;— బుద్ధూ ఏడవటానికి లంకించుకున్నాడు. అప్పుడు అమ్మీజాణ్ ''పిచ్చివాడా, దాన్ని చేత్తో ఎత్తేవ్!! దాంట్లో నిప్పు రవ్వ ఉన్నది''—

''అదైతే కాలిపోయిందేనమ్మా!'' ఏడుపు మొహం బెట్టి అన్నాడు బుద్ధూ.

''నా రత్నంగా?...నీకు తెలియదు బుద్ధూ. అందులో నిప్పున్నది! పైకి అవుపించదు.'' అన్నది అమ్మీజాణ్.

బుద్ధూ మరిచిపోయిన వాడిలా అడిగాడు ''ఏం అప్పా. దీంట్లో నిప్పుందా?'' అప్పుడు అప్పముఖంమీద చిన్నమంత ఎర్ర రంగు పరు

గెత్తింది. "నాకేం దెల్సు? ఆమె ఛర్రు మన్నట్టు బిగ్గరగా అన్నది. గొట్టం దీసి మండుతోన్న నిప్పును అనవసరంగా 'ఉఫ్' మంటూ ఊదటం మొదలెట్టింది....

ఇప్పుడు నేను గ్రహించాను, అప్ప హృదయపు గంభీరాలలో అదటూ వుంది. ఆ గంభీరాలు చాలా లోతుగానూ వున్నై. మాట ఉబికి వచ్చినప్పటికీ బైటపడలేనట్టుగా—ఇవ్వాళ బుద్ధూ ఎలాగా ఆకులాంటి తేలికైన మాట అన్నాడు—కాని నేనంటోండేదాన్ని—"అప్పా నీవు సరి, అలా కూచూనే ఉంటావా?" అని, అప్పుడామె చిరునవ్వు నవ్వి అంటుంది. "పిచ్చివాడా!!"—ఇక అక్కడినించీ తన పనిలో తగిలిపోతుంది. అదే పనిగా ఆమె రోజు రోజంతా నిమగ్నమయ్యే ఉంటుంది. ప్రతివాళ్ళూ ఇలాగే ఏదో ఒక పన్ని చెప్పారో, ఇక ఏక్‌దమ్మున ఆమె ఏ పనినైనా చెయ్యటానికి పడిపోతుంది—ఇటు బుద్ధూ కేకలేస్తాడు "అప్పా నా నూకలు" అని; అటు తండ్రి గుడ్లురుముతూ 'సజ్జాదా' ఇప్పటిదాకా 'చాయ్' ఎందుకు చెయ్యలా?" అని, మధ్యలో అమ్మీజాన్ లేస్తుంది. "అబ్బాయీ, చాకలి ఎప్పట్నించీ బైట నుంచున్నాడు?"—అప్పుడిక అప్ప అన్ని పనులనుంచీ పూర్తిగా మెదలకండా తప్పుకుంటుంది. ఇదైతే నేను బాగా ఎరుగుదును. కాని, ఆమె లేకుండా పోవటం ఎందుకు. ఆమె పని చేస్తోండగా చూస్తే అనిపిస్తుందిగదా, అసలు ఆమె పని చేస్తోన్నదని, లేదా ఇంత పని జేస్తోన్నదనీనూ! సరే. నాకైతే ఇదే అర్థమైతుంది ఆమె ఎప్పుడూ కూచునే ఉంటుంది అని; ఆమె ఇటునుంచి అటు మెడ తిప్పటానికే ఇంతసేపు పట్టుతుంది—ఇక నడుస్తోంటే నడుస్తున్నట్టే అనిపించదు—అదీగాక అప్ప ఎప్పుడైనా గలగల లాడుకుంటూ నవ్వటం విననేలేదు! ఎక్కువలో ఎక్కువ ఆమె చిరునవ్వే ఎప్పుడోగాని నవ్వదు. ఆమె అలా నవ్వినప్పుడు ఆమె పెదిమెలు విడిపోతాయి. ఆమె కళ్ళు తడిసిపోతాయి. అవును. అందుకనే ఈ మొత్తాన్ని కలిపి నేను గ్రహించగలను; అక్క ఊరికనే కూచుంటుంది. కొంచెమైనా కదల్దు. మరి అడుగువ కదపదు. దొర్లుకుంటూ

ఎలాగో ఇక్కడినించీ అక్కడికీ పడిపోతుంది. ఎల్లాగని? ఎవరైనా ఆమెను గెంటేశారా అన్నట్టు! ఈమెకు పడని 'సాహిరా' ఎంత మజాగా నడిచిందంటే, అదేదో 'దాద్రా' రాగపు తాళంమీద నాట్యం చేస్తోందా అన్నట్టు—

మరి: తన పినతల్లి స్వయం చెల్లెలు 'సాజూబాజీ'ని నడుస్తోంటే చూసి అయితే నేనెప్పుడూ అసహ్యించుకోకు—ప్రాణం కోరుకుంటుంది గదా 'బాజీ' హమేషా నా దగ్గర ఉండాలి అని; మరి నడుస్తూ నడుస్తూ అదేవిధంగా మెడ వంపుగా పెట్టి పంచమ స్వరంలో పలకాలి, అనీ;

"ఉన్నారమ్మా! ఎందుకమ్మా!?" ఆమె నల్లని కండ్ల కొసలు నవ్వుకోటం మొదలెట్టాయి చిన్నగా! బాజీ మాట మాటా నాకెంత ప్రియంగా ఉండేది—

సాహిరా, సుర్‌యా, మా ఇరుగు పొరుగుగా ఉంటూండేవారు. రోజల్లా వారిల్లు వారి గలగలలతో ప్రతిధ్వనిస్తోండేది ఎలా దేవాలయంలో గంటలు మ్రోగుతోంటాయో అలా!—సరే. నా ప్రాణం అనిపిస్తూంటుంది వారింటికే వెళ్ళి తిందామని. మా యింట్లో మటుకు ఉన్నదేఁవిటి? ఒక కూచుని వుండే అప్పా, ఒక "ఇది జెయ్యి అది జెయ్యి" అనే అమ్మీ, ఇక రోజల్లా హుక్కాను గుడగుడమంటూ పీల్చే తండ్రీ—

అవ్వాళ, నాయన అమ్మతో అంటూండటం విన్నా, ఇదైతే నిజం. నాకు హద్దులేనంత కోపం వచ్చింది. నాయన అనజొచ్చాడు. "సజ్జాదాతల్లీ తెలుస్తోందా సాహిరా ఇంట్లో చాలా గిన్నెలున్నాయి!"

"ఎందుకు?" అనడిగింది అమ్మీ.

"సరే! రోజల్లా గిన్నెలే మోగుతోంటాయి. ఇదీగాక వారి గలగల్లు సాగుతోంటాయి. ఉత్సవాలలో మాదిరిగా—" అన్నాడు.

అమ్మీ తనాయించి అడిగింది. "నాకేం తెల్సు. మీరైతే లోకుల ఇండ్లవైపే చెవులు నిక్కపొడుచుకుని కూచుంటారు."

''వహన్వే! యెక్కడైతే పిల్ల యువతిగా ఉంటుందో అక్కడ గిన్నెల సవ్వడి వస్తుంది. బజారు ఆ మలుపుదాకా ఈ సంగతి తెల్సి పోతుంది ఫలానా యింట్లో పడుచుదైన పిల్ల ఉన్నదీ అని, నా ఉద్దేశం ఇది;—కాని, చూడూ మా సజ్జాదాలో ఈమాట లేదు—'' నేను నాయన మాట విన్నాను. నా మనస్సు విప్పుకో మొదలెట్టింది.

పెద్దదైంది సజ్జాదా—చిత్తం అవును! ఏదో అయింది మా అమ్మాయి—అప్పుడు నా మనస్సుకు అనిపించేది, వెళ్ళి వంటింట్లో కూచుని వున్న అప్ప ముఖాన్ని వెక్కిరిద్దాం అని! అదే ఆలాపంతో ఆ రోజల్లా నేను అన్నమే తినలేదు సరిగదా మనసే మనసులో కుమిలిపోతుంది. నాయనకుమటుకేం తెల్సు. పాపం! హుక్కా తీసుకుంటాడు. గుడ్‌గుడ్ అంటాడు. లేదా, ఎక్కువకు ఎక్కువ ఏదో పుస్తకం విప్పుకుని కూచుం టాడు. 'గిట్‌మిట్‌గిట్‌మిట్' అంటోంటాడు. ఎవరో వంటపూటది మొక్క జొన్న పేలాలు వేయిస్తున్నట్టుగా!—ఇహ. ఇంట్లో ఇచ్చుకోలూ, పుచ్చు కోలూ అన్నీ తసద్దఖ్ ఖాయీయే చూసే వాడు - హృదయంగమంగా మాట్లాడేవాడు. తండ్రి యింట్లో లేకపోతేనా, గొంతెత్తి గంధర్వు లాల కించేటట్టుగా పాటలుకూడా పాడేవాడు - ఆ పాటలు రాసిన కవి ఎవరో ఎవరికి తెలుసు! అవును—

వారు ఊరికే ఊరికేనే కూచుని ఉన్నారు. కండ్లల్లో తేమ ఉంది. నాజూకైన ఆ చూపులలో నాజూకు సాఫీగా లేదు—అతను పాడేపాటలు విని అప్ప ఏదో ఒకమాట దగ్గర చిరునవ్వు నవ్వుకుంటుంది. మరి ఏమాటా లేకపోతే ఆమె బుద్ధూని చిన్న దెబ్బకొట్టి అంటుంది. "బుద్ధూ ఏడవాలి-'' మళ్ళీ ఆమెకు ఆమే కూచుని ముఖం చిన్నగా విప్పుతుంది—

తసద్దఖ్‌ఖాయీ నామామ కుమారుడు. అతను మా యింటికి వచ్చి రెణ్ణెల్లు అయ్యుంటుంది. కాలేజీలో చదువుతోండేవాడు. మొదట్లో బోర్డింగులో ఉండేవాడు. తరువాత ఒకనాడు మేనత్త వచ్చినప్పుడు మాటా మాటలలో

అతనిమాట వచ్చింది, మేనత్త అన్నది : "బోర్డింగులో అన్నవసతి తిన్నగా లేదు. పిల్లాడు ఎప్పుడూ అనారోగ్యంగా ఉంటున్నాడు" అమ్మీజాన్ ఈమాట విని బాగా పోట్లాడింది. "మాయిల్లు ఇక్కడ ఉండగానే బోర్డింగులో పడివుండటంలో ఉద్దేశ మేమిటి ?" అన్నది ఇక అక్కడ్ణించీ వాళ్ళిద్దరికీ జాలాసేపు సంభాషణ జరిగింది. అమ్మకు ఈ అలవాటు బాగా ఉంది ఏవో వెనకా ముందూ మాటలను పట్టుకుని కూచోటం !—చివరకు ఫలితం ఏమొచ్చిందంటే ఒక వారం తరవాత తసద్దఖ్ భాయీ బోర్డింగువదిలి పెట్టి మా యింటికి వచ్చి ఉన్నాడు—

తసద్దఖ్ భాయీ నాతోనూ, బుద్ధూతోనూ గొప్పగొప్ప గప్పాలుకొట్టే వాడు. అతనిమాటలైతే ఎంతో అహ్లాదకరంగా ఉండేవి. బుద్ధూతో అతనికి రోజుకు ఇరవై నాలుగ్గంటలు సరిపొయ్యేవి గావు. ఐనా విసుగుండేదిగాదు. కాని, అప్పతో తరుచు మాట్లాడేవాడుకాడు. ఎట్లా మాట్లాడతాడు ! ఎప్పు డెప్పుడైనా అప్ప ఎదురుగుండా వెళ్లాడా, ఆమె ముసుగుదుప్పటి కొంగు దానికదే జరిగి సగం ముసుగ్గా అయ్యేది. ఆమెగారి తడిసినట్టున్నకళ్ళు వంగిపొయ్యేవి. ఆమె ఏదో పనిలో తీవ్రంగా నిమగ్నమై ఉన్నట్టు అవు పించేది – ఇప్పుడు నాకు జ్ఞాపకంవస్తోంది : అప్ప అతని మాటలను బహు శ్రద్ధగా వింటోండేది. కాని, ఏమీ అనేది గాదు. భాయీసాహెబ్‌గూడా అప్పనుగురించి బుద్ధూను అడుగుతోండేవాడు. అయినా, అదే సమయం లోనే ఎప్పుడు ఆ యిద్దరూ విడివిడిగా ఉంటారో ! కూడా అడిగేవాడు— "బుద్ధూ. మీ అప్ప ఏం జేస్తుంది ?"—"అప్పా ?!" అని, ఏదోధ్యాసతో బుద్ధూ అదేమళ్ళీ అడిగేవాడు – "కూచుంది – పిలవనా ??"

వద్దులే వద్దు...సరేలే బుద్ధూ ఇవ్వాళే నీకు, ఇది చూడూ, ఇటు వేపు, నీకే చూపిస్తా !" భాయీ సాహెబ్ భయపడి అన్నాడు. అప్పుడు బుద్ధూ ధ్యానం ఇటూ అటూ అయిపోతే, అతని మధ్యమ స్థాయిలో అంటాడు. "ఒరేయ్ అబ్బాయ్ ! నీవు ఉచితంగా వేసే దండోరావి :"

బుద్ధూ అరుస్తూ లేస్తాడు "ఏమిటి నేనూ !?"—అప్పుడు అతను మేజు వాయించటం మొదలెడతాడు. 'డిగ్ మగ్ డిగ్ మగ్' దండోరా గాని దండోరా ఇది చూశావా దీన్ని డోలు కూడా అంటారు. 'డిగ్ మగ్ డిగ్ మగ్' తెల్సిందా ?"—తరవాత : విశేషించి నడుస్తూ నడుస్తూ అప్పవారి గుమ్మం దగ్గర ఆగిపోతుంది. వాళ్ళ మాటలేమో వింటూంటుంది. ఆ పైన పొయ్యి ముందర కూచుని తనలో తనే రవ్వంత రవ్వంత నవ్వుకుంటుంది. అప్పుడు ఆమె తలమీద నున్న దుప్పటీ జారిపోతుంది. వెంట్రుకల ముడి ఊడి చెంపల మీదకు వచ్చి పడుతుంది. ఇక ఆ తడిసిన తడిసిన కళ్లు ఉయ్యాల్లో ఎగురుతూ ఆడుతోన్న నిప్పుకణాల్లాగా ఊగుతోంటాయ్. అప్ప పెదిమెలు కొంచెం కదులుతాయి ఆమె ఏమన్నా పాడుతుందేమో అన్నట్టుగా, కాని ఒక్కక్షరం వినబడదు. ఇలాంటప్పుడు అమ్మ గానీ, నాయనగానీ వంటింట్లోకి వస్తే ఆమె ఠకీమని ఉలికిపడి, తన దుప్పటికీ, వెంట్రుకలూ, కళ్ళూ సర్దుకుంటుంది. ఎవరో నిరాడంబరంగా గాన సభలో పరాయివాడు వచ్చి దూరినట్టుగా !!!—

ఒకనాడు నేనూ, అప్పా, అమ్మీ బైటి వసారాలో కూచుని ఉన్నాం అప్పుడు భాయీ సాహెబ్ లోపల తన గదిలో బుద్ధూతో మాట్లాడు తోన్నాడు—నా అభిప్రాయంలో, భాయీ సాహెబ్‌కు మేము బైట కూచుని ఆయన మాటలు వింటున్నట్టు తెలియదు అని;—భాయీ సాహెబ్ బుద్ధూతో అంటున్నాడు: "నా మిత్రమా! మనమైతే ఆమెను వివాహమాడ దాం! ఎవరైతే నాతో ఇంగ్లీషు మాట్లాడగలదో, పుస్తకాలు చదవగలదో, చదరంగం—క్యారం బల్లబంతీ ఆడగలదో!—బల్లబంతంటే తెల్సునా? అది గుండ్రగుండ్రగా బొచ్చుగావున్న బంతిని బల్లమీద ఇల్లా డిఙైండ్సు, అన్నిటి కన్న ముఖ్యమైన మాట ఏమిటో తెలుసా! మనమే మజేదారుగా అన్నం వండి తినిపించగలిగి ఉండాలి !!"

"నేనైతే ఛాజూ బాజీని వివాహమాడతాను !" అన్నాడు బుద్ధూ.

"ఊఁ హూఁ !" అన్నాడు భాయీసాహెబ్.

బుద్ధూ అరవటం మొదలెట్టాడు. ''నాకు తెల్సిందిలే! నీవు అప్పను పెండ్లాడతావు గదూ! ఆఁ!?'' అప్పుడు దరహాస వదనంతో అమ్మీ అప్ప వేపు చూసింది. కాని, అప్ప తన కాలి బొటనవేలును విరగదీసుకోవటంలో అలా అలాగే వుంది—ఏమీ తెలియనిదానిలాగా!...లోపల భాయీసాహెబ్ అంటున్నాడు: ''ఓహో! మీ అప్పగారు పరవాన్నం వండితే, దాంట్లో బాగా పంచదారే వెయ్యదు—అచ్చం చప్పగా—ఇవ్వాళ థూ!''

పరవాన్నంలో తీపి తక్కువగా ఉండాలని నాయన అంటాడు'' అన్నాడు బుద్ధూ.

"అయితే ఆమె తన నాన్న కోసం వండుతుందిగాని, మనకోసం గాదన్న మాట!''

"ఈ మాట నేననా మా అప్పతో?'' బిగ్గరగా అన్నాడు బుద్ధూ. భాయీసాహెబ్ గూడా గొంతు పెద్దదిజేసి, "ఓహో! పిచ్చివాడా! దండోరా మీరే తీసుకోండి! దండోరా వేసి చూపుదాం: ఇది చూడూ, ఇటువేపు 'డిగ్ మగ్ డిగ్ మగ్!''

బుద్ధూ మళ్ళీ బిగ్గరసా ప్రారంభించాడు. ''నే నెరుగుదునండీ! నీవు మేజు వాయిస్తున్నావ్ గాదూ!!''—భాయీసాహెబ్ నవ్వు ముఖం పెట్టి, ''కుస్తీలలో! సరే, బుద్ధూ నీవెప్పుడైనా కుస్తీ పట్టావా? రా నీవూ నేనూ కుస్తీ పడదాం, నేను గామా పహిల్వానైతాను. నీవేమో బుద్ధూ పహిల్వానువి—తీసుకురా—ఆగూ—ఎప్పుడు నేను 'ఏక్, దో, తీన్' అంటానో!''—తరువాత ఓ నిమిషం ఆగి అతను మధ్యమంలో అన్నాడు. ''ఒరే! మిత్రమా నీ స్నేహమైతే నాకు చాలా అరుదుగా లభిస్తుంది.'' అన్నాడు—

చూస్తోన్న నా అభిప్రాయంలో:—అప్ప నవ్వును ఆపుజేసుకోలేక పోయింది. అందుకని ఆమె లేచి వంటింట్లోకి పోయింది. నా మట్టుకు నాకైతే నవ్వుతో ప్రాణం పోతోంది! అమ్మీ గూడా నవ్వు పైకి పొక్క

కండా పైట చెంగు నోట్లో కుక్కుకుని, చప్పిడి గాకుండా చేసు కున్నది——

నేనూ, అప్పా ఇద్దరమూ గదిలో కూచుని ఉన్నాం——భాయీ సాహెబ్ వచ్చేశారు——వెంటనే అన్నారు. ''ఏం జదువుతున్నావ్ ''జహన్నియా ?'' అతని నోటివెంట జహన్నియా అనే మాట విని నాకు చాల సంతోషమైపోయింది. నాకు నా పేరుమీద ఎంతో అసహ్యం వేసింది. 'నూర్ జహాఁ' ఎలాంటి, ఎంత ప్రాచీనపు పేరు !——ఆ మాట అనటంతోటే నోటిలో పాత రొట్టె రుచి వచ్చేస్తుంది. నేనైతే 'నూర్ జహాఁ' విని ఇలా అనుకుండేదాన్ని, ఏదో చరిత్ర గ్రంథం చినిగిపోయిన పుటను ఎవరో ముసిలి అవ్వ కర్ర పోటేసుకుంటో తీసుకు వస్తోన్నదో అన్నట్టు ! కాని, భాయీ సాహెబ్ ఆ పేరును మార్చివేసి దాన్ని అలంకారంగా అనటంలో ఎంతో నైపుణ్యం ఉంది——అతని నోటినుంచీ, 'జహాన్నియా' అని విని నాకు తన పేరును గురించి ఎటువంటి ఆక్షేపణా లేదు. నేనిలా అను కుంటాను——ఒకవేళ ఈరాణా రాజకుమార్తె అప్పకు ఆ చిత్రాసనం వేసు కుని నొసలంట మొక్కులు పెట్టేది——కాని, అదైనా చాలా పాతపాట ! అప్పుడు అప్ప చిన్నది. ఇప్పుడైతే భాయీసాహెబ్ ఆమెను సజ్జాదా అనరు. ఆమె పాతపేరు ఉచ్చరించటానికే ఉలికిపడేవాడు. కానియ్యండి. నేనైతే జవాబిచ్చేశాను—''స్కూల్లో పనిచేస్తున్నాను'' అని——

అడగటం మొదలెట్టాడు. "నీవు ఏదైనా బెర్నార్డ్‌షా పుస్తకం చదివావా ?''

నే నన్నాను "లేదు !'' అని.

అతను, నాయొక్కా, అప్పయొక్కా మధ్యలో నున్న గోడకు వ్రేలాడే గడియారాన్ని చూస్తో అన్నాడు, ''మీ అప్ప అయితే 'హార్టు బ్రేక్ హౌస్' చదివుండవచ్చు.'' అతను క్రీగంట అప్పవేపు చూశాడు.

అప్ప కన్నెత్తకుండానే తల ఊపింది. మధ్యమస్థాయిలో అన్నది. ''కాదు'' అని, స్వెట్టరు అల్లటంలో నిమగ్నమై ఉంది.

బాయీజాన్ అన్నాడు. "ఓహో! నేనేం చూపించను జహోన్నియా! అంటే అదేం వస్తువు! మత్తుగా ఉందిగా, మత్తు? అచ్చమైన తేనె!! నీవు దాన్ని తప్పకుండా చదువు. చాలా తేలిగ్గాడా అది. లేకపోతే పరీక్షల తరవాతైనా తప్పకుండా చదవాలి—నా దగ్గర ఉన్నది"—

నే నన్నాను "తప్పక చదువుతాను!" అని—

మళ్లా అడగటం మొదలెట్టాడు: "నే నంటాను. మీ అప్ప మెట్రిక్ తర్వాత చదవటం ఎందుకు మానేసినట్టు?"

"నాకేం దెల్సు? మీరు స్వయంగానే అడగండి" అని నేను చీదరించుకుని అన్నాను—అయినప్పటికీ, నాకు బాగానే తెలుసు అప్ప కాలేజీకి వెళ్ళటానికి ఎందుకు నిరాకరించిందో, అంటోందేది: నాకు ఎందుకో కాలేజీకి వెళ్ళటానికి ప్రాణం వప్పటం లేదు అని; అక్కడ చదివే పిల్లల్ని చూసి ఇట్లా అనిపించేదిగదా ఏదో ఎగ్జిబిషన్ జరుగుతోన్న స్థలంలాగా! పాఠశాల అని అనిపించనే అనిపించదు—చదవటం అనే పేరుబెట్టిన 'మేళా' లాగా!—నాకు అప్పగారి ఈమాట బహుచెడ్డగా అన్పించింది. నాకు తెల్సినంతవరకూ ఏమిటంటే: ఆమె ఇంట్లో కూచుని ఉండటానికని కాలేజీకి వెళ్ళటానికి ఒప్పుకోదు, అని;—మా గొప్పగా వచ్చావ్‌లే పేర్లు బెట్టటానికి! అదీగాక. అప్ప దెప్పుడైనా భాయీజాన్ అప్పను గురించిన ప్రస్తావనతెస్తే నేను ఇష్టమైనా, గాకున్నా, చీదరించుకుంటాను.

అప్ప అయితే మాపుకు జవాబుకూడా ఇయ్యదు. మరి వీరేమో అప్ప అప్ప అంటున్నారు! మరి తరవాత అప్పమాట నన్నడగటంలో అర్థం? నేనేమన్నా టెలీఫోనా? స్వయంగా అప్పనే అడుక్కుంటారు—ఇక అప్ప—కూచుని వున్న మౌన ధారిణి అప్ప—తడిసిన పిల్లి—

సాయంత్రంపూట నాయన అన్నానికి కూచుని అరవటానికి లేచాడు- ఇవ్వాళ పరవాన్నంలో ఇంత పంచదార ఎందుకుంది? తీపితో ఫెద్దాలు

అంటుకుపోతున్నాయి. సజ్జాదా ! బిడ్డా సజ్జాదా ! ఏ. పంచదార ఇంత చౌక అయిపోయిందా ? ఒక్క చెంచా అయినా మింగటం కష్టంగా వుంది——''

అప్పగారి తడిసిన తడిసిన కళ్ళు ఊగుతున్నాయి. కదాచిత్తుగా ఎప్పుడైనా నాయనగారు కోప్పడితే అప్పగారి రంగు ఎర్రబడిపోతుంది. అలాంటప్పుడు ఆమె చెంపలు గాంగ్రేడించినట్టుంటాయి——

"ఒకవేళ పంచదార కొంచెం ఎక్కువపడ్డదేమో !" ఈ మాట అంటూ ఆమె వంటింట్లోకి వెళ్ళిపోయింది——మరి నేను పళ్ళుతోముకుంటు న్నాను. బహుశా - ఏం కొంచెం ఎక్కువ - ఒకవేళ -

అటు నాయనగారు యథాప్రకారం బడబడలాడుతోనే వున్నారు - ''నాలుగైదు రోజుల్నించీ చూస్తున్నానుగదా, పరవాన్నంలో తీపి పెరుగుతూ పోతోంది''——వాకింట్లోంచీ అమ్మి పరుగే పరుగుగా వచ్చింది - రావట మేమిటి, నాయనగారిమీద ఆమె మామూలు అలవాటుతో విరుచుకు పడటమేమిటి ! ''మీరైతే శుద్ధ అనవసరంగా కోప్పడుతున్నారు. మీకైతే కొంచెం తీపే కావాలి, అయితే మిగతా అందరూ తినాల్నా ? తీవ్రంగా ఇంట్లో తెచ్చిపెట్టుకున్న పడుచుపిల్లవాడున్నాడు - వాడినైనా కాస్త జ్ఞాపకం పెట్టుకోవాలిగదా !?''....నాయనకు ప్రాణ సంకటమంత ఇరకట మైంది - అనజొచ్చాడు. "ఓహో ! ఇదా ! నాకు చెప్పివుంటే నే ననే వాడినా సజ్జాదా తల్లీ !——'' తరవాత వారు కొరకొరలాడసాగారు——

అప్ప సాహిరా ఇంటికి వెళ్ళటానికి సిద్ధమయ్యేప్పటికీ నేను చాలా హైరాణ (గాభరా) అయినాను. అప్ప ఆమెను కలిస్తే ఏమాటదాకా చెయ్యటానికీ ప్రీతిపడదు. అసలు, ఆమె పేరు అంటేనే ముక్కు విరుచుకుండేది. నే నేమనుకున్నానంటే, ఇందులో తప్పకుండా ఏదో రహస్యం ఉందని !— మీమాటమటుకు అవును. ఎప్పు డెప్పుడన్నా సాహిరా గోడవెంబడి కుంచాన్ని నుంచోబెట్టి దానిమీద ఎక్కికూచుని మావేపు గదమాయిస్తుంది.

అంతేనా, ఎవరిమీదో ఒకరిమీద పెట్టి రహస్యంగా అనటం - తేలిక చెయ్యటం చేసేది. అయితే అప్ప మిక్కిలి మతిలేనిదానిలా ఒకటి రెండు మాటల్తోనే ఆమెను టలాయించేస్తుంది. ఆమెంతట ఆమే చెప్పటానికి లేస్తుంది. "ఇప్పుడైతే ఇంత పనిబడ్డది. మరందుకే నే నిక్కడ నుంచున్నది." ఇట్లా అని ఆమె వంటింట్లోకి పోయి కూచుంటుంది ;——పోనీ అలాంటప్పుడు మెదలకుండానే కూచుంటాను. కాని, అప్పుడు అప్ప పడుకుంటే, కొంచెంసేపయ్యాక ఊరికనే నేనున్నా సాహిరా ఇంటికి చేరవెళ్లాను. మాటలో మాటగా నేను ఆ జోలి (విషయం) దీశాను. "ఇవ్వాళ అప్ప వచ్చిందా ?"

సాహిరా గోళ్ళకు పాలిష్‌చేసుకుంటూ అన్నది. "అవును. ఏదన్నా పుస్తకం తెప్పించాలని అన్నా. తెలియదు ఆ పుస్తకం పేరేఁవిటో?—ఆఁ. అవును. 'హార్ట్ బ్రేక్ హౌస్' !

అప్ప ఈ పుస్తకాన్ని నాతో దాయించి (దర్వాజా)లో జాగ్రత్తగా ఉంచేది. నాకు ఏమీ తెలియదు. రాత్రిపూట ఆమె మాటి మాటికీ ఎప్పుడైనా నావేపూ, మరెప్పుడైనా గడియారంకేసీ చూస్తో ఉండేది. ఆమె తత్తరపాటు చూసి నేను ఏదో ఒక అబద్ధంగా ఒళ్లు విరుచుకుండేదాన్ని. తరవాత మళ్ళీ పుస్తకం మూసేసి ఇలా సమ్మతి పడిపోతాం. సకాలంలో గాఢమైన నిద్రలో మునిగినట్టు !——అప్పుడు ఆమెకు నమ్మకం అవుతుంది. నేను పడుకుని ఉంటే, దర్వాజా తెరిచి పుస్తకం తీసుకుంటుంది. దాన్ని చదవటం మొదలెడుతుంది. ఆఖరుకు ఒకనాడు నాతో ఉండనే లేకపోయింది. నేను మనస్ఫూర్తిగానే నోరు దెరిచి అడగనే అడిగాను. "అప్పా ఈ 'హార్ట్‌బ్రేక్ హౌస్' యొక్క ఉద్దేశం ఏఁవిటి ? మనస్సును తెగగొట్టే ఇల్లు అని !?—— దీని అర్థమేఁవిటో !?" అప్ప మొదట్లో చకితురాలైంది. తరవాత ఆమె తెప్పరిల్లింది. లేచి కూచుంది. కాని, ఆమె ఇందులో నా మాటకు

జవాబియ్యలేదు. నేను ఆమె మౌనానికి మండిపడి అన్నాను. "ఈ విధంగా జూస్తే మన యిల్లు గూడా 'హార్ట్ బ్రేకే!"

"నేనేం ఎరుగుదును?" అన్నది—

నేనామెను ఉడికిద్దామని అన్నాను. "అవును మా అప్పా, భలే, ఏమెరుగును?"—నేననుకుంటాను ఈ మాట ఆమెకు తప్పక చెడ్డగా తోచి ఉంటుంది. అని, ఎందుకంటే, ఆమె పుస్తకం మడిచి అక్కడ పెట్టింది—వత్తి ఆర్పి పడుకున్నది—

ఒకనాడు ఇట్లాగే తిరుగుతూ తిప్పుతూ నేను ఖాయీజాన్‌గారి గది లోకి వెళ్ళాను. మొదట్లోనైతే ఖాయీజాన్ అటూ ఇటూ మాటలు చేస్తోన్నాడు—మళ్ళీ అడిగాడు:—"జహాన్నియా! మంచిది. ఇది చెప్పు. ఏం మీ అప్పకు ఫ్రూట్‌సాలిడ్ చెయ్యటం వస్తుందా?" అని—నేనన్నాను. "నాకేం దెల్సు! వెళ్ళి అప్పనే అడగండి!" అని—

"ఇవ్వాళ ఎవరితోనన్నా ఎక్కడైనా పోట్లాడి వచ్చావా?" నవ్వుతూ అన్నాడు—

"ఏం! నేను పోట్లాడేదాన్నా?" అన్నాన్నేను—

"కాదులే కాదు! ఇప్పుడైతే చిన్నపిల్లవే అనుకో! బహుశా ఎప్పుడోప్పుడు పోట్లాడే ఈడుగలదానివి గూడా అవొచ్చు!!" అన్నాడు. దీనిమీదనా నవ్వుపరుచుకోటం మొదలెట్టింది అలలలాగా!—

ఆయన ఇల్లా అన్నాడు. "చూడూ! జహాన్నియా! నాకు పోట్లాటంటే అత్యంత ప్రీతికరమైనది. నేనయితే ఎలాంటి అమ్మాయిని పెళ్లాడతానో తెలుసా! ఎవరైతే ఉదయానించీ సాయంత్రందాకా యథా శాస్త్రీయంగా పోట్లాడగలుగుతారో! కొంచెమైనా విసుకూ కసుకూ ఉండగూడదు సుమా!—అలాటి మంచిదాన్ని!!—"

నేనెందుకు లజ్జతో వినమ్రమైపోయానో నాకే తెలియదు—మరి మాటను మార్చటానికని, ఇలా తీశాను దారి; "సరేగానీ, ఫ్రూట్‌సాలిడ్ ఎలా అయితుంది భాయీజాన్ ?"

"అదీ గూడా ఏదో అయితుంది తెల్ల తెల్లగా, ఎర్ర ఎర్రగా, నల్ల నల్లగా, నీలి నీలిగా" అన్నాడు—నేనతని మాటను విని ఎంతో నవ్వాను—మళ్ళీ అనటం మొదలుజేశాడు. "అది నాకు అంతులేని ఇష్టం! ఇక్కడైతే నేనూ జహాన్నియా పరమాన్నం తినీ తినీ అలసిపొయ్యాం!" అని—

నేనే మనుకుంటానంటే, ఈ మాట తప్పకుండా అప్ప విని ఉండొచ్చును. ఎంచేతంటే ఇదే సాయంత్రం ఆమె వంటింటో కూచున్నది. 'భోగాల గది' చదువుతోంది. ఆనాటి తరవాత, ఇకరోజూ నాగా లేకుండా ఆమె అన్నం అవీ వండటంనుంచీ బైటబడి ఫ్రూట్‌సాలిడ్ చేసే అభ్యాసం చేయసాగింది—మరి, మాలో ఎవ్వరమైనా సరే ఆమె సమీపానికి వెళ్లామో, వెంఠనే ఆ ఫ్రూట్‌సాలిడ్ చేసే పళ్ళాన్ని దాచేసేది! ఒకనాడు నేను అప్పను చీదరించుకుంటూన్నట్టు బుద్ధూతో అన్నాను—"బుద్ధూ. భలే, నీ వడిగిచూడు అప్ప వెనకాల ఏదో పళ్లెం దాచిపెట్టినట్టుంది. దాంట్లో ఏముందో ?"

బుద్ధూ చేతులు కడుక్కుని అప్ప వెంబడి బడ్డాడు—ఎలా అయితేం అప్ప ఆ పళ్లెం బుద్ధూకి ఇవ్వాల్సే వచ్చింది చివరికి! మళ్ళీ నేను బుద్ధూను భయపెట్టాను. "బుద్ధూ అయితే నీవెళ్ళు. భాయీజాన్‌ను అడుగు ఆ తినే దాని పేరేమిటో ?—

బుద్ధూ భాయీజాన్ గదివేపు వెళ్ళుతున్నాడు—అయితే అప్ప లేచి అతని చేతులోంచీ ఆ పళ్లెం ఊడదీసుకుంది. నాకేసి గుడ్లురిమి చూసింది. అదే మొదటిసారి ఆమె నన్నట్లా చూడ్డం! ఎందుకో !?"

ఆ రాత్రి అప్ప సాయంత్రి కాగానే పడుకున్నది. నాకు చక్కగా అవుపడ్తూనే వుంది గదా, ఆమె ఇష్టాపూర్తిగానే ఏడుస్తోంది. దుప్పటి

కప్పుకుని మరీ;—అప్పుడు నా మాట మీదే నాకు చాలా విచారం వేసింది. నా ప్రాణం ఏమనిపిస్తుందంటే, లేచి అప్పగారి పాదాలమీద వ్రాలిపోదాం అని, మరామె నెంతో ఎంతో ముద్దాడాలనీ,...కాని, నే నలాగే కదలకండా మెదలకండా ఉండిపోయ్యాను—పుస్తకంలో ఒక్కక్షరం గూడా చదవలేక పోయ్యాను—అదేరోజుల్లో మా పినతల్లి బిడ్డ 'సాజద్దా' ఎలా మేమందరమూ 'సాజూబాజీ' అని అంటూండేవాళ్ళం, ఆమె మెట్రిక్ పరీక్ష ఇక్కడ ఇయ్యటానికి మా యింటికి వస్తోంది. సాజూబాజీ రావటంలో మా యిల్లు దేదీప్యమానమైంది. మా ఇల్లు గూడా గలగలలతో ప్రతిరవం ఇస్తోంది. సాహిరా, సూర్యా, మంచాలమీద కూచుని 'బాజీ'తో మాట్లాడుతోంటారు—బుద్ధూ 'ఛాజూ బాజీ ఛాజూ బాజీ' అని అరుస్తూ, తిరుగుతూ, అంటూంటాడు— "మేమైతే ఛాజూ బాజీని పెళ్ళి చేసుకుంటాం ! అని—

బాజీ అంటుంది. "మా ఇబ్బంది ఏవిటో చూడు—ముందు మొహం కడుక్కురా !"—మళ్ళీ ఆమె భాయీసాహెబ్ వేపు ఇలా మెడ తిప్పుతుంది, నల్లని నల్లని కండ్ల కోణాలు మృదుహాసం చేసుకుంటాయి. మరి ఆమె పంచమ తానంలో అడుగుతుంది, "ఉన్నాయిగదా 'భయ్‌జా ఆన్' ఎందుకండీ?"——

బాజీ నోటినించీ 'భయ్‌జాఆన్' ఏదో ఇలాంటి విచిత్రంగా వినిపిస్తుంది గదాంటే, నేను సంతోషంతో వళ్ళేమరిచిపోతాను-దానికి విరుద్ధంగా ఎప్పుడైనా అప్ప 'భాయీసాహెబ్' అనంటే ఎట్లా మోటుగాఅనిపిస్తుంది- కాక, ఆమె నిజంలో ఆయన్ని భాయీ అంటున్నదేమో !——మళ్ళీ తరువాత. 'సాహెబ్' అనటానికి ఏదో, గొంతుకలో ఎల్లాగో అడ్డపడ్డట్టు—— కాని, బాజీ 'సాహెబ్' అనే స్థలంలో 'జాఆన్' అని ఆ పూర్తిపదంలో ప్రాణం పెట్టేస్తుంది. 'జూ ఆన్' యొక్క గుంబితంలో భాయీ అనేది అణగిపోతుంది. మరి ఇది అనిపించనే అనిపించదుగదాంటే ఆమె భాయీ అనీ అంటున్నదని, అదీగాక 'భయ్‌జాఆన్' అంటూ ఆమె తన నల్లనల్లని మెరుస్తోన్న కళ్ళతో చూస్తుంది. మరిన్ని కళ్ళలో కళ్ళలోనే పిల్లనవ్వులు నవ్వుకుంటుంది, అయితే ఇది వినేవాళ్ళకు స్పష్టంగా ఈ అనుమానం

తోచదు. అతన్ని భాయీ అన్నదనీ—అప్పగారి "భాయీసాహెబ్", మరి బాజీ 'భయ్‌జాఆన్'లలో ఎంత తేడా ఉన్నది !!—

బాజీ వచ్చాక అప్ప కూచుని ఉండటం, అచ్చం కూచోని ఉంటం గానే ఉండిపోయింది ! బుద్ధూ భాయీజాన్‌తో ఆడుకోటం మానేశాడు. అతను ఎప్పుడూ బాజీ చుట్టూ ప్రదక్షిణం చేస్తోంటాడు. ఇక : బాజీ భాయీ జాన్‌తో ఎప్పుడన్నా చదరంగం—ఎప్పుడన్నా క్యారంబోర్డూ ఆడుతుంది.

బాజీ అంటుంది : "భయ్‌జాఆన్ - ఒకబోర్డు తగుల్తుంది" లేదా, భాయీజాన్ బాజీ సముఖంలో బుద్ధూతో అంటాడు-"ఏం అబ్బాయ్. బుద్ధూ. ఎవరన్నా ఉన్నారా మాతో చదరంగం ఆడి గెలవగలవాళ్ళు ?"—బాజీ అంటూ లేస్తుంది "అప్పను అడగండి"—భాయీజాన్ అంటాడు "మరి నీవు ?"—బాజీ అబద్ధాల సబద్ధాల ఆలోచనలలో పడిపోతుంది. ముఖంమీద గంభీరాన్ని సృష్టించుకుంటుంది. కనురెప్పలు కొంచెం ముకుళిస్తుంది. నాసలు పైకెత్తి నుంచుంటుంది—మళ్లా అంటుంది. "ఊఁహూ !...నాతో నైతే మీరు గెలవగలరు."-భాయీజాన్ కిలకిలా నవ్వుతూ అంటారు : "నిన్న ఎవరు గెల్చారో మర్చే పొయ్యారా ఏమిటి ?"—ఆమె జవాబు : "నే నన్నాను. పదండి భయ్‌జాఆన్‌గారిని దృష్టిలో ఉంచుకోవాలి అని, లేకపోతే ప్రపంచం ఏమంటుంది, నాతో ఓడిపోయారని !" మళ్ళీ మళ్ళీ ఎలాగో నవ్వుతుంది మువ్వలు మోగుతున్నాయా అన్నట్టు—

రాత్రికి భాయీజాన్ భోజనంచెయ్యటానికి వంటింట్లోనే కూచున్నారు. అప్ప గప్‌చిప్‌గా పొయ్యి ముందరే కూచునివుంది - బుద్ధూ భాజూబాజీ అంటూ బాజీ దుప్పటికొంగు పట్టుకుని ఆమె చుట్టూరా తిరుగుతోన్నాడు. బాజీ భాయీజాన్‌ను వెక్కిరిస్తుంది - అంటుంది :— "భయ్‌జాఆన్ అయితే పూర్తిగా ఆరు రొట్టెలు తింటారు. అంతేనా ! పరవాన్నం ప్లేటు దొరికితేనా, ఎటువంటి అభ్యంతరమూ ఉండదు ! ఏం జేస్తారు పాపం ! తినకపోతే అత్తయ్య కోప్పడగలరు ! వారిని ఏదో సంతోషపెట్టాలిగదా !

ఉన్నారుగదా భయ్‌జాఆ‌న్''—మేమంతా యీ మాటలు విని దిట్టంగా నవ్వాం!—మళ్లీ బాజీ ఇటూఅటూ తిరగటం మొదలెట్టింది—అంతలో అప్పగారి వెనగ్గా వెళ్ళి నుంచుంది. అప్ప వెనకనే ఫ్రూట్‌సాలిడ్ పళ్ళెం పెట్టబడివుంది. బాజీ పైమూత జరిపి చూసింది. పళ్లెం తీసుకుంది. ఆమె కంటే ముందుగా అప్ప ఏదో అందామనుకుంది, గాని, బాజీ ఆ పళ్లాన్ని భాయీజాన్ దగ్గరకు తీసుకువచ్చింది. ''తీసుకోండి భయ్‌జాఆన్'' అని కండ్లలో నవ్వుకుంటూ అన్నది—''మీరుమటుకు ఏమంటారేమిటి, సాజూ బాజీ ఎప్పుడూ ఏమీ తినిపించనే లేదు.''—

భాయీజాన్ రెండుమూడు చెంచాలు నోట్లో కుక్కుకుని, ''దేవుడి సాక్షి. చాలా బాగా కుదిరింది—ఎవరు చేశారోగాని!''—సాజూబాజీ అప్ప గారి వేపు కనుగోసలతో చూడ్డం, నవ్వటంలోనే ఒక్కసారే కలిపి ఇలా అన్నది. ''సాజూబాజీయేనా? ఇంకెవరన్నానా భయ్‌జాఆన్‌కోసం?''—బుద్ధూ అప్ప ముఖంవేపు అదోలా చూశాడు. అప్ప ముఖం ఎర్రబడు తోంది— బుద్ధూ అరుస్తూలేచాడు. ''నేను జూపించనా, నేను జూపించనా భాయీజాన్?''—అప్ప కొంచెం ముందుకు వచ్చి వాడి మూతిమీద చెయ్యి బెట్టింది. వెంటనే చంక కెత్తుకుని బయటికి వెళ్ళిపోయింది— బాజీ గల గలలతో గది మార్మోగింది. బుద్ధూమాట వచ్చిందీ పోయిందీ అయింది—భాయీజాన్ బాజీకేసి చూశాడు - మళ్లీ ఏమైందో వాళ్ళకేం దెల్సు—నోరు విప్పింది విప్పినట్టే ఉండిపోయింది. కండ్లు బాజీ ముఖంమీద పాతుకు పోయినై. తెలియదు నే నెందుకు అనుకున్నానో, ఎవరో నన్ను జబ ర్దస్తీగా గదినుంచీ బైటికి బలవంతంగా గెంటేసినట్టుగా! నేను బైటికి వచ్చేశాను - అప్ప బైట దండెం దగ్గర నించుని వుంది. లోపల భాయీ సాహెబ్ మధ్యమ స్వరంలో ఏదో అన్నాడు. అప్ప చెవులమీదినుంచీ దుప్పటి తొలగించింది—ఈసారి బాజీ కంఠధ్వని వచ్చింది. ''వదలండి వదలండి'' అని; మళ్లా అంతట్లో నిశ్శబ్దం కప్పుకుంది—

మర్నాడు మేం వాకిట్లో కూచుని వున్నాం, అప్పుడు భాయీజాన్ తన గదిలో చదువుకుంటూ ఉన్నాడు. బుద్ధూ గూడా అటే ఎక్కడో ఆడుకుంటున్నాడు. బాజీ మామూలుగా భాయీజాన్ గదిలోకి వెళ్ళిపోయింది. "ఇవ్వాళ మీకు ఒక ధణధణలాడే బోర్డుచేసి చూపిస్తా. ఏమిటి మీ సలహా?" అన్నది ;—"వహ్వా! ఇక్కడ్నించీ వెళ్ళిపోవటానికి. ఈ లంకెనుంచీ వెళ్ళటం ఎలాగ" అన్నాడు భాయీజాన్ - బహుశా అతను బాజీకేసి జోరుగా గొంతెత్తి అనుంటాడు— ఆమె కల్పితమైన కోపంతో బిగ్గరగా అన్నది ఇల్లా "వాః! మీరైతే హమేషా గొంతు విప్పుకునే వేళాకోళం చేస్తారు!!"—భాయీజాన్ అదోరకంగా అంటూ లేచాడు. "అయితే ఏ చేతితో":—"ఊరుకో - మాట్లాడకు" బాజీ ముఖం చెండుకుని అన్నది. ఆమె ఊరికే పోతోన్న చప్పిడి అయింది. ఒక్క నిమిషందాకా అయితే గబగబా అని వినిపించింది. మళ్లీ నీరవత అలుముకుంది.

ఇంతలో ఎక్కణ్ణించో బుద్ధూ ఉరుకుతూ వచ్చాడు. "అప్పా! భాయీజాన్ లోపల బాజీతో కుస్తీ పడుతున్నాడు. పద. చూపిస్తా నీకు. పదా ఇప్పుడే!" అన్నాడు. వాడు అప్పగారి దండచెయ్యి పట్టుకుని లాగటం మొదలెట్టాడు. అప్ప ముఖమంతా మండ పసుపు మాదిరిగా ఎర్ర నవుతోంది. అప్పుడామె శుద్ధబుద్ధావతారంగా నిలబడిపోయింది. బుద్ధూ అప్పను వదిలిపెట్టాడు. "అమ్మీ ఎక్కడుంది?" అన్నాడు - ఇకవాడు అమ్మ దగ్గరికి పోవాలని ఉరికాడు. అప్ప అతన్ని గబుక్కున లంకించుకుని చంకకెత్తుకుంది. "రా. నీకు మిఠాయి పెడతానుండు" అన్నది. బుద్ధూ ఏడుపు ముఖం పెట్టి బుసలు కొట్టటం మొదలెట్టాడు—అప్ప అన్నది ; రా. "చూడనైతే చూడూ, ఎంత చక్కని మిఠాయి ఉందనుకున్నావ్ నా దగ్గర!" వాడిని వంటింటోకి కొంచుబోయింది.

అదే సాయంత్రం తన పుస్తకాల బీరువా తెరిచేసరికి అందులో అప్పగారి 'హార్ట్ బ్రేక్ హౌస్' పడివుంది. బహుశా, అప్ప దాన్ని

అక్కడ పెట్టుంటుంది. కాని, నేను నానా హైరాన పడ్డా. అసలు సంగ తేమిటి ? అని,— అప్ప వంటింట్లో మౌనంగా కూచుని వుంది. ఎక్కడా ఏమీ జరగనట్టూ, ఏమీ ఎరగనట్టూనూ ! ఆమె వెనకనే ఫ్రూట్‌సాలిడ్ పళ్లెం ఖాళీగా పడివుంది...అప్ప పెదిమెలు అలా అదుముకునే ఉన్నయ్!

తసద్దక్ భాయీ, మేమూ, బాజీ పెళ్ళయిన రెండేళ్ళకుగాని వాళ్ళింటికి వెళ్ళటం తటస్థించింది గాదు. ఇప్పటి బాజీ అప్పటి బాజీగాదు. ఆమె ఆ గలగలలూ లేవు. ఆమెరంగు ఎర్రగా వుండేది—పాపం ! అమె నొసలు మీద ముడుతలు పడ్డై. భాయీసాహెబ్ గూడా మెదలకుండా వున్నాడు. ఒకనాడు పొద్దు కూకక ముందు అమ్మ తప్ప మే మందరమూ వంటింట్లో కూచుని వున్నాం. భాయీసాహెబ్ అన్నాడు ఇలా ''బుద్ధూ సాజూబాజీని వివాహం చేసుకుంటాడా ?''

''ఊఁహ్'' బుద్ధూ అన్నాడు. "మేం పెళ్ళి చేసుకోనే చేసుకోం !''

నే నడిగాను. "భాయీజాణ్ జ్ఞాపకం ఉందా, అప్పుడు బుద్ధూ అంటోండే వాడు. 'మేం ఛాజూబాజీని పెళ్ళి చేసుకుంటాం !! అని"— అమ్మీ అడిగింది ''అప్పను ఎందుకు చేసుకోవూ !" అని;—అయితే వాడన్నాడు. ''చూపించనా అప్ప ఎట్లా వుంటుందో ?" మళ్లీ పొయ్యిలో కాలివున్న పిడకవేపు సైగచేసి చూపిస్తూ అనజొచ్చాడు. ''ఇట్లాగే !" మరి "ఛాజూబాజీ ?''— నేను బుద్ధూకేసీ వెలుగుతోన్న ఎలక్ట్రిక్ బలుబుకేసీ, సైగగా వేలుతో చూపించాను. ''ఇల్లాగే !''—సరిగ్గా అదే సమయంలో ఎలక్ట్రిక్ లైటు ఆరిపోయింది. అప్పుడు గదిలో నిప్పుల వెల్తురు తప్ప చీకటి కప్పి వేసుకుంది. "అవునూ, జ్ఞాపకంఉంది'' భాయీజాణ్ అన్నాడు. అప్పుడు బాజీ ఏదో పనిమీద బయటికి వెళ్ళిపోతే భాయీ అన్నాడు ''తెలియదు ఇప్పు డీ కరెంటుకు ఏమైందో—ఎప్పుడూ వెలుగుతూ మలుగుతూనే ఉంటుంది—''

అప్ప మౌనంగా కూచుని పొయ్యిలో బూడిదతో కప్పివున్న నిప్పు రవ్వలను కెలుకుతోంది. భాయీసాహెబ్ గద్గదగంతో అన్నాడు. "అయ్యో. ఎంత చలిగా వుందీ?" అని;—అంటూ, లేచి అప్పగారి దగ్గరగా పొయ్యికి ఎదుట వెళ్ళి కూచున్నాడు. రాజుకుంటూ ఉన్న ఆ పిడకల నిప్పుతో చేతులు కాపుకోటం మొదలెట్టాడు. "అత్త నిజమే చెబుతూండేది; ఆకాలిన పిడకలలో నిప్పు అణగి వుంటుంది. పైకి అవుపించదు అని : ఏం సద్దా?"

అప్ప ముందుకు జరుగుతోంటే 'ఛుంయ్' అని ధ్వనైంది; ఎలాగంటే ఏదో అణగివున్న నిప్పుకణం మీదం నీటిచుక్క పడ్డట్టు! భాయీజాన్ విన్నపం నిండివున్న స్వరంతో ఇలా అన్నాడు. "సద్దా. ఇప్పుడు ఈ నిప్పురవ్వనైతే చల్లార్ప వోకు !—చూడూ ఎంత చల్లగా వుందో!?"

———

రచయిత:
"సాదత్ హుస్సేన్ మంటో"

# కొత్త చట్టం

మూల కథ:
"నయా ఖానూన్"

తా నున్నచోట మాంఛి తెలివైనవాడుగా గణింపబడేవాడు టాంగా వాలా మంగూ. వాడి విద్యాస్థాయి మటుకు సున్నాకు ఏమీ తీసిపోకండా ఉండేది. న్యాయానికేం! అతనెప్పుడూ బడి గుమ్మం దొక్కి ఎరుగడు! ఏది ఎలా వున్నా అతనికి ప్రాపంచిక విషయాల పరిజ్ఞానం మిక్కిలిగా ఉండేది. తన వీధి వాడాలోని తోడి టాంగాల వాళ్ళంతా తెల్సుకోవాల్సిన ప్రపంచపు సంగతులన్నీ మంగూతోనే తెల్సుకోవాలనే వాంఛ తరుచుగా కనబరచేవారు. అతని విశాల వివేకంమీద వాళ్ళందరికీ నమ్మకం ముమ్మరంగా ఉండేది!

వెనకటి మాట: ఎప్పుడైతే మంగూ తన టాంగాలో వచ్చే ప్రయాణీకుడితో స్పెయిన్‌లో యుద్ధం రగిలిన వార్త విన్నాడో, అప్పుడే అతని గామా చౌధరీ గారి విశాల భుజస్కంధాన్ని గట్టిగా తట్టి ఉన్మత్తుడా అన్నట్టు భవిష్యత్తు చెప్పాడు. "చూస్తావ్‌గా చౌధురీ. కొద్దిరోజుల్లోనే స్పెయిన్‌లో యుద్ధం రగుల్తుంది!"

ఆ తర్వాత గామా చౌధురీ ఇతన్ని 'స్పెయిన్ ఎక్కడుంది?' అని అడగటంతో మంగూ ఇంకా పొంగుతూ జవాబిచ్చాడు. 'విదేశాల్లో, ఇంకెక్కడ!! స్పెయిన్‌లో యుద్ధజ్వాల లంటుకున్నాయి.' అన్నమాట అక్కడే ఆ స్టేషన్‌లో వున్న తన తోటివాళ్ళూ, టాంగావాలాలూ గుమిగూడి సంతోషంతో హుక్కా లాగుతో 'అరే! మన మంగూకంటే గొప్ప వాళ్లు లేరురా!' అని మనస్సుల్లోనూ, మాటల్లోనూ ఎంతో ఎత్తు కెత్తుతారు

మంగూను !...కొంచెం ఆగినప్పుడు మంగూ సరీగ్గా ఆ సమయంలోనే మాల్ రోడ్డు అందాల మెరుపులమీద టాంగా నడుపుతూ తన ప్రయాణీకుడితో, నూతనంగా చెలరేగిన హిందూ ముస్లింల అల్లర్లను గురించి తన అభిప్రాయాలు చర్చిస్తోన్నాడు.

అదే రోజు—సాయంత్రమైంది. తన నివాసానికి వచ్చాడు. అతని ముఖం ఎల్లా వుందంటే, ఎప్పుడూ కనీ వినీ ఎరగనంత తీవ్రంగా అతని అభిప్రాయాల్ని వ్యక్తం చేస్తోంది! హుక్కా తాగుతూ తాగుతూండగా ఎప్పుడైతే హిందూ ముస్లిం కొట్లాటల మాట దొర్లిందో, మంగూ తన నెత్తిమీది కాకీషంలాను తీసి దాన్ని చంకలో బెట్టుకుని ధీమాగా ఆలోచనా పూరితంగా అన్నాడు. "ఇది ఏ గొప్ప ఋషి శాపంయొక్క పరిణామమో!! ప్రతిరోజూ ఇట్లా హిందువుల్లో మహమ్మదీయుల్లో కత్తులూ కటార్లూ తిరుగుతూ పోతోంటాయి!...మా పెద్దలు అనగా వినేవాణ్ణి అక్బరు చక్రవర్తి ఏ దేశ నివాసి హృదయాన్నీ బాధించలేదు! ఏ ఋషీశ్వరుడి మనస్సునో నొప్పించాడు. ఆ మహానుభావుడు క్రోధం గక్కుతూ శాపం పెట్టాడు. 'పో. మీ భారతదేశంలో ఎప్పుడూ కలహాలు ఉంటూ ఉంటాయి!' అని. మరి నా మాట అబద్ధమేమో చూడు. అక్బరు రాజ్యం ఎప్పుడైతే అంతరించిందో అప్పటినించీ గూడా తగాదా మీద తగాదాగా నిప్పు ఆరకుండానే వుందిగదా!" ఈ మాటలని ఒక జడమైన నిట్టూర్పు పుచ్చాడు. మళ్ళీ ఒక దమ్ము లాగాడు హుక్కాను. తన ధోరణిలో పడ్డాడు మళ్ళీ, "ఈ కాంగ్రెస్‌వారు హిందూ దేశాన్ని స్వతంత్ర దేశంగా చెయ్యాలనుకుంటారు. కానీ, నేనంటానూ, మీరు వెయ్యి సంవత్సరాలు తల బద్దలు గొట్టుకున్నా ఏమీగాదు! ఇంకో గొప్పమాట కూడా అంటాను! ఇది మటుకు జరిగి తీరుతుంది. ఇంగ్లీషువాళ్ళు వెళ్ళిపోయినా ఏ ఇటలీవాళ్లో వచ్చేస్తారు! లేదా ఆ రష్యావాడు—వాణ్ణిగురించి నేను విన్నా. వాడొక గొప్ప దిట్టమైన మనిషిట!...కాని, భారత దేశం ఎప్పుడూ బానిసదేశంగానే ఉంటుంది!...ఓ! నేను చెప్పటం మరిచాను, ఋషి ఈ శాపం

గూడా ఇచ్చాడు. హిందూ దేశం మీద ఎప్పుడూ పరదేశీయుడి రాచరికమే ఉంటుంది!'' అని. మంగూకు ఇంగ్లీషువాళ్ళంటే మా చెడ్డ అసహ్యంగా ఉండేది. ఆ అసహ్యానిక్కారణం అతనిలా చెప్పేవాడు "వాళ్ళు తమ నాణేలను భారత దేశంలో చెలామణీ చేయిస్తున్నారు—అంతేనా! రకరకాల దౌర్జన్యాలనూ సాగిస్తున్నారు!!—

అసలు ఈ అసహ్యానికంతకూ మూల కారణం: శిబిరాలలోని తెల్ల వాళ్ళు అతన్ని బాగా బాధపెట్టటం జ్ఞాపకం వచ్చి; వారి ప్రవర్తన ఇతనితో కుక్కకన్నా హీనంగా చూస్తున్నట్టుండేది! అదీగాక వాళ్ళ రంగున్నూ ఇతనికి బొత్తిగా నచ్చేదిగాదు. ఎప్పుడైనా ఆ యింగ్లీషువాళ్ళ ఎర్రని తెల్లని మొహాలు కన్పిస్తే సరి అతని వళ్లు జలదరించేది. అతనెందుకు అలా అనేవాడో తెలియదుగాని వాళ్ళ ఎర్రని తెల్లని మొహాలు చూడగానే శవాలు గుర్తుకొచ్చేవి. శరీరాలమీది చర్మం వొలిచేస్తే ఎలా వుంటుందో అలా అనిపించేది—ఎప్పుడైనా తాగుబోతు తెల్లవాడితో అతనికి తగాదా వచ్చిందీ అంటే ఆ రోజు రోజల్లా అతని పరిస్థితి అంతా ఒక రకంగా ఉండేది! సాయంత్రానికల్లా తన మకాంకు వచ్చి జబ్బలు చరుచుకుని సిగరెట్టు ఒక్క దమ్ముగా పీల్చేసేవాడు. లేదా మాంఛి దమ్ములాగేవాడు హుక్కాను! ఇక ఆ తెల్లవాడితో ఎంతగా అరిచేవాడంటే హృదయ భారం తీరేదాకా—

''.........ఈ మోటు తిట్లు తిట్టాక తన నెత్తిమీది పాగా కదిలేలాగా తల విసురుతూ అనేవాడు. 'నిప్పుకోసం అని వచ్చారూ! ఇప్పుడు ఇంటికి నిప్పే పెట్టారు! ముక్కు చివరకు వచ్చింది ఊపిరి! ఈ కోతుల సంతానం ఇట్లా తమ వ్యక్తిత్వాన్ని మా మీద ముద్రవెయ్యటానికి ప్రయత్నం చేస్తారు గదాంటే, మేమంతా వారి తాత ముత్తాతల గులాములమన్నట్టు!!''

ఇంత అరిచాక గూడా అతని కోపం తగ్గి హృదయం శాంతించేదిగాదు. అతని పక్కన అతని స్నేహితులు కూచుని ఉన్నంత మట్టుకూ

అతని తరహా ఇంతే. తన గుండెల్లో మంటను ఇల్లాగే ఒలకబోసుకునేవాడు. 'ఆకారాలు చూశారు గదా వాళ్ళవి, మండిపోతున్నలాగా ! పూర్తిగా పాచి పీనుగులు !' నేలమీద ఒక ఘాటైన ఒక దెబ్బను టకటకా కొడుతూ ఇలా వాగుతూనే ఉండేవాడు చంపెయ్యనున్నట్టే !—నీ ప్రాణంతోడు మొదట మొదట మనసులో అనిపించింది బుర్ర చెక్క చెక్కలుగా చెక్కెయ్యాలని, కాని, ఈ ఆలోచనతో ఆగిపోయేవాణ్ణి, వాళ్ళని కొట్టటం మనకే మంచిది గాదని !...'' ఇలా అంటూ అంటూ మధ్య మధ్య కాస్త నిశ్శబ్దంగా ఉండేవాడు. మళ్ళీ, ముక్కును కాకీ చొక్కాతో తుడుచుకున్నాక, మళ్ళీ బడబడలాడేవాడు—

భగవంతుడి సాక్షిగా చెబుతున్నాననుకో, ఈ దొరల అసహానాన్ని భరించి విసిగిపొయ్యా! ఎప్పుడు వాళ్ళ పాపిష్టి మొహాలు చూస్తానో నరాల్లో నెత్తురు వేడెక్కిపోతుంది—ఎవరైనా కొత్త ఖానూను తెల్సిన వాళ్ళుండేట్టయితే ఈ పేడిమూతి వాళ్ళతో శని విరగడయ్యేది. నీతోడు ప్రాణంలో ప్రాణం వచ్చేది !''

ఒకనాడు మంగూ ఆఫీసునుంచీ తన టాంగాలో ఇద్దరు ప్రయాణీకుల్ని ఎక్కించుకు వస్తూండగా వాళ్ళ మాటల్లో అతనికి తెల్సి వచ్చింది. భారతదేశంలో కొత్త ప్రభుత్వం వెలవనున్న దన్నట్టు !—అతని ఆనందానికీ హద్దూ పద్దూ లేకపోయింది !—టాంగాలో వచ్చే వారిద్దరూ దోమలగూడెం కోర్టులోని తమ దావాను గురించి వచ్చిపోతూ 'కొత్త చట్టం' అంటే 'నవ భారత రాజ్యాంగం' మీద తమతో తాము మాట్లాడుకుంటో వస్తోన్నారు—

వినికిడిలోకి వస్తోంది ఏప్రిల్ ఒకటినుంచీ భారత దేశంలో కొత్త ఖానూణ అమలులోకి రానున్నది ! ఏం ప్రతిదీ మారిపోతుందా !!

''ప్రతీ విషయం అయితే మారదు. గాని, తెలుస్తోంది గదాంటే చాలావరకు మార్పులొస్తాయని, దాంతో భారతీయులు సర్వతంత్ర స్వతంత్రులౌతారు అని''.

"ఏం వడ్డీలను గురించి కూడా ఏదైనా కొత్త ఖానూన్ అమల్లోకి వస్తుందా?"

"ఇది తెల్సుకోదగ్గ విషయమే. రేపే ఏ ప్లీడరునన్నా ఆలోచిద్దాం!"

ఈ మార్వాడీ భాయీల మాటలు మంగూ హృదయంలో భరించ రాని సంతోషాన్ని రేపుతోన్నాయి—అతను ఎప్పుడూ తన గుర్రాన్ని తిడు తూనే వుండేవాడు. బెత్తంతో ఎప్పుడూ బాదుతూనే వుండేవాడు. కాని, ఇవ్వాళ తేపతేపా వెనక్కి తిరిగి మార్వాడీలకేసి చూస్తూ, తన మీసాలను సగర్వంగా దువ్వుకుంటూ, గుర్రం వీపుకు బిగుతుగా బిగించి వున్న బక్లెస్‌లను వదులు చేస్తూ, మహా ప్రేమగా అనజొచ్చాడు; "నడూ బిడ్డా! నడు! కొంచెం గాలితో మాట్లాడి చూడు!"

మార్వాడీలని వాళ్ళ బసలకు పంపించి అతను 'ఉక్లీ'లో 'దీనూ హైలర్' దుకాణంలో అర్ధశేరు పెరుగు ప్రశాంతంగా తాగి ఒక త్రేపు త్రేణ్చి, మరి మీసాలని పెదాలతో బిగబట్టి వాటిని చప్పరిస్తూ నిబ్బరంగా బిగ్గరగా అన్నాడు. "హత్తేరీ. నీకు నీవే సాటి!"

సాయంత్రం అతను తన ఇంటికేసి తిరిగిరాక రోజూ మామూలుకు తేడాగా అతనికి పరిచయమైన వాళ్లెవరూ దొరకలేదు. ఇదిచూసి అతని గుండెల్లో ఒక విచిత్రమైన తుపాను చెలరేగింది! ఈరోజున అతను తన స్నేహితులకు ఒక గొప్ప వార్త వినిపించేవాడు? చాలా గొప్ప వార్త!! ఈ వార్తని తన కడుపులోనించీ వెళ్ళగక్కటానికి మహా ఉబలాట పడు తున్నాడు. కాని అక్కడెవరూ లేనేలేరుగా? అరగంటదాకా బెత్తం చంకలో బెట్టుకునీ స్టేషన్ దగ్గరి "టాంగా స్టాండు" చూరుకింద అన్నీ మరిచి పచార్లు చేస్తున్నాడు. మంగూ తలలో రకరకాల మంచిమంచీ ఆలో చన్లు తరంగాల్లా లేస్తూ పొయ్యాయి! "కొత్తచట్టం" గురించిన వినికిడి వాణ్ణొక కొత్తలోకంలోకి లాక్కుపోయింది. అతను ఆ కొత్తచట్టాన్ని గురించి, ఏదైతే భారతదేశం అంతటా ఏప్రిల్ ఒకటో తారీఖుకు అమల్లోకి

రానుందో దాన్నిగురించి బుర్రంతా దీపాలుగా వెలిగించుకుని ఆలోచించ నారంభించాడు—అతని చెవుల్లో మార్వాడీ సేటు అడిగిన వడ్డీల విషయం గూడా ఏదో కొత్త ఖానూణ్ పాసైతుంది అని మార్మోగుతోంది మాటి మాటికీ! అతని వళ్ళంతా సంతోషంతో విద్యుత్ప్రవాహంలా దూసుకు ప్రవ హిస్తోంది! ఎన్నో, ఎన్నోసార్లు తన గుబురు మీసాలలో నవ్వుకుంటూ మార్వాడీలని తిట్టాడు అతను—బీదల మంచాలలో దూరిన నల్లులు! కొత్తఖానూణ్ వారిపట్ల పొంగులెత్తే వేడినీళ్ళుగా మారుతోంది!!...

మహా తీవ్రాలోచనలో ఉన్నాడు. సరీఘ్లా అప్పుడే అతని హృదయా నికి ప్రత్యేకమైన చల్లదనం చేకూరుతోంది! తెల్లవాళ్ళ విషయంలో ఎప్పు డైతే అతను ఆలోచిస్తాడో—'తెల్ల ఎలుకలు' (అతను వాళ్ళ నెప్పుడూ అదే పేరుతో జ్ఞాపకం చేసుకుంటోంటాడు) కొత్తఖానూణ్ రాగానే కన్నా ల్లోకి మాయమైపోతాయి!—

"నత్థూగుంజా" షంలా చంకన అదుముకుని టాంగాస్టాండులో ప్రవేశించటమే తడవుగా మంగూ గబగబా అతని కెదురుగా బోయి అత నితో కల్సి నడుస్తూ, "తే. చెయ్యి ఇట్లా" అంటూ అతని చేతిని తన చేతు లోకి తీసుకుంటూ, 'నీ కెట్లాంటి వార్త చెబుతా ననుకున్నావ్! అది వింటే నీవు ఖుషీని ఆపుకోలేవు సరిగదా, నీ బట్టతలమీద వెంట్రుకలు మొలకెత్తు తాయి!'—

ఈ మాటంటూ మంగూ ఆనందాన్ని తెరలు తెరలుగా గుండెల్లో అదుముకుంటూ కొత్తచట్టాన్నిగురించి స్నేహితుడితో ప్రారంభించాడు. ఈ మాటల సందర్భంలో అత నెన్నోసార్లు నత్థూగుంజా భుజాన్ని దిట్టంగా గట్టిగా తన చేత్తో చరిచిచరిచీ మరీ చెప్పాడు! "నీవు చూస్తో ఉండు. ఏం గానున్నదో! ఈ రష్యారాజు ఏదో ఒహటి చెయ్యకమానడు!"

మంగూ పంతులు ప్రస్తుత రష్యా విధానంపట్ల వేడివేడి విషయాలు ఎన్నో వినున్నాడు. మరి అతనికి అక్కడి కొత్తచట్టం—మరి అక్కడి

కొత్త సంగతులూ బాగానచ్చేవి! అందుకని అతని రూసురాజుకి ఇండియా చట్టానికీ అంటే కొత్తచట్టానికీ ఒకటో ఏప్రిల్‌తో పాత పద్ధతిలో ఏవైతే మార్పులు రానున్నయ్యో అతను వాటన్నిటినీ రష్యా రాజుయొక్క ప్రభావంతో అనుకుండేవాడు!

కొన్నాళ్ళనించీ ఏవో వృత్తులు చేసుకుండే వాళ్ళల్లో-పట్టణవాసుల్లో, ఎర్రని దుస్తుల చిహ్నాలు కన్పించేవి. మంగూ పంతులు ఈ గుర్తుల్ని తన మెదడులో, రష్యా రాజు—కొత్త చట్టంతో తప్పొప్పుగా కలిపేశాడు—ఇదీ గాక అతను ఎప్పుడైనా ఎవరితోనైనా వింటాడో ఫలానా పట్నంలో బాంబులు వేసేవాళ్ళు పట్టుకోబడ్డారు, లేక ఫలానిచోట ఇంతమంది మనుషుల మీద తిరుగుబాటు నేరం కేసు నడపబడ్డదీ అని, అయితే యీ అన్ని విషయాలకీ కారణం కొత్త చట్టం ప్రభావం అనుకుంటామే గాదు తోడి వాళ్ళతో అనేసేవాడు! తన హృదయంలో తానే పొంగిపొయ్యేవాడు!—ఒకనాడు అతని టాంగాలో ఇద్దరు బారిష్టర్లు కూచుని కొత్త చట్టం మీద విమర్శలు కురిపించుకుంటూన్నారు. అతని ఆ మాటలన్నీ తిన్నగా అతి నిశ్శబ్దంగా వింటూ పొయ్యాడు. వారిద్దరిలో ఒకరు మరొకరితో ఇట్లా అంటున్నారు. "కొత్త చట్టంయొక్క రెండో భాగం ఫెడరేషన్ - అది ఇంతవరకూ నాకు బుర్ర కెక్కలేదు. ఇలాంటి ఫెడరేషన్ ప్రపంచంలో ఈ తేదీదాకా ఎక్కడా కనీవినీ ఎరగనిది!—రాజకీయ దృష్టితో కూడా ఈ ఫెడరేషన్ పూర్తిగా తప్పు. అదీగాక దీన్నేమనాలంటే ఇది ఫెడరేషనే గాదు——

ఈ బారిస్టర్ల మధ్య జరిగిన ఈ వాగ్వాదమంతా మంగూ పంతులుకు అర్థమైతూనే వుంది గాని మధ్య మధ్య కొన్ని ఇంగ్లీషు మాటలు ఉండటం మూలాన్ని ఆ భాగం తెలిసేదిగాదు. తనలో వీరిని గురించీ భారతదేశంలో వచ్చిన కొత్త చట్టాన్ని గురించీ వీరు చెడ్డగా తలుస్తున్నట్టు తెల్సుకున్నాడు. వీరిని దేశ స్వాతంత్ర్యం వ్యతిరేకించే వాళ్ళుగా జమ కట్టుకున్నాడు. అందుగ్గాను ఎన్నోసార్లు ఆ యిద్దరికేసీ మీ లెక్కేమిటన్నట్టు చూస్తూ తనలో

తాను 'దుర్మార్గులు' అనుకున్నాడు. అతనెప్పుడైనా తనలో తాను ఎవర్ని గురించైనా దుర్మార్గులు' అన్నందుకు ఎంతో తృప్తి పడ్డాడు. ఎందుకంటే, వాళ్ళకి సరిపొయ్యే మాటను తాను వాడగలిగానని; ఆ మాటను వాడవలసి నట్టుగా వాడానని తృప్తి అది!!—అందుకే అతనికి సాత్వికులను గురించీ, పెద్దవాళ్ళని గురించీ తెల్సుకుండే జ్ఞానం వుందని అనుకోవచ్చు—

ఈ వ్యవహారం జరిగిన మూడు రోజుల అనంతరం గవర్నమెంటు కాలేజీ విద్యార్థులు ముగ్గురిని తన టాంగాలో కూచోబెట్టుకుని, 'ఫరంగు'కు వెళ్తున్నాడు. అతను ఆ ముగ్గురిలో జరిగే చర్చను విన్నాడు.

కొత్త చట్టం నా కోరికల్ని పెంచేసింది. బహుశా...అసెంబ్లీ సభ్యుడు అయితే ఏ ఆఫీసులోనన్నా కొలువు దొరకవచ్చు నాకు—''

''అలానే అయితే, చాలా కొత్త చోట్లు గూడా సృష్టించబడవచ్చు. బహుశా ఈ గోలలోనే మన చేతులు గూడా కొంత పెద్దవి గావచ్చు! మనక్కూడా ఏమైనా దొరకవచ్చు!—''

''అవునవును. ఎందుక్కూడదు!''

''ఆ నిరర్థకపు గ్రాడ్యుయేట్లు ఎవరైతే దేశ దిమ్మర్లుగా తిరుగుతున్నారో వాళ్ళలో కొందరు తగ్గిపోవచ్చు!''

ఈ సంభాషణలో, మంగూ పంతులు హృదయంలో కొత్త చట్టం కొంత ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది. మరతను దీన్ని ఎలాంటి వస్తువుగా తలపోసేవాడంటే ఇది బాగా ప్రకాశించే దానినిగా.

''కొత్త చట్టం''

మరతను ఆనాడు ఎన్నోసార్లు ఆలోచించాడు. ఏదో కొత్త వస్తువు! అతని కళ్ళముందు తేపతేపా అతని గుర్రం క్రొత్త పట్కాలతో కన్పిస్తూ పోయింది. రెండేళ్ళ క్రితం ఖుదా బక్ష్ చౌకుదారీనుంచి ఆప్యాయంగా తగినంత విలువ బెట్టికొన్న పట్కాలు తగిలించుకున్న ఆ రెండు సంవత్స

రాల క్రింది గుఱ్ఱం. అప్పుడు పట్కాలకి మధ్య మధ్య తెల్లగా మెరిసే ఇనప బక్లెసులూ, మధ్య మధ్య ఇత్తడి పనితో అలంకారం చెయ్యబడి వెండి బంగారాల ఆభరణాలతో సజ్జీకరించినట్టు మెరిసిపొయ్యేది. అందుకని కొత్త చట్టం అతనికి తన గుఱ్ఱం కొత్త పట్కాల కోసం గూడా అవసరం గానే తోచింది.

ఒకటో ఏప్రిలు వరకు మంగూ పంతులు కొత్త చట్టానికి అనుకూలంగానూ, వ్యతిరేకంగానూ ఎంతో విన్నాడు. కాని, తన హృదయంలో దాన్ని గురించి ఏదైతే నిర్ణయించుకున్నాడో దాన్ని చెరుపుకోలేక పొయ్యాడు. ఒకటో ఏప్రిల్‌కు కొత్త చట్టం రాగానే అంతా వింతగా మారిపోతుందనుకున్నాడు. అతనికా నమ్మకం గూడా అనిపించింది. అది రావటం తోటే ఏ పరిస్థితులైతే ఏర్పడతాయో దానివల్ల తన కళ్ళకి చల్లదనం గూడా వస్తుందనుకున్నాడు. చివరికి మార్చి 31 కూడా గడిచిపోయింది. ఏప్రిల్ ఒకటి ప్రారంభానికి రాత్రి కొన్ని నిశ్శబ్దపు గంటలు మాత్రమే మిగిలిపోయాయి. ప్రకృతి మామూలుకు విరుద్ధంగా కొంచెం చల్లగావుంది. గాలిలోనూ ఏదో కొత్తదనమున్నట్టున్నది. ఏప్రిల్ ఒకటి కోడి కూతతో మంగూ పంతులు లేచాడు. గుఱ్ఱపు సావిట్లోకి వెళ్ళి గుఱ్ఱబ్బండిని దాని వీపుమీద పెట్టాడు. బైటికి వెళ్ళాడు. అతని శరీరంలో పొంగూ, కళ్ళల్లో మెరుపూ, గుండెల్లో శీవీ ఉండటాన మనిషి నిలువునా ధీమాగా ఉన్నాడు. కొత్త చట్టాన్ని చూట్టానికి కదిలాడు !—

అతని ఆ ఉదయపు చల్లని మసకలో ఎన్నో ఇరుకూ, విశాలమూ, అయిన గొందుల్ని తిరిగాడు. కాని, ప్రతీదీ పాతగానే కనబడ్డది ! ఆకాశం మాదిరి పాతది ! అతని చూపు ఈనాడు ప్రత్యేకమైన కొత్త రంగూ రేఖలను చూడటానికి ఉబలాటపడుతోంది. కాని, అదే పాతా, నిర్జీవమూ అయిన రంగు దప్ప అతనికి మరేమీ కన్పించనేలేదు !—ఇక అతని దృష్టి తన గుఱ్ఱం తల మీద కేంద్రీకృతమైంది అంతా సకల పాతదిగానే కనబడ్డది. కాని, దాని తలమీది తురాయీ కొత్తదిగా కనిపించింది. అది తాను

రానున్న కొ త్త చట్టపు సంతోషాన 31 మార్చి సాయంత్రం వేళ ఖుదా బక్ష్ చౌకుదారీలో, 0-14-6 కి కొన్నాడు. గుర్రపు డెక్కల చప్పుడూ, నల్లని రోడ్డూ, ఇరుప్రక్కలా కొద్ది ఎడంగా నిల్చుని వున్న కరెంటు స్తంభాలూ, దుకాణాల సైన్ బోర్డులూ, అతని గుర్రం మెళ్లో అలంక రించిన సన్నని గజ్జెలూ, వాటి మెత్తని చిన్నని సంగీతమూ, బజారులో ఎవరి పనిమీద వారు జోరుగా తిరిగే నడకా, వీటిలో ఏది కొత్తది ?? ఏదీ కొత్తగా లేదు ! కాని మంగూ పంతులు నిస్పృహ చెందలేదు—

ఇంకా చాలా వేకువ ఉన్నది. దుకాణాలు గూడా అన్నిటికి అన్నీ మూసివెయ్యబడే వున్నాయి.'' ఆ ఉద్దేశంతో అతను నిశ్చయించుకున్నాడు. అదీగాక అతను ఇలా గూడా ఆలోచించేవాడు అప్పుడప్పుడూ—

హైకోర్టులో తొమ్మిది గంటల పిదపనే పని ప్రారంభమైతుంది. ఇప్పుడు దానికంటే ముందు కొత్త చట్టాన్ని గురించి ఏ చూపు వస్తుంది?''

అప్పుడతని టాంగా గవర్నమెంటు కాలేజీ దర్వాజాకు సమీపానికి చేరుకుండేసరికి కాలేజీ గడియారం పెద్ద గంభీరంగా తొమ్మిది కొట్టింది. విద్యార్థులంతా కాలేజీ గేటుగుండా బైటికి వస్తోన్నారు. అంతా ఖుషీ ఖుషీగా వుంది. కాని, మంగూ పంతులుకు తెలియకుండానే అతని బట్టలు మాసి మాసిపోయినట్టుగా ఎందుకు కనిపించినై ! ఒకవేళ అందువల్ల ఇలా ఉన్నది గదాంటే అతని దృష్టి ఇవ్వాళ ఏదో కొత్త విశేషం చూసేదానిలా వుంది.

టాంగాను ఎడమచెయ్యి జాపి ఆపి, అతను కొంచెం సేపాగాక మళ్ళీ అనార్కలీలో ఉన్నాడు. బజారులో సగం దుకాణాలు తెరవబడ్డాయి. ఇంకా, ఇప్పుడు లోకుల రాకపోకలున్నూ పెరిగినై. మిఠాయి దుకాణాల మీద జనసమ్మర్దం ఎక్కువగా ఉంది. జనరల్ మర్చంట్సు ఆకర్షణీయ మైన ప్రదర్శనపు వస్తువులు అద్దాల బీరువాలలోనుంచీ ప్రజల కళ్ళను తమ వేపు తిప్పుకుంటున్నాయి. పక్కలనున్న ఎలక్ట్రిక్ తీగెలమీద ఎన్నో పావు రాలు వాటిలో అవి జగడా లాడుకుంటున్నై ! కాని, మంగూ పంతులుకైతే

ఆ అన్నివస్తువులలో ఏదీ హృదయం కదిలించేదిగా లేదు! అతను కొత్తఖానూన్ను చూడాలనే ఆదుర్దా, ఆలోచనలలో వున్నాడు.—— మంచిది ఇదే విధం! ఏవిధంగానైతే అతను తన గుర్రాన్ని చూస్తున్నాడో!

అప్పుడు మంగూ పంతులు ఇంట్లో శిశూదయం కావాలిసిన వేళలు. అయితే అతను నాలుగైదు నెలలుగా మిక్కిలీ అనవసరంగా కాలక్షేపం జేశాడు. అతనికో నమ్మకం ఉండేది. ఏదో ఒకనాడు శిశువు తప్పక జన్మిస్తుంది అని; కాని, అతను అనర్థకంగా గడియలను గడపలేక పొయ్యేవాడు! అతను అనుకుంటూనైతే ఉండేవాడు. తన కొడుకును ఒక్కసారి, కేవలం ఒక్కసారి చూసుకుందామని! కాని, ఈ అపురూపపు కోరికకు అత నెన్నోసార్లు తన అనారోగ్యపు భార్య దగ్గరికి పోయి ఆమె కడుపును మాటిమాటికీ తడిమి చూసేవాడు. అంతేనా! ఆమె నిండు గర్భంమీద తన చెవి బెట్టిన్నీ చూస్తూ కుర్రాడి జననానికి ఎదురు చూస్తోండేవాడు. అయితేం! ఏమీ ప్రయోజనం లేకపొయ్యేది—ఒకసారి అతడు నిరీక్షించగా నిరీక్షించగా విసుగ్గూడా పుట్టింది. ఈ విధంగా చెయ్యగా చెయ్యగా సంవత్సరమున్నూ తిరిగివచ్చింది. ప్రతీసారీ ఆమె మరణించినదానిలా పడివుండేది——

...“లేచి కొంచెం తిరుగుతూండు. నీ శరీరానికి స్వాస్థ్యంగా ఉంటుంది. బల్లలా పడివుంటే లాభంలేదు! ఇలా వుంటేనే నీకు ప్రసవమయితుందనుకుంటున్నట్టుంది!” అంటాడు భర్త.

మంగూ పంతులు గర్భిణీ పరీక్ష తెలిసినవాడు. ఇతని భార్య గంగాదేవి ఈ రకమైన దుస్థితిని గూర్చి అనుకునేది——“భావిని తవ్వనేలేదు. అప్పుడే దాహంకోసం డస్సిపోతున్నావు!” అంటుంది భార్య.

ఏమైనా కానియ్యండి మంగూ పంతులును పిలిపించినట్టయితే, అతనితో తెలుసుకుంటే ఇంత విచార ముండదు——ఎందుకంటే అతనికి నా ఆరోగ్యం గురించి బాగా తెల్సు!

అతడోనాడు కొత్తచట్టపు ప్రయోగాన్ని చూట్టానికని ఊళ్ళోకి బైల్దే రాడు. ఎలా అయితే గాంధీగారు జవహర్‌లాలుగారి ఉత్సవోత్సాహాన్ని చూడటానికి బయలుదేరుతారో అలా !

భార్య తన ప్రసవాన్నిగురించే ఎంత ఆసక్తి ఆందోళనా పడేదో మంగూ పంతులుకు 'నయాఖానూన్'ను పరీక్షించాలని అంత ఇదీ ఉండేది!

గొప్ప నాయకుల మెడలో దండలా మంగూపంతులు కొత్తచట్టాన్ని తన మెడలో ఎప్పుడు ధరిస్తాడు !

ఎవరైనా బంతిపూలదండ వేసుకుంటే ఎంత ఆనందం అందంగా అనిపిస్తుందో మంగూ పంతులుకు గూడా తన కొత్తఖానూనుమీద అలానే వుండేది !

సభలో నాయకుడికి ఉపన్యాసంమీద ఎంత ఉత్సాహమూ ఉబలాటమూ ఉంటుందో, మంగూ పంతులుకు తన కొత్తఖానూన్ ప్రచారం చెయ్యాలని అంతగానూ ఉండేది !

అనార్‌కలీ భవనం నుంచీ బైల్దేరి మాల్ రోడ్డుమీద తన టాంగాను నిమ్మళంగా నడుపుతోన్నాడు. మోటారుషాపుల దగ్గర సీడకు టాంగాను పోనిచ్చాడు. ఆ శిబిరాల దగ్గర ఏదైనా సవారీ దొరికి బేరం కుదిరితే తన గుర్రాన్ని అద్దెకిద్దామనుకున్నాడు !!—

కానీ, ఒకందుకు మంచిదే అయింది. శిబిరాల దగ్గరనున్నా కొత్త చట్టం ప్రచారం జరగగలదని !......

శిబిరం దగ్గరికి పోయాక మంగూ పంతులు తన ఉద్దేశమైన కొత్త చట్టాన్ని తెలియజెప్పటానికి లంకించుకున్నాడు. జేబులో నుంచీ సిగరెట్టు దీసి ఎడమచేతి చివరిరెండు వేళ్ళలో బిగించి పట్టి వెలిగించాడు. టాంగా ముందుగా కింద వున్న చెక్కమీద కూచున్నాడు. మంగూ అప్పుడు తాను ఎలా వెళ్లాలీ ! ఏ మెక్కి వెళ్లాలీ ! ఏమీ అనుకోలేదు. నిజానికి చెప్పాలంటే మొత్తంమీద ముందుసీటు విడిచి వెనకసీటుమీద మాంచినమ్మకంగా

కూర్చుని తన గుర్రం కళ్లేన్ని ఎడమచేతికి చుట్టుకున్నాడు. ఇల్లాంటి సమయాల్లో ఆ గుర్రం కొద్దిగా సకిలించిన తరవాత చాలా ధీమాగా నడవటం మొదలెట్టేది. అలా కొంచెం సాగాక దౌడుతీసేది !...

గుర్రపు ఈ సవారీవల్ల మంగూ పంతులుకు ఆలోచన అనేది అడుగైనా సాగకండా బహు స్తబ్ధమైనాయి. ఆ గుర్రం ఎలా నెమ్మది నెమ్మదిగా నడుస్తుందో అలాగే అతని మెదడులో కొత్తచట్టాన్ని గురించిన ఆలోచనాపరంపర సాగుతోందేది—

ఆ కొత్తచట్టం రీత్యా మున్సిపల్‌కమిటీనుంచీ టాంగాల నెంబర్లు దొరికే విధంమీద ఆలోచిస్తున్నాడప్పుడు. మరిన్నీ ఆ దృఢాలోచనతో కూడిన పాత కొత్త మాటల తీరుల వెలుగులో చూడటానికి నిర్ధారించుకుని ఉన్నాడు. అప్పు డతని ఊహాపోహాలు తల మునకగా ఉన్నాయి. అతనికి ఇలా అనిపించింది, ఎవరో ప్రయాణీకుడు తనను పిలిచినట్టు, వెనక్కు తిరిగి చూసేప్పటికే రోడ్డుకు ఆవలిపక్క దూరంగా ఎలక్ట్రిక్ స్తంభాల దగ్గర ఒక గుర్రం నుంచుని కనిపించింది. అది ఇతని చేతితో పిల్చినట్టుగానూ, అని ఎవరో చెప్పుతోన్నట్టుగానూ అనిపించింది. ఇదంతా ఎందుచేతో అతనికి గుర్రాలంటే మహా చెడ్డ విరక్తిగా తోచింది. వెంటనే అతను తాజాగా, జోరుగా నడిచే తన గుర్రం ఆకార ప్రకారాల్ని చూశాడు. మంగూ హృదయం విదిలించినట్టుగా విరక్తిలోకేపోతోంది. మొదట అతని మనస్సులో ఏమనుకున్నాడంటే దాన్నిగురించి ఏమీ కలిగించుకోగూడదనీ, దాన్ని వదిలిపెట్టి వెళ్లాలనీనూ !—కాని, పిదప అతనికి జ్ఞాపకంవచ్చింది. “దాని డబ్బులు విడిచిపెట్టటం గూడా బుద్ధిహీనతే. ఏదైతే పద్నాలుగణాల స్నర ఖర్చైందో అతని జేబునుంచే వసూలు చెయ్యాలని-పోదాం పద !”

ఖాళీరోడ్డుమీద శుద్ధ ఖాళీ టాంగాను తిప్పి గుర్రానికి కొరడా చూపించాడు. చూడండి ఇక కన్నుమూసి తెరిచేంతలో ఆ ఎలక్ట్రిక్ స్తంభాల దగ్గర ఉంది టాంగా ! గుర్రం కళ్లాన్ని బాగా వెనక్కు లాగిపట్టి ఆపు

జేశాడు టాంగాను! తాను దాని వెనకగా ఉన్న సీటులో అలా కూచుని కూచుని గుర్రంతో అన్నాడు—

—"మహా ప్రభువుగారు ఎక్కడికి వేంచెయ్యాలనుకుంటున్నారు?"

ఈ ప్రశ్నలో గొప్ప అర్థాన్నే కడుపులో బెట్టుకున్నాడు. 'మహా ప్రభువు' అనే సమయంలో గుర్రం పై పెదవిని నొక్కుకున్నది! దాని ముక్కు రంధ్రాలనించి గడ్డం పైదాకా మెడమీది జూలు కదిలేట్టుగా శ్వాస వదులుతోంది! అకస్మాత్తుగా ఆగిపోయింది చాకుతో చేవకర్రను కోసినట్టుగా దాని ముఖమంతా నవ్వుతోన్నట్టుంది. ఇది చూసి మంగూ తనలో తాను ఆత్మజ్వాల మండించి భస్మం చేసుకున్నాడు!

సరీగ్గా అదే సమయంలో 'గోరే' ఎలక్ట్రిక్ స్తంభం దగ్గరనుంచుని సిగరెట్టు కాలుస్తోన్నాడు. ఇటు తిరిగి టాంగావేపు ఓ అడుగు వేశాడు. మంగూ పంతులు అకస్మాత్తుగా అతని కంట్లో బడగానే ఇట్లా అనిపించింది. గభీమని ఎట్టఎదురుగా తుపాకి గుండు వదిలినట్టుగా! ఒకరొకరుగా డీకొని ఒక అగ్నిజ్వాల పుట్టినట్టుగా అవుపడ్డారు!—

మంగూ పంతులు చేతులో కళ్లెం వదిలి టాంగామీదినుంచీ కిందికి దిగుతోండగా తన ముందు నిలబడి చూస్తోన్నాడు గోరే! అతడు ఇతని సర్వావయవాలనూ ఒప్పరికించి చూస్తోన్నాడు—గోరే తన స్వభావ సిద్ధమైన దృష్టితో మంగూ పంతులు దాడి తాకిడీని తప్పుకునే ప్రయత్నంలో ఉన్నాడు—

గోరే సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూ మబ్బులు మబ్బులుగా పొగలు వదుల్తూ ప్రాణం కాపాడుకోవాలనే ఆదుర్దాలో అన్నాడు. 'పోవోయ్ వెధవా మళ్ళీ గడ్‌బిడ్ చేశావా!!' అని—'అవునదే!' అచ్చం ఇవే భావాలు మంగూ పంతులు హృదయంలోను నాట్యమాడజొచ్చాయి!

'అవునదే' అన్ని అక్షరాలను మంగూ పంతులు నోట్లో లోపల లోపలనే అనుకున్నాడు. వెంటనే అతనికి పూర్తిగా తోచింది గదాంటే ఆ గోరే ఎవరు తన ముందరనే నిల్చుని ఉన్నాడో, వాడే.

గత సంవత్సరం ఎవరితో తనకు జగడం అయిందో, ఏ తీవ్ర పోరాటపు ప్రభావం గోరే మెదడులో సారాయిలాగా ఎక్కివుందో, అతని చెవులకు ఆనాటి ఆ భీషణ భాషణాలన్నీ వినిబడజొచ్చాయి—మంగూ పంతులు గోరే మెదడును సాఫీ చేసి ఉంటాడు. లేదా తల ఎగరగొట్టే ఉంటాడు. కాని అతనేదో స్వంత కారణాలవల్ల మెదలకుండా ఊరు కున్నాడు. అతనికిది తెలుసు. ఈ రకం తగాదాలు కోర్టు కెక్కితే సాధార ణంగా తమలాంటి వాళ్ళమీదే పడ్తాయని—

మంగూ పంతులు, పోయిన యేటి తగాదా, ఒకటో ఏప్రిలునుంచి వచ్చే కొత్త ఖానూఞమీద దృష్టి పెట్టుకుని గోరేతో అన్నాడు—''ఎక్కడికి పోవాలని అడుగుతున్నావ్?''

మంగూ పంతులు చేతులో మాంఛి చురుకైన కొరడా తాడు ఉంది.

గోరే అన్నాడు 'హీరామండీ' అని—

''అయిదు రూపాయలైతుంది కిరాయా''(బాడుగ)మంగూ పంతులు మీసాలు కదిలాయి.

ఇది విని గోరా హైరాఞ అయినాడు—అతని బిగ్గరగా అన్నాడు— ''అయిదు రూపాయలా!—ఏం నీవు...?''

''అవునవును తప్పకండా అయిదు రూపాయలు'' ఇలా అంటూ మంగూ పంతులు మండుతోన్న వెంట్రుకలు తడుముతోన్న చేతినివిప్పి ఒక భయంకరాకారంగా కనిపించాడు—

''ఎందుకు పోతున్నావ్? ఎందుకీ అనవసరం మాటలు?''

మంగూ పంతులు రూపం మరీ కఠినమైపోయింది—

గోరా గత సంవత్సరపు సంగతిని దృష్టిలో పెట్టుకుని మంగూ పంతులు వెడలుపాటి తేనె కండ్లను నిర్లక్ష్యంగా చూశాడు—ఇంకా అతనే మనుకుంటున్నాడంటే వాడి తల తిరిగిపోతోందని—గోరే ఇలా అనుకుంటూ మంగూ పంతులు టాంగా కేసి నాలుగడుగులు వేశాడు. ఆ టాంగా ఎక్కాడు. మంగూ పంతులును టాంగా దిగమని సంజ్ఞ చేశాడు. గోరా తన చేతులో వున్న వెదురు బెత్తంతో మంగూ పంతులు పిర్రలమీద రెండు మూడు సార్లు కొట్టాడు. అతనలా నుంచుని గోరేను కిందినుంచి మీదికి తేరిపార జూశాడు. బహుశా అతని తన బరువైన చూపులతోనే వాడిని ముక్కలుచేసి పెట్టాలనుకున్నాడు. వెంటనే అతని పిడికిలి విల్లులోనించీ దూసుకువచ్చే అమ్ములాగా పైకి లేచింది. చూపుతో ఒక దెబ్బ గొట్టుతోనే నిల్చున్న పళంగా గోరా వీపుకిందికి తన శరీరాన్ని పోనిచ్చాడు. ఒక నెట్టునెట్టి అతని గోరాను కిందికి తోసేశాడు. వెంఠనే తాను కిందికి దిగి అతనిని చెత్త మాడేట్టు గ్రుద్దటం మొదలెట్టాడు——

మంగూ పంతులు బలమైన బాహు పంజరంలో ఇరుక్కుపోయిన గోరే ఇటూ అటూ మసలుతూ, మంగూ పంతులు బలమైన పిడికిటి పోట్ల నించీ తప్పుకుని బ్రతికే ప్రయత్నం చేశాడు. కాని అప్పుడు చూశాడు గదా అతని విరోధంలో పిచ్చితనపు నిజమైన స్థితి తారట్లాడుతోంది. అతని కండ్లలోనుంచీ పట్టుదల ప్రవహిస్తోంది. కాని అతను జోరు జోరుగా అరవటం ప్రారంభించాడు. అలా అరవటం చెయ్యటంలో మంగూ పంతులు చేతుల పని ఇంకా తీవ్రం జేశాడు—అతను గోరేను బ్రతికినన్నాళ్ళూ జ్ఞాపకం ఉండేట్టు పీటు రేగకొడుతున్నాడు—వెంటవెంట ఇలా అంటూపోతున్నాడు—

"ఏప్రిల్ ఒకటి తర్వాతగూడా అదే మిడిసిపాటు!...ఏప్రిల్ ఒకటి తర్వాతగూడా అదే మిడిసిపాటు!...ఇప్పుడు మా రాజ్యమోయ్ బచ్చా!!"

జనం గుమిగూడారు. ఇద్దరు పోలీసు సిపాయిలు బహుకష్టంమీద గోరేను మంగూ పంతులు చేతుల్లోనించి బైటికితీశారు – మంగూ పంతులు

ఆ యిద్దరి సిపాయీల మధ్య నుంచుని ఉన్నాడు - అతని వెడలుపైన ఛాతీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలవల్ల పైకీ కిందికీ అవుతోంది. నోటినుంచీ వెచ్చగా సెగలు పొగలు వెళ్ళుతోన్నై. చిరునవ్వునవ్వుతూ కండ్లతో నిర్భీతిగా గుమిగూడి ఉన్న ఆ జనంవేపుచూసి నవ్వుతూ అతను ఎలుగెత్తి అనబోయాడు.

"ఆరోజులు గతించిపోయినై. ఎప్పుడు ఖలీల్ ఖాన్ పావురాలను ఎగరవేసేవాడో !—ఇప్పుడు కొత్త ఖానూన్ (చట్టం) అబ్బాయీ-కొత్త ఖానూన్!"

పాపం ! ముడుచుకుపోయిన ముఖంతో గోరా, బుద్ధిలేనివాడిలా ఒకోసారి మంగూ పంతులు కేసీ, ఒక్కొక్కసారి ఆ జనం కేసీ చూస్తోండే వాడు.

మంగూ పంతులును ఆ పోలీసు సిపాయీలు ఠాణాకు తీసుకుపోయారు-దారి పొడుగునా, ఠాణా(స్టేషన్)లో ఇనప కటకటాల గదిలోనూ అతను "కొత్త ఖానూన్" "కొత్తఖానూన్" అని కేకలేస్తూనే వున్నాడు. కాని ఇంత ప్రపంచంలో ఎవరూ ఆ కేక విన్నవారు లేరు !!—

"కొత్తఖానూన్ - కొత్తఖానూన్ అని ఏం వదురుతున్నావ్ !— ఖానూన్ అదే వుంది పాతది !!"

తరువాత ఇతనిని నేరస్తుడుగా ఖైదు(జైలు)లో బంద్‌చేశారు !!!



రచయిత:
"ఇబ్రాహీం జలీస్"

# గులాబీ చెక్కిళ్ళు

మూలకథ పేరు:
"ఇర్ద్ చహ్‌రే"

ఆసిఫ్ చెల్లెలు యౌవనంలో వుంది. ఐదేళ్ళనించీ వరుడికోసం ప్రతీక్ష చేస్తోంది. కాని, ఇంతమటుకు తెలియదు, ఆమె భర్త యెవరో, ఎట్లా వుంటాడో! ఎక్కడుంటాడో! ఎప్పటికి రానున్నాడో!!—

ఆసిఫ్‌కు ఏదో ఇలా అనిపించేది. ఎప్పటిదాకా, తన చెల్లెని బుగ్గల మీద పచ్చపచ్చని బంతిపూచెండ్లు వికసించినట్లు ఉంది—ఆమెభర్త ఎప్పటికీ రానేరాడేమో! ఎంచేతంటే పెళ్ళికొడుకు బంతిపూల గుత్తులంటే పసందు చెయ్యడు. ఎర్రఎర్రని గులాబీలంటే ప్రాణం విడుస్తాడు. అతని స్నేహితు రాండ్లు హాజిరా, పరోత్‌మా, జహారా, షీలా, సఈదాల చెంపలమీద ఎంత పెద్ద పెద్ద ఎర్రని గులాబీలున్నాయి!! వారి భర్తలు ఎంత తొందరగానూ, ఎంత తన్మయంగానూ, ఎంత ఆరాటంగానూ వచ్చివచ్చి ఆ ఎర్రఎర్రని పూలను కోసుకుతీసుకుని వెళ్లారు. ఇప్పుడు ఆవీధి అంతటికీ ఒక పూవు మాత్రమే మిగిలి వుంది! తన చెల్లెలు ఏదైతే పూర్తిగా ఐదేళ్ళనించీ కలల్లో నీడల్లో భావనలలో పచ్చపచ్చని బంతిపూల బుగ్గలతో పెండ్లికుమారు డికి కనిపించవచ్చునేమో! బహుశా కలలలో అతనికి ఆమె కనబడవచ్చనీ, భావనాపథంలో వస్తాడేమోననీ, శూన్యంలో తనవేపు దిగుతాడేమోననీ!! కాని, ఆమె అయితే భూమిమీదనే ఉండేది. శూన్యాలలో, భావాలలో, కల లలో వచ్చే అందగాడు నేలమీద కెట్లా దిగుతాడు! అతనైతే కలల మెత్త మెత్తని పై పై అంచులమీదిగానే నడవగలడు. ధరిత్రి అయితే అతనికి గాఢ కఠినం! గరుకు గరుకుగానూ అయోమయంగానూ ఉంటుంది?

ఆవీధి వీధంతా ప్రతిధ్వనించేది ఆసిఫ్ చెల్లెలికి మనస్సు వ్యాకులత గలిగింది అని; కాని, డాక్టర్లకు చూపిస్తే వ్యాకులం గీకులం ఏమీలేదు, అది కేవలం ఒక వ్యాధి అని. నిడుపైన ఆమె చిన్నారి చిలిపితనం ఏదైతే మిక్కిలీ ఆశావహంగా ఉంటూండేదో, నిడుపుగా ఉంటూ ఉంటూ ఆమె వ్యాకులపు కంఠంలో వెయ్యటానికిగూడా వీలులేకుండా వుండేది :...క్రమ క్రమంగా అతని చెల్లెలి కుర్రతనం పొడుగు అవుకుంటూ పోతోంది. అదీ ఆమె మనోవ్యాధిలో మగ్గిమగ్గి ఎండిఎండి పొడుగు అవుకుంటూపోతోంది. ఎముకల పొడుగే పొడుగు అయిన అస్థిపంజరం :...

చెల్లెలి వివాహ నిశ్చయపు తళుకులు ఏరటానికి అతను ఏమేమి చేయలేదు ? అప్పట్లో తండ్రి ఏరోగమూ నెప్పీ లేకుండా అకస్మాత్తుగా చనిపోతే అతను న్యాయశాస్త్రం చదువుతూ చదువుతూ అసంపూర్తిగా వది లేసి ముప్ఫైరూపాయల సామాన్యపు గుమాస్తా ఉద్యోగానికి గత్యంతరం లేక ఒప్పుకున్నాడు—ఒకవేళ అతని చెల్లెలు లేనట్టయితే, లేక యువతి గాక పోతే, లేక బీదతనం లేకపోతే, తమ ప్రసిద్ధమైన వంశాచారానికి తగ్గట్టుగా తండ్రిలాగానే ఏ వకాలతో ఏదో స్వతంత్రవృత్తి నవలంబించేవాడు. ఇల్లా గుమాస్తాగిరీ ఎప్పటికీ చెయ్యడు. తమ నరనరాలలో ప్రవహించే స్వతంత్ర గుణం తమ పూర్వులనించీ సంక్రమించినదే ! తన తండ్రి మాదిరిగానే తానున్నూ ప్రభుత్వాన్ని ఎదుర్కొంటూండేవాడు. కాని, ఇంత చిన్నవయసు లోనే తండ్రి మరణించీ, నెలసరి ఆదాయం ముప్ఫైరూపాయలకు మించ కుండా వుండీ, చెల్లెలు యుక్తవయస్కురాలై పెళ్ళికి ఎదురుచూస్తోనూ, చెల్లెలు చెంపలమీద బంతిపూలు చెరుపుకొనివుండీ, ఉంటే అతను ప్రభుత్వాన్ని ఎదుర్కొండే దశదాకానా ! అసలు ఈ గుమాస్తాగిరీనుంచీ ఎట్లా గెలవగల్గు తాడు !!—

కాని, ఆసిఫ్ చెల్లెలు ఇంకా ఈడేరకముందే వయస్సును మించిన వికాసం గలిగి ఉంది. పాపం ! అతనైతే ఉదయంనుంచీ సాయంత్రందాకా కచేరీలో మేజుముందర వంగి పడివుంటాడు. పైరవీకార్ల చివాట్లు వినసట్టు

వింటూ నెలకునెలా ముప్పైరూపాయలూ తెచ్చి చెల్లెలి చెంగులోపోసేవాడు. అతనంత కష్టాల కావిళ్లు మోసినా ఆమె పెదవులమీద చిరునవ్వు చిందేది గాదు! దానికి ముందుకుముందే చెంపలమీద నెత్తురు ధార గడ్డకట్టిపోయి నట్టుండేది. కుంకుమలాంటి ఒక చిన్నరేఖ అయినా పండ్లదాకా పాకేదిగాదు. ఇదేమాటమీద అతడు కేకలు వేసేవాడు. ఏమ్మాటకండా ఆమెను విదిలించి వేసేవాడు. కాని, అప్పుడు మొదలు మొదలు పూలమీద మంచు చుక్కలు ప్రాకులాడుతోంటే, అతను ఆ తడిసినపూలను మాసిన తన దబీజ్‌కోటు పొడుగుపాటికాలర్లలో దాచిగూడా తాను ఏడవటానికి లంకించుకునేవాడు. కారణం: మంచుబొట్ల పూసలతో కడగబడ్డ పూలరంగు ప్రమాద స్థితిదాకా పోతుంది! ...

అయినా, అతను నిరాశావహుడు గాలేదు. అతనికి బాగా నమ్మకం ఉండేది. ఏదో ఒకనాడు తన చెల్లెలికి అనురూపవరుడు కలలలో, భావాలలో శూన్యాలలో, దాటి నెట్టుకుని ఈ నేలమీదికి రాగలడు అని! దానికి అతని ఉద్దేశంలో వరులు చాలా లాలూచీగా ఉంటారు అనీ! పూలు ఎంత మామూలువి అయినప్పటికీ పచ్చనివి ఎందుక్కాకూడదు! ఒకవేళ వాళ్ళకి వెండీ బంగారాల పూల సజ్జలోపెట్టి సమర్పించుకుంటే వరుడు కళ్లు మూసు కుని మర్తేటే ఆ పూలసజ్జను అందుకుంటాడు!...ఇందువల్లనే అతను గుమాస్తాగిరీగాక పత్రికలూ - మాస సంచికల కార్యాలయాల్లోగూడా సగం సగం రాత్రిదాకా పనిచెయ్యటం మొదలెట్టాడు. అతని ఆదాయం 60-70 రూపాయలదాకా పెరగజొచ్చింది—

పొద్దున్నే తలదువ్వుకుండేప్పుడు అద్దంలో తన ముఖం చూసుకుండే వాడు. అర్ధరాత్రిదాకా పనిచెయ్యటంవల్ల తన చెంపలమీది ఎర్రని రేఖలు కళ దగ్గిపోయి అవుపించేవి. అయినా, ఆ యెర్రని చారల అవసరం మటుకు ఏముంది! అతనైతే కోరుకుండేవాడు ఈ ఎర్రనిరేఖలు తన చెల్లెలిచెక్కిళ్ళ మీద ఉంటే ఎంత బావుండునో అని! ఇక చాలు!—అదీగాక ఇలాగాక పోతే అతను తన చెల్లెల్ని వెండి బంగారాల నగలతో తళతళా మెరిసేలా

శృంగారిస్తే, హాజిరా-పరోత్‌మా-జహీరా-షీలా-సఈదాల ప్రియుల కళ్ళు మిరుమిట్లు గొలుపుతై !—వాళ్ళు తమ అనవసరపు వ్యర్థపు చిరునవ్వుల ఎర్రని చెంపలతో సిగ్గుపడతారు ! మరిన్నీ ఆ పట్టణపు వీధుల్లోనించీ వరుడు తన చెల్లెలి మెడలో వున్న హారాలు పట్టుకుని ఆమెను మేళతాళాల, తాషామర్ఫాల ధ్వనులూ; బాణాసంచాలూ, లైట్లూ మెరిసే మెరుపు కాంతులలో జయం పొందిన వాడులాగా తీసుకుని వెళ్తాడు ! అప్పుడు ఈ హాజిరా వీళ్ళంతా చేతులు నలుపుకుంటూ తమతొందరబాకీతనమూ, తమ బుద్ధిహీనతా ఎచ్చులూ తల్చుకుని పశ్చాత్తాప పడుతోంటారు !!—

ఏ నెలలో అతని ఆదాయం నెలకు 85 రూపాయలదాకా పోయిందో అతని చెంపల వెలుగు సొంతం దట్టంగా ఆవరించుకుపోయింది. ఎందుకంటే అతని ముఖాన్ని చూస్తే ఇలా అనిపిస్తుంది, అతను ఏదైనా ఎర్రరంగు అద్దాల కిటికీనుంచీ ఫోకస్ అవుతోన్న వెలుగులో నిలబడివున్నట్టు ! అతని చుట్టాలూ స్నేహితులూ ఎప్పుడూ అతని పచ్చగా మునిగిపోయిన ముఖాన్ని చూస్తోంటే చేదుచేదుగా ఎగతాళి చేసేవారు !

"చికిత్స చేయించుకోండి తమరు ! ఏ పిల్లయినాచూస్తే తమర్ని పెండ్లాడటానికి పసందు చెయ్యదు !"

"యౌవనమంతాగూడా స్త్రీ లేకుండానే గడిచిపోతుంది !"

ఈ ధోరణులు విని అతను చిన్ననవ్వులు నవ్వుకుండేవాడు. అవన్నీగాక అతని పెదవులు మిక్కిలిగా చిన్ని నవ్వు పరుచుకునుంటాయి ! ఎంత ఆపుకున్నా అతను చిన్నగానన్నా నవ్వకుండా ఉండలేకపొయ్యేవాడు ! ఒక నెలలో అతనికి 85 రూపాయలు దొరికాయి. అతని 85 సార్లు చిరునవ్వు నవ్వుకున్నాడు—

అరే ! ఏ పిల్లయినా వివాహం ఆడకపోనీ, ఆమె పుణ్యామా అని ! యౌవనం కేవలమూ స్త్రీ పర్యంకంలో గడపటానికోసమేలేదు ! యౌవనం వీధి ఉత్సాహాలలోనూ, స్త్రీల ఏకాంతాలలోనూ గడపటానికే ఇవ్వబడలేదు! యౌవనమైతే 'ఆలీఫ్ లైలా'లవంటి శూరుల్లాగా అతల పాతాళాలు

గాలించటం,'' కాగా తతిమ్మాది మొత్తం అతను తన మనస్సులో మనస్సులో ఊరికే ఊరికే అంటాడు !

''యౌవనం జీవితంతో పోరాడటానికి ఉన్నది. తన యౌవనం తన తోబుట్టువులకు వరాన్వేషణ చెయ్యటానికీ, పుంస్త్రీలను చెయ్యటానికీ ఏర్పడింది. వాళ్ళ సిగ్గుల పేరాసల రంగూ వాసనలకోసం ప్రాణం అర్పించే వాళ్ళయిన పెళ్ళికొడుకులను ఆకాశంనుంచీ భూమిమీదకు గుంజుకురావ టానికి అయివున్నది—నేను నా చెల్లెల్ని ఉజ్వలమైన పెళ్ళికూతుర్ని చేస్తాను. అది తాజ్‌మహల్‌కంటే ఎంతో శోభాయమానంగా ఉండగలదు !''

ఇలా కొన్నినెల్లు గడుస్తూపొయ్యాక అతను నెలకు నూరు నూరూ, నూట పాతికరూపాయలదాకా సంపాయించటం మొదలెట్టాడు. ఆరోగ్యమా రోజుకురోజూ దిగనాసిల్లిపోతోంది. ప్రాణబంధువు చెల్లి ఏడవటం మొత్తు కోవటం—కాని, ఆ గుడ్డివాడు పగలు పొద్దుపొడవకముందునుంచీ రాత్రి చీకట్లు పడ్డాకగూడా రూపాయలవెంట పరుగెత్తుతున్నాడు ! తన నిద్రా, తన ఆహారమూ, తన ఆలోచనా పరిధులూ - స్వప్నాలూ - యౌవనమూ- అంతేనా, తన లోకాన్ని గూడా మరచిపోయాడు ! తన యిల్లూ లోకమూ మీద దేనివల్లనో అతనికి ఒక అణగి మణగీ, మూతబడి దాగిన ఇంకా దొంగప్రేమ ఉంది! అతని పెద్దపెద్ద కళ్ళనించీ బైలుదేరిన బాణాలు అతని హృదయంలో అంతులేని కళ్ళను సృష్టించినై !

ఒకనాడు అతగాడు డస్సిపోయి ఇంటికిచేరాడు. మంచంమీదబడి చెడ్డగా దగ్గటం ప్రారంభించాడు. గబగబా వచ్చి చెల్లెలు అతని బూట్లుతాళ్లు విప్పింది. అతని మాసిన దబీజ్‌కోటును విడిచింది. వచ్చి తలాపునకూచుని నీలగిరి తైలంతో అతని గుండెను మాలిష్ చెయ్యటం మొదలెట్టింది. అతను చిరునవ్వుకళ్ళతో, తన మూగతనపు, విధిలేని చెల్లెలి పచ్చపచ్చని ముడుచుకుపోయిన కుమిలిపోయిన ముఖాన్ని చూస్తూ అన్నాడు—

''నా చిన్నారి చిలకా ! మన తండ్రిపోయిన మార్గాన్నించీ తొలిగితే మటుకేమైంది ! నేను ఇప్పుడు నా నీడలో నీ చేతులను ఇలాంటి ఎర్రఎర్రని

గోరింటరసంతో అలంకరిస్తానుగదా !! కాని...అవును...నీవు వెళ్ళు. ఇదే మాటమీద నాకోసం మంచి చాయ్ చేసి పట్టుకురా——''

నిండిపారే దరహాసంతో చెల్లెలు ముఖంతిప్పుకుంటూ వెళ్ళిపోయింది. తన అన్నగారి ఈ పరిస్థితి జూసి తన చేతులకు గోరింటరంగువేయటం—— చూడటానికి బొత్తిగానే నిరాశ చెందిపోయింది !

సంతోష సమయాలలో బుద్ధి ఎక్కడికి వెళ్ళిపోతుందో! అతడు తన నీడను తన తండ్రి నీడతో సమంగా పోల్చిచెప్పాడు. వాళ్ళ తండ్రయితే తినాకుడవావున్న పురాతన హిందూస్తానపు ఒక భారీ మోతుబరీ ఆసామీగా ఉండేవాడు. ఆరడుగుల ఎత్తు శరీరమూ, ఒకడుగు మందమూనూ ! అదీ గాక అతని ఆదాయం తన ఆదాయంకంటే ఐదారురెట్లకంటే ఎక్కువగా ఉండేది. అతని నీడలోనైతే పద్దెనిమిదిమంది ఏకకుటుంబంగా పోషింప బడేవారు——ఎంతోమంది బీదచుట్టాలు వివాహ నిశ్చయాలకోసం ఇక్కడికి వచ్చిపడి ఉండేవాళ్లు. ఇప్పుడు ఈ బడాయి కొట్టేవాడు ఎముకలుకూర్చిన పొడుగాటి ప్రాణమున్న బొమ్మమాత్రమే ! మాసిమాసివున్న ఆ దబీజ్ కోటు విడిస్తే అతని నీడ టెలిఫోన్ స్తంభం మోస్తరుగా ఇంత పలచగా కురచగా ఉండేదిగదాంటే ఒకటే బక్కపలచని నీడగాని నీడ మెత్తని మేలైన చెల్లెలి యౌవనపు ఎండకూ దాని తీక్షణతకూ తాళలేకపోతోంది ! ఆమె అయితే ఆ యెండ తాకిడికి ఎట్లా మండుతోందో, ఉడికిపోతోందో ! అచ్చం అ దేకిసా మాదిరిగానూ, దానిలో కాగుతోన్న టీనీళ్ళ వేడిపొంగుల వలెనూ సలసలలాడిపోతోంది !——అవును——ఎప్పుడు అతను రూపాయలతో జేబులునిండిన దబీజ్ కోటు తొడుగుకుంటాడో——ఆమె పెద్దపెద్దకంచాల్లో ముఖం దాచుకుని యౌవనం, ఉద్రేకం, ఎండా అన్నీ ఏదోమరిచిపొయ్యేది!

రోజురోజూ పడిపోతోన్న అన్న ఆరోగ్యమూ, ఎండిపోతోన్న శరీరమున్నూ చూసి చెల్లెలు చివరిసారిగా మనస్సు దృఢపరుచుకుని సిగ్గుల తెరలు తొలగించి పారేస్తూ——ఒకనాడు అనజొచ్చింది.

"అన్నయ్యా. నీ జీవితంతో నాజీవితం ఉన్నది. మీ ఆదరాభిమానాల గొప్పతనంలో నావంటి వెయ్యిమంది చెల్లెళ్ళను బలాదూరు చెయ్యవచ్చును. నీవు నన్ను గురించి నీ యౌవనమూ - జీవితమూ - ఎందుకు ఈరకంగా నాశనం చేసుకుంటున్నావు! నాకు నీలాంటి ప్రియమైన అన్న అడుగులలో ఎనలేని సౌఖ్యమూ, సులభమైన జీవితమూ దొరకటంలో ఆశ్చర్య మేముంది !! నేను ఎక్కడికీ వెళ్ళటానికి ఇష్టపడను. నేను—నేను వివాహం ఆడదలచికూడా లేను!—అవును. అన్నయ్యా నీవు పెళ్ళి చేసుకో! గులాబీ పూవులాంటి వదినెను వివాహమాడు!...నేను మీ యిద్దరి అడుగు జాడలలో నవ్వుతో, చిరునవ్వుతో బ్రతుకు గడుపుతాను. జంట పూవుల్లాగా మీరిద్దరూ నా కళ్ళల్లో మెదుల్తోంటే ఇంకా నాకు పెళ్ళితో పనేమిటి!!"

అతను ఆమె కన్నీళ్ళతో తడిసిన బుగ్గలను ప్రేమ చిహ్నంగానూ, గాద్గదికంగానూ, ఒక మెత్తని చిన్న చిటికె వేస్తూ, అమాయకురాలా. నాకు తెల్సు! నీవు శరీరంలో నెత్తురు లేనట్టుగా పాలిపోయి పచ్చగా వున్నావు. ఆ నెత్తురు చుక్కల్లో ఉద్రేకం ఎప్పటికీ కలగదు. నీవు కోరినా కోరకపోయినా, ప్రపంచం కోసం—ప్రజలకోసమైనా నీవు వివాహమాడటం ఎంతో అవసరం! కానీ, ఒకవేళ పూజలు చేస్తూ ఒట్టు వేసుకున్నట్టున్నా నిన్నెవరూ సత్శీలురాలవని అనరు!"—

—అతను రాని కోపం తెచ్చుకుని, సిగ్గును బుగ్గిలో గలిపి అన్నాడు.

ఆ సమయంలో అతని మనస్సులో ఈ రకమైన ఆలోచనలు వచ్చాయి. "ఈ మాట కూడా అనాలిసిందే! నీవు చిన్నదానివి. నీకు పెళ్ళి అత్యవసరం. నేను స్వయంగా ప్రతీ రాత్రీ నీ మంచంమీదినుంచీ పొంగుతోన్న—అణగియున్న—భయంకరమైన ధ్వని వింటూనే వున్నాను. లెక్కలేనన్ని కదలికలనూ, ఏదో రకమైన శబ్దాన్ని, యువదాహధ్వానులనూ వింటూనే వున్నాను! నన్ను బుజ్జగించటానికో—మోసగించటానికో ప్రయత్నించకు! నీవు ఈ యింటి నాల్గు గోడల మధ్యన మాత్రమే చూశావ్!

నేను చాలా విశాలమైన ప్రపంచాన్నిన్నీ చూశాను చెల్లీ! 28 ఏళ్ళ ప్రాయంలో తలలో తెల్లని వెంట్రుకలు! మెడ వంగటం! వెలుతురు లేకుండా కళ్ళు!! ఇదేమిటి! నేను లోకం చాలా చూశా. నీవు మాత్రం 24 ఏళ్ళ వయస్సుగల యువతివి!...మళ్ళా అతని జీవితంలో ఒక పెద్ద ప్రకాశవంతమైన సూర్యోదయమైంది. తన చెల్లెలిని నఖశిఖాపర్యంతమూ బంగారం—వెండి ఆభరణాలతో అలంకరించాడు. ఆమె పాపిడిని ఉదయ శిఖరంకన్నా ఎక్కువ సుందరంగా జిగేలుమనేట్టు తీర్చి దిద్దాడు! ఆమె కొసవేళ్ళకూ, అరచేతిలోనూ ఇంత చక్కని గోరంట రసం నింపాడుగదా, ఆ యెర్రదనాన్ని చూచి సంధ్యారాగమే లజ్జపడి ఏ పర్వత సానువుల వెనకనో దాక్కునేట్టు!! ఆకుపచ్చని రంగు ఋతువులో తయారైన బనారసు చీరా, పసుపు పచ్చని మేల్మి బంగారు నగలూ ఆమెను ఇలా తలపింపజేస్తున్నై: ఆకుపచ్చని పూల సజ్జమీద ప్రాచీన భారతదేశపు ప్రసిద్ధుడైన ఏ మహా శిల్పి గొప్ప చేతిపని నేర్పరితనం సజీవ సాలంకృత శోభగా మలచాడేమో! అన్నంతగా;—ఈ శృంగార చర్చలో ఓమాదిరి పసుపుపచ్చ బంతిపూలు బిడియంతో తల వంచుకున్నట్టుందేమో గూడా!...ఆ పుష్పదళాలు హిమబిందువుల అసంఖ్యాకమైన చిరు ముత్యాలతో తడుస్తోన్నాయి. అవి స్వయంగాకూడా ఏడుస్తూ, రానినవ్వును నవ్వుతూ వాటి వీపులు బిందుపతాన్ని ఆపుకుంటూ ధిలాసా కలిగిస్తోన్నై!... "అరే! వధువు ఏడుస్తోందా!...ఎక్కడన్నా అలాఏడుస్తారా? అలాగాదు చెల్లీ!!—"

ఇక :— తాషాలూ, మర్ఫాలూ, సన్నాయిలూ, డోళ్ళూ, వాటి వాటి గంభీర వాద్యాల ధ్వనులు గాలిలోవ్యాపించి దానిమీద పరిహాసమాడుతొన్నై గదా చూడు! ఈ కన్నీళ్ళు తుడిచేవాడు వాడే కళ్ళ నీళ్ళు పెట్టుకుంటున్నాడు!...హాహాహా!!...ఢం ఢం ఢం, పీఁ పీఁ పీఁ, తరార్ తరార్ తరార్,.........

చెల్లెలు వెళ్ళిపొయ్యాక అతని జీవితం, అతని ఇల్లూ అన్నీ నీరవం నిర్జీవం అయిపోయినై! అతని చెల్లెలి మంచం ఇప్పుడు గప్‌చిప్‌గా ఒంటరి

ఒంటెలా పడి వుంటున్నది. అది ఇప్పుడు నిట్టూర్పు విడవటంలేదు—దాని మీద ఆమె యువదాహపు చిరచిరలు వినబడటంలేదు !...అతనిప్పుడు హోటళ్ళలో అన్నం తింటున్నాడు. ఏ దేకీసాలోనూ అన్నం వండుకోటం రాదు ! కాని...అవును అతని తల మునుపటికంటే ఎత్తుగా మళ్ళీ లేవటం మొదలెట్టింది ! ఇన్నేళ్ళనించీ చెల్లెలి యౌవనం ఇతని మెడలో బండను కట్టినట్టుగా తల వంగి ఉండేది. ఇప్పుడా బరువు భారాలు తీరాయి. అతడు గర్వంగా తల పైకెత్తి రోడ్లమీద వీరుడిలా నడుస్తున్నాడు. మాటమాటకూ మెడ వెనక్కు నెట్టుతూ పకపకలాడేవాడు. ఎన్నాళ్ళనించో అతని పక పకలు ఆ గొంతులో అలా దాగి వున్నాయో !! ఇప్పు డతగాడు ఎప్పు డెప్పుడన్నా దర్జాగా భూమివేపు చూస్తోండేవాడు. ఇప్పుడతనికి అసలు కిందికి చూసే అవసరం ఏమున్నది !—ఎంత వెండీ బంగారాలూ, డబ్బూ దస్కమూ, తన చెల్లెలి పెళ్ళికి అవసరం ఉండెనో అతను నేల గొంతుకలో వేలుబెట్టి మరీ కక్కించాడు !!—

ఇప్పు డతను రోజూ ఒక పర్యాయం చెల్లెల్ని చూట్టానికి ఆమె అత్తారింటికి వెళ్ళేవాడు. ఎంత సంతోషంగానో తిరిగి వచ్చేవాడు. చెల్లెలి చెక్కిళ్ళమీద గులాబీల ఎఱ్ఱ ఎఱ్ఱటి మొగ్గలు విచ్చుకుంటున్నట్టు కనబడు తున్నాయి ! ఇవ్వాళా, రేపూ, ఎల్లుండీ ఈ మొగ్గలు పూర్తిగా ఆరవిప్పుని పెద్దపెద్దగా ఎఱ్ఱఎఱ్ఱని సంపూర్ణ పుష్పాలవుతాయి ! ఆమె భర్త ఆ పూల చుట్టూ మత్తుగానూ సగర్వంగానూ ఆనందాతిశయంగానూ తుమ్మెదలాగా ఆ పూల చుట్టూ పరిభ్రమిస్తాడు ! ఈ మజా అయిన ఆలోచనలతో సంతో షం పడుతూ ఒక సిగరెట్టు పొడుగాటి దమ్ము లాగుతూ ఆకాశం వంక చూస్తూనూ ముసిముసి నవ్వులు ఒలకబోసుకుంటాడు. ఎలాగైతేనేం తానే గెల్చినట్టున్నూ ఆకాశం తనని ఓడించలేకపోయినట్టున్నూ—అలాగే జీవితం గూడా ఓడించలేకపోయింది. కాని, అతనికి జీవితమంతకూ కేవలమూ ఒకే దుఃఖం ఉండేది. అది బర్జీస్ జహాఁను తాను తన దానినిగా చేసుకోలేక పోయ్యాడు. ఒకవేళ బర్జీస్ జహాఁ ఇప్పటిదాకా కుమారికగానే ఉన్నది.

అయినా, ఆమెకు మారీత్వం ఒక "ట్రోఫీ"గా ఉంది! దాన్ని గెల్వటానికి కొన్ని ప్రత్యేక ప్రత్యేకాలైన షరతులు విధించబడి వున్నాయి—ఆసిఫ్ బర్జిస్‌జహాఁ తండ్రికీ, ఆమె ఇబ్బందిలేని చుట్టాలకూ, ఇంకా అలాంటి సన్నిహితులకూ కబురుపెట్టాడు. ఏమని? తాను బర్జిస్‌జహాఁను మనసారా ప్రేమిస్తున్నానని! దానికి ఆమె తండ్రి జవాబున్నూ ఇచ్చాడు. "వివాహానికి ప్రేమే అత్యంత ముఖ్యమైనది అనిన్నీ! భార్యకూ మంచి యిల్లూ, మంచి తిండీ, మంచి దుస్తులూ చాలా ముఖ్యాలైనవే!—" ఆసిఫ్ మిత్రులు వేలం పాట పాడుతున్నారు—

"నాకు మూడిళ్ళున్నాయి. వాటిని బర్జిస్‌జహాఁ పేర రాసిస్తాను."

"నా ఆదాయం నెలసరి నాలుగొందల రూపాయలు"

"నాకు వజ్రాల, ఆభరణాల దుకాణం వున్నది బర్జిస్ జీవితాంతమూ తళతళా ప్రకాశిస్తోంటుంది!"

"నాకు రెండు మోటారు కార్లున్నై. బర్జిస్‌ను ప్రపంచం అంతా షికారు తిప్పుతాను!"

"నాకు నెలకు '1500' రూపాయిల పెన్షన్ వస్తుంది. నేను బర్జిస్‌ను కాశ్మీరు తీసుకెళ్ళి అక్కడి సర్వ స్వర్గారామాలలోనూ విహరింప జేస్తాను?"

ఆసిఫ్ ఓడిపొయ్యాడు. అతనుండే కచేరీలో హెడ్‌క్లర్కు ఆ 'ట్రోఫీ'ని గెల్చుకున్నాడు. ఆసిఫ్ జీవితపు మూలవాంఛను గెల్చుకున్నాడు.

తనది అనుకున్న ఆ ప్రియురాలిని మరొకరు తమ ఒడిలోకి లాక్కున్నాక ఆసిఫ్‌కు మరో ప్రేయసి అవసరమే లేకుండా పోయింది. కాని, అతని యౌవనపు సాఫల్యంలో అతనికి నిజంగా ఇంత అల్లకల్లోలం-నిశ్శబ్దమూ—భయమూ అనిపించేది, ప్రాణం కోరుకుండేది, ఈ భయంకరమైన అల్లకల్లోలంలో అద్దాల గాజులు అమ్మటం మొదలెట్టింది!—పాంజేబుల తియ్య తియ్యని ఝుంకారాలు పుట్టినై!—వల్లె వేసుకున్న రవ

సెల్లాలు గాలికి రెపరెపలాడుతోన్నై !—ఫడ్ ఫడ్ ఫడ్—రాప్ ఫడ్—ప్రియురాలు లేదు సరిగదా, కనీసం ఒక ఆడదన్నా లేదు! అతని జీవితంలో అతిథుల మాదిరిగానన్నా ఎందుకు తటస్థపడరాదు !!....

మరి ఆ వెంటనే అతనికో స్త్రీ దొరికిపోయింది ! పట్నంలో క్రైస్తవ మత ప్రచార సంబంధమైన ఒక మిషన్ వచ్చింది. అందులో బాగా ఎర్రని అందాల గంధర్వాంగనలున్నారు. వారి దేహాలు ఎలాటి తెల్ల తెల్లని అద్దాలతో చెయ్యబడి వున్నాయి !! వాటిలోపల దట్టమైన దిట్టమైన ఎర్రని రంగు నింపబడిన్నీ ఉన్నది !—హిందూస్తాన్‌లో ఆకలివాళ్ళకూ, వికలాంగులకూ, ప్రాణంలో ప్రాణం వచ్చింది వార్ని చూసి !...వాళ్ళు తమ తమ పాడుబడ్డ సందుగొందుల మాదిరిగా వున్న తమ మతాల్ని వదిలి ఆ రాజ వీధిలో నడవటానికి ఆశా ఆసక్తీ పడ్డారు! ఎక్కడా అడుగడుగునా హోటళ్లూ, సత్రాలూ పెట్టబడ్డాయి. తినాకుడవా, డబ్బూ దస్కమూ, స్త్రీలూ ఇస్త్రీలూ, ఆసిఫ్‌కు ఈ గొప్ప వస్తువులలో—ఒకటే ఒకటి ప్రియమైన వస్తువు కావల్సి ఉండెనో...'మిస్ ఫాక్స్'

హాయ్ భగవంతుడా ! ఎలాంటి స్త్రీ మిస్ ఫాక్స్ ! మొదటిసారి ఆసిఫ్ ఆమెను ఏప్రిల్ పోస్టాఫీసునుంచీ బైల్దేరుతూ చూశాడు—నిండు కుండలాంటి ఒత్తైన శరీరమూ, పొడుగుపాటి ఎత్తూ, ఆమెను చిత్రించిన చిత్రకారుడు ఆమెకు రంగేయటంలో గులాబీల రంగంతా ఉపయోగించాడు. ఆమె చెక్కిళ్ళ మీద తియ్యని సేపులకు బదులు 'యార్క్ షైర్ అరటి పళ్ళు' చిత్రించినట్టుంది !—పోస్టాఫీసునుంచీ బైలుదేరి అప్పుడామె తన సైకిలు నెక్కుతోంది—అప్పుడామె సైకిల్‌కు ఉండి గంతులు వేస్తోన్న ఎర్ర ఎర్రని చేపలను చూసి ఆసిఫ్ ఇలా అనుకున్నాడు ! అవి బ్రతికి వున్న చేపలేనని !...అవి చచ్చిపోయినై—అవి చచ్చిపోయినై—అవి బ్రతికే వున్నై !—

అతను కుల, మతాల పక్షపాతాన్ని మనసులో మనసులోనే దూదేకినట్టు ఏకుతున్నాడు...తర్వాత. ఒక సాఫీ అయిన మనస్సుతో ఒప్పు

కుంటున్నాడు ఇల్లా-వాస్తవంలో ప్రపంచపు ఇతర రాజ్యాలు స్త్రీల నిజమైన గౌరవాన్ని తెల్సుకుని కనుక్కున్నారు. ఇక్కడ హిందూస్తాన్‌లో మాత్రం స్త్రీలకు దుర్గతి పట్టే వున్నది! ఈ దుర్గతి గల నేలలో అచ్చం బంతి పూలూ, గోరింటపూలూ, గన్నేరు పూలూ, పొద్దుబొడుపు పూలు మాత్రమే పూయటం చాతనౌను !!

రెండో మూడోనాడే అతను మిస్ ఫాక్స్‌ను రాజవీధిలోనే దర్శించగానే తిరిగి యౌవనం తలెత్తింది! అప్పుడతని తన చెల్లెల్ని మిక్కిలీ తక్కువగా అనుకుంటూండేవాడు. గులాబీ గుత్తులు ఎదురుగా వుంటే, బంతి పూచెండ్లను తలిచే వారెవరు!;!...

ఒకనాడు మిస్ ఫాక్స్ ఆర్కెస్ట్రా మీద ఒక జాతీయ—విషాద గీతాల్ని ఆలాపిస్తోంది. అది వింటూ ఆసిఫ్ ఏ మహాకవి ఈ గేయాన్ని రచించాడో, లోలోపలనే తిట్టుకుంటున్నాడు. అంతలో అతని దృష్టిలోకి బంతిపూలు జ్ఞాపకంగా వచ్చాయి! కారణం ఉన్నది ఆమె గృహద్వారం నుంచీ తన చెల్లెలి ప్రేమాస్పదుడైన భర్త ప్రవేశించాడు. అకస్మాత్తుగా అసిఫ్‌ను చూసి తటపటాయించాడు—ఆగిపొయ్యాడు—భీతిపడ్డాడు—కానీ, ఎప్పుడైతే మిస్ ఫాక్స్ దరహాసం చేస్తూ అతన్ని పిలవటానికి లంకించుకున్నదో, ఆసిఫ్ అప్పుడు అవకాశాన్ననుసరించి నిలబడ్డాడు. మిస్ ఫాక్స్ మారుతోన్న ఆసిఫ్ తీవ్రత కనిపెట్టి నవ్వుకుంది—

—"అనగా...అతనైతే ప్రతీరోజూ వస్తున్నాడు ఇక్కడికి !!"

అదే రోజు సాయంకాలమప్పుడు ఆసిఫ్ చెల్లెలింటికి వెళ్ళాడు. కాని, చెల్లెలితో పల్లెత్తి ఒక మాటా కూడా మాట్లాడలేదు. సిగరెట్టు తాగుతో వున్నాడు. ఎందుకో అతని మూయబడి వున్న పెదిమెలు మాటి మాటికీ తేలిగ్గా కంపిస్తూ విడిపొయ్యేవి! వంగి వున్న అగాధమైన కను రెప్పల లోపల్నించీ వణుకుతోన్న తారలు కనిపించేవి! ఇప్పటినుంచీ కొన్ని రోజులకు ముందుదాకా అదే బుగ్గలమీద అతను ఎర్ర ఎర్రని రేఖల ఒక వలను అల్లుతోన్నలాగా వున్నై! నేడు ఆవల...అదృశ్యం!!...ఆ స్త్రీ

రంగు కూడా ఎట్లా మార్పు చెంది ఉన్నదో! ఏమీ నమ్మకం లేనట్టుగా, ఏమీ పునాది లేనట్టుగా, మరి అది ఎలా తాత్కాలికం అయినదో!!

ఎప్పుడైతే ఆతను ఇంటికి చేరుకున్నాడో అతని మెదడు స్తంభించి పోయింది—ఇప్పుడేమీ తోచటంలేదు—కాని నవ్వు మాత్రం వస్తోనే వుంది! అయితే ఎందుకని ఆ నవ్వు!?—ఏడుస్తున్నాడు! సరే ఎందుకని ఆ ఏడుపు!? అయితే ఎందుకేడుస్తోన్నట్టు??—ఇప్పుడు, బహుశా దాన్ని తెలుసుకోవాలన్న అవసరమే లేదతనికి. బ్రతుకులో అతనికి ఎముకలు బైటికి వచ్చిన గుండె మీద ఇట్లా బలిష్ఠమైన గుద్దు గుద్దిందిగదా, దాని దెబ్బకు అతను మూణ్ణాళ్ళదాకా మంచంనించీ అడుగు కింద బెట్టలేకపొయ్యాడు! దగ్గు తెరలు తెరలుగా లేస్తోంది. ముఖంమీది వెంట్రుకలు పీక్కుని పీక్కుని మరీ ఏడుస్తున్నాడు. ఎప్పుడో నవ్వుతాడు—ఎప్పుడో ఏదో పాడతాడు !! ... పిదప నాలుగోనాడు అతని ఎదలో ఏమనుకున్నాడో...పాత స్నేహితుడు అక్కడే దొరికాడు. అతను మాసిన పాత దబీజ్ కోటు తొడుక్కుని బైటికి బైలుదేరాడు. అతని నేత్రాంతాలలో ఎర్రని అగ్నికణాలు మెరిసి పోతున్నై! అవి ఎలాగున్నాయని? ఎదటబడ్డ ఎవరైనా సరే కాల్చి వేస్తాయేమో అన్నట్టుగా!,—

చీనా రెస్టోరెంటు ఉన్న సెంటరులో బంగారవు అలమి అలికినట్టున్న ఆ సాయంత్రం తన తెల్లని జరీ పని చేసిన పల్చని దుప్పటి కప్పుకున్నట్టుగా ఉంది. ఆ 'బస్ స్టాప్' స్తంభానికి భుజం ఆనించి సిగరెట్టు పొగను లాగి గుబురు గుబురులుగా విడుస్తోన్నాడు—అలా వచ్చిపొయ్యే ప్రతి ఒక్కరినీ చూస్తూ ముసి ముసిగా నవ్వులు నవ్వుకుంటున్నాడు—ఒక ఎత్తుగా, ఒత్తుగా ఉన్న పంజాబీ వనిత తన బక్కపలాచని పొట్టిపొటి భర్తతో వంగి వంగి మాట్లాడుతోండడం చూసి ఆసిఫ్ మరీ జోరుగా నవ్వజొచ్చాడు! పంజాబీ ఆవిడ తన భర్త కోపోద్రేకాన్ని చూసి అతడిని అనునయిస్తోంది—"ఎవరో పిచ్చివాడు లాగున్నాడు! హుం!" అతను వారి సమీపానికి పోయి ఇలా అన్నాడు—"కాదు కాదు. నేను పిచ్చివాడినిగాదు!—

ఆ పిచ్చివాడు గాంధీ! కాదు. జిన్నాగారు పిచ్చివాడు! కాదులేకాదు. ఫకీర్ ఆలీ పిచ్చివాడు!—వాడు కూలీ చేస్తున్నాడు. హుఁ హుఁ హుఁ !!!—

పంజాబీ ఆవిడ ఆ నాలుగు బజార్ల కూడలిలో నుంచున్న పోలీ సతన్ని చూడటం మొదలెట్టింది. సరీఘ్గా అదే సమయంలో ముందరనుంచీ మిస్ ఫాక్స్ సైకిలుమీద వస్తూ కనిపించింది—

''—ఏయ్. డార్లింగ్ అందాల బరిణా. నీ కోసం ఎంతసేపట్నుంచీ నిరీక్షణా!'' అంటూ ఆసిఫ్ ఆమెవేపు నడిచాడు. ఆమె గూడా అతన్ని చూస్తూ చిన్నగా నవ్వుతూ సైకిలునుంచీ దిగింది. మళ్ళాపోవటానికి ఏమైంది!...చీనా రెస్టోరెంటు సెంటరు పూర్తిగా భయంకరమైన అరుపులతో ప్రతిధ్వను లీనుతోంది!...'చంపేశాడు'...అవును...చంపేశాడు... ఖూనీ...ఉరకండి...ఖూనీ...పట్టుకోండి...కొట్టండి. కొట్టండి!!"

అంతట్లో అరుపులు ఆగిపోయినయ్. జనం కూడటం మొదలెట్టారు- అయితే ఆకాశంలోని మొదటి నక్షత్రం ఈ ఉదంతాన్ని చూసిందేమో! మిస్ ఫాక్స్ నెత్తురులో తడిసి సిమ్మెంటు రోడ్డు మీద పడివుంది—మరి, నెత్తురు ధారలు ఆమె పొడుగైన కంఠంనుంచీ చిమ్ముతూ ప్రవహిస్తోన్నై. ఇద్దరు పోలీస్ కానిస్టేబిళ్ళు ఆసిఫ్ దండ చేతులు పట్టుకు నుంచున్నారు. అప్పుడతని తాను ఖూనీ జేసిన కత్తి ఎత్తుగా ఎత్తి పట్టుకుని కేకలెయ్యటం మొదలెట్టాడు వెర్రి వెర్రిగా!

"చూడండి! పూర్తిగా పీల్చుకున్నటువంటి నెత్తురు పారుతున్నది. ఇప్పుడు నా చెల్లెలి బుగ్గలమీద బంతిపూల గుత్తి ఎప్పుడూ వికసించదు!... అవును. నా దేశస్థుల పూర్తిగా పీల్చినటువంటి రక్తం...నేనే మిస్ ఫాక్స్‌ను పొడిచేశాను!...చంపేశాను!....తప్పేముంది!!....నా యౌవనాన్ని చంపేసుకున్నా!...అవును నా దేశస్థులు..."

పోలీస్ సబ్ ఇన్స్పెక్టరు ఆసిఫ్‌ను మెడబట్టి ఒక్క గెంటు గెంటాడు—మరి ప్రజల చరచరలు—చర చరలాడుతున్నారు—

"వహవ్వా ! గొప్ప వీరుడివి !.... ఆడదాన్ని చంపావు !"

"ఎవరో పిచ్చివాడి లాగున్నాడు...!"

"ఏదో కసి అయ్యుండాలి ! అయినా దురంతమే !"

"అయ్యో ! ఏకఫలాపేక్ష—" ఈ మాట ఎవరో కవి అని ఉంటాడు—

"ఏమండీ. ఎవరో ఇతను విప్లవకారుడి లాగున్నాడు!" అని ఎవరో ఒక క్లర్కు గామాల్ను అనుంటాడు—

"దురదృష్టం—ఇటువంటి విశ్వాస ఘాతుకమైన అరాచకులు ఉండటాన్నే దేశానికి ఇంకా స్వాతంత్ర్యం లభించలేదు !" ఇది ఎవరో ఒక షాహుకారు అన్నమాట—

"ఈ మాట అనగూడదు గాని, అతన్నెంత చంపిందో, చంపాడు!" ఈ మాట ఎవరో అన్నారు నిమ్మళంగా.

పోలీస్ సబిన్స్పెక్టరు కోపోద్రేకాలతో—గద్గద స్వరంతో అతని మెడ మీద చెయ్యేసి నెట్టుతూ అంటున్నాడు. "బద్మాష్ ! నీచుడా !...జాతి భ్రష్టుడా !..."

ఆసిఫ్ కొండ చిల్లులు పడేట్టు కేకలు వేస్తూనే వున్నాడు.—

—"చంపేశాడు—చంపేశాడు—ఎవర్నీ చంపేసింది ?... తన యౌవనాన్ని చంపేశాడు !...తన దేశస్థుల నెత్తురును పూర్తిగా—పూర్తిగా పీల్చేసిన యంత్రాన్ని చంపేశాడు !..."

పోలీసు కానిస్టేబిల్సు అతని మెడబట్టి గెంటుకుంటూ ఆక్స్ఫర్డు స్ట్రీటులో తోసుకుంటూ తీసుకుపోతున్నారు.

"ఆహా ! స్వదేశస్థుడు !!..."



మూల కథ :
"డెడ్ లెటర్"
రచయిత :
"ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్"

# డెడ్ లెటర్

"డార్లింగ్ !"

"చిత్తం !"

"ప్రసాద్ ఇవ్వాళ సాయంత్రం గోపురం చూట్టానికి పిలిచాడు—జ్ఞాపక ముందా ?"

"చిత్తం !"

"అయితే నేను ఆఫీసునుంచీ 5½ గంటలకు వస్తా - నీవు సిద్ధంగా ఉండాలి ?"

"చిత్తం !"

చిత్తం ! చిత్తం !! చిత్తం !!! పన్నెండేళ్ళనుంచీ ఈ రెండక్షరాల పదం తన భార్యనోటినించీ వింటూన్నాడు. పదిమాటల్లో తొమ్మిదిటికి జవాబు "చిత్తం" అని మాత్రం ఇస్తూండేది—చదువుకున్న చిలకలాగా ఒక టేమాట అనగల్దువుగదూ. చిత్తం ! చిత్తం ! చిత్తం ! అని !!—

నారాయణగంజ్ డిస్ట్రిక్టుకమీషనర్ సుధీర్ సక్సేనా, ఐ.సి.యస్; గారి విషయంలో అందరి అభిప్రాయాలూ ఇలా వుండేవి. లోకంలో ఈయన కంటే అదృష్టవంతులు మరొకరుండరు. ఉన్నతమైన పదవి, సమృద్ధయిన జీతమూ, ఉండటానికి ఇల్లూ, విమలలాగా అందమైనది, చాతుర్యముగలదీ, బాగా చదవనూ రాయనూ నేర్చిన భార్య ! ఆమె కమీషనర్‌గారితో బ్రిడ్జి ఆడుతోండేది ! రాంనగర్ రాజాసాహేబ్‌గారితో పాటు నాట్యం చెయ్యగల ప్రవీణురాలు ! ఆమె సాంఘికంగాగూడా కలిసి మెలిసి తిరగటం - చిన్నా పెద్దలయెడ కూర్చోటం లేవటం అన్ని రీతులూ నీతులూ తెలిసినటువంటిదిన్నీ !

అన్నిటికంటే ముఖ్యవిషయం ఏమిటంటే అందమూ తెలివీ గల ముగ్గురు పిల్లలతల్లి ఆమె ! అందరికంటే పెద్దవాడు రణధీర్ పదేళ్ళ ప్రాయంలోనే నైనితాల్‌లోని జూనియర్ కేంబ్రిడ్జి స్కూలులో చదువుతోన్నాడు. ఆ స్కూలులో మిక్కిలీ క్రమశిక్షణగల పిల్లాడుగా తన తరగతి మానెటరు అయినాడు. ఆంగ్లో ఇండియన్ల పిల్లల్లాగా ఇంగ్లీషు మాట్లాడేవాడు. మరి ఇతని కన్నా ఏడేళ్ళు చిన్నదైన 'ఉష' ముమ్మూర్తులా తల్లిలాగా బక్క పలచగానూ, మాంచి చురుకుగానూ ఉండేది—అచ్చం అలాగే విశాలమైన కండ్లతో మెరిసేది. వంకులు వంకులుగా వున్న పొడుగాటి వెంట్రుకలు రెండుజడలు వేసుకుండేది—ఆమె నారాయణగంజ్‌లో ఒక కాన్వెంట్ స్కూల్‌లో మూడో తరగతి చదువుతూండేది. ఆ పిల్లకు నర్సరీకి సమ్మంధించిన చదువు కంఠోపాఠంగా ఉండేది. 'ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్‌స్టార్' ఇలాటి పద్యాలైతే ఎన్నోఎన్నో శ్రావ్యంగా పాడేది. వాళ్ళందరిలోకీ చిన్నది 'శాంత' దాదాపు మూడేళ్ళ యీడుగలది. ఆ పిల్లను 'బేబే' అని ముద్దుగా పిల్చుకుండేవారు. ఆ చిన్నారి తల్లిదండ్రుల కండ్లలో పాపగా ఉండేది. పసితొక్కుపలుకులతో, డి.డి.టా.టా. అనో, మీ.మీ.బాయ్.బాయ్. అనో, అంటూ ఒక్కొక్క అక్షరం పలకటం నేర్చుకుండేది :—

అవును. అయితే అందరూ సుధీర్ సక్సేనా, ఐ.సి.యస్;ను అంతు లేని అదృష్టవంతుడుగా భావించేవారు. అప్పుడప్పుడూ అతడుకూడా అలాగే అనుకునేవాడు. ఏదైతే అతనికి లభించిందో దానికన్నా ఎక్కువ గొప్ప దాన్ని తన జీవితంలో ఎవరన్నా ఏ వస్తువన్నా ఆశిస్తారా ? కాని, ఎప్పుడైతే తన భార్యనోటివెంట రెండక్షరాల పదం 'చిత్తం' అని వింటాడో... విమలలో ప్రత్యేకమైన - చప్పని - రంగులేని - అలసిపోయివున్నస్థితిలో ...అయితే, అతని సంతోషం, మరి మిక్కిలీ అదృష్టం, ఈ రెంటిమీదా సందేహమూ, అసంతృప్తీ—ఇంకా ఒక నిరాశామేఘాలు కప్పివేసేవి—

''చిత్తం''

ఎప్పటినుంచీ ఈమాట అతని జీవితంలో మారుమోగుతోందో—

పదమూడేళ్ళు అయినై వారు ముస్సోరీలో కలిశారు. సుధీర్ నెల సొంతం కాకముందే ఇంగ్లడునుంచీ వచ్చాడు—ఉద్యోగంలోకి వెళ్ళక ముందే కొన్ని వారాలు గడపటానికని శలవు మీద వచ్చాడు—తినా త్రాగా ఉన్న ఇండ్ల అందాల చందాల దుస్తులూ, పిల్లలతో కళకళలాడుతోంది. ముస్సోరీ—లైబ్రరీ ముందర ప్రతి సాయంకాలమూ మెరుస్తూ రెపరెప లాడుతోన్న చీరలూ, బిగుతైన జాకెట్లూ, శిల్కు లాగులూ, మెడలో అడ్డంగా వేసుకున్న కండువాలూ, వీటి ప్రదర్శనాలు లోకమోహనంగా జరుగుతూండేవి!—ఎత్తైన మడిమలుగల బూట్లతో నడుస్తోన్న నడకా, నిర్లక్ష్యమైన చూపులూ, సుందరాంగులైన కన్యల ఒయ్యారపు నడకలు, విదేశీసెంట్లలో మునిగినగాలి అలలూ, దానిమ్మపువ్వు పెదిమెలూ, రైజర్లతో దిద్దుకుని సన్నంగా తీర్చబడిన ధనుస్సులాంటి కనుబొమలూ, గందపొడి చల్లి కత్తిరించబడి అమర్చిన జులపాల జుత్తులూ, ప్రతీ పడుచువాడికీ—సౌందర్య దృక్పథం గల వారందరికీ ఆహ్వానపు విందు!

కాని ఎందుకో తెలియదు! సుధీర్‌కు ముస్సోరీ అంతటిలోనూ అతనికి నచ్చినదల్లా కేవలమూ 'విమల'-'హైక్‌నైజ్' హోటలులో ఒకనాటి సాయంత్రం టీ డ్యాన్సు సమయంలో ఆమెతో ప్రథమ పరిచయం జరిగింది.

"హలో సుధీర్!" ఇతని పాట్నా నేస్తం చెయ్యూపుతూ తన మేజువేపు పిలుస్తూ అన్నాడు—

"ఇలా రావోయ్ మిత్రం!...వారితో కలువూ!! వీరే మిస్ విమలా బెనర్జీ. ఈమె బెంగాల్‌లో పుట్టారు—లక్నోలో ఉంటున్నారు!"

సుధీర్ చూశాడు. పౌడరు లేకుండానే పొడిగానూ పొంకంగానూ ఉన్న సొగసైన ముఖం—విప్పుకున్న రెండు విశాల నేత్రాలూ—ఆ కళ్ళ అగాధంలో ఏదో ఒక దుఃఖం దాగుకున్నలా ఉంది! వాటి చుట్టూ నల్లని గుండ్రని రేఖలున్నాయి. మెత్తని, నిక్కపొడుచుకుని ఉన్న సిగ్గుల కను రెప్పలు—రాత్రులలో నిద్ర మేల్కొని వున్న కనురెప్పలు బరువువల్ల వంగి పోతున్నాయి!

అతను మాథర్ పట్టుదలను నిరీక్షించకుండానే విమల సమీపంలో ఉన్న కుర్చీలో బోయి కూచున్నాడు. మరి, మళ్ళీ అతని కోసం, తలంటి పోసుకున్న వెంట్రుకలు ఆరబోసుకుని గదిలో కూచున్న ఆమె దప్ప ఎవరూ లేరు.

పన్నెండేండ్లైనప్పటికిన్నీ వారి ప్రథమ సంభాషణ నేటిదాకా గూడా అతని స్మృతిలో తాజాగానే ఉన్నది!

"అయితే మీరు ఐ. టి. కాలేజీలో చదువుకున్నారు గాబోలు!!"

"చిత్తం!"

"బి. ఏ. లోనా ??

"చిత్తం!"

"వచ్చే యేడు ఫైనలు పరీక్ష ఇస్తారా ?"

"చిత్తం!"

రెండు సంవత్సరాలదాకా ఇంగ్లీషు స్త్రీల—పురుషుల కఠినమైన ధ్వనులు వినటానికీ, ఇంకో రెండు వారాలు ముస్సోరీ అల్లర్లలో గడపటానికీ, అలవాటు పడ్డాక ఎంతో కొంత శాంతి తోచింది! విమల మామూలు మిత భాషిత్వంలో గాలి దుమ్మూ—తుపానూ—ఉరుములూ—మెరుపులూ, తరువాత వర్షం తగ్గిపోయింది—గులాబీ రేకులమీదనుంచీ కొన్ని చిన్ని చిన్ని బిందువులు పచ్చి గడ్డిమీద పడుతోండేవి. "ఎంత భారతీయత్వముంది. ఆ 'చిత్తం'లో" ఎంత కలుపుగోలుతనం—ఎంత తీపీ—ఎంత వినయమూ—ఎంత అభిమానమూ ఉంది 'చిత్తం'లో!—

"మీరు డ్యాన్సు చేస్తారా ?"

"చిత్తం లేదు"

వారి స్నేహితుడు నాట్యం చేసేవాళ్ళను ఆ జన సమూహంలో ఎక్కడో వీడిపోయాడు—ఇక ఇప్పుడు వారిద్దరూ తమ మేజుమీద ఒంటరిగానే వున్నారు. చిట్టచివరకు సుధీర్ ఆలోచించాడు. నా అన్వేషణ నేటికి సమాప్తమైంది. విమలకన్నా ఉత్తమురాలైన భార్య నాకు దొరకదు!

ఆమె సౌందర్యవతి. కాని, ఒక పువ్వుమీదినుంచీ ఇంకో పువ్వుమీదికి ఎగురుతూ తిరిగే కామాతురత అయిన సీతాకోక చిలుకలా గాదు ! ఆమె విద్యావతి; కాని, అనవసర వాదీ, అధిక ప్రసంగీ కాదు ! తినాకుడవా ఉన్న ఘరానా కుటుంబంలోనిదిలా అనిపిస్తోంది. అయితే, అంత ధనవంతురాలున్నూ కానట్టున్నదిగదా ఒక ఐ.సీ.యస్‌గారి కోరికను నిరాకరించిందే!– ఆయన్ను పెండ్లాడి వాస్తవంలో మానవ జీవితపు సుఖమూ శాంతీ గడప వచ్చునే !!

మళ్ళీ అతను అన్నాడు. "అయితే, మీ తండ్రి..."

వారు లక్నోలో ఉంటున్నారు. ఆర్ట్ స్కూలులో టీచరుగా ఉంటున్నారు !"

"ఓహో ! మీరు ఆర్టిస్ట్ బెనర్జీగారి కూతురేనా ! వారి చిత్రాల ప్రదర్శనం మా పాట్నాలో గూడా జరిగింది"—మరి, తరువాత అతను మాంచి తెలివి తేటలుగా అబద్ధమాడాడు—"నాకు వారి చిత్రాలు చాలా నచ్చాయి—" అయినప్పటికిన్నీ అతను మనస్సులో అనుకుంటున్నదిది : ఆ వంకర టింకర గీతలూ, నీలం పచ్చారంగుల మరకలలో విశేషమేమున్నది !—ప్రజలు వాటిని ఎంతో ఎత్తు పొగడుతున్నారు ! అని;— కాని అదే క్షణంలో ఆ చిత్రాలలోనుంచి ఒక ప్రత్యేకమైన ప్రతిమ జ్ఞాపకం వచ్చింది. ఒక 11-12 సంవత్సరాల తుంటరీ దుర్మార్గురాలూ అయిన బాలిక చిత్రం. సబ్బు కరగిన రంగు నీటి బుడగలను చేసి ఎగవేస్తోంది ! చిత్రం పేరు గూడా రాయబడి ఉంది "బుల్ బులే"

"ఆ బుల్ బులే బొమ్మ మీదేగదా !"

"చిత్తం !"

"ఇందులో మీరు చాలా గడుసువారిలాగా కనబడుతున్నారు !— ఇప్పుడైతే మీరు ఎంత తీవ్రమైపొయ్యారు !"

అచ్చం ఈసారి ఆమె 'చిత్తం' అని జవాబియ్యలేదు. ఒక ఆశ్చర్యమైన, అలసిన, ఆరిపోయిన చిరునవ్వుతో అన్నది. "బుల్‌బులే" అసలు

జీవితమే ఎంత ఉంటుంది. ఒక పిల్లగాలితెప్పరావటం - బుల్‌బులా పగిలి పోవటమూ! చాలు అయిపోయింది!

ముస్సోరీలో ఉన్నంతదాకా అతని అమూల్యమైన కాలం విమల సాన్నిహిత్యంలోగడిపాడు. వారిద్దరూ కలిసి పాపశిఖరాగ్రాలదాకా ప్రాకారు. క్యామిల్ బేక్‌రోడ్డుచుట్టూ తిరిగారు, క్యాప్టీఫాల్ వనభోజనాలకున్నూ పోయారు.

ఆ కాలమంతటిలోనూ విమల కష్టతరమ్మీద మొత్తం పదిపన్నెండు మాటలు అతనితో మాట్లాడి ఉండవచ్చు. సుధీర్ మాటలను ఆమె మిక్కిలి మౌనంగానూ, శ్రద్ధగానూ వినేది. ఎప్పటిదాకా అయితే అతను యధార్థంగా ప్రశ్నించడో ఆమె ఏ మాటమీదగూడా తన అభిప్రాయాన్ని వెల్లడించేది గాదు. కాని, సుధీర్ విమల మౌనాన్ని గురించి అన్యధాభావించేవాడుగాడు. మాటకారి పిల్లలు ప్రపంచపు ప్రతి సమస్యమీదా తమ అభిప్రాయాలను వెలిబుచ్చుతోంటారు- అంతేగాదు. తాము అట్లా చెప్పటం అత్యవసరమనీ భావిస్తారు. ఇది ఆమెకు బొత్తిగా ఇష్టమైన పద్ధతి గాదు. ఆమెకైతే ఇదే మంచిది అనిపించేదిగదా : ఆయన చెబుతూండాలి, తాను శ్రద్ధగా కూచుని వింటూండాలి. ఇక. "చిత్తం! చిత్తం!" అంటూండాలి. అప్పుడు సుధీర్‌కు బాగా నమ్మకంతోచింది. విమలను చాలా కొనియాడజొచ్చాడు. బహుశా ప్రేమిస్తూగూడా ఉన్నాడు. అయితే ఒకనాడు ఏకాంతంగా ఉండి సమయం కనిపెట్టి ఆమెకో సూచన చేశాడుగూడా!—

"విమలా. నీకు తెల్సుగదా. నేను నిన్ను ఎంతోమెచ్చుకుంటాను."

"చిత్తం!"

"నీవు లేకుండా నే నొక్క గడియైనా ఉండలేను—ఏం. నీవు నన్ను వివాహమాడతావా ?"

"చిత్తం!" ఈ 'చిత్తం'లో ప్రశ్నావుంది, ఉత్తరమూ ఉంది—

కొంచెంసేపు నిశ్శబ్దంగా ఉన్నాక ఆమె అన్నది, "చూడండి, నేను

మిమ్మల్ని అధికంగా గౌరవిస్తున్నాను—ఇందువల్లనే నేను మిమ్మల్ని మోసంలో పెట్టదలచుకోలేదు. నేను మిమ్మల్ని ప్రేమించటంలేదు—"

"ఏం! నీవు ఇంకెవర్నన్నా ప్రేమిస్తున్నావా?"

విమల నోటితో "చిత్తం కాదు" అని ఎంతో అరుదుగా గానివచ్చేది గాదు—కాని, ఈసారి ఆమె "చిత్తం కాదు" అని వెంటనే గంటకొట్టి నట్టు అన్నది—తరవాత, ఒక్కనిమిషం మౌనం తరవాత దానిలో దీర్ఘమైన శైత్యమైన శ్వాస సాయంకాలపు సంగీతంలా ఉంది—

—"అట్లా ఏమీగాదు" అన్నది.

సుధీర్‌కు మళ్ళీ నమ్మకం అనిపించింది. "అయితే ఇంకా ఏమభ్యంతర ముంది? నేను నిన్ను, నాతో ప్రేమగా ఉండేమార్గం చెబుతాను" అన్నాడు.

ఆ రోజు జూలై పధ్నాలుగు 1940.

పోస్టుమాన్ తన ఉత్తరాల సంచీని భోజనాల మేజుమీద సుధీర్‌కు ఎదురుగా పెట్టాడు. అన్నిటికంటే మొదటి ఉత్తరం ఏదో తీసుకోటానికి ఆ సంచీని విప్పాడు. కాని అతని చూపు పోస్టు ముద్రమీద పడ్డది. "నారాయణగంజ్—14-7-1952" తక్షణమే సుధీర్ జ్ఞప్తిలో పూర్తిగా పన్నెండు సంవత్సరాల క్రిందటి ఆరోజు నిద్రనుంచి మేల్కొన్నది!

కవరును చాకుతో కోస్తూ సుధీర్ విమలను అడిగాడు—"తెలుసునా ఇవ్వాళ తారీఖు ఏమిటో?"

"చిత్తం!" ఆమె చూపు ఎదురుగా గోడకు వ్రేలాడుతోన్న కాలండరుమీద పడ్డది.

"పన్నెండేళ్ళక్రితం ముస్సోరీలో ఆ రోజు జ్ఞాపకం ఉందా—అప్పుడు నేనే నీకు "సూచన" చేశాను?"

"చిత్తం!" కాని, ఆ "చిత్తం"లో కేవలమూ ఒప్పుదలే ఉన్నది. ఏలాటి వేడి అయిన ఆవేశం లేదు—సుధీర్ పన్నెండేళ్ళ పూర్వపు

ఏ భస్మాన్నైతే కొనదలచాడో అది బొత్తిగా చల్లారిపోయినది. అందులో ఎప్పుడుగూడా నిప్పురవ్వ లేనేలేదు.

కాని సుధీర్ విమల ముఖంమీద ఒకరంగుపోవటమూ, రెండోది రావటమూ చూడలేదు. అతను కవరు విప్పి చదువుతోన్నాడు. అది పూర్వపు తన కాలేజీ ముఖ్యస్నేహితుడు మాథర్ దగ్గర్నించీ వచ్చినది— ఇప్పు డతను పాట్నాలో వకాలతు చేస్తున్నాడు - ఉత్తరంమీద దృష్టి పడగానే సుధీరే చిన్నగా నవ్వుకున్నాడు. మాథర్ రాశాడని; "నేస్తం. నీవెంత అదృష్టవంతుడివి! విమలలాంటి భార్యను బడయగల్గావు, మిత్రం. మాకు దీవెనలియ్యి. ఆనాడు పేక్‌మంజ్‌లో నీకు ఆమె ప్రథమ ప్రదర్శనం చేయించాను నేను. కాని, ఈ ప్రపంచంలో ఎవరు ఎవరికి కృతజ్ఞులై వుంటారు!"

"విన్నావా నీవు. మాథర్ ఏంచేశాడో?"

"చిత్తం!"

మాథర్ విమలను గురించి వ్రాసిన ప్రతి అక్షరాన్నీ ఆమెకు జాగ్రత్తగా చదివి వినిపించాడు. అక్కడినించీ రెండో ఉత్తరాన్ని అందు కుని చదవటంలో నిమగ్నుడై నాడు -- మాథర్ ఉత్తరం వినేప్పుడు అతని స్నేహపూరితమైన పరిహాస వాక్యాలకు ఆమె కండ్లలో ఎలాటిమెరుపూ విరియలేదు. పెదవులమీదమాత్రమే ఒక వికటమైన చిరునవ్వు తరంగం లేచింది. వెంటనే అదృశ్యమూ అయింది.

సుధీర్ విప్పిన ఆ రెండో ఉత్తరం కాబూల్ క్లబ్బునుంచివచ్చింది. అతను దాన్ని విమలవేపు నెట్టేశాడు. ఎందుకంటే బిల్లుల పైకం ఆమే చెల్లిస్తోండేది. మూడో వుత్తరం, ఐ. సి. యస్, అసోసియేషనునుంచీ వచ్చింది. దానిలో, "వార్షికోత్సవమూ-కమిటీ ఎన్నికా" గురించి ఉన్నది.

"విన్నావా విమలా నీవు? ఈయేడు బలదేవూ, అహసన్ మొద లైనవారు నాపేరు శక్రటరీగా ప్రపోజ్ చెయ్యదలచి ఉన్నారు."

"చిత్తం!"

నాలుగో ఉత్తరం—కానీ, అది తనపేర రాలేదు. విమల పేరుమీద వచ్చింది. అది లావుగానూ, పసుప్పచ్చగానూ, పాత కవరూ దానిమీద ఎన్నోముద్రలు పడ్డదీ, అనేక పర్యాయాలు అడ్రసు కొట్టివేసి మళ్ళీ మళ్ళీ రాయబడ్డదిగానూ ఉంది. మరి ఇదేమిటి ? మిస్. విమలా బెనర్జీ ! ఇత నెవరు మూర్ఖుడు. ఎవరు మిసెస్ విమలా సక్సేనా వివాహమాడిన పన్నెండు సంవత్సరాలకు 'మిస్' అని రాస్తున్నాడు ?...సుధీర్ ఒకచూపు విమల వేపు విసిరాడు. అప్పు డామె నౌకరును మధ్యాహ్న భోజనాన్నిగురించి ఏదో చెప్పటంలో మునిగి ఉన్నది--ఇది నమ్మేక విమల తన ఉత్తరాన్ని గుర్తుపట్టలేదు. సుధీర్ టీ క్యాట్లీ ఆమె ముందర బెట్టి కవరు చింపాడు. వివాహమైనాక చాలా సంవత్సరాలదాకా అతడు విమలపేరుతో వచ్చిన ఎన్నో ఉత్తరాలు ఊరికా ఊరికానే విప్పి చదివేవాడు. అవన్నీ ఆమె కాలేజీ స్నేహితురాళ్లో, చెల్లెలు వరసవాళ్లో, అలాంటివాళ్ళు రాసిన ఉత్త రాలు. వాటిలో ఎలాంటి అనుమానాస్పదమైన రాతగలవీ కనబడలేదు. తెలియదు, ఎందుకు ఈ ఉత్తరపు కవరుతోనే తెలుస్తోందిగదా. ఇందులో ఏదో ఒక లోతైన రహస్యం తప్పక ఇమిడివున్నది--బహుశా నేడు ఆమెకు తెలియవచ్చు. అంటే ఏమన్నమాట ఆ 'చిత్తం!' అనే ఉచ్చారణా, అధీరతల చాటున ఏ రహస్యం దాగి ఉన్నదో !

ఆ కవరులోనించీ చాలాపేజీలు గల పొడుగాటి ఉత్తరం బైల్దేరింది. కాని, దాని మొదటి కొన్ని పంక్తుల్లోనే, సుధీర్ గంభీరమైన శాంతిని చెల్లా చెదరు చేయటానికి తగ్గట్టుగా ఉన్నది—ఇల్లా రాసి ఉంది :—

"ప్రాణప్రదమైన విమలా !"

నిన్ను కలిసి రెండు నెలలు గడిచింది—నా ప్రాణానికైతే ఈ రెండు నెల్లూ రెండు యుగాలుగా ఐనయ్ ! మనం ఎప్పుడూ ఇలాగే దాగి దాగీ కలుసుకుంటూంటామా ఏమి ? మనిద్దరి మధ్యా ఘోరంగా నిలబడి వున్న ఈ గోడ, ఇది ఇల్లాగే ఉంటుందా ? రెండున్నర ముక్కలుగా చెక్కలై పోదా ?..."

కోపమూ, అసహ్యమూల ఉద్రేకంవల్ల సుధీర్ కాళ్ళూ చేతులూ కంపించిపోతున్నాయి. అంతకన్నా ముందు అతనికి ఆ వుత్తరం చదవటమే చాతకాలేదు....ఈ వుత్తరం అతని భార్య పోకిరీతనపు—దుశ్శీలపు ప్రకటన పత్రంగా వుంది—గబగబా పేజీని తిప్పి అతను చివరి పేజీ మీదకు దృష్టి సారించాడు. ఉత్తరం చివర రాసి వుంది ! "హమేషా హమేషా కోసం నీ అనిల్ !" అని—

"అనిల్ !" అతని మెదడులో ఎప్పుడూ ఎరగని ఈ పేరు బాంబు లాగా బద్దలైంది—

"విమలా !" అని అతను కేక పెట్టాడు—అప్పుడు విమల ఆ గదిలో నించీ బైటికి వెళ్లాలని చూస్తోంది—ఈ కేకకు దిగ్భ్రమజెంది దర్వాజా దగ్గరనే ఆగిపోయింది.

"చిత్తం !"

చిత్తం ! చిత్తం !! చిత్తం !!! అదే మెత్తని, చల్లని, చప్పని, 'చిత్తం'—ఇక ఆ సమయంలో సుధీర్‌కు ఇట్లా తోచింది, ఈ రెండక్షరాల పదమూ ఏదో ఒక ఆక్షేపణ అయిన మాటై వుండాలి. ఒక పెద్ద తిట్టు—ఒక చెంపదెబ్బలాగా ఉంది. తన భార్య తనను ఈడ్చి మొహంమీద గుద్దినట్టుగా ఉంది !

"ఇట్లారా !" అతను మళ్ళా పెద్ద గొంతుతో అరిచాడు. విమల మౌన ముద్రాలంకారిణి అయి మేజుకు దగ్గరగా వచ్చి నిల్చుండిపోయింది-ఆమె ముఖంమీద చింత, గొంతు చించుకుని అంటోంది. "చిత్తం?" అని—

"అనిల్ ఎవరు ?"

సుధీర్ ఈ ప్రశ్నను ఇంత అనుకోకుండా గభుక్కున అనేశాడు గదాంటే, కొన్ని నిమిషాలదాకా విమల అలా చూస్తున్నది చూస్తున్నట్టే నిలబడిపోయింది. ఆయనేమడిగాడో ఆమెకు అర్థమే గాలేదు...లేదా, నమ్మకమూ గావటంలేదు. ఎకాయెకీ ఈమె భర్తకు ఈ రహస్యం ఎలా తెల్సింది !...కాని, మళ్ళీ నిమ్మళం నిమ్మళంగా సూర్యుణ్ణి గబ్బుకున్న

మబ్బులు విడిపోతాయి. వర్షంతో తడిసిన ఎండ భూమినిండా పరుచుకుంటుంది. అచ్చం అలాగే ఒక నెమ్మది, తియ్యని, మెత్తని దరహాసం ఆమె ముఖంమీద వికసించింది—

"అనిల్ ?" అతను చాలా మృదువుగా పేరు పలికాడు...ఎలా తల్లి, బిడ్డ పేరు అంటుందో! ఎలా తపస్వి భగవంతుడి పేరు ఉచ్చరిస్తాడో! ఎలా కవీశ్వరుడు తన ప్రియమైన కవిత్వాన్ని నోట్లో గొణుక్కుంటాడో!... మరి ఆమె కన్నులు ఒక కొత్త కాంతితో తళతళలాడాయి!...ఈ వెలుగు ఆ పన్నెండేళ్ళలో సుధీర్ ఎప్పుడూ తన భార్య కండ్లలో చూడలేదు !....

"అవును ! అవును ! అనిల్ ! ఎవరాయన ?" విమల కళ్ళలో ఈ నూతన కాంతిని చూసి సుధీర్ పరవశుడైతున్నాడు—

కాని, విమల అయితే ఏదో రెండో ప్రపంచంలోనే వుంది - ఆమె కళ్ళు దూరం - చాలా దూరం - తెలియటంలేదు. ఏం జూస్తోంది !— ఏదో, ఎంతో సౌందర్యవంతమైన దర్శన స్థానం ?—ఏదో హృదయంగమమైన స్మృతి ?—ఏదో ఆశాకిరణం ?—

"అదంతా ఏదోవుంది..."ఆమె చిరునవ్వులు చిందుతోన్న పెదిమెలు. సుధీర్‌తో కాదు కాని తనతోనే కర్ణేజపం చేసింది...మళ్లా ఆ పెదిమెలమీది చిరుత నగవులు ఆరిపోయాయి!—అదీగాక ఆమె శరీరమంతటా ఏదో చేదు చేదు వరదలు తలలెత్తి పారాయి! "మరి ఇప్పుడు అవి ఏవీకూడా లేవు..." మళ్లా. ఏమీ తెలియని దుఃఖభారంవల్ల ఆమెమెడ వంగిపోయింది—

"ఈ విచారాంశాన్ని ఆర్పివేయకు." అని బిగ్గరగా అరచినట్టున్నాడు సుధీర్ - అతని ప్రాణం కోరుకుంటుందిగదా ఆ మేజును తల్లకిందులు చెయ్యాలని - అక్కడున్న ఆ చీనా పింగాణీ పాత్రలన్నిటినీ చూర్ణం చూర్ణం చేసివెయ్యాలని - చా పాత్రను ఎత్తి విమల నెత్తిన విసిరి కొట్టాలని !-నిజం నిజం చెప్పు - ఏం నువ్వతన్ని ప్రేమిస్తున్నావా ?"

వంగి ఉన్న మెడ మళ్లా పైకి లేచింది. కండ్లలోనుంచీ టపటప పారాలుతోన్న అశ్రువులలోనుంచీ మళ్ళీ ఆ ఆశ్చర్యకరమైన వెలుగు

తళుక్కు_మనటం మొదలెట్టింది - చప్పనీ, రింగులేనీ, స్థితిగతులలో కేవలం "చిత్రం" అంటోన్న విమల సగర్వమైన వయ్యారంతో తల ఎత్తి సుధీర్ కళ్ళలో కళ్ళుబెట్టి అన్నది. "చిత్రం అయ్యా-మీ తలపు మిక్కిలి నిజం".

ఇక అప్పుడు సుధీర్ నిర్మించుకున్న మరో ప్రపంచం తల్లక్రిందులై పోయింది. అతనికి ఇట్లా తట్టింది విమలకు అతని గౌరవంమీదా, అతని ఐ.సి.యస్; దర్జా మీదా, అతని పురుషార్థంమీదా, ఎప్పటికీ మాయని మచ్చగా కళంకాన్ని తెచ్చి పెట్టింది - అతనికి మళ్ళీ ఇట్లా అనిపించింది : విమల తనను ఒక ఇలాంటి బూతులు తిట్టిందో, అవి జీవితాంతమూ తన చెవులలో మారుమోగుతోనే వుంటాయి. అప్పుడు విద్యా, వివేకమూ, నీతీ, నాగరికతా అన్నీ అతనిలోనుండీ దిగిపొయ్యాయి. ఇప్పుడతని లండనులో చదివి వచ్చిన బారిస్టరు కాడు. ఐ.సి.యస్; అసోసియేషనుకు కాబొయ్యే శక్రటరీ అంతకన్నా గాడు. క్లబ్బు మెంబరు గూడా గాడు ఆఖరుకు ! నారాయణగంజ్ జిల్లా డిప్టీ కమీషనరున్నూ కాడు. అతని పిడికిటిలో ఒక లక్ష మందికంటే ఎక్కువ ప్రజల అజ్ఞాతమైన అదృష్టాలున్నాయి - కాని, ఆ సమయంలో అతను అడివి మెకంలాగా ఉన్నాడు. కోపపు ఎర్రని చివళ్ళ ఉద్రేకంలో అనలెత్తి భార్యతో వంచింపబడ్డ మగాడిలా ఉన్నాడు.

అమానుషంగా అరిచాడు—

"వెళ్ళిపో ఈ యింటినించీ - ఇప్పుడే, ఈ క్షణమే"

విమల ముఖంమీద కోపోద్రేకాల చిహ్నామైనా లేని దుఃఖం-ఆమె ఇప్పుడు గూడా ఏదో రెండో ప్రపంచంలోనే ఉంది. ఆమె సుధీర్ అరుపుల్లో ఇల్లా విన్నది, ఏదో చాలా దూరంనుంచీ అదేదో ధీమా అయిన ధ్వని వచ్చిందేమో !...మళ్లా ఒకసారి ఆమె పెదిమెలు ఒక లేత లేత మొగ్గ నవ్వులు తొడిగింది. ఎట్లా అయితే దారి దప్పిన బాటసారికి బాగా వెదికాక దారి దొరికినట్టు ! ఎట్లా ఆ గడువులో - పన్నెండేళ్ళనించీ - ఆ ఘడియకోసం నిరీక్షిస్తూ ఉన్నదో-చివరకు ఆ పుణ్యమైన ఘడియ ఎదురుగా వచ్చి కలిసినట్టు !

ఆమె ఏమీ జవాబియ్యలేదు - కేవలం ఒక చూపు మాత్రం తన భర్తవేపు చూసింది. ఆ చూపులో ఆక్షేపణలు లేవు - ఆ చూపులో చాడీలు ఏవీ లేవు - దయ మాత్రమే ఉంది! క్షమ ఉంది! అతని చూపులు చెప్తు తున్నట్టు ఉన్నై. "అందులో నీ నేరమేమీ లేదు - నీవు ఆ మాటలను గ్రహించలేవు."-మళ్ళీ ఆమె తన పడక గదిలోకి పోయింది-అక్కడినించీ తన చిన్నారి పాపను ఎత్తుకుని వరండాలోనుంచీ బయటకు బైలు దేరింది. ఆమె అడుగుల సవ్వడి దూరం అవుకుంటూ పోయింది. ఎంతదాకా? బైట రోడ్డుమీద కోలాహలంలో కలిసి అసలే వినబడకండా అయిపోయింది.

సుధీర్ ఆలోచన ఏమని?-ఆమె ఏడుస్తుంది, మొత్తుకుంటుంది, తన నిజాయితీని నెత్తిన నోరు బెట్టుకుని వాదిస్తుంది, తన దోషాలకు క్షమాభిక్ష వేడుతుంది - భవితవ్యంలో తన శీలాన్ని దిద్దుకోవటానికి ప్రతిన జేస్తుంది. కాని, అతడు అందుకు సిద్ధంగా లేడుగదా, విమల వాస్తవంగానే ఇల్లు వదిలి వెళ్ళిపోయ్యేది. ఆ హఠాందా అయిన దెబ్బతో ఆమె మదం పూర్తిగా ఒక అంతస్తుకు లేచింది. సుత్తెతో మాదిరిగా ఆమె మెదడుమీద ఒకే దెబ్బ పడుతూ ఉంది. అనిల్! అనిల్!! అనిల్!!!...ఈ అనిల్ ఎవరు? నేను వాడి జాడ కనుక్కొనిగాని వదలను. ఆమె మీద ఒక వివాహిత అయిన స్త్రీకి దుర్బోధకురాలుగా కేసు బెడతాను. ఆమెను జైలుకు పంపిస్తాను. ఆమె ప్రాణాలు తీస్తాను—

పిచ్చివాడిలా ఉరుకుతూ అతను విమల గదిలో ప్రవేశించాడు. అతనికి తెల్సు ఆమె తన వార్డు ఊడ్చేవాడి ఒక గదిలో తన ఉత్తరాలూ అవీ పెట్టుకుండేదని, తాళం చెవుల గుత్తి ఎదురుగా మంచం మీద పడి వుంది. వెళ్తూ వెళ్తూ ఆమె పారేసిపోయింది. సుధీర్ వార్డువాడి గది తాళం దీశాడు. లోపలికి వెళ్లాడు. అందులో దాచి ఉంచిన ఉత్తరాల కట్టనూ, ఇంకా కాగితాలనూ వెదికాడు. అన్నిటికంటే క్రింది మడతలో ఎర్రని పట్టు రిబ్బనుతో కట్టిన ఉత్తరాల దొంతర ఉంది. ఇవి తప్పకండా అనిల్ కుమార్ ఉత్తరాలు అయ్యుండవచ్చు-చూడగా, అతని ఆలోచన నిజమని

తేలింది. ప్రతీ లేఖలోనూ ప్రేమోల్బణం - ''విమల నా ప్రాణం''- ''నా విమలవు నీవు'' - ''నా ఉత్తమురాలైన విమల'' - ''నీ, కేవలం నీ అనిల్''-ఈ లోకంలో, ఇంకా పై లోకంలో నీయొక్క నీయొక్క--'' ఇలా ప్రతి పంక్తి అడుగునా మలినమైన కత్తిలాగా అతని గుండెల్లో పొడుస్తోంది. ఆ ఉత్తరాలనూ ఒక్కొక్కటి తీస్తూ నేలమీద పడేస్తున్నాడు. కాని, ఇదేమిటి ?...ఉత్తరాల మధ్యలో మడత ఏమైంది ? పత్రికల కట్టింగ్స్...వాటిని విప్పాక చూస్తే అందులో ఒక నవయువకుడి ఫోటో. అతని లోతైన భావాలు గల, మెరుస్తోన్న కళ్ళు, ఎత్తైన నొసలూ, పిన్న నగవుల పెదవులూ, వాటికింద ఈ సంగతి దాక్కొని ఉన్నది !...

'నవ యువకుడైన కవి మరణం !'

మేమే ఈవార్త చెప్పటానికి మనస్సుకు బాధగా ఉన్నది. లక్నోయొక్క నవ యువకుడు-అభివృద్ధి కాముకుడు-ఇంకా విశేషం ఏమిటంటే : విప్లవ కవి అనిల్ కుమార్!-అనిల్ నిర్యాణం అయిపోయింది...1939 సం. సత్యాగ్రహంలో జైలుకు వెళ్లాడతను. అక్కడనే అతనికి క్షయవ్యాధి అంకురించింది.

సుధీర్ పూర్తిగా ఆ వార్తను చదవలేకపోయాడు. కారణం : పేపర్ కట్టింగులమీద పత్రికల ప్రచురణల తారీఖులు వెయ్యబడిఉన్నాయి. 18 జూన్ 1940 సం.-అతని చేతులోనుంచీ మిగిలిన ఉత్తరమూ, ఆ పత్రికల కట్టింగులో జారి నేలమీద పడ్డాయి.

అతనికి అర్థం గాలేదు ఇదంతా, దీని అసలు విషయ మేమిటి ? ?- అనిల్ ! అనిల్ !! అనిల్ !!!--ఏం ఎవరైనా చచ్చిపోయిగూడా బ్రదికి ఉండగల్తారా ? పోగొట్టుకున్న బాటసారి - ఓడిపోయిన జూదరీ, మాదిరిగా అతని భోజనశాలలోకి వచ్చాడు. మేజుమీద అనిల్ ఉత్తరమూ, కవర్లూ పడివున్నై. అతను కవరుతీసి ఒకసారి మళ్లీ పరికించి చూశాడు. అనేక డజన్ల గుండ్రని ముద్రల మధ్యలో ఒక పొడుగైన చతురస్రమైన ముద్ర వేసి ఉన్నది. దానిలో నాలుగు ఇంగ్లీషు అక్షరాలు ముద్రింపబడి ఉన్నాయి. D. L. O. ''డెడ్‌లెటర్ ఆఫీస్'' అని——